






16 వ పటలము నుండి 40 వ పటలము వరకు

సమర్పణ :

'సాహిత్య విద్యా ప్రవీణ'
'వైద్య విద్వాన్', 'భాషా ప్రవీణ', 'హిందీ విశారద'

**శ్రీ అన్నదానం చిదంబర శాస్త్రి,**
M. A. & M. A. P. O. L.

ప్రచురణ :

**శ్రీ హనుమత్సేవా సమితి**
సత్యనారాయణపురం : : విజయవాడ - 520 011.

# ✳ విషయ సూచిక ✳

ఓం

శ్రీ హనుమతే నమః

# శ్రీ పరాశర సంహితా

## షోడశ పటలః

### అష్టాక్షరీ ప్రభావము — విజయు చరిత్రము

శ్రీ మైత్రేయః

శ్లో॥ గత్వా తు విజయ స్తత్ర - కిం బుద్ధి రభవ న్మునే
పరాశర మహా ప్రాజ్ఞ - తద్వృత్తం వక్తు మర్హసి॥

తా॥ మైత్రేయు డీరీతిగా అడుగజొచ్చెను. సర్వజ్ఞుడవగు ఓ పరాశరమహామునీ! విజయుడు తననగరమున కేగినవాడై ఎట్టియాలోచనతో నుండెనో ఆ వృత్తాంతము నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ విజయో గృహ మాసాద్య - ప్రజావర్గేణ రంజయన్
భుంజాన స్సకలా న్భోగాన్ - బహుకాలం వినాయ సః॥

తా॥ శ్రీ పరాశరులవారు సమాధానముగా నిట్లనిరి. మైత్రేయా! విజయుడు ఇంటికి వచ్చి ప్రజలను ధర్మపరిపాలనతో సంతోషపెట్టుచు సమస్తములగు సుఖములను అనుభవించుచు చాలాకాలము గడపెను.

శ్లో॥ రాజా హనుమ దాదేశా - ద్బిభృక్షు రపరాం తనుమ్
సుఖదా మపి పూర్వాం తు - మేనే భార మి వాత్మనః

తా॥ రాజగు నాతడు హనుమంతుని యాజ్ఞవలన వేరొక దేహమును గ్రహింపదలచినవాడై పూర్వదేహము సుఖవంతమే మైననుదానిని బరువుగానే యెంచెను.

శ్లో॥ తతో హిత్వా తనుం పూర్వాం - విజయో జయకాంక్షయా
పాండుపత్న్యాం పృథాయాం తు - లేభే దేవేంద్రపుత్రతామ్॥

తా॥ పిమ్మట విజయుఁడు జయకాంక్షకలవాఁడై వెనుకటి దేహమును వీడి పాండురాజు భార్యయగు కుంతీదేవియందు దేవేంద్రపుత్రునిగా నేర్పడెను.

శ్లో॥ యస్యాగ్రజో మహారాజ - స్సత్యసంధో యుధిష్ఠిరః
తదగ్రజో భీమసేనః - భీమకర్మా మహాబలః॥

తా॥ అతని పెద్దన్న మహారాజు. సత్యమునే పలుకువాఁడగు ధర్మరాజు, ఆ పిదప అన్న భయంకరకృత్యము లొనర్పజాలిన, మహాబలుడగు భీమసేనుఁడు.

శ్లో॥ తస్యానుజస్తు విజయో - వవృధే మాతృసన్నిధౌ
స ఏ వార్జుననామ్నాఽసౌ - జగృహే సకలాః కలాః॥

తా॥ ఆ భీమసేనుని పిదప బుట్టిన వాఁడగు విజయుఁడు తల్లిసన్నిధిని పెరిగెను. అతఁడే అర్జునుఁడను పేరుతో సన్ని కళలందు ఆరితేరెను.

శ్లో॥ కదాచి ద్విజయో రాజా - జగదేక ధనుర్ధరః
ప్రాచీందిశ మగా త్పూర్వం - జిగీషు స్సపరిచ్ఛదః

తా॥ ఒకప్పుడు ఆవిజయుఁడు—లోకమందేకైక ధన్వియగు నాతఁడు జయించు కోర్కెతో పరిజనముతో కూడినవాఁడై తూర్పుదిక్కునకేగెను.

శ్లో॥ ప్రాచీనా న్శత్రుసామంతాన్ - జిత్వా భుజబలేన సః
అనుయాత స్తు తై ర్భూపై, - ప్రపేదే దక్షిణాం దిశమ్॥

తా॥ తూర్పుదిక్కునున్న శత్రుసామంతురాజుల నాతఁడు భుజబలముచే జయించి ఆ రాజులు వెంటరాగా దక్షిణ దిక్కును బొందెను.

శ్లో॥ దాక్షిణాత్యా న్నృపా న్రాజా - ప్రోత్సార్య చ గుణస్వనైః
సేతుం దదర్శ విజయః - సూత సంస్తుత విక్రమః॥

తా॥ తన వింటి త్రాటిమ్రోతలచేతనే దక్షిణదిక్కుననున్న శత్రు రాజులను కదల్చివేసినవాఁడై సూతనిచే కొనియాడబడిన పరాక్రమము కల విజయుఁడు సేతువును చూచెను.

శ్లో॥ కి మేత దితి పప్రచ్ఛ - మంత్రీ న్వృద్ధా న్పురావిదః
తైరూచే విజయో రాజా - సేతుదర్శన విస్మితః॥

తా॥ సేతువునుచూచుటచే నాశ్చర్యమునందినవాఁడగు విజయుఁడు పూర్వజ్ఞులు, పెద్దలు, అగు మంత్రులను అదియేమని యడిగెను. వారి ట్లనిరి.

శ్లో॥ రాజ న్రఘుపతీరామో - రావణస్య దురాత్మనః
వధాయ బంధయామాస - సముద్రం పర్వతోత్తమైః।

తా॥ రాజా! రఘుకులశ్రేష్ఠుఁడగు రాముఁడు దురాత్ముడగు రావణుని వధించుకొరకు పెద్దపర్వతములతో సముద్రమును బంధించెను-

శ్లో॥ శతయోజన పర్యంతా - సేయం సేతుర్ మహాబుధా
ఇతి మంత్రివచ శ్రుత్వా. జహాస విజయో నృపః॥

తా॥ నూరుయోజనములు వ్యాపించిన ఇది సముద్రమునకు సేతువు అనెడు మంత్రి వాక్యములు వినినవాఁడై రాజగు విజయుఁడు నవ్వెను.

శ్లో॥ స్వయం ధానుష్కతాం ప్రాప్య - శరాణా మపి సంపదమ్
కిమర్థ మన్వభూ ద్రామః - ప్రయాసం రఘునందనః॥

తా॥ స్వయముగా తాను ధనుస్సుపట్టగల్గి, బాణ సంపద నిండా కల్గి యుండియు రఘుపతియగు రాముఁ డెందులకు ప్రయాస ననుభవించెను.

శ్లో॥ శరపంజర బంధేన - సుతరోఽయం తు సాగరః
ప్రయోజనం న జానేఽస్య - ప్రయాసస్య మహాత్మనః॥

తా॥ బాణసమూహము బంధనముచేతనే సముద్రమును దాటుట రవ కాశము ఉండగా ఆమహాత్మునియొక్క ఈ ప్రయాసకు ప్రయోజనము అర్థమగుటలేదు.

శ్లో॥ అథాస్మి న్ననంతరే శ్రీమా - న్హనుమా న్మారుతాత్మజః
రామవృత్తాంత విజ్ఞానా - దాజగామి కృతాంజలిః॥

తా॥ ఇంతలో వాయుపుత్రుఁడు, శ్రీమంతుఁడగు హనుమంతుఁడు రాముని వృత్తాంతముగా నెఱిగినకారణమున అంజలిఘటించి వచ్చెను.

శ్లో॥ అబ్రవీ న్మారుతి ర్భూపం - గర్వాంధ తమసావృతమ్
యదుక్త మధునా రాజన్ - భవతా హేళ యాన్వితమ్॥

తా॥ గర్వమనెడుచీకటితో కప్పబడిన రాజుతో హనుమంతుఁ డిట్లనెను ఓరాజా నీచే పరిహాసముగా నిప్పుడు పలుకబడినది యసత్యము.

శ్లో॥ ఆపాత రమణీయత్వా - త్త న్న క్షోదక్షమం వచః
ఋక్షవానర ముఖ్యాస్తు - మహాపర్వత సన్నిభాః
శరపంజర మార్గేణ తరేయు ర్జలధిం కథమ్?

తా॥ మాటలు రమణీయముగనున్నను విమర్శనార్హములుకావు. గొప్పపర్వతములతో సమానమైన ఎలుగుబంట్లు, కోతులు నీవు కట్టినట్టి బాణసమూహమార్గమున సముద్రము నెట్లుదాటగలరు?

శ్లో॥ శకుంతపాత మాత్రేణ - ఛిద్యతే శరపంజరః
ఏతాదృశం తు పంథానం- శ్రద్దధాతుకథం జనః?

తా॥ పక్షివాలినమాత్రముననే బాణములచే చేయబడిన వంతెన కూలునే - అట్టి మార్గమును జనుడెట్లు విశ్వసించును.

శ్లో॥ పిపాసో రధికం జంతోః - పిధాయ మధురోదకమ్
మరీచికా తోయ మివ - భవే త్పంజరపద్ధతిః॥

తా॥ మిక్కిలి దాహము గొన్నవానికి మధురోదకము మాటుచేసి ఎండమావులను చూపినట్లున్నది నీ బాణముల వంతెన పద్ధతి.

శ్లో॥ అథవా జానకీనాథో - మమ స్వామీ రఘూద్వహః
అవిమృశ్య కథంకుర్యాత్ - వృథాలాపై రలం తవ॥

తా॥ లేకున్న రఘుశ్రేష్ఠుడు, సీతానాధుడు అయన న్వాస్వామి అవి మర్శకముగ పనినెట్లుచేయును? నీవ్యర్థ ప్రలాపములు కట్టిపెట్టుము.

శ్లో॥ అర్హా త్యేష మమారోహం - యది వా శరపంజరః
గజ వాజి రథోపేతాం - తథా సేనాం వహిష్యతి॥

తా॥ ఈ శరపంజరము నన్ను భరించగల్గిన యెడల ఏనుగులు, గుఱ్ఱములు. రథములతో కూడిన సేనను వహించగలదు.

శ్లో॥ ఇత్యుక్తః కపినాథేన – నృపో వచన మబ్రవీత్
బధ్యతే జలధి ర్ధీర! మయా సాయకపంజరైః
శిధిలీకురుతాం తత్తు – ప్రసభం శరపంజరః॥

తా॥ అని హనుమంతునిచే చెప్పబడినవాడై విజయుఁడిట్లనెను. ఓ ధీరాత్ముడా! నేను బాణములచే సముద్రమునకు సేతువు నిర్మించుచున్నాను. యత్నించి దానిని నీవు పడగొట్టుము.

శ్లో॥ దృఢగత్యా యథాశక్తి - ధావనేన జవేన వా
యేన కేనాపి యోగేన – శిథిలీకురు పంజరమ్॥

తా॥ బలముగా నడుచుటచేతకాని, శక్తికొలది వేగముగాపరుగిడుట ద్వారాకాని యెట్టియుపాయముచేతనయిన బంధనమును విరుగగొట్టుము.

శ్లో॥ సమయః క్రియతే సౌమ్య! మయా నిశ్చలబుద్ధినా
భిద్యతే శరబంధోఽయం - భవతా యది మారుతే!
తదా సద్యః ప్రవేక్ష్యామి - సగాండీవో హుతాశనమ్॥

తా॥ సౌమ్యుడా! నిశ్చలబుద్ధితో నేను ప్రతిజ్ఞచేయుచున్నాను. ఈ శరబంధము నీచే భేదింపబడినచో ఓ వాయుపుత్రా! వెంటనే నేను ఈ గాండీవముతోడపాటు అగ్నియందు ప్రవేశింతును.

శ్లో॥ ఇత్యుక్త్వా శరజాలేన – బబంధ జలధిం నృపః

తా॥ అని విజయుడు బాణములతో సముద్రమునకు బంధనము నిర్మించెను.

శ్లో॥ కపీంద్రోఽపి తదా దృష్ట్వా - శరబంధం [illegible]
రాజాన మబ్రవీ ద్వాక్యం - సీతారామ మనుస్మరన్

తా॥ అప్పుడు హనుమంతుడు [illegible] చూచి సీతారాములను స్మరించుచు విజయునితో నిట్లనెను,

శ్లో॥ సీతారామ పదద్వంద్వ - ధ్యాన సంభృత వి[illegible]
భంజేయం శరబంధం తే - పదే నైకేన [illegible]

తా॥ ఓ రాజా! సీతారాముల పాదములను సేవించుట ద్వా[illegible] ష్టమైన పరాక్రమముకల నేను నీ శరబంధము [illegible] విరుగగొట్టగలను.

శ్లో॥ న చేత్తవ పతాకాంకో - భవేయం విజయోన్ముఖః

తా॥ లేకున్న నీ విజయము నంగీకరించువాడనై [illegible] యొక్క టెక్కెమున చిహ్నముగా కాగలను.

శ్లో॥ ఇత్యుక్త్వా హనుమా న్నృపం - ప్రహస న్మఖసంనిధః
ద్విత్రైస్తు పదవిన్యాసై - ర్బభంజ శరపంజరమ్॥

తా॥ అని చిరునగువుతో రాజును గూర్చి పల్కి హనుమంతుడు రెండు మూడడుగులతోనే శరపంజరమును విరుగగొట్టెను.

శ్లో॥ దృష్ట్వా పంజరభంగం తు - నిర్విణ్ణవదనో నృపః
గాండీవం పాతయామాస - కి మేత దితి విస్మితః॥

తా॥ శరపంజరము భగ్నమగుట చూచినవాడై వెల వెల బాఱిన మోముతో విజయుడు దాని కాశ్చర్యపడుచు గాండీవమును పారవైచెను.

శ్లో॥ నినింద బహుధాఽఽత్మానం - గాండీవం చ పునః పునః
అథ చింతాం సమాపేదే - విజయో జయనిస్పృహః

తా॥ అనేకవిధములుగా మాటిమాటికి తనను, గాండీవమును నిందించుకొనువాడై విజయుడు తనవిజయముల విషయమున నిరాశకలవాడై మిక్కిలి చింతించెను.

శ్లో॥ అద్యప్రభృతి మచ్ఛక్తే - రవసాదోఽథవా నను
రక్షో మాయాథవా నూనం - స్వప్నోఽయ మథవా పునః

తా॥ ఇప్పటినుండి నాశక్తికి నాశమేర్పడినట్లేనా? లేక ఇది రాక్షస మాయయా? కాకున్న నిది కలయేమో:

శ్లో॥ యది వా మమ దిఙ్మోహః-బుద్ధిభ్రంశోఽపి వా పునః
అన్యథా కథ మేతత్తు - విపరీతం మహద్భవేత్?

తా॥ లేక నాకు దిగ్భ్రాంతియో, మతిచెమటో కాకున్న నిట్టి విపరీతము వేఱొకరీతిగా నెట్లేర్పడును?

శ్లో॥ ఇతి సంచిత్య మనసా - సహసా నృపనాయకః
ప్రజ్వాల్య పావకం తత్ర - ప్రవేష్టు ముపచక్రమే॥

తా॥ అని మనసున నాలోచించుకొని వెంటనే రాజశ్రేష్ఠుడగు విజయుడు అచ్చటనే అగ్నినిరగుల్కొల్పి దానియందు ప్రవేశింప సిద్ధమయ్యెను

శ్లో॥ అథాస్మిన్నంతరే కృష్ణః - పాండవానుజిఘృక్షయా
తం దేశ మాగమ త్తూర్ణం - నిర స్తాన్యప్రయోజనః
ఆగత్య వాసుదేవస్తు - పప్రచ్ఛ హనుమ న్నృపౌ॥

తా॥ ఇంతలో పాండుతనయు ననుగ్రహింప ఇతరపనులగు పను లన్నియుమాని కృష్ణుఁ డచ్చటకువచ్చి హనుమంతుని, అర్జునుని ఇట్లు ప్రశ్నించెను.

శ్లో॥ యువాభ్యాం కిం కృతం ధీరౌ - వద తం మే నియుంజితః
కిమర్థం జ్వలితో వహ్ని - ర్భగ్నో వా శరపంజరః

తా॥ ఓధీరులారా! మీచే నేమిచేయబడినదో అడిగెడు నాకు సమాధానము చెప్పుడు. ఎందుకొఱకు అగ్ని ఏర్పాటుచేయబడినది. శరపంజర మెందుకు విరిగినది?

శ్లో॥ తా వ బ్రూతాం యథావృత్తం - కృష్ణస్య పరమాత్మనః
శృత్వా ని గదితం తాభ్యాం - ప్రాహ  గమి

తా॥ పరమాత్ముడగు కృష్ణునకు  జరిగినట్లు చెప్పిరి. వారిచే చెప్పబడినది విని  కృష్ణుడిట్లనెను.

శ్లో॥ అసాక్షిక మిదం కర్మ - కృతవంతం కథం 
శరపంజర సంస్థానం - కీదృశం భవతా కృతమ్

తా॥ సాక్షిలేనటువంటి ఈపనిని  శరపంజర మెట్లేర్పాటు చేయబడినది?

శ్లో॥ త్వయా వా శరబంధస్య - విశ్లేషః  
పశ్యేయం యువయోః కర్మ - పునరేవ విధీ॥

తా॥ నీచేత ఆ శరబంధ మెట్లువిరుగగొట్టబడినది?  ర్వురి పనికూడా చూడవలయును ప్రదర్శింపుము.

శ్లో॥ శ్రుత్వా కృష్ణవచ స్తత్ర - పాండవో హృదయప్రియమ్
బబంధ జలధిం తూర్ణం - పునరేవ శతై శ్శరైః॥

తా॥ కృష్ణుని మాటలను విన్నవాడై  మగు నామాటతో మరల వాడియైన బాణముల వలన  నకు బంధన మేర్పరచెను.

శ్లో॥ తతో హరి స్తు సర్వాత్మా - సర్వభూత 
అథస్తా చ్ఛరబంధస్య - ప్రవిష్టః కమఠాకృతిః॥

తా॥ పిమ్మట సర్వాత్ముడు, సమస్తప్రాణులందు  నగు కృష్ణుడు ఆ శర బంధముయొక్క క్రిందుభాగమున తాబేలుగా ప్రవేశించెను.

శ్లో॥ హనుమా నపి సన్నద్ధః - శరపంజర భంజనే
ఆరురోహ శరారోహం - పంజరీకృత విగ్రహః

తా। హనుమంతుఁడు వాడ ఆ శరపంజరమును భగ్నము చేయ సిద్ధమైనవాఁడై సన్నద్ధమగు దేహముతో శరపంజరము నెక్కెను.

శ్లో॥ అవష్టభ్య పదద్వంద్వం - యథాశక్తి స మారుతిః
అథో నిపీడయా తూర్ణం - చాలయామాస పంజరమ్॥

తా॥ పాదములు రెంటిని శక్తికొలది మోపినవాఁడై క్రిందకు నొక్కిపారవేయుటకై ఆ శరపంజరము నూగింపసాగెను.

శ్లో॥ తథాపి దృఢసంస్థానా - న్న చచాలేషుసంహతిః
ధావతిస్మ తతశ్శీఘ్రం - మారుతిః శరవర్త్మనా॥

తా॥ అయినను దృఢమగు నాధారముండుటవలన శరపంజరము చలించలేదు. అప్పుడు హనుమంతు డా శరమార్గమున తొందరగా పరుగిడ జొచ్చెను.

శ్లో॥ తథాపి న చకంపేఽసౌ - పార్థావష్టంభ వైభవాత్
ఉడ్డీయోడ్డీయ వేగేన - న్యపత త్పూతవిక్రమైః॥

తా॥ కాని పార్థమూర్తియాధారముగ నున్నకారణమున నది చలించలేదు. హనుమంతుఁడు పవిత్రపరాక్రమముచే ఎగిరిఎగిరి వేగముగ దూకెను.

శ్లో॥ తథాపి శరసంఘాతః - కించి న్నైవాప వైకృతమ్
దుష్కర ప్రతిఘాతస్య - స్వవీర్యస్య జగత్త్రయే
అపూర్వ ప్రతిఘాతేన - బహ్వామన్యత సోఽద్భుతమ్॥

తా॥ కాని ఆ శరబంధము కొంచెమువాఁడా వికారమును బొందలేదు. ముల్లోకములందు నెదురులేనట్టి తన పరాక్రమమునకు వన్నెలేని యెదురేర్పడుటచే హనుమంతుఁ డబ్బురపడి మిక్కిలి కొనియాడెను.

శ్లో॥ హనూమ త్పదవిష్టంభ - జర్జరీకృత పర్వణః
కమఠేశ్వర పృష్ఠాగ్రా - త్సుస్రావాసృఙ్నదీ తతః॥

తా॥ హనుమంతుని పాదములు [illegible]
కూర్మమూర్తి వీపునుండి రక్తము నదివలె ప్రవహించ [illegible]

శ్లో॥ అథాంజనాసుత శ్రీమాన్ - నిజవిక్రమ [illegible]
అస్పృశ్యమయం జలం పాపి - నివృత్త్యవపదో [illegible]

తా॥ పిమ్మట అంజనాసుతుడగు హనుమంతుడు [illegible]
కేర్పడిన భంగమును, రక్తమయమైన జలమును [illegible]
నుండి దిగెను.

శ్లో॥ కపీంద్రో భక్తవాత్సల్యా - ద్వరదానా త్స్వయం [illegible]
లక్ష్మీశ పక్షపాతాచ్చ - నివృత్త శ్శరభంజనాత్.

తా॥ ఆ హనుమంతుడు భక్తుడగు [illegible]
ములనను, తానే పూర్వము వరమిచ్చి [illegible]
పక్షపాతమువలనను శరపంజరమును భగ్న [illegible]

శ్లో॥ స్వభక్తం విజయం వీక్ష్య - సంప్రహృష్టమనా [illegible]
పరాజితోఽహ మస్మీతి - బభాషే వాయునందనః॥

తా॥ ఆ వాయుసుతుడు తన భక్తుని విజయమును [illegible]
యానందించినవాడై 'నేనోడితిని' అని పల్కెను.

శ్లో॥ రాజన్ త్వ మసి మద్భక్తో - విజయః పూర్వజన్మని
మన్మంత్ర జపనిష్ఠాతో - నిష్ఠాతో నిత్యకర్మసు॥

తా॥ ఓ రాజా నీవు పూర్వజన్మయందు విజయుడను [illegible]
నామంత్రమును జపించువాడవు. నిత్యకర్మల యందును నిష్ఠావంతుడవు అయి
తివి.

శ్లో॥ దిగ్జిగీషుః భవా న్నద్య - స్సత్వరం సర్వవిగ్రహః
స త్వం మయానునీతస్సన్ - భావికార్యవశా ద్భృశమ్
నివృత్తో విజిగీషాత - స్తదానీం నృపనందనః

తా॥ అప్పుడే నీవు దిక్కులను జయింపదలచినవాఁడవై సర్వ సన్నద్ధుఁడవయ్యు జరుగబోవుదాని ననుసరించి నాచే నియమింపబడిన వాఁడవై ఓరాజా అప్పటికి జయించుకోర్కె నుండి మరలితివి.

శ్లో॥ ఇదానీం సమయో రాజ — న్విజేతుం సకలాదిశః
అద్యప్రభృతి శత్రుభ్యో — న స్యాత్తవ పరాభవః।

తా॥ రాజా! దిక్కులన్నిటిని జయించుట కిదియే సమయము. నేటి నుండి నీకు శత్రువులవలన పరాభవమనునది యుండదు.

శ్లో॥ దుస్సహోఽయం మహాభారో — మద్భక్తస్య పరాభవః
ససరిత్సింధు శైలా భూ — ర్న మే భారాయ కల్పతే॥

తా॥ నాభక్తుల కేర్పడిన పరాభవము నాకు మిక్కిలి భరింపరానిది. అది నదులు, సముద్రములు, పర్వతములు అన్నిటితోడను గూడిన భూమి కన్న మిక్కిలి భారమైనది.

శ్లో॥ వరదాన ప్రతిజ్ఞా తు — విజయార్జునజన్మని
పరాజయ ఫలేనాద్య — ప్రాప్నోమి ధ్వజచిహ్నతామ్॥

తా॥ విజయుఁడవైన నీయర్జున జన్మమునందే నేను చేసిన వరదాన ప్రతిజ్ఞ. కావున పరాజయమును ముఖతో నీధ్వజమున చిహ్నముగానుందును.

శ్లో॥ ఇత్యుక్త్వా వచనం శ్రీమా — న్హనుమా న్భక్తవత్సలః
విజయస్య స్వభక్తస్య — ఖ్యాతయే జగతాం త్రయే
ప్రతిజ్ఞారక్షణార్థంచ — లేభే తస్య ధ్వజాగ్రతామ్।

తా॥ అని భక్తవత్సలుఁడు, శ్రీమంతుఁడు నగు హనుమంతుఁడు పల్కి ముల్లోకములందును తన భక్తుఁడగు విజయునకు కీర్తియేర్పడుటకు, తానొనర్చిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుటకును అతనిధ్వజమునచిహ్నముగా నేర్పడెను.

శ్లో॥ తదాప్రభృతి లోకేషు — పాండవ స్సఫలోద్యమః
కపిధ్వజ ఇతి ఖ్యాతిం — జగామ జగతాం చిరః

తా॥ అప్పటినుండి అర్జునుఁడు లోకమున సఫలములగు యత్నములు కలవాఁడై కపిధ్వజుఁడను ప్రసిద్ధినంది సంచరింపసాగెను.

శ్లో॥ తతః కపిధ్వజో రాజా - స్మయమాన ముఖాంబుజః
కృష్ణం నిరీక్ష్య వశ్యం తం - వచనం చేద మబ్రవీత్।

తా॥ పిమ్మట కపిధ్వజుఁడగు నారాజు చిఱునగవుతోఁ గూడిన మోము దమ్మికలవాఁడై కృష్ణుని చూచి వశ్యుఁడగు నాతనితో నిట్లనెను.

శ్లో॥ కృష్ణ! పశ్య మమ ప్రాజ్ఞ - భుజవీర్య మనర్గళమ్
న మేఽస్తి త్రిషు లోకేషు - ప్రతియోద్ధా కించన॥

తా॥ ఓకృష్ణా! నాయొక్క గొప్పదగు తిరుగులేని భుజపరాక్రమమును చూడుము. ముల్లోకములందును నాకు ప్రతివీరుఁడగువాఁడేలేఁడు.

శ్లో॥ అజేయోఽసురజేతాపి - హనూమా న్పవనందన.
భుజవీర్యా జ్జితో యస్మాత్ - ధ్వజలక్ష్మతా మగాత్॥

తా॥ ఎందువలననగా అజేయుఁడు, రక్కసిమూకను జెండినవాఁడు, శివాంశసంభూతుఁడు నగు హనుమంతుఁడే నాభుజబలముచే జయింపబడినవాఁడైనా టెక్కెపు గురుతుగా నేర్పడినాఁడు.

శ్లో॥ ఇతి గర్వితచేతస్కం - పాండవం యదునందనః
ఉవాచ వచనం ధీమాన్ - తస్య గర్వప్రశాంతయే॥

తా॥ అనుచు గర్వముతోఁ గూడిన మనసుకలవాఁడైన యర్జునుని గర్వమునణచుటకై బుద్ధిశాలియగు శ్రీకృష్ణుఁడీరీతిగాననెను.

శ్లో॥ యదా తే విజిగీషా స్యా - త్ప్రతిజ్ఞాపూర్వి కార్జునః
తదా శ్రమాతి రేకో మే - దీయతే సుహృదా త్వయా।

తా॥ అర్జునా! ఎప్పుడైతే నీకు ప్రతిజ్ఞతోఁ గూడిన విజయేచ్ఛ యేర్పడుచున్నదో అప్పుడు నాకు స్నేహితుఁడవగు నీచే మిక్కిలి శ్రమ చేయ బడుచున్నది.

శ్లో॥ ప్రణవామో వయం పార్థః సదా స్వాభీష్ట దేవతామ్
ప్రబల ద్వేషిణం జిష్ణో – సంయద్వామా భవ త్విత॥

తా॥ అర్జునా! సదము జయశీలుఁడవగు నీకు బలవంతునితో శత్రుత్వమును కూర్చుకుండుటకై మన ఇష్టదేవతకు నమస్కరింతము,

శ్లో॥ స్మృతేః సమయోత్సేక – స్తావకో మామకం వపుః
హనూమ త్పాదవిష్టంబ – బాధితం బాధతే పునః॥

తా॥ ఓయర్జునా! నీ ప్రతిజ్ఞాగర్వము హనుమంతునిపాదములు తాకిడిచే బాధపడు నా దేహమును మఱింత బాధపెట్టుచున్నది.

శ్లో॥ పశ్య రాజ న్మదీయాంగం – శోణితా క్త త్వ గంతరమ్
శిథిలీకృత శల్యాగ్రం – నిష్ఠ్యూత బహు మేదసమ్॥

తా॥ ఓరాజా! రక్తముచేవ్యాపించిన లోపలిచర్మముకల, మాసియున్న పుండుపై భాగములుకల, క్రొవ్వును వెడలించుచున్న నాశరీరమును చూడుము.

శ్లో॥ త్వ త్ప్రతిజ్ఞాం సమాలోక్య – మార్కనాయక విగ్రహః
అథస్తా త్పంజర స్యాహ – మవష్ట భ్యావతస్థివాన్॥

తా॥ నీప్రతిజ్ఞను పరిశీలించి మార్కరూపము దాలిన వాఁడనై నేను శరపంజరముయొక్క క్రిందిభాగమున పూనికతో నుంటిని.

శ్లో॥ తదా పాదప్రహారేణ – వాయుసూనో ర్మహాత్మనః
జర్జరీకృత సర్వాంగో – బహు సంకట మభ్యగామ్

తా॥ అప్పుడు మహాత్ముఁడగు వాయునందనుని పాదముల తాకిడిచే సర్వావయవములు శిథిలములుకాగా మిక్కిలి కష్టము ననుభవించితిని.

శ్లో॥ కో వా యుధి కపీంద్రస్య – స్తాతా ఉతికుపితాత్మనః
యత్ర వజ్రాది శస్త్రాణి – తూలప్రాయాణి జజ్ఞిరే॥

తా॥ వజ్రాయుధమువంటి శస్త్రములే ఎవనియెదుట దూదితో సమానములో అట్టి హనుమంతునియెదుట అందును మిక్కిలికోపముగానున్నవానియెదుట యుద్ధమున నిలువ నెవ్వఁడు సమర్థుడు?

శ్లో॥ కిం తు మచ్ఛ్రుత వేదిత్వా - ద్వారవానా ద్రుతే హరా
భావికార్య ప్రభావాఖ్యే - ధ్వజాగ్రే సంప్రతిష్ఠితః

తా॥ కాని నా పాట్లను గమనించుటవలన హనుమంతుడు నీకు వరము నిచ్చి యుండుటవలన రాబోవు కార్యభారములు ప్రభావమువలనను టెక్కెమున నిల్చినాడు కాని ఓడిపోయికాదు.

శ్లో॥ ఇత్యుక్త్వా తస్య తోషాయ - ప్రశశంస హరిః స్వయం
కృతార్థోఽపి మహాభాగః హనుమాన్ స్వభక్తి తోషితః
ఆస్తే ధ్వజపతాకాయాం - జయ మిచ్ఛన్ సదా తవ॥

తా॥ అని పల్కి మరల ఆ యర్జునుని తృప్తికై కొనియాడెను. ఓ మహామహుడా! సర్వకామితములు నెరవేర్చువాడైనను హనుమంతుడు భక్తివలన తృప్తిపడినవాడై నీ కెల్లప్పుడు జయమునే కోరుచు నీ ధ్వజము నందు ఉన్నాడు.

శ్లో॥ ఇతి సాంత్వ వచస్సారై - స్త దవజ్ఞాం ప్రమార్జ్య సః
తతో హృష్టమనాః పార్థః - కపీంద్రధ్వజ లాభతః
అవశిష్టదిశ స్సర్వాః - జిగాయ భుజవిక్రమైః

తా॥ అని కృష్ణుడు తన మెల్లనైన పలుకులతో అర్జునుని అజ్ఞానమును తొలగించెను. పిదప అర్జునుడు సంతసించిన మనస్సుకలవాడై హనుమంతుడు టెక్కెమునందున్న లాభమున భుజపరాక్రమముచే మిగిలిన దిక్కులన్నిటిని జయించెను.

శ్లో॥ ఇతి పవనసుత ప్రసాద లాభాత్
సకలహరి జ్జయ సంప్రహృష్ట చేతాః
అలభత నిజమందిరం సజిష్ణుః
పథి యదునాయక దత్త సూతభావః।

తా॥ ఇట్లు వాయునందనుని యనుగ్రహలాభమువలన నన్నిదిక్కులను జయించుటచే నేర్పడిన మానసికానందము కలవాడై ప్రయాణమున కృష్ణుడు సారథ్యమువహించుచుండగా నా జయశీలుడగు నర్జునుడు తన యంతఃపురమును చేరెను.

శ్లో॥ అథ సురపతిసూను రిద్ధతేజాః
సకల దిగీశ కిరీట జుష్టపీఠః
చిర మరమత కృష్ణయా సకృష్ణః
కురుపతి గౌరవభంగ హేతులీలః॥

తా॥ అటుపిమ్మట ప్రకాశించు తేజస్సు కలవాడై, సకల దిక్పతుల కిరీటములచే సేవింపబడు పీఠము కలవాడై కృష్ణునితో కూడియున్నవాడై దుర్యోధనుని గౌరవమును నాశనమొనర్చు విలాసముతో ద్రౌపదితోకూడి చిరకాలము సుఖముగా నుండెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పంచముఖ హనుమన్మంత్రవివరణే
శ్రీ పరాశర మైత్రేయ సంవాదే హనుమ దష్టాక్షరీప్రభావ
విజయచరిత్రకథనం నామ షోడశః పటలః

## సప్తదశ పటలః

### న్యాసముద్రాది [illegible]

మైత్రేయః

శ్లో॥ సమస్తాగమజాలాని – శ్రుతాని సవిశేషతః
పున ర్విశేషం పృచ్ఛామి – స్వామి న్మే వద మారుతేః।

తా॥ మైత్రేయుఁ డడుగుచున్నాడు. స్వామీ! పరాశర మహామునీ! సకలాగమవిషయములు విశేషసహితముగా వింటిని. ఇంకను హనుమంతునకు సంబంధించిన విశేషము లడుగుచున్నాను. నాకు చెప్పవలసినది.

శ్లో॥ స్నానం సంధ్యా జపో హోమః – ముద్రా ఆవరణ దేవతాః
అంగమంత్రా న్యాసవిధిః – ప్రాణాయామ శ్చ తర్పణమ్॥
పీఠపూజాం హనుమతో – మే వదస్వ మహామునే!

తా॥ ఓ మహామునీ! స్నానవిధానము, సంధ్యావందనము, జపము, హోమము, ముద్రలు, ఆవరణదేవతలు, అంగమంత్రములు, న్యాసవిధా

నము, ప్రాణాయామము, తర్పణము, హనుమత్పీఠపూజనము నాచు చెప్ప
వలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ బ్రాహ్మీముహూర్తే చోత్థాయ - శుచి ర్భూత్వా సితాంబుజే
అనంతదళ సందీప్తే - కర్ణికామధ్యమే సుధీః॥

తా॥ తెల్లవారుటకు నాల్గుఘడియలు ముందుగలేచి పరిశుద్ధుడై శుభప్రదమై, అనంతములగు దళములతో ప్రకాశించు తెల్లని పద్మముయొక్క దుద్దునముమగా

శ్లో॥ ధ్యాయే న్మూర్ధ్ని సితాంభోజే - సహస్రదళ సంయుతే
సర్వాంతర్యామినం దేవం - భగవంతం సనాతనమ్॥

తా॥ ఆ సహస్రదళములుకల తెల్లని పద్మము యొక్క శిరోభాగమున సర్వాంతర్యామియు, సనాతనుండును భగవంతుడు నగు నాదేవుని భావింపవలెను .

శ్లో॥ ప్రాత శ్శిరసి శుక్లాబ్జే - ద్వినేత్రం ద్విభుజం గురుమ్
వరాభయకరం శాంతం - స్మరేత్తం నామపూర్వకమ్॥

తా॥ ఉదయసమయమున ఆతెల్లని పద్మముయొక్క శిరోభాగమున రెండునేత్రములు, రెండుభుజములుకల్గి వరదుడు అభయమునిచువాడు నగు నా శ్రేష్ఠుని ఉపనామోచ్చారణపూర్వకంగా స్మరింపవలెను.

శ్లో॥ గురుం చా భేదబుద్ధి ర్వై - ధ్యాయే త్తన్మధ్యమే సుధీః
సింహాసనే పురోదేశే - సంస్థాప్య గురుదైవతమ్॥

తా॥ బుద్ధిశాలి దానియొక్క ముందుభాగమున సింహాసనమున అభేదబుద్ధితో గురుదేవుని స్థాపించినవాడై ధ్యానించవలెను.

శ్లో॥ గుకారం గురవే దద్యా - ద్గణనాథాయ గం వదేత్
క్షం వదేత్ క్షేత్రపాలయ - సరస్వత్యై స సం వదేత్॥

తా॥ 'గు, కారమును గురువునకు, 'గ' కారమును గణనాధునకు 'క్ష' కారము క్షేత్రపాలురకు స,కారము సరస్వతికి

శ్లో॥ పకారం చ తతః కుర్యాత్ - పరమాత్మన ఇత్యపి
నమస్కుర్యాద్గురం మూర్ధ్ని - గణేశం దక్షిణే భుజే

తా॥ 'ప'కారము పరమాత్మునకు నుచ్చరింపవలెను. శిరోభాగమున గురుధ్యానమొనర్చి, దక్షిణభుజమందు గణపతిని భావించి,

శ్లో॥ వామే భుజేక్షేత్రపాలం - దక్షిణాంసే సరస్వతీమ్
వామాంసే పరమాత్మానం - క్రమేణ విధినా మునేః

తా। వామభుజమందు క్షేత్రపాలుని, కుడిమూపున సరస్వతిని, ఎడమమూపున పరమాత్మను భావించి ఓమైత్రేయమహామునీ క్రమవిధానముతో

శ్లో। గంధపుష్పై శ్చ ధూపై శ్చ - దీపే నామిత తేజసా
నైవేద్యేన చ సంపూజ్య - నమస్కుర్యా ద్యథావిధి॥

తా॥ గంధముచేత, పుష్పములచేత, ధూపముచేత, ప్రకాశముకల దీపముచేత నైవేద్యముచేత విధివిధానముగా పూజించి నమస్కరింపవలెను.

శ్లో॥ ఆదాయ స్నానసామగ్రిం - నదీ మభివసే త్తతః
యథావిధి తత స్స్నాయాత్ - స్మార్తాచా రానుసారతః॥

తా॥ స్నానమునకు వలయుసామగ్రిని తీసికొని నదిచేరి పిదప స్మృతిచెప్పిన యాచారమునసునరించి యధావిధిగా స్నానముచేయవలెను.

శ్లో మంత్రస్నానం తతః కుర్యాత్ - ఏవం తద్విధి రుచ్యతే
హస్తేన ఫేనం నిష్కాస్య - ఆత్మనః పూర్వభాగతః
వర్తులం కవచేనాఽథ - విలిఖే త్తత్ర సంయుతః

తా॥ పిదప మంత్రస్నానము చేయవలెను. ఆ విధానమట్లు చెప్పబడుచున్నది. చేతితో నురుగును తొలగించి తనకు ముందుభాగమున హుమ్ మత్కవచముచే వర్తులాకారమును లిఖింపవలయును.

శ్లో॥ విలిఖే దష్టకోణం చ - చక్రం తత్ర ప్రయత్నతః
మంత్రరాజస్య వర్ణాం శ్చ - అష్టకోణేషు విన్యసేత్

తా॥ అట ప్రయత్నపూర్వకముగ అష్టకోణచక్రమును లిఖించి హనుమదష్టాక్షరీ మంత్రవర్ణముల నెనిమిదికోణములందు నుంచవలెను.

శ్లో॥ అష్టాక్షరీం త్రి రావృత్య - అష్టముద్రాః ప్రదర్శయేత్
తదీయ ముదకం తత్ర - భావయే దమృతాత్మనా॥

తా॥ అష్టాక్షరీమంత్రమును మూడు మారులుచ్చరించి అష్టముద్రలను ప్రదర్శింపవలెను. అచ్చట మంత్రింపబడిన యుదకమును అమృతముగా భావింపవలెను.

శ్లో॥ తత్ర దివ్యానితీర్థాని - అంకుశేనాఽఽహరే న్మునే।
సూర్యమండల మధ్యస్థం - హనూమంతం ప్రయత్నతః
ప్రసన్నముద్రయా తత్ర - చక్రే సంస్థాపయే ద్బుధః॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! అంకుశముద్రచే దివ్య తీర్థముల భావించి ప్రసన్నముద్రచే సూర్యమండల మధ్యస్థుడగు హనుమంతుని ప్రయత్నపూర్వకముగ నట చక్రము నందు స్థాపించవలెను.

శ్లో॥ ప్రాణాయామం తతః కృత్వా - తతః స్నానం విధీయతే
త త్పాదోపరి మూర్ధానం - త్రివారం ప్రాపయే జ్జలే
జపే దష్టాక్షరీం తత్ర - మంత్రరాజం త్రివారకమ్

తా॥ పిదప ప్రాణాయామము, ఆ పిదప స్నానము విధింపబడినవి. చక్రమధ్యస్థునొనర్చిన హనుమంతుని పాదములకడ తన శిరస్సునుంచిన ట్లుగ భావించి మూడుమారులు జలమందు నిమజ్జనమొనర్చవలెను. అపై మంత్రములందు శ్రేష్ఠమగు అష్టాక్షరీమహామంత్రమును మూడుమారులు జపించవలెను.

శ్లో॥ ముఖాది సర్వగాత్రేషు - ప్రోక్షయే త్కుంభముద్రయా
త్రివార మష్టవారం వా - మంత్రరాజ ముదాహరేత్॥

తా॥ ముఖము మొదలుగాగల సర్వశరీరమునను కుంభముద్రచే ప్రోక్షణ మొనర్చి మూడుమారులుకాని, ఎనిమిదిమాఱులుకాని మంత్రరాజమగు అష్టాక్షరి నుచ్చరింపవలెను.

శ్లో॥ సంహారముద్రయా దేవం - స్థాపయే త్పూర్వమండలే
తత స్తీరం సమాసాద్య - ధారయే ద్ధౌతయుగ్మకమ్

తా॥ పూర్వోక్తమండలమధ్యమున సంహారముద్రతో హనుమంతుని స్థాపించవలెను. పిదప ఒడ్డునకు వచ్చి తెల్లటి వస్త్రముల జంటను ధరింపవలెను.

శ్లో॥ మంత్రస్నాన విధానోఽయం - సకలాగమ సమ్మతః
స్మార్త సంధ్యాం తతః కుర్యాత్-మంత్రసంధ్యా మనన్తతః॥

తా॥ ఇది సకలాగమ సమ్మతమైన మంత్రస్నాన విధానము, పిదప స్మృతిచెప్పినరీతిగా సంధ్యావందన మొనర్పవలెను. ఆపిదప మరల మంత్ర సంధ్యోపాసన మొనర్పవలెను.

శ్లో॥ పూర్వవ ద్విలిఖే చ్చక్రం - ప్రాణాయామం చ మూలతః
తచ్చక్రమధ్యే హనుమ - త్పాదపద్మోదకం త్రిభిః
ఆచమ్య మూలమంత్రేణ - స్పృశే దంగాని మూలతః॥

తా॥ వెనుకటివలెనే చక్రమును లిఖియించి ప్రాణాయామము చేయవలెను, ఆచక్రమధ్యమందలి హనుమత్పాద పద్మములకడనున్న జలముతో మూడుమారులు ఆచమన మొనర్చి మూలమంత్రము నుచ్చరించుచు అంగములను స్పృశింపవలెను.

శ్లో॥ త్రివార మష్టవారం వా-మార్జనం మస్తకాదితః
మూలేన సకలాంగాని - మున రాచమ్య మూలతః
మనునా మంత్రగాయత్ర్యా దద్యా దర్ఘ్యత్రయం తతః॥

తా॥ శిరమునందు మూడుమార్లుకాని, ఎనిమిదిమార్లుకాని మార్జనము చేసికొనవలెను. మూలమంత్రముతో సర్వావయవములు స్పృశించి, మూల

మంత్రముచే మరల ఆచమనమొనర్చి పిమ్మట మంత్రగాయత్రితో ముమ్మారు అర్ఘ్యము నీయవలయును.

శ్లో॥ ఆత్మప్రదక్షిణం కుర్యాత్ - మూలమంత్రేణ యత్నతః
మూలేన పున రాచమ్య - ప్రాణాయామం చ రేత్సునః

తా॥ ప్రయత్న పూర్వకముగా మూలమంత్రముచేతనే ఆత్మప్రదక్షిణము చేయవలెను. మూలమంత్రముచే మరల ఆచమనమొనర్చి మరల ప్రాణాయామము నాచరింపవలెను.

శ్లో॥ మూలమంత్రం చ గాయత్రీం - యథాశక్తి జపే త్సుధీః
ప్రాణాయామం పునః కుర్యాత్ ఆచమ్య విధివ త్సునః

తా॥ బుద్ధిమంతుడగువాడు మూలమంత్రమును, మంత్రగాయత్రిని శక్తికొలది జపించవలెను. మరల ఆచమనమొనర్చి యథావిధి ప్రాణాయామము నొనర్చవలెను.

శ్లో॥ సంహారముద్రయా చక్రే - స్థితం దేవం హృది న్యసేత్।

తా॥ సంహారముద్రచే చక్రమున స్థాపించబడిన దేవుని హృదయమందు ప్రతిష్ఠింపవలెను.

శ్లో॥ నిత్య మంత్రజపం వక్ష్యే -శృణుష్వ మునిపుంగవ:
మూలేన పున రాచమ్య - ప్రాణాయామ త్రయం పునః॥

తా॥ మునిశ్రేష్ఠా। మైత్రేయా। నిత్యమంత్రజపమును చెప్పుచున్నాను. వినవలసినది. మూలమంత్రముచే మరల ఆచమనమొనర్చి ముమ్మారు ప్రాణాయామము నొనర్చవలెను.

శ్లో॥ విరేచ్య దక్షిణే నాసా-త్రివారం మూలమంత్రతః
నాసారంధ్రేణ వామేన-షడ్వారం పూరయే త్తతః॥

తా॥ మూల మంత్రముచే ముమ్మారు దక్షిణభాగమున నాసారంధ్రముచే రేచకము చేయవలెను. పిదప ఎడమవైపుముక్కు రంధ్రముద్వారా ఆరుసార్లు పూరణ మొనర్చవలెను.

శ్లో॥ కుంభయే న్మనునా చేన-ద్వాద శావృత్తి మాత్రతః
షడ్వారం రేచయే త్తత్ర-పున ర్దక్షిణభాగతః
ఏవం హనుమతో మంత్ర-ప్రాణాయామస్య లక్షణమ్॥

తా॥ పిదప పండ్రెండుమార్లు మూలమంత్రావృత్తి జరుగునట్లుగ కుంభకము నొనర్చవలెను. మరల దక్షిణ నాసా రంధ్రముద్వారా ఆరుమార్లు రేచకమొనర్పవలెను. ఇది హనుమన్మంత్రమునకు ప్రాణాయామ లక్షణము.

శ్లో॥ భూశుద్ధిం భూతశుద్ధిం చ-న్యాసా న్కుర్యాత్ ప్రయత్నతః
క్రమేణ వక్ష్యే మౌనీంద్ర-సమాహితమనా శ్శృణు॥

తా॥ ఓమునిశ్రేష్ఠా: ప్రయత్నపూర్వకముగ భూశుద్ధిని, భూతశుద్ధిని, న్యాసములను చేయవలయును. వానిని క్రమముగ చెప్పెదను సావధానుడవై వినుము.

శ్లో॥ భూశుద్ధిం మాదౌ వక్ష్యామి-శ్రూయతాం మునిపుంగవ:
పృధివ్యా ఇ త్యుదీ ర్యాదౌ - మేరుపృష్ఠఋషి స్తథా॥

తా॥ మౌనీంద్రా: ముందుగ భూశుద్ధిని చెప్పెదను వినుము. 'పృథివ్యాః' అని ముందుగ చెప్పి పిమ్మటమేరుపృష్ఠఋషిః అని.

శ్లో॥ సుతలం ఛంద ఇత్యేవం-కూర్మో దైవత ముచ్యతే
ఆసనే వినియోగేఽపి-ఏవం కించి దథో న్యసేత్॥

తా॥ 'సుతలంఛందః' అని, 'కూర్మోదేవతా' అని 'ఆసనే వినియోగః' అని హస్తమును భూమియందుంచవలెను.

శ్లో॥ తతోఽనంతాసనా యేతి-నమోంతం సముదీరయేత్
కమలాసన శబ్దం చ - చతుర్థ్యంతం నమోంతకమ్॥

తా॥ పిదప 'అనంతాసనాయ నమః' అని చెప్పవలెను. 'కమలాసనాయనమః' అని.

శ్లో॥ విమలాసన శబ్దం చ-చతుర్థ్యంతం నమోఽంతకమ్

తా॥ 'విమలాసనాయ నమః' అని పూజ సేయవలెను.

శ్లో॥ పృథ్వీ! త్వయా ధృతా లోకా-దేవి! త్వం విష్ణునా ధృతా
త్వం చ ధారయ మాం దేవి! పవిత్రం కురు చాసనమ్।

తా॥ ఓభూదేవీ! లోకములన్నింటిని నీవు ధరించుచున్నావు. విష్ణువు నిన్ను ధరించుచున్నాడు. నీవు నన్నుకూడ ధరించుము. ఓదేవీ! నాకై ఆసనమునుకూడ పవిత్రము చేయుము.' అని భూప్రార్థనచేసి.

శ్లో। అపసర్పం తు యే భూతా-యే భూతా భువి సంస్థితాః
యే భూతా విఘ్నకర్తార-స్తే నశ్యంతు శివాజ్ఞయా॥

తా॥ ఈ ప్రదేశమందున్న ప్రాణికోటియంతయు తొలగుగాక. శివాజ్ఞచే ఇచ్చటి విఘ్నకారులగు ప్రాణులన్నియు నశించుగాక। అని

శ్లో॥ త్రివారం ఘాతయే ద్భూమా-వాసనే వామపార్ష్ణినా
తాళత్రయం ప్రకుర్వీత-కరాభ్యాం మూలమంత్రతః॥

తా॥ ఎడమపాదముచే మూడుమారులు ఆసనభూమి యందు తాడనము చేయవలెను. మూలమంత్రము చెప్పుచు చేతులతో మూడుమారులు మ్రోతచేయవలెను.

శ్లో మూలమంత్రేణ దిగ్బంధం - కుర్యా న్ని యతమానసః
మూలమంత్రాగ్నిబీజాభ్యాం - కుర్యా త్ప్రాకార మాత్మనః
ఏవం ప్రకారా భూశుద్ధిః - యథాశాస్త్ర ముదాహృతా॥

తా॥ మనస్సును నిగ్రహముతో నుంచుకొని మూలమంత్రముతోనే దిగ్బంధము చేయవలెను. మూలమంత్రము, అగ్నిబీజములచే తనకు ప్రాకారము చేయవలెను (ఇట శ్రీకారమని పాఠాంతరముకలదు) ఈరీతిగా శాస్త్రోక్తముగ భూశుద్ధి చెప్పబడెనది.

శ్లో॥ బ్రహ్మహత్యాశిరస్కం చ - స్వర్ణస్తేయ భుజద్వయమ్
సురాపాన హృదాయుక్తం - గురుతల్ప కటిద్వయమ్॥

తా॥ బ్రాహ్మణహత్యచేసిన శిరస్సుకలవానిని అనగా బ్రాహ్మణ హత్యచేసినవానిని, బంగారము దొంగిలించిన చేతులుకలవానిని, కల్లు త్రాగిన అనగా మదించిన హృదయముకలవానిని గురువుగారిభార్యను పొందిన కటిప్రదేశముకలవానిని.

శ్లో॥ తత్సంయోగ పదద్వంద్వ - మంగప్రత్యంగ పాతకమ్
ఉపపాతక రోమాణం - రక్తవిశ్రుత లోచనమ్॥

తా॥ పైనల్వురు మహాపాతకులతోడి స్నేహమొనర్చిన పాదములు కలవానిని, సర్వావయవములు పాపముతోకూడుకొన్నవానిని ఉపపాతకములచే గగుర్పాటు ననుభవించు రోమములుకలవానిని రక్తము ప్రవహించునేత్రములు కలవానిని "రక్తశ్మశ్రు' అనిపాఠాంతరముకలదు"

శ్లో॥ అచైతన్య మధోవక్త్రం - దగ్ధపాదప సన్నిభమ్
అంగుష్ఠమాత్రం పురుషం - దురాత్మానం దురాసదమ్॥

తా॥ చైతన్యరహితుని, తలవంచియుండువానిని, కాలినచెట్టువలె జీవహీనుడై యుండువానిని బొటనవ్రేలులా పొట్టిగానుండు పురుషుని, దుర్మార్గుడైనవానిని పొందుకు తగనివానిని "దురాననమ్ అని పాఠాంతరము"

శ్లో॥ ఖడ్గ చర్మ ధరం కృష్ణం - కుక్షౌ వామే విచింతయేత్
ఏవం విచింత్య పాప్మానం - వామకుక్షౌ ప్రయత్నతః

తా॥ ఖడ్గమును చర్మమును ధరించినవానిని నల్లనైనవానిని పాపపురుషుని వామకుక్షియందు చింతనచేయవలెను. ఇట్లు ప్రయత్నపూర్వకముగా పాపపురుషుని వామకుక్షియందు భావించి

శ్లో॥ తస్యాంగం సర్వతః స్థాప్య - తజ్జీవం మూర్ధ్ని విన్యసేత్
తస్యైవాంగం ప్రయత్నేన - వాయుబీజేన శోషయేత్॥

తా॥ అతని యంగము నంతట స్థాపించి (ఇట 'పురతః' అని పాఠాంతరము) శిరస్సున నాతని జీవమును స్థాపించవలెను. వానియంగమును ప్రయత్నపూర్వకముగా వాయుబీజముచే శుష్కింపజేయవలెను.

శ్లో॥ తతః పావకబీజేన – తమేవ ప్రదహే త్పునః
తతో మారుతబీజేన – భస్మీభూతం విసర్జయేత్॥

తా॥ పిమ్మట అగ్ని బీజముచే వానినే మరల దహింపవలెను. ఆ పిమ్మట వాయుబీజముచే భస్మరాశిని విసర్జించవలెను.

శ్లో॥ దివ్యమంగళ రూపాంగం – మనసా కల్పయే త్పునః
దేవం మూర్ధ్ని స్థితం తత్ర ప్రవిశ్యాఽమృతబీజతః
ప్రాణప్రతిష్ఠా మంత్రేణ – ప్రాణాం స్తత్రోపకల్పయేత్॥

తా॥ పిదప దివ్యమంగళరూపుని మనసా కల్పింపవలెను. ఆదివ్య మంగళమూర్తిని అమృతబీజముతో బ్రహ్మరంధ్రభాగమున నున్నవానిగా సంభావించి ప్రాణప్రతిష్ఠామంత్రముచే ప్రాణప్రతిష్ఠ నొనర్పవలెను.

శ్లో॥ హృదయే న్యస్తపాణి స్సన్ - త దేకాగ్ర మహామనాః
ప్రాణప్రతిష్ఠా మంత్రం చ – త్రివారం సముదీరయేత్॥

తా॥ హృదయప్రదేశమున చేతినుంచి ఏకాగ్రచిత్తుడై ప్రాణప్రతిష్ఠా మంత్రమును ముమ్మారుచ్చరింపవలెను.

శ్లో॥ వాయుబీజాఽగ్నిబీజేన - దక్షిణేన ప్రపూరయేత్
ప్రాణాన్ సంరుధ్య విధివత్ –వామేనైన విసర్జయేత్

తా॥ వాయ్వగ్నిబీజములచే దక్షిణనాసారంధ్రముద్వారా వాయువును పూరించి, నిలిపియుంచి తగినరీతిగా ఎడమముక్కు రంధ్రముద్వారా విడువవలెను.

వ॥ అస్య శ్రీ అంతర్మాతృకా సరస్వతీ మహామంత్రస్య బ్రహ్మ ఋషిః గాయత్రీఛందః అంతర్మాతృకా సరస్వతీదేవతా, హలః బీజాని, స్వరాశ్శక్తయః బిందవః కీలకం, మమ అంతర్మాతృకా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

అను ఋష్యాది విషయమునుచెప్పి ధ్యానమొనర్పవలెను.

ధ్యానమ్:-

బంధూకాభాం త్రినేత్రాం పృథుతర విలస చ్చక్తిమ ద్రక్తవస్త్రామ్
పీనోత్తుంగ ప్రవృద్ధ స్తన జఘన భరాం- యౌవనారంభ రూఢామ్
సర్వాలంకార యుక్తాం సరసిజ నిలయాం మిందుసంక్రాంత మూర్తిమ్
అంబాం, పాశాంకుశాఢ్యాం అభయ వరకరా మంబికాం తాం నమామి

తా॥ మంకెనపూవుతో సమానమగు కాంతికలదియు, మూడు కన్నులు కలదియు గొప్పగా ప్రకాశించు ముత్యపుచిప్పవలె ఎఱ్ఱని వస్త్రము కలదియు, బలసిన యెత్తైన మిక్కిలిపెద్దవగు స్తనములయొక్క, జఘనముయొక్క భారముకలదియు, యౌవనప్రాదుర్భావముచే స్పష్టమైనదియు సమస్తములగు నలంకారములు కలదియు, పద్మమే నివాసస్థలముగ కలదియు, చంద్రునినుండి సంక్రమించిన స్వరూపముకలదియు, పాశము, అంకుశము అను ఆయుధములచే ప్రకాశించునట్టియు, అభయమునొసగు శ్రేష్ఠమగు చేతినికల్గియున్నట్టియు, మాతృస్వరూపిణియగునామెకు నమస్కరించుచున్నాను. [అనుధ్యానశ్లోకమును చదువవలెను]

శ్లో॥ అథాంతర్మాతృకా న్యాసః-కంఠ హృన్నాభి గుహ్యకే
పాయౌ భ్రూమధ్యగే వక్త్రేం షోడశ ద్వాదశాన్వితే
దశపత్రే చ షట్పత్రే చతుష్పత్రే ద్విపత్రకే॥

తా॥ ఇక అంతర్మాతృకాన్యాసము చెప్పబడుచున్నది. కంఠము నందు, హృదయమునందు, బొడ్డునందు, గుహ్యప్రదేశమందు, పాయుస్థానమునందు కను బొమలమధ్య ప్రదేశమందు, ముఖమందు, షోడశారమందు, ద్వాదశారమందు, దశపత్రకమలమందు, షట్పత్రకమల మందు, చతుష్పత్రకమలమందు, ద్విపత్రకమందు,

శ్లో॥ ఆధారే లింగ, నాభౌ, హృదయసరసిజే, తాలుమూలే, లలాటే
ద్వేపత్రే షోడశారే, ద్విదశ, దశదళే, ద్వాదశార్ధే, చతుష్కే,
నాసాంతే, తాలుమధ్యే, ఢ ఫ క ట సహితే కంఠమూలే స్వరాణామ్
హం క్షం తత్వార్థయుక్తం సకలమునినుతం వర్ణరూపం నమామి॥

తా॥ మూలాధారమందును, లింగమునను, బొడ్డున, హృదయకమలమునందు, దవుడలమొదట, నొసట ద్విదళ కమలమునందు షోడశార చక్రమునందు, ద్విదళదళయుక్తమైన ద్వాదశార్ధమందును, చతుష్కోణమందును, నాసాంతమందును, తాలుమధ్యమునను డ ఫ క ట సహితముగ కంఠ మూలస్థానమందు సర్వస్వరముల యొక్కయు హ కా ర క్షకారముల యొక్కయు, హకార క్షకార తత్వార్థముతో కూడినదియు, సకల మునిసమ్మతమైనదియు నగు వర్ణ స్వరూపమును నమస్కరించుచున్నాను.

వ॥ అస్య శ్రీ బహిర్మాతృకామంత్రస్య అంతర్మాతృకావత్

తా॥ ఈబహిర్మాతృకా మంత్రమునకు అంతర్మాతృకకు వలెనే ఋష్యాదికము చెప్పుకొనవలయును.

ధ్యానమ్ :-

పంచాశల్లిపిభిర్విభక్త ముఖ దోర్మధ్యస్థ వక్షస్థలామ్
భాస్వన్మౌళినిబద్ధ చంద్రశకలా, మాపీన తుంగస్తనీమ్
ముద్రా మక్షగుణం సుధాఢ్యకలశం విద్యాం చ హస్తాంబుజైః
బిభ్రాణాం, విశదప్రభాం, త్రిణయనాం, వాగ్దేవతా, మాశ్రయే॥

తా॥ ఏబదివర్ణములతో విభక్తమైన ముఖము బాహు మధ్యభాగ మందలి వక్షస్థలము కలిగినట్టిదియు, (అవ్యక్త పాఠాంతరములున్నవి) ప్రకాశించు కిరీటమందుకల చంద్రకళ కలిగినట్టిదియు, బలిసిన యెత్తయిన స్తనములు కలిగినట్టిదియు, చిన్ముద్రను, అక్షమాలను, అమృతకలశమును, పుస్తకమును-హస్తపద్మములచే ధరించినట్టిదియు, స్పష్టముగ వ్యాపించిన కాంతికలిగినట్టిదియు, మూడుకన్నులు కలిగినట్టిదియు నగు వాగ్దేవతను సరస్వతిని ఆశ్రయించుచున్నాను.

వ॥ ఆసన హృ త్కుక్షి శృతి నాసా గండోష్ఠ దంత మూర్ధా స్యే
దోఃప త్సంధ్యంగుళ్యగ్రేషు పార్శ్వద్వయ పృష్ఠ నాభి జఠరే
ష్వధో మూలాపర గళ కక్షేషు హృదాది కర పదద్వయ జఠ రాననయో
ర్వ్యాపకసంజ్ఞా న్న్యసే దక్షరా న్క్రమశః

తా॥ ఆసనమందు (ఇటకాననవృత్తాక్షి అని పాఠాంతరము కలదు) హృదయమందు, కడుపునందు, చెవియందు, ముక్కునందు, చెక్కిలియందు, పెదవియందు, దంతములందు, శిరస్సునందు ముఖమునందు, బాహువులయొక్కయు, పాదములయొక్కయు, సంధులందును, వ్రేళ్ళ యొక్క చివఱిభాగమున ఉభయపార్శ్వములందు. పృష్ఠమందు, నాభియందు, జఠరలయందు, మూలభాగములందు, అపరగళభాగమున, చంకలయందు, హృదయ, కర, పాద, జఠర, ముఖ వ్యాపకములగు అక్షరములనుంచి భావించవలెను.

గ్రంథాంతరే

శ్లో॥ శిరో వదన వృత్తే చ - చక్షు శ్శ్రోత్రద్వయే పి చ
నాసా కపోలయుగళే - త థోష్ఠాఽధరయో రపి
ఊర్ధ్వాథో దంతపంక్త్యౌ చ - మూర్ధాస్యే షోడశ స్వరా।

తా॥ శిరమునందు, ముఖమునందు, కనులజంటయందు, చెవులజంటయందు, నాసారంధ్రములురెంటి, చెక్కిళ్ళజంటయందు, అట్లేపై పెదవి, క్రిందిపెదవులందు, పైపంటివరుస, క్రిందిపంటివరుసయందు, శిరస్సుపైభాగమునందు ముఖమునందును మొత్తము పదునారు అచ్చులను చెప్పవలెను.

శ్లో॥ క చ వర్గద్వయం బాహ్వోః - పంచ సంధిస్థలిం న్యసేత్
ట త వర్గద్వయం పాద - సంధ్యగ్రేషు తథా న్యసేత్

తా॥ కవర్గ చవర్గలు రెంటిని బాహువులందును, పంచసంధుల పరిభాగమున అనగా నడినెత్తిన (ఇట ' పంచసంధిస్థ స్త్రకేన్యసేత్'

అని పాఠాంతరమున్నది కాని ఛందోయోగ్యముకాదు) టవర్గ తవర్గ ద్వయమును పాదసంధుల చివటిభాగములను ఉంచవలెను.

శ్లో॥ పవర్గం పార్శ్వయుగళే- పృష్ఠనాభ్యుదరేషు చ
యకారాది క్షకారాంతం - దశవర్ణా న్న్యసేత్॥

తా॥ పవర్గాక్షరముల నుభయ పార్శ్వములందును, పృష్ఠము, నాభి, ఉదరములందును, యకారము మొదలు క్షకారమువరకుగల పది యక్షరములను ఉచ్చరించుచు

శ్లో॥ హృద్దోర్మూల కకు త్కుక్షి - హృదాది కర పద్వయే
జఠరాఽఽననయో శ్చైవ - వ్యాపకమ్ వినియోజయేత్।

తా॥ హృదయమునందును, బాహుమూలములందును, మూపునందును, పొట్టయందును, హృదయమునందును, కరద్వయమునందును, పదద్వయమునందును, జఠర యందును, ముఖమునందును వ్యాపకత నియోగించవలెను.

శ్లో॥ ఋషిశ్ఛందో దేవతా చ-బీజం శక్తిం చ కీలకమ్
శిరో వదన హృద్గుహ్య - జంఘ పాదా న్న్యసే త్క్రమాత్।

తా॥ ఋషిని, చందస్సును, దేవతను, బీజమును, శక్తిని, కీలకమును శిరస్సు, ముఖము, హృదయము, గుహ్యము, పిక్క, పాదముల న్యాసమొనర్చవలెను.

శ్లో॥ ఋషిం మూర్ధ్ని ముఖే ఛందః - దేవతాం హృది విన్యసేత్
ఆధారే శక్తి బీజం చ - కీలకం పాదయో ర్న్యసేత్॥

తా॥ ఋషిని శిరస్సున, ఛందమును ముఖమున, దేవతను హృదయమున శక్తిని, మూలాధారమున, బీజకీలకములను పాదములు రెంటియందును న్యాసమొనర్చవలెను.

శ్లో॥ న్యాసా త్పరం ప్రాణనిరోధనం మునే,
ధ్యానం చ కృత్వా విధివ జ్జపే న్మనుమ్

దేహాంగుళిన్యాస విధిం చ కృత్వా
ధ్యాత్వా చ సంక్షిప్య జలం విసర్జయేత్।

తా॥ ఓ మైత్రేయమహామునీ! న్యాసము నిట్లు చెప్పి ప్రాణానిరోధ మొనర్చవలెను. యథావిధి ధ్యాన మొనర్చి మూలమంత్రమును జపించవలెను. అంగన్యాస కరన్యాసవిధి నొనర్చి ధ్యానమొనర్చి జపసంక్షేపణ మొనర్చి జలమును పరమేశ్వరార్పితముగ విడువవలెను.

శ్లో॥ తతోఽంగ మంత్రజాలాని-జపే చ్ఛాస్త్రానుసారతః
ప్రవక్ష్యే మ్యంగ మంత్రాణాం-లక్షణాని యథాక్రమాత్॥

తా॥ పిదప శాస్త్రానుసారముగ అంగమంత్రములను జపించవలెను ఆ యంగమంత్రముల లక్షణములను క్రమముగా చెప్పుచున్నాను.

శ్లో॥ హనూమ త్సర్వమంత్రాణాం—అంగమంత్రా వి తీరితౌ
సుగ్రీ వాంగద మంత్రౌ ద్వౌ-తత్ప్రకారం వదే చ్ఛృణు।

తా॥ హనుమత్సంబంధమగు అన్ని మంత్రములకు సుగ్రీవమంత్రము. అంగద మంత్రము అని రెండుఅంగమంత్రములు చెప్పబడినవి. వాని విధానము చెప్పెదను వినవలసినది.

శ్లో॥ అదౌ ప్రణవ ముచ్చార్య—సుగ్రీవపద ముచ్చరేత్
నమశ్శబ్దం తతః కుర్యా-దేత దే వాంగదస్య చ॥

తా॥ మొదట ఓంకారము నుచ్చరించి 'సుగ్రీవ' అనుపదము నుచ్చరింపవలెను. పిదప 'నమః' శబ్దము నుచ్చరింపవలెను. అనగా 'ఓం సుగ్రీవాయ నమః' అని. ఇదియే అంగదమంత్రమునకును అనగా 'ఓం అంగదాయ నమః' అని,

శ్లో॥ బ్రహ్మ ఋషి ర్ద్వయో ర్మన్వో-ర్గాయత్రీ చంద ఏవ హి
త ద్దేవతా ప్రసాదార్థం-వినియోగం-వదే న్మనోః॥

తా॥ వీనికి బ్రహ్మ ఋషి, రెండుమంత్రములకును గాయత్రీ ఛందము. ఆయాదేవతల యనుగ్రహముకొఱకు మంత్రము యొక్క వినియోగము చెప్పవలెను.

ధ్యానమ్—

సుగ్రీవం హృదయే ధ్యాయే-సూర్యపుత్రం మహాప్రభమ్
దేదీప్యమాన సర్వాంగం-రామకార్య ధురంధరమ్॥

తా॥ సూర్యపుత్రుడును, గొప్పబలము కలవాడును గొప్పగా ప్రకాశించు నవయవములు కలవాడును. రామకార్యమున నిష్టకలవాడును అయిన సుగ్రీవుని హృదయమున ధ్యానించుచున్నాను.

ధ్యానమ్;-

అంగదాయ నమస్తుభ్యం-కనకాంగద బాహవే
సర్వాంగ లక్షణై ర్యుక్తం-గదా సంయుక్త బాహవే।

తా॥ బంగరు కేయూరములు చేతులకు కలవాడవును. సమస్త శుభలక్షణములు కల అవయవములు కలవాడవును, గదతోడాడిన బాహువు కలవాడవు నగు ఓ అంగదా! నీకు నమస్కారము.

శ్లో॥ హనుమ న్మంత్రజాలాని-జప్త్వాఽనంతర ముచ్చరేత్
సుగ్రీ వాంగద మంత్రౌ ద్వౌ-తేన సిద్ధి ర్భవిష్యతి॥

తా॥ హనుమన్మంత్రములన్నిటిని జపించినపిదప శ్రీసుగ్రీవాంగద మంత్రములను జపించవలెను, అట్లు జపించుటచే మంత్రము సిద్ధించును,

శ్లో॥ కుర్యా న్నిత్యజపం చైవ-తర్పణం విధినా శృణు
మంత్రాంగ తర్పణం కుర్యా-దితిపూర్వవ దాచరేత్॥

తా॥ నిత్యజపముచేయవలెను. శాస్త్రరీత్యా తర్పణమును వినుము. మంత్రాగతర్పణము నాచరించవలెను. పూర్వవిధి వలెనే ఈ విధిని ఆచరించవలెను.

శ్లో॥ జలే చక్రం లిఖే త్సమ్య - గమృతం భావయే జ్జలే
తర్పయే చ్చ స్వహస్తేన - స్వర్ణపాత్రేణ త జ్జలమ్॥

తా॥ జలమందు జాగరూకతతో చక్రమును లిఖించి ఆ జలమున అమృతభావన చేయవలెను. ఆ జలమును స్వర్ణపాత్రయందుంచి స్వహస్తముతో తర్పణము చేయవలయును.

శ్లో॥ గుడోదకేన వా కుర్యా - న్నారికేళజలేన వా
న్వాదశాంజలిభిః క్షీరం - హనూమంతం ప్రతర్పయేత్॥

తా॥ బెల్లపుపానకముతో కాని, కొబ్బరినీటితోకాని, పాలనుకాని పంన్రెండుమారులు అంజలితో తర్పణము చేయవలయును.

శ్లో॥ ఇ త్యుచ్చార్య ప్రతిదినం — తర్పణం కారయేత్సుధీః
ఉత్పత్తి స్థితి సంహార న్యాసభేదాః త్రిధా స్మృతా

తా॥ ఈరీతిగా మంత్రోచ్చారణము, తర్పణమును బుద్ధి శాలియగు వాడు చేయవలెను- ఉత్పత్తిన్యాసము, స్థితిన్యాసము, సంహారన్యాసము అని న్యాసము మూడు విధములు.

శ్లో॥ బ్రహ్మచారిణి ఆద్యస్య-ద్వితీయో గృహమేధినః
యతీనా మంత్యమః ప్రోక్తః-క్రమా దాశ్రమిణాం విదుః॥

తా॥ మొదటిదగు ఉత్పత్తిన్యాసము బ్రహ్మచారియందు, రెండవ దగు స్థితిన్యాసము గృహస్థులయందు, యతులకొఱకు మూడవదగు సంహారన్యాసము ఆయాఆశ్రమవాసులకు క్రమముగా చెప్పబడినవి.

శ్లో॥ బ్రహ్మరంధ్రం సమారభ్య పాదాం తోత్పత్తి రుచ్యతే
బ్రహ్మరంధ్రాది నాభ్యంతం-లింగం జా న్వాదిమూలతః
స్థితిన్యాస ఇతి ప్రోక్త-వ్యవస్థా గృహమేధినామ్
పాదాది బ్రహ్మరంధ్రాంతం-సంహారో యతిసమ్మతః॥

తా॥ బ్రహ్మరంధ్రము మొదలుకొని పాదాంతమువఱకు ఉత్పత్తి న్యాసముగ చెప్పబడుచున్నది. బ్రహ్మరంధ్రము మొదలు నాభివఱకు లింగము, మూలము, మోకాలి మూలమువఱకును గృహస్థులకు నేర్పరుప బడిన స్థితిన్యాసమునకు చెప్పబడినది. పాదముమొదలుకొని బ్రహ్మరంధ్రమువఱకు సన్యాసులకు అనుమతింపబడిన సంహారన్యాసము చెప్పబడినది.

శ్లో॥ శిఖ లలాట నేత్రాస్య-గళ దోర్హృదయే ష్వపి
సకుక్షి నాభి లింగాఖ్య-జాను పాదేషు విన్యసేత్॥

తా॥ శిఖయందు, నుదుట, నేత్రములందు, నోటియందు, కంఠమందు, బాహువులయందు, హృదయమందు, పొట్టయందు, బొడ్డుయందు, లింగమున, పిక్కలందు, పాదములందు న్యాసము చెప్పవలెను. ఇది ఉత్పత్తిన్యాస విధానము.

శ్లో॥ హృత్కుక్షి నాభిషు తథా-గుహ్య జాను పదేష్వపి
కర కంఠాస్య దృ జ్ఞాన-శిఖా మూర్ధ్వం చ విన్యసేత్॥

తా॥ హృదయమునందు, పొట్టయందు, బొడ్డునందు, అట్లే గుహ్య ప్రదేశమున, పిక్కలందు, పాదములందు, చేతులందు, కంఠమున, నోటియందు, కన్నులందు, ముక్కునందు, శిఖోపరిభాగమందు న్యాసము చెప్పవలెను. ఇది స్థితిన్యాస విధానము.

శ్లో॥ సపాద జానుయుగళే-లింగ నాభ్యుదరేషు చ
హృద్దోర్గళాస్య దృ జ్ఞాన-శిఖా స్వక్షరశో న్యసేత్

తా॥ పాదముతో కూడిన పిక్కల జంటయందు, లింగమున, నాభియందు, ఉదరమునందు, హృదయమునందు, బాహువులందు, కంఠమునందు. ముఖమునందు, కండ్లయందు, ముక్కునందు, శిఖయందును అక్షర విన్యాసమొనర్పవలెను. ఇది సంహారన్యాసమనబడును.

శ్లో॥ ఏతే చ త్రివిధా న్యాసా-స్సమ్య గేవం ఫలం శృణు
సంహృతే సర్వ సంహారః - సృష్టే శ్చ శుభసృష్టయః।

తా॥ ఈమూడునే త్రివిధన్యాసము లనబడుచున్నవి. వీనియొక్క గొప్పఫలములను వినవలసినది. సంహారన్యాసమునకు సర్వలయమును, ఉత్పత్తిన్యాసమునకు శుభములన్నియు చేకూరుటయు,

శ్లో॥ స్థితే శ్చ శాంతివిన్యాసాః-తస్మా త్కార్యా స్త్రయో మతః
ఏతద్రూపం మంత్రవర్ణైః - క్రియతే మంత్రవేదిభిః॥

తా॥ స్థితిన్యాసమువలన సర్వశాంతులు చేకూరుటయు ఫలము. అకారణముచే త్రివిధన్యాసము లాయావారలకు కర్తవ్యములే. వీటి స్వరూపము,

మంత్రవేత్తలచే మంత్రవర్ణములచే చేయబడుచున్నది.

శ్లో॥ హృదయాయ నమః ప్రోక్తం-స్వాహా తు శిరసే మతా
శిఖాయై వషడిత్యుక్తం-వౌషణ్ణేత్ర త్రయాయవై॥

తా॥ హృదయమందు నమస్కారము చెప్పవలెను. శిరస్సున స్వాహాయనునది, శిఖకొఱకు వషట్కారమును, నేత్రత్రయముకొఱకు వౌషట్కారమును చెప్పవలెను.

శ్లో॥ తతః పరమసంకీర్ణ-ముచ్చరేత్ కవచాయ హుమ్
తతోఽస్త్రాయ ఫడిత్యంతే-హృదయ న్యాస లక్షణమ్॥

తా॥ పిమ్మట సర్వశరీరకవచమునకై హుమ్‌కారము నుచ్చరింపవలెను. ఆ పిదప అంతమున అస్త్రాయ ఫట్ అని ఫట్కారము చెప్పవలెను. ఇది హృదయన్యాసలక్షణము.

శ్లో॥ బహుధా మునిభిః ఖ్యాతా-న్యాసముద్రాఽసనాని చ
ప్రాణాయామ న్యాసవిధం-లఘుమార్గేణ తే వదా॥

తా॥ ధ్యానము, ముద్రావిధానము, ఆసనవిధానాదులును, ప్రాణాయామము మునులచే ననేకరీతుల చెప్పఁబడినవి. నీకు నేను తేలికమార్గమున చెప్పెదను వినుము.

శ్లో॥ జప్యమంత్రాంగమంత్రాశ్చ - న్యాసాశ్చ బహుధా స్మృతాః
ప్రాణాయామాదయశ్చాపి - ఆసనాని బహూన్యపి॥

తా॥ జపించదగిన మూలమంత్రములు, అంగమంత్రములు, న్యాసములున్ను అనేకరీతుల చెప్పబడుచున్నవి. ప్రాణాయామాదులు, ఆసనాదులున్ను అనేకములు కలవు. (పైన 'జప్యమంత్రాంగముద్రాశ్చ' అని పాఠాంతరము.)

శ్లో॥ యద్యాపి కీర్తితం తత్ర - బహుధైవ ప్రకీర్తితమ్
తథాపి గురుణోక్తేన - ప్రకారేణ సమాచరేత్॥

(5)

తా॥ పైె చెప్పబడిన దేదైనను అనేకరీతుల చెప్పబడినది. అనేక రీతుల కొనియాడబడినదికూడ. కాన తమ తమ గురువులు చెప్పినరీతిగా మాత్రమే ఆచరించవలెను.

శ్లో॥ యస్య దేవీ పరాశక్తిః - యథా దేవే తథాగురౌ
తస్యైతే కథితా హ్యర్థాః - ప్రకాశ్యంతే మహాత్మనః॥

తా॥ ఎవనికి ఉపాస్యదేవత యే పరాశక్తియో అట్టివాఁడా దేవత యందువలెనే గురునియందు భక్తిభావన యుండవలెను. ఏలనన ఆమహాత్మునిచే చెప్పబడిన మంత్రార్థములే ఉపాస్య దేవతగా ప్రకాశించుచున్నవి.

శ్లో॥ గుణదోష విమర్శేన - గురో ర్మూఢః పతే దధః
నిజవిశ్వాస సందిష్టః — గుణదోష సమో భవేత్॥

తా॥ గురునియందలి గుణదోషములను విమర్శించు మూఢుడు అధఃపతితుఁడగును. తన విశ్వాసముచే ఉపదేశమందు వానికి గురుగుణ దోషములు సమభావనతోనే యుండును.

శ్లో॥ ముద్రా షోడశ విఖ్యాతాః - న్యాసపంచక మి త్యత
ప్రసన్నా, గాలినీ, పద్మా, శంఖ, చక్ర, గరుత్మతీ॥

తా॥ ముద్రలు పదునారుగా ప్రశస్తినందియున్నవి. న్యాసము లైదు రీతుల నున్నవి. అందు ముద్రలు ప్రసన్న ముద్ర, గాలినీముద్ర, పద్మ ముద్ర, శంఖముద్ర, చక్రముద్ర, గారుడముద్ర

శ్లో॥ ధేను న త్యంకుశ మృగీ - కుంభ సంహార ముద్రికాః
మల్ల తాండవ వాలాఖ్యా — హనూమ దభిధాఽపి చ
ముద్రా షోడశ సంప్రోక్తా - ఇ త్యాగమవిదో విదుః॥

తా॥ ధేనుముద్ర, నమస్కారముద్ర, అంకుశముద్ర, మృగీ ముద్ర, కుంభముద్ర, సంహారముద్ర, మల్లముద్ర, తాండవముద్ర, వాల ముద్ర, హనుమన్ముద్ర అని పదునారుగా ఆగమములెరిగిన వారు చెప్పుచున్నారు.

శ్లో॥ హనూమతో విశేషేణ - కథితా మునిసత్తమః
గురుధ్యానే మృగీముద్రా - తీర్థాఽఽకర్షణేఽంకుశమ్॥

తా॥ ఓమైత్రేయమహామునీ! హనుమద్విషయమున ఇవి విశేష ముగా చెప్పబడినవి. గురుధ్యానసమయమున మృగీముద్రయు, జలము తెచ్చుసమయమున అంకుశముద్రయు,

శ్లో॥ స్నానకాలే కుంభముద్రా - సమాప్తౌ హరణం తథా
అన్యాఽష్టముద్రకా స్సర్వ - కర్మసు ప్రతిదర్శయేత్॥

తా॥ స్నానసమయమున కుంభముద్ర, జపము మున్నగు వాని సమాప్తియందు సంహారముద్రయు అట్లే ఇతరములగు నెనిమిది ముద్రలను అన్నికర్మలయందును ప్రదర్శింపవలెను.

శ్లో॥ జపాదౌ తీర్థపాత్రే చ - స్నానే చక్రవిలేఖనే
మంత్ర తర్పణ సంధ్యాసు - శంఖే దైవతపూజనే॥
ఏతేషు కర్మసు ప్రోక్తాః అష్టముద్రాః ప్రదర్శయేత్॥

తా॥ జపము మొదట, తీర్థపాత్రయందు, స్నానసమయమున, చక్రమును లిఖించుసమయమున, మంత్రమందు, తర్పణమందు, సంధ్యల యందు, శంఖమందు, దేవతాపూజయు అను ఈ కర్మలయందు అష్టముద్ర లను ప్రదర్శింపవలెను.

శ్లో॥ గాలినీ పద్మ చక్రే చ - శంఖ గారుడ ధేనుకాః
నతి ప్రసన్నా ఇ త్యేతా - అష్టముద్రాః ప్రకీర్తితాః॥

తా॥ గాలినీముద్ర, పద్మముద్ర, చక్రముద్ర, శంఖముద్ర, గారుడ ముద్ర, ధేనుకాముద్ర, నమస్కారముద్ర, ప్రసన్నముద్ర అను యెని మిది ముద్రలు కీర్తింపబడుచున్నవి.

శ్లో॥ అంత ర్బహి ర్మాతృకయో - రంగుళీ దేహయో ర్మనోః
న్యాసపంచక మేతచ్చ - కుర్యా చ్ఛ్రీహనుమ న్మనోః
జప్త్వా తు విధివ న్మంత్ర - మిష్టదైవం ప్రపూజయేత్॥

తా॥ అంతర్మాతృకాన్యాసము, బహిర్మాతృకాన్యాసము, అంగుళీన్యాసము, అంగన్యాసము, మనువు అని శ్రీహనుమన్మంత్రమునకు న్యాసము లైదు చెప్పవలెను. యథావిధి మంత్రమును జపించి ఇష్టదైవతమును పూజించవలెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖ హనుమన్మంత్రవివరణే శ్రీ పరాశరమైత్రేయసంవాదే న్యాసముద్రాదిలక్షణ కథనం నామ సప్తదశ పటలః

## అష్టాదశ పటలః

### స్నానసంధ్యాసంతర విధిః

శ్లో॥ చిత్రాసనే సమాసీనః - పద్మాసన విధానతః
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా - పూజయే ద్ధనుమత్ప్రభుమ్॥

తా॥ పులిచర్మము, రత్నకంబళి, జింకచర్మమువంటి చిత్రాసనమున పద్మాసనవిధానము ననుసరించి కూర్చొని తూర్పుదిక్కునకుగాని ఉత్తరదిక్కునకుగాని తిరిగి కూర్చొని శ్రీ హనుమంతుని పూజింపవలెను.

శ్లో॥ ప్రాణ నాయమ్య విధివ - ద్గాయత్రీ మంత్ర పూర్వకమ్
భూశుద్ధిం చ ప్రకుర్వీత - రంగవల్లీం న్యసే ద్బుధః

తా॥ గాయత్రీ మహామంత్రపూర్వకముగా యథావిధి ప్రాణాయామ మొనర్చి భూశుద్ధినొనర్చి ముగ్గును తీర్చవలెను.

శ్లో॥ సింహాసనం న్యసే త్తత్ర - వస్త్రాలంకార సంయుతమ్
చక్రం కర్ణికయా యుక్తం - అష్టకోణం ప్రకల్పయేత్॥

తా॥ అచ్చట వస్త్రాలంకారములతో కూడియున్న సింహాసనము నుంచవలెను. కర్ణికతో [దుద్దుతో] కూడియున్న అష్టకోణచక్రము సమర్చవలెను.

శ్లో॥ మంత్రరాజం సప్రణవం - భావయే దష్టవర్ణకమ్
అ మర్కమండలా యాథ ఉపర్యుపరి సర్వదా॥

తా॥ ప్రణవముతో కూడినదియు ఎనిమిది వర్ణములు కలదియునైన మంత్రశ్రేష్ఠమును భావింపవలెను. ఎల్లప్పుడు 'అం అర్కమండలాయ నమః' అని, పైన

శ్లో॥ చం చంద్రమండలా యేతి - ధ్యాత్వా ధ్యాత్వా నమా మ్యహమ్
ర మగ్నిమండలా యేతి - సంపూజ్యేవ ప్రయత్నతః॥

తా॥ 'చం చంద్రమండలాయనమః' అని మరల మరల ధ్యానించి నమస్కరించుచున్నాను. 'రం అగ్నిమండలాయనమః' అని ప్రయత్న పూర్వకముగ పూజయొనర్చి

శ్లో॥ కమలం చింతయే త్తత్ర - దళాష్టక సమన్వితమ్
విమలోత్కర్షిణీ జ్ఞాన - క్రియా యోగాఢ్య ఇత్యపి॥

తా॥ అట నెనిమిది దళములతోకూడియున్న కమలమును భావన చేయవలెను. [కళాష్టకమని, దళాష్టకమని పాఠాంతరములు] విమలా, ఉత్కర్షిణీ, జ్ఞానమ్ క్రియా, యోగాఢ్య అనియు,

శ్లో॥ నమా మ్యహింసా సత్యాభ్యాం - ఈశానాయై దళాంతరే
అనుగ్రహాయై నమః కుర్యాత్ - ఓంనమో భగవతేఽపి చ
విష్ణవే చేతి తత్రైవ - సర్వభూతాత్మనేఽపి చ

తా॥ అహింస, సత్యము, ఈశానా అనునట్టియు ఎనిమిది అధిదేవతలను ఎనిమిదిదళములందు నమస్కరించుచున్నాను. అటనే 'అనుగ్రహాయైనమః' అని, 'ఓంనమోభగవతేనమః' అని 'విష్ణవేనమః' అని, అటనే 'సర్వభూతాత్మనే నమః' అని,

శ్లో॥ పున రోంకార ముచ్చార్య - యోగపీఠాత్మనేఽపి చ
పునః ప్రణవ ముచ్చార్య - మంత్రపీఠాత్మనే నమః
ఇతి ధ్యాత్వా తతః కుర్యా - దావాహన ముపక్రమమ్॥

తా॥ మరల ఓంకారముచ్చరించి యోగపీఠాత్మనేనమః అనగా ఓంయోగపీఠాత్మనేనమః' అని మరల ఓంమంత్రపీఠాత్మనే నమః అనియు ధ్యానించి పిదప ఆవాహనోప క్రమము నొనర్చవలెను.

శ్లో॥ పూర్వాదీని చ చత్వారి-ద్వారాణి పరికల్పయేత్
ద్వారపాలా న్యథాపూర్వం-పూజయే త్తత్ర సంయుతః॥

తా॥ తూర్పుదిక్కు మొదలయిన నాల్గుద్వారములను కల్పించి వెనుకటివలెనే అట ద్వారపాలురను నియమముతో పూజింపవలెను.

శ్లో॥ సంత ప్త హేమవపుషం-బ్రహ్మ వి ష్ణ్వీశ సంయుతమ్
హనూమ త్పరమాత్మానం-ధ్యాయే ద్దేవం జగత్పతిమ్॥

తా॥ పుటంపెట్టిన బంగారమువలె ప్రకాశించు దేహము కల్గినట్టియు, బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరుల అంశకల్గిన పరమాత్మస్వరూపుడు, జగద్రక్షకుఁడగు హనుమంతుని ధ్యానమొనర్పవలెను.

శ్లో॥ ఉపరి స్వామినం కృత్వా - ఆవాహిత ఇ తీరయేత్
స్థాపిత స్సన్నిధి శ్చైవ — సన్నిరుద్ధో భ వే త్యపి॥

తా॥ ఆ పైన స్వామినేర్పరచి 'ఆవాహితోభవ' అనియనవలెను. 'స్థాపితోభవ' అని, 'సన్నిరుద్ధోభవ' అనియు,

శ్లో॥ సమ్ముఖో భవ తస్యాఽగ్రే - అవకుంఠో భ వేత్యపి
ప్రసన్నో భవ చే త్యగ్రే — అమృతో భవ సమ్ముఖే॥

తా॥ 'సమ్ముఖోభవ' అని, 'అవకుంఠోభవ' అని ప్రసన్నోభవ అని, 'అమృతోభవ' అనియు పల్కి

శ్లో॥ ప్రసీ దేతి ప్రసీ దేతి -స్వాగతం సముదీరయేత్
చతుర్ష్వాఽఽవరణే ష్వేవం - కీర్త యే ద్దేవతాః క్రమాత్॥

తా॥ 'ప్రసీదోభవ' 'ప్రసీదోభవ' అని స్వాగతము పల్క వలెను. నాల్గుఆవరణములందును దేవతాపూజను క్రమముగ నొనర్చవలెను.

శ్లో॥ షడంగన్యాస సంజ్ఞం చ — ప్రథ మావరణం విదుః
ద్వితీ యావరణం చాపి - విదు ర్జాంబవతే నమః॥

తా॥ ప్రథ మావరణమునందు షడంగన్యాస సంజ్ఞను చెప్పుదురు. ద్వితీయావరణమున జాంబవతేనమః అని తెలియవలెను.

శ్లో॥ తృతీ యావరణం చైవ - లోకపాలాఖ్యయా యుతమ్
తురీ యావరణం చైవ - త దాయుధ మ థార్చయేత్॥

తా॥ మూడవ యావరణమును లోకపాలురతో కూడిన దానినిగా తెలియవలెను. నాల్గనయావరణమందు అవానియాయుధము నర్చించవలెను.

శ్లో॥ షడంగాఽఽవరణ స్త్వేవం-ప్రకారోఽయం బుధై స్మృతః॥

తా॥ పండితులచే షడంగావరణ విధాన మిట్లుచెప్పబడినది.

శ్లో॥ అ మంజనాసుతా యేతి - నమ ఇత్యుక్తి పూర్వకమ్
హృదయే దేవ మి త్యుక్త్వాఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ 'ఆం అంజనాసుతాయనమః' అని హృదయమందు దేవుని అవాహనము చేయవలయును.

శ్లో॥ ఈం రుద్రమూర్తయ ఇతి - నమ ఇ త్యుక్తి పూర్వకమ్
శిరసి దేవ మి త్యుక్త్వాఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ 'ఈం రుద్రమూర్తయేనమః' అని శిరస్సునందావాహనము చెప్పవలెను.

శ్లో॥ ఊం వాయుపుత్రా యే త్యుక్త్వ - నమ ఇ త్యుక్తి పూర్వకమ్
శిఖాయై దేవ మి త్యుక్త్వాఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ 'ఊం వాయుపుత్రాయనమః' అని శిఖోపరి దేవతా వాహనము చేయవలెను.

శ్లో॥ ఐ మగ్నిగర్భకా యేతి - నమ ఇ త్యుక్తి పూర్వకమ్
కవచే దేవ మి త్యుక్త్వాఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ 'ఐం అగ్నిగర్భాయనమః' అని కవచమునందు దేవతావాహనము గావించవలెను.

శ్లో॥ ఔం రామముఖ్యదూతాయ - నమ ఇ త్యుక్తి పూర్వకమ్
నేత్రత్రయాయ దేవం చా ఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ 'ఔం రామముఖ్యదూతాయనమః అని నేత్రత్రయమునందు దేవతావాహనము చేయవలెను.

శ్లో॥ అః బ్రహ్మాస్త్ర నివారణాయ - నమ ఇ త్యుక్తి పూర్వకమ్
అస్త్రాయ దేవ మి తుక్త్వా ఽఽవాహయా మీతి సంవదేత్॥

తా॥ అః బ్రహ్మాస్త్రనివారణాయనమః అని అస్త్రమందు దేవతా వాహనము నొనర్చవలెను.

శ్లో॥ ఏవం షడంగ విన్యాసం — ప్రథమావరణే విదుః

తా॥ ఇట్లు షడంగవిన్యాసమును విజ్ఞులు ప్రథమావరణమున తెలియుచున్నారు.

శ్లో॥ జాంబవా న్వినతో నీలః - పవనో గంధమాదనః
సుషేణ మైంద ద్వివిదా - ద్వితీ యావరేణ విదుః

తా॥ జాంబవంతుఁడు, వినతుఁడు, నీలుఁడు, పవనుఁడు, గంధమాదనుఁడు సుషేణుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు మున్నగువారిని ద్వితీయావరణమునందు తెలియుచున్నారు.

శ్లో॥ ఇంద్రాగ్ని శ్చ యమ శ్చైవ - నిరృతి, ర్వరుణ స్తథా
వాయుః కుబేర ఈశాన్యా - స్తృతీ యావరణే విదుః

తా॥ ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నిర్ఋతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు ననువారిని తృతీయా వరణ మందు గలవారినిగా తెలియుచున్నారు.

శ్లో॥ వజ్రం శక్తి శ్చ దండ శ్చ - ఖడ్గః పాశో ధ్వజ స్తథా
గదా త్రిశూలకం చేతి - తురీ యావరేణ విదుః॥

తా॥ వజ్రాయుధము, శక్త్యాయుధము, దండాయుధము, ఖడ్గము, పాశము, ధ్వజము, గద, త్రిశూలము అను వీనిని నాల్గవ అవరణమందలి వానినిగ తెలియుచున్నారు.

శ్లో॥ ఏతా న్యావర ణాంగాని - కుర్యా త్పూజావిధి ర్నరేః
న కుర్యా దన్యకాలే తు - అవరణాని కదాచన॥

తా॥ ఇవి హనుమంతుని ఆవరణాంగములు. వీనికి పూజావిధాన మొనర్చవలెను. ఇతర కాలములందెప్పుడు ఈ అవరణ పూజనుచేయరాదు.

శ్లో॥ ధాతా విధాతా ప్రాగ్ద్వారే - జయ విజయౌ చ దక్షిణే
చండ ప్రచండౌ పశ్చిమ్యాం — ఉత్తరద్వార సంస్థితౌ
బల ప్రబల నామానౌ - ద్వారపాలా వితీరితౌ ।

తా॥ ధాతయు విధాతయు తూర్పుద్వారమున, జయ విజయులు దక్షిణద్వారమున, చండప్రచండులు పశ్చిమద్వారమున, బల, ప్రబలులను పశ్చిమద్వారమున నుండు వారిని ద్వారపాలురుగా చెప్పుదురు.

శ్లో॥ ఐశ్వర్యాఽనైశ్వర్యౌ తౌ - ఉపపాలక సంజ్ఞకౌ
ప్రాకార రక్షకా వేతౌ - ప్రపూజ్యౌ దేవసన్నిధౌ ॥

తా॥ ఐశ్వర్య, అనైశ్వర్య నామములుకల ఉపపాలకులనబడు వారు ప్రాకారరక్షకులు దేవసన్నిధియందు పూజింప దగినవారు.

శ్లో॥ తతః పురుషసూక్తం చ - కీర్తయే దవితంద్రితః
షోడశోపచారాం శ్చ - కుర్యా ద్యోగీ హనూమతః ॥

తా॥ పిమ్మట జాగరూకుడై పురుషసూక్తమును కీర్తించవలెను. చిత్తవృత్తి విరోధముకలవాడై హనుమంతునకు జాగరూకతతో షోడశోపచారముల నొనర్చవలెను.

శ్లో॥ సర్వావరణ దేవా శ్చ - సాయుధా స్సపరిచ్ఛదాః
సయోగ్య వాహన చ్ఛత్ర - వింజామర విభూషణాః
సోపస్కరా సదీముద్రా - సహితా సుఖినో భృశమ్
తిష్ఠం త్వితి స ముచ్చార్య - స్వాహాంతం ప్రజపే ద్గృహీ॥

తా॥ సాయుధులును, పరిజనముతో కూడినవారును, యోగ్యములగు, వాహనములు, గొడుగులు, వింజామరలు, విభూషణములు గలవారును, సంబారముతో కూడినవారును, సదీముద్రాసహితులును, మిక్కిలి సుఖ

(6)

ముగనున్నవారగు సర్వావరణ దేవతలను తిష్ఠంతుస్వాహా, అని గృహ స్థుడుచ్చరించి జపించవలెను.

శ్లో॥ సుషే ణాంగద సుగ్రీవాః - జాంబవా న్నీల సంజ్ఞకాః
గవాక్షమైంద ద్వివిదా - శ్శరభో గంధమాదనః॥

తా॥ సుషేణుడు, అంగద సుగ్రీవ, జాంబవంత, నీల, గవాక్ష, మైంద, ద్వివిద, శరభ, గంధమాదనులు,

శ్లో॥ గవయ శ్చ ప్రహ స్త శ్చ - సుషేణ నలనామకౌ।
హనూమతః ప్రసాదోఽయం - సర్వే గృహ్ణంతు వానరాః

తా॥ గవయ, ప్రహస్త, సుషేణ, నలనామకులు, వానరు లందరును హనుమంతుని ప్రసాదమును గ్రహింతురుగాక।

శ్లో॥ నిత్యహోమవిధిం వక్ష్యే - హూవే త్స్మార్తాగ్నిహోత్రకే
పంచ ద్వాదశ వా ప్రోక్తా - ఆహూతీ ర్నిత్యహోమకే॥

తా॥ ఓ మైత్రేయా। నిత్యహోమవిధిని చెప్పుచున్నాను వినుము స్మార్తాగ్నియందు ఐదుమార్లుగాని. పండ్రెండు మార్లుగాని ఆహుతులు నిత్యహోమమునకు చెప్పబడినవి.

శ్లో॥ హవ్యేన తండులైర్వాథ - గోఘృతేన విశేషతః
సప్తాక్షరీ హనుమతః - ప్రోచ్చరన్ ప్రత్యహం హునేత్॥

తా॥ హవ్యద్రవ్యమగు బియ్యముచేతగాని (ఇచట 'అన్నేనతండు లైర్వా' అని పాఠాంతరము) విశేషించి ఆవు నేతితోకాని హనుమత్సప్తా క్షరీమంత్రము నుచ్చరించుచు హోమము ప్రతిదినము చేయవలెను.

శ్లో॥ సకాలనియమ స్తత్ర - చోక్తా హోమవిధానకే
కర్మిణ స్తు యథాకర్మ - కర్మణానంతరం విదుః॥

తా॥ ఆహోమవిధానమునందు కాలనియమము చెప్పబడినది. యథా విధి నాచరించువాడు ఆనంతరకర్మను తెలియుదురు.

శ్లో॥ పురశ్చర్యాంగహోమేషు - తత్కల్పోక్త దశాంశతః
అనేన విధినా సాంగ - మాచరేద్యస్తు కర్మతః॥

తా॥ పురశ్చర్యాంగహోమములందు ఆయాకల్పములందు చెప్పబడిన దశాంశములతో ఈ విధిననుసరించి యెవడు సాంగహోమాదిక మాచరించునో

శ్లో॥ స యాతి పరమాం సిద్ధిం - యథాశాస్త్ర విధానతః
ముముక్షురర్చయేత్తత్ర - నిర్బంధోఽత్ర న విద్యతే॥

తా॥ వాడు ఉత్తమసిద్ధి నందుచున్నాడు. శాస్త్రవిధానము ననుసరించి మోక్షేచ్ఛకలవాడు పూజించవలెను అర్చింపవచ్చును. ఇందు నిర్బంధములేదు.

శ్లో॥ యదా కదా వా యత్కించి - త్కుర్యాచ్ఛక్త్యనుసారతః
తావన్మాత్రేణ సంపూర్ణ - ఫలమాప్నోత్యసంశయః॥

తా॥ ఎప్పుడైనను, యేమాత్రమైనను శక్తి ననుసరించి చేసినచో అంతమాత్రమునకే నిస్సందేహముగా సంపూర్ణ ఫలము లభించును.

శ్లో॥ దూర్వాంకురయుగ్మం జుహుయా - ద్వేదం చ సమిధం తథా
ఫల పత్ర సుమా న్యేతం - చరు మాములహోమయేత్॥

తా॥ గరికను, సమిధలను, ఫలములు, పత్రములు, పూలు, చిన్నికాయంత హవ్యమును హోమము చేయవలెను.

శ్లో॥ ధారారూపం ఘృతం దద్యా - న్మంత్రాంగే హోమకర్మణి
తర్జనీ మధ్యమానామ - సర్వాభి స్త్రంగులాన్ హునేత్॥

తా॥ మంత్రాంగమగు హోమకర్మయందు ధారారూపముగా నేతిని సమర్పింపవలెను. అందే తర్జని, మధ్యమాంగుళులతో మధ్యమమును హోమము చేయవలెను.

శ్లో॥ హనూమన్ మంత్రమాహాత్మ్యం - కేన స్తోతుం హి శక్యతే
సాకల్యే వాంగవైకల్యే - మేరుతుల్యం ఫలం లభేత్॥

తా॥ హనుమంతుని మంత్రవిశిష్టత నెవ్వఁడు కొనయాడగలఁడు. భక్తియుక్తుఁడగుచో మంత్రాంగవిధానము సాకల్యముగ నొనర్చినను, కొంతవైకల్యతయున్నను బంగరు కొండయగు మేరుపర్వతముతో సమానమగు ఫలమును పొందఁగలడు.

శ్లో॥ తిష్ఠ న్గచ్ఛ న్సమాసీనః - శయానో వా స్వపన్నపి
భుంజానో భాషమాణో వా - మల మూత్ర విసర్జనే
అనులోమ విలోమాభ్యాం - హనుమన్మంత్ర ముచ్చరేత్॥

తా॥ నిలబడియు, నడచుచున్నను, కూర్చున్నను, పడుకొనియున్నను నిద్రించుచున్నను, తినుచున్నను, మాటాడుచున్నను, మలమూత్రవిసర్జనమునను‌న్నను అనులోమ విలోమక్రమములతో హనుమన్మంత్రమునుచ్చరింపవలెను.

శ్లో॥ న్యూ నాధి కాక్షరత్వేన - రతికాలే ఽపివా జపన్
పరాం సిద్ధి మవాప్నోతి - నాత్ర కార్య విచారణా॥

తా॥ తక్కువగా ఎక్కువగా అక్షరములతో రతిసమయమున జపించియును ఉత్తమసిద్ధిని పొందగల్గును. ఇందులో సందేహింపపనిలేదు.

శ్లో॥ దేవతాంతర మంత్రాణాం - సాంగత్వేన ఫలం లభేత్
ఈష న్మంత్రస్య వైకల్యే - వృథాయాసో భవే న్నృణామ్॥

తా॥ ఇతర దేవతలమంత్రములకు సక్రమముగా సాంగముగా నాచరించిననే ఫలము లభించును. కొద్దిగా మంత్రదోషమేర్పడినను. వానిని జపించు మనుష్యునిదంతయు వృథాప్రయాసేయగును.

శ్లో॥ బహూనాత్ర కి ముక్తేన - వాచాపి మనసా మునే!
ఐహి కాముష్మి కేభ్యో వా - హనూమ ద్భక్తిమాన్ భవేత్॥

తా॥ ఓమైత్రేయమహామునీ! పలురీతుల చెప్పనేల? వాగ్రూపేణ కాని, మనసాకాని హనూమద్భక్తిమంతునకే ఇహలోకపు, పరమునకు సంబంధించిన లాభములేర్పడును.

శ్లో॥ అనౌపాధిక భక్తిస్స్యా - ద్దైవతే యత్ర యస్య చ
అనాయాసేన తస్యైవ - తన్మంత్ర స్సిద్ధ్యతి ధ్రువమ్॥

తా॥ ఎవనికి ఎక్కడ అకారణమగు భక్తి దేవతయందు కల్గునో అతనికే సులభముగా తప్పక ఆ మంత్రము సిద్ధించును,

శ్లో। కలశేఽపిచ చక్రే చ - మ్ముద్రికా స్దర్శయే త్తతః

తా॥ పిదప కలశమునందు, చక్రమునందు అష్టముద్రికలను ప్రదర్శింపవలెను.

శ్లో॥ మంత్రస్నానం మంత్రసంధ్యా - కర్తవ్యం సదనే ష్వపి
భూశుద్ధి ర్భూతశుద్ధి శ్చ - మాతృకే బహి రంతరే
సమస్త మంత్రజాలానాం - సమానం మను రబ్రవీత్।

తా। ఇండ్లయందైనను మంత్రస్నానము. మంత్రసంధ్యా వందనము చేయదగియే యున్నది. భూశుద్ధి, భూతశుద్ధి, బహిర్మాతృకా, అంతర్మాతృకా విధానము అన్ని మంత్రసమూహంబులకును సమానముగనే మనువు పలెక్కను.

శ్లో॥ ఐశ్వర్యార్థం చరుం భక్షేత్ - మధురత్రయ సంయుతమ్
శర్కరా మధు సర్పింషి - మధురత్రయ మీరితమ్॥

తా॥ ఐశ్వర్యప్రాప్తికొఱకు మధురత్రయముతో కూడిన హవ్యమును భుజింపవలెను. పంచదార, తేనె, బెల్లము అనునవి మధురత్రయముగ చెప్పబడుచున్నవి.

శ్లో॥ హనుమ న్మంత్ర చక్రాణాం - ముద్రికా ష్షోడశ స్మృతాః
అవరాణి చ చత్వారి - కర్తవ్యం న్యాసపంచకమ్॥

తా॥ హనుమన్మంత్ర సంబంధులగు చక్రములన్నింటికి పదునారు ముద్రికలు చెప్పబడినవి. నాల్గు ఆవరణలు, ఐదు న్యాసములుకూడ చేయదగియున్నవి.

శ్లో॥ ఉపదిష్టేషు మంత్రేషు - ప్రథమో మూల ముచ్యతే
ప్రాణాయామత్రయం కుర్యా - న్మంత్రస్యా ద్యంతయో ర్మనేః

ఇతరేషాం తు మంత్రాణా - మేక మాద్యం తయో ర్మతమ్॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఉపదేశింపబడిన మంత్రములలో మొదటిది మూలమంత్రము. మంత్రముయొక్క అద్యంతములందు ముమ్మారు ప్రాణాయామము చేయవలెను. ఇతర మంత్రములకు ఆద్యంతము లందొక్క ప్రాణాయామముమాత్రము చాలును.

శ్లో॥ య ద్యన్మంత్రం జపేత్తత్ర - తైస్తైః ప్రాణా న్నిరోధయేత్
ఆద్యంతయో స్సదా కుర్యా - న్మాలామంత్రస్య మూలతః॥

తా॥ ఏఏమంత్రము నుచ్చరించుచున్నాడో వానివానితో ప్రాణ నిరోధము నొనర్చవలెను. ముఖ్యముగా మాలామంత్రమున కెప్పుడును అద్యంతములందు ప్రాణనిరోధము నొనర్చవలెను.

శ్లో॥ అంగన్యాస కరన్యాస - ధ్యానాని చ పృథ క్పృథక్
శుద్ధా నమోంతా స్వాహాంతా - తర్పణాంతా జయాంతికాః
ప్రవృత్తయః పంచధా స్స్యుః - మాలాసు నిఖిలా స్వపి॥

తా॥ మాలామంత్రములకు అంగన్యాస కరన్యాస ధ్యానములు వేరువేరుగా చెప్పబడినవి. శుద్ధా యని, నమోంతా యని, స్వాహాంతా యని, తర్పణాంతా యని, యయాంతా అనియు సమస్తములగు మాలామంత్రము లందును ఐదురీతులుగ ప్రవృత్తులున్నవి. (ప్రపత్తులు అని పాఠాంతరము)

శ్లో॥ శుద్ధా సంబుద్ధిమాత్రా స్యా - జ్జప స్తేన విధీయతే

తా॥ శుద్ధా యనునది సంబోధనమాత్రము. దానిచే జపము విధింపబడుచున్నది.

శ్లో॥ మనసా పూజనం దేవ - పాదుకాం పూజయామి చ
స్వా హేతి హోమరచనా - తర్పయా మీతి తర్పణమ్
జయ ద్వంద్వ సమాయోగః - స్తుతి రుక్తా తు పంచమీ॥

తా॥ దేవపాదుకాపూజనము చేయుచున్నాను అని మనసా పూజించుట నమోంత స్వాహా అను హోమరచన కలది స్వాహాంత, తర్పయామి

అని తర్పణముకలది తర్పణాంతా, 'జయజయ' యని స్తుతించువిధానమే ఐదవది యగు జయాంతా,

శ్లో॥ యో లిఖే త్ప్రవదే ద్ధ్యాయే - ద్భావయే త్ప్రతిపాదయేత్
పూజయే త్పుస్తకం ధన్యః - స మర్త్యో ముక్తిమాన్ భవేత్॥

తా॥ ఏమానవుడు దీనిని వ్రాయునో, చెప్పునో, ధ్యానించునో, భావనమొనర్చునో, శాస్త్రరీత్యా ప్రతిపాదించునో, ఈ మంత్రగ్రంథమును పూజించునో అట్టి ధన్యుడగు మనుష్యుడు ముక్తినిపొందును.

శ్లో॥ జానూర్వో రంతరే సమ్య - క్కృత్వా పాదతలే ఉభే
ఋజుకాయ స్సమాసీనః - స్వస్తికం తత్ప్రచక్షతే॥

తా॥ పిక్కలు, తొడలమధ్య పాదతలములు రెండు చక్కగ పెట్టి సమముగ దేహముకలవాడై కూర్చుండిన స్వస్తికాసనమందురు.

శ్లో॥ అపన్యా మాత్మనః పార్శ్వే - గుల్ఫౌ నిక్షిప్య పాదయోః
సవ్యే దక్షిణగుల్ఫంతు - దక్షిణే దక్షిణేతరమ్
ఏత చ్చ స్వస్తికం ప్రోక్తం - సర్వపాప ప్రణాశనమ్॥

తా॥ భూమిపై తన రెండుప్రక్కలను పాదములయొక్క చీలమండలు రెంటినుంచి ఎడమభాగమున కుడి చీలమండ, కుడివైపున ఎడమచీలమండయు నుంచినట్లున్నచో దీనిని బాధ సర్వపాపములను పోగొట్టెడి స్వస్తికాసనమందురు.

శ్లో॥ ఊర్వో రుపరి విప్రేంద్ర! కృత్వా పాదతలే ఉభే
పద్మాసనం భవే దేత - త్సర్వేషా మపి పూజితమ్॥

తా॥ బ్రాహ్మణశ్రేష్ఠుడవగు మైత్రేయా! అరికాళ్లను రెంటిని రెండుతొడల మైభాగమున పైకి కనుపించునట్లుంచిన అందరిచే కొనియాడబడు పద్మాసనమగును.

శ్లో॥ ఏకపాద మథైకస్మిన్ - విన్యస్యోరుణి సంస్థితమ్
ఇతరస్మిం స్తథా చోరుం - వీరాసన ముదాహృతమ్॥

తా॥ ఒకపాదము నొక తొడయందుంచి రెండవతొడనట్లే యుంచిన వీరాసనమగును.

శ్లో॥ మేఢ్రా దుపరి నిక్షిప్య - సవ్య గ్గుల్ఫం త థోపరి
గుల్ఫాంతరం తు నిక్షిప్య - సిద్ధి స్సిద్ధాసనం విదుః
హనుమ న్మంత్రవిషయే - ఆసనాని శుభాని వై।

తా॥ మేఢ్రముయొక్క పైభాగమున నొకచీలమండనుంచి ఆ చీలమండపైన మఱియొక చీలమండనుంచిన సిద్ధాసనము సిద్ధించునని తెలియుదురు. శ్రీ హనుమద్దేవుని మంత్రోపాసన విషయమున ఆసనములు శుభప్రదములు.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖహనుమన్మంత్రవివరణే
శ్రీపరాశర మైత్రేయసంవాదే స్నానసంధ్యానంతరవిధి
ర్నామ అష్టాదశః పటలః

ఏకోనవింశతి పటలః
షట్పల్లవాది వివరణం

మైత్రేయః :—

శ్లో॥ షట్పల్లవ ప్రకారస్తు - షట్ప్రయోగస్తు కీదృశః?
కేవా స్త్రీమంత్ర పుం మంత్ర - క్లీబమంత్రాః స్మృతాః మునే।

తా॥ మైత్రేయులు ఇట్లనిరి. ఓ పరాశర మహామునీ! షట్పల్లవ విధానమును షట్ప్రయోగవిధానము ఎట్టివి? ఏవి స్త్రీ మంత్రములుగా ఏవి పుంమంత్రములుగా, ఏవి నపుంసక మంత్రములుగా చెప్పబడుచున్నవి?

శ్లో॥ హనుమ న్మంత్రసంఖ్యా కా - చక్రాణాం చ విశేషతః
భక్తిః కతి విధా జ్ఞేయా - కథం జప్యం హి సూతకే॥

తా॥ శ్రీ హనుమంతుని మంత్రముల సంఖ్య యెంత? విశేషించి చక్రముల సంఖ్య ఎంత? భక్తి ఎన్నివిధములుగా తెలియబడుచున్నది? సూతకమందెట్లు జపింపవలెను.

శ్లో॥ సోమ సూ ర్యోపరాగే చ - పురశ్చర్యా కథం భవేత్?
మంత్ర శ్చ కోఽర్చణం ప్రోక్త - మనిరోధీ చ కిం పునః?

తా॥ చంద్ర సూర్యగ్రహణములందు పురశ్చర్య ఎట్లొనర్చవలెను? మంత్రమెట్టది? అట్టి మంత్రమునకు విరోధము లేని అర్చణ విధాన మెట్టిది?

శ్లో॥ హనూమ న్మంత్రజాలస్య - విరుద్ధం వా కి ముచ్యతే
ఏత త్సంగృహ్య వక్తవ్యం - కృపయా మునిసత్తమః

తా॥ శ్రీహనుమంతుని మంత్రసమూహమునకు విరోధ రూపముగా నేదిచెప్పబడుచున్నది? ఓ మునిశ్రేష్ఠుడా ఈ విషయమునంతను దయతో సంగ్రహించి చెప్పవలసినది.

శ్రీ పరాశరః-

శ్లో॥ షట్పల్లవాదికం పృష్టం - భవతా మునిసత్తమ!
అధునా తత్ప్రవక్ష్యామి - క్రమే ణైవ విభావ్యతామ్॥

తా॥ శ్రీ పరాశరులవారనుచున్నారు. ఓ మునిశ్రేష్ఠా! నీ చేత షట్పల్లవాదివిషయము అడుగబడినది. దాని నిప్పుడు క్రమముగా చెప్పుచున్నాను. భావింపవలసినది.

శ్లో॥ పల్లవా శ్చ ప్రయోగా శ్చ - బహవ స్సంతి వై మునే
నమో వషట్ చ ఖేఖే చ హుం వౌషట్ ఫ డి త్యపి॥

తా॥ ఓమైత్రేయా! పల్లవములు, ప్రయోగములు అనేకములుగా నున్నవి- నమః వషట్, ఖేఖే, హుం, వౌషట్, ఫట్ అను

శ్లో॥ ఏతే షట్పల్లవా ప్రోక్తాః - షట్ప్రయోగే ఫలం శృణు

తా ఇవియే షట్పల్లవములుగా చెప్పబడినవి. ఇక షట్ప్ర యోగము లందలి ఫలమును చెప్పెదను వినవలసినది.

శ్లో॥ నమ స్సంపద్వషడ్వశ్యే - వౌష డాకర్షణే తథా
హుంద్వేషే చ ఫ డూచ్చాటే ఖేఖే చ మారణం విదుః
స్వాహా పుష్టికరం చేతి - పల్లవాగ్రే నిగద్యతే॥

తా॥ నమశ్శబ్దము సంపదయందును, వషట్కారము వశీకరణ మందును, అట్లే వౌషట్ కార మాకర్షణయందును, హుంకారము ద్వేషము నందును, ఫట్కారము ఉచ్చాటన మందును ఖేఖే యనునది మారణము నకు తెలియుదురు. స్వాహాశబ్దము పుష్టికరమని పల్లవాగ్రమందు చెప్ప బడు చున్నది.

శ్లో॥ శాంతి రుచ్చాటనం ద్వేష - స్తంభనం మారణం తథా
వశ్యం చావశ్య మీష చ్చ - షట్ప్రయోగా ఉదాహృతాః॥

తా॥ శాంతి, ఉచ్చాటనము, ద్వేషము, స్తంభనము, అట్లే మారణము, వశ్యము మున్నగునవి తప్పక షట్ప్రయోగాలుగా చెప్పబడు చున్నవి.

శ్లో॥ తత్తత్పల్లవ సత్వేఽపి - వర్ణసంజ్ఞా న పూరయేత్
ఉచితం షట్ప్రయోగానాం - పునః పల్లవ ముచ్యతే
పునః పల్లవ సంయోగే - ప్రత్యవాయో న విద్యతే।

తా। ఆయాపల్లవములున్నను అక్షరసంజ్ఞను చేయకూడదు. షట్ప్రయోగములకు మరల షట్పల్లవవిన్యాసము యుక్తముగననే చెప్ప బడుచున్నది. మరల పల్లవ సంయోగమొనర్చుటవలననే ప్రత్యవాయము నేర్పడదు.

శ్లో॥ స్త్రీమంత్రస్తు నమోంత స్స్యా - త్స్వాహాంతః పురుష స్తథా
క్లీబ స్తు వషడంత స్స్యాత్ - స్త్రీ క్లీబా శ్చ అమీ స్మృతాః ॥

తా॥ స్త్రీమంత్రము నమశ్శబ్దాంతముగను, పురుష మంత్రము, స్వాహాంతముగను, నపుంసకమంత్రము వషట్కారాంతముగను చెప్ప బడినది. స్త్రీక్లీబములుగా నివి చెప్పబడుచున్నవి.

శ్లో॥ స్త్రీమంత్ర శ్శీఘ్రఫలదః - ఆలస్యం పురుషస్య చ
క్లీబో మహావిలంబ శ్చ - ఏతేషాం ఫల మీరితమ్॥

తా॥ స్త్రీమంత్రము త్వరగా ఫలమునిచ్చును. పురుష మంత్రమున కాలస్యము పట్టును. నపుంసకమంత్రమునకు చాల అలస్యమగును. వీని యొక్క ఫల మిట్లుచెప్పబడినది.

శ్లో॥ క త్యాంజనేయ మనవః - ఇతి వక్ష్యామి తే శ్శృణు
సువర్చలాసమేత శ్రీ - హనుమ ద్ద్వాదశాక్షరీమ్॥

తా॥ ఆంజనేయమంత్రము లెన్నియని యడిగితివి దానికి సమాధానమిచ్చుచున్నాను వినవలసినది. సువర్చలాసమేత శ్రీహనుమద్ద్వాదశాక్షరిని.

శ్లో॥ సవ్యంజనేఽవ్యంజనేషు - వ్యుత్క్రమ శ్చ క్రమోపి చ
మహర్షయో మంత్రసిద్ధాః - ఏతద్రూప జపా న్మునే॥

తా॥ మైత్రేయా! అచ్చులందు, హల్లులందు, వ్యుత్క్రమముతోను, అక్రమముతోడను మంత్రసిద్ధులగు మహర్షులు అనుష్ఠించుట యున్నది.

శ్లో॥ శంభునా చోపదిష్టం త త్పార్వత్యై హితకామ్యయా
ఖిలసంయుతయా చైవం - ప్రత్యపాది మనో ద్విజే॥

తా॥ ఓమైత్రేయ మహాముని! లోకహితమును కోరిన శంకరుడు పార్వతికి ఖిలమగుటయైన, ఖిలాదియున్నను మంత్రములను చెప్పెను.

శ్లో॥ అ థైషా వివిధా ప్రోక్తా - కేవల ద్వాదశాక్షరీ
అష్టాక్షరీ కపీంద్రస్య - పంచధా పరికీర్తితా
పంచాక్షరీ తు తస్యైవ - త్రివిధా పరికీర్తితా॥

తా॥ ఇక కేవలము ద్వాదశాక్షరీమహామంత్రమే అనేకరకములుగ చెప్పబడినది. హనుమదష్టాక్షరీ మహామంత్రము ఐదువిధముల కీర్తింపబడినది. ఆ హనుమత్ప్రభుని పంచాక్షరీమంత్రము మూడురీతుల కొనియాడబడినది.

శ్లో॥ పంచవింశతి సంఖ్యాకా - మాలామంత్రాః ప్రకీర్తితాః
ఏకాక్షరీ మహామంత్రో - ద్వివిధా పరికీర్తితః
షడక్షరీ చతుర్ధా తు - కీర్తితా హనుమత్ప్రభోః ॥

తా॥ శ్రీహనుమంతుని మాలామంత్రము లిరువదియైదుగా చెప్పబడుచున్నవి. ఏకాక్షరీమహామంత్రము రెండువిధములుగా కీర్తింపబడినది. శ్రీహనుమానుని షడక్షరీ మహామంత్రము నాల్గువిధములుగా కీర్తింపబడినది.

శ్లో॥ అరభ్యైకాక్షరీ మంత్రం - వాయుసూనో ర్మహాత్మనః
ద్వాత్రింశ ద్వర్ణ పర్యంతాః - మంత్రా స్తు సువ్యవస్థితాః॥

తా॥ ఏకాక్షరీమంత్రము మొదలుకొని ద్వాత్రింశద్వర్ణపర్యంతము అనగా ముప్పదిరెండక్షరముల మంత్రములవఱకు శ్రీహనుమన్మహనీయుని మంత్రములు చెప్పబడియున్నవి.

శ్లో॥ సప్తమంత్రాత్మికా విద్యా - పంచవక్త్ర హనూమతః
సప్తవింశతి మంత్రైశ్చ - విద్యా తస్యైవ ధీమతః
శౌనకీ సంహితాయాం తు - సమ్య గేవ వ్యవస్థితా॥

తా॥ పంచముఖాంజనేయుని సప్తమంత్రాత్మికవిద్యయు. ఆ మహనీయునిదే మంత్రము ఇరువదియేడుమంత్రములతో శౌనకసంహితయందు బాగుగా చెప్పబడినది.

శ్లో॥ శాబరా అపి మంత్రా శ్చ - బహవః కథితాః కపేః
హనుమ న్మంత్ర జాలాని - శతపంచక సంఖ్యయా॥
ఇతిహాస పురాణేషు - కథితాని మహామునే!

తా। ఆంజనేయునకు సంబంధించిన శాబరమంత్రములను అనేకములు చెప్పబడినవి. హనుమన్మంత్రములు మొత్తము ఐదువందలవఱకు ఓమైత్రేయమహామునీ ఇతిహాసములందు పురాణములందు చెప్పబడినవి.

శ్లో॥ పురశ్చర్యా మపేక్షంతే - మహామంత్రా స్తు సర్వశః
శాబరాణాం తు మంత్రాణాం - త దపేక్షేన విద్యతే।

తా॥ మహామంత్రములకు ఎల్లెడ పురశ్చర్యావిధానము అవసరముండును. శాబరమంత్రములకు ఆ అవసరము ఉండదు.

శ్లో॥ గురూపదిష్ట మంత్రేణ - యథాశక్తి జపే త్సుధీః॥

తా అ శాబరమంత్రములకు గురువుచెప్పిన మంత్రమును యథాశక్తి బుద్ధిమంతుఁడగువాఁడు జపించుట మాత్రమే కర్తవ్యము.

శ్లో॥ మంత్రాణాం సమసంఖ్యాని - చక్రా ణ్యపి హనూమతః॥

తా॥ హనుమత్సంబంధములగు మంత్రము లెన్నికలవో అదే సంఖ్యలు చక్రవిన్యాసములున్ను కలవు.

శ్లో॥ భక్తి ర్బహువిధా ప్రోక్తా - తథా నవవిధా స్మృతా
శ్రవణం కీర్తనం విష్ణోః - స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం - సఖ్యం చాత్మనివేదనమ్॥

తా॥ భక్తి చాలవిధములుగా చెప్పబడినది. అట్లే అది ముఖ్యముగా తొమ్మిదివిధములుగా తెలియుచున్నది.

1) శ్రవణము - దైవగాథలు అనగా పురాణాదులు వినుట ఇట్టి భక్తిచే సాధకుఁడైనవాఁడు పరీక్షిత్తు మహారాజు.

2) కీర్తన భక్తి - అనగా దైవమునుగూర్చి పాడుచు తరించుట- ఇట్లు ధన్యుఁడైనవాఁడు నారదుఁడు.

3) స్మరణభక్తి - దైవమును స్మరించుచు ధన్యుఁడగుట. ఇట్లు కృతకృత్యుఁడు ప్రహ్లాదుఁడు.

4) పాదసేవనము - పాదములర్చించుట. ఇట్లు ధన్యురాలైనది లక్ష్మి.

5) అర్చనము – అనగా పూజించి తరించుట. ఈరీతిని తరించినవాఁడు పృథుమహారాజు.
6) వందనము – నమస్కారముచే ధన్యుఁడైనవాఁడు అక్రూరుఁడు.
7) దాస్యము - సేవలొనర్చి ధన్యుఁడైనవాఁడు గరుత్మంతుఁడు.
8) సఖ్యము – దైవముతో సాక్షాత్తు స్నేహమొనర్చి ధన్యుడైనవాఁడు అర్జునుఁడు.
9) ఆత్మనివేదనము - సర్వస్వార్పణ మొనర్చి ధన్యుడైనవాఁడు బలిచక్రవర్తి.

పైవారు విష్ణువిషయమున నవవిధభక్తులు. ఏదేవునైన ఆ తొమ్మిది విధములుగా నర్పించి ధన్యులు కానగును.

శ్లో॥ ఉపదిష్టాని మంత్రాణి – మృత జాతక సూతకే
జపే స్థిత్వా ఽపి మౌనేన – జపేదేవ న సంశయః॥

తా॥ ఉపదేశింపబడిన మంత్రములను జాతాశౌచ (పురుడు) మృతాశౌచము (మైల) ల యందు జపమునకు కూర్చొని మౌనముగానే మంత్రమును జపించవచ్చును. సందేహము లేదు.

శ్లో॥ అజ్ఞానా ద్యది వా లోభాత్ - మంత్రత్యాగే దరిద్రతా
సోమ సూ ర్యోపరాగేషు – జపే న్మంత్ర మతంద్రితః॥

తా॥ అజ్ఞానమువలనగాని లేదా లోభమువలనగాని మంత్రమును త్యజించినచో దారిద్ర్యమేర్పడును. సూర్యగ్రహణమున, చంద్రగ్రహణమునను నిశ్చలుఁడై మంత్రమును జపించవలెను.

శ్లో॥ గ్రస్యమానే భవే త్స్నానం – గ్రస్తే హోమో విధీయతే
ముచ్యమానే భవే ద్ధ్యానం – ముక్తే స్నానం విధీయతే॥

తా॥ గ్రహణము పట్టుచుండగా స్నానముచేయవలెను. పట్టిన పిదప హోమము చేయవలెను. విడుచుచుండగా ధ్యానమొనర్చవలెను. విడచిన పిదప మరల విడుపుస్నానము చేయవలెను.

శ్లో॥ ముచ్యమానే వదే న్మంత్రం - జపేదేవ పరాగకే
పురశ్చర్యా విధానేన - యథోక్త ఫల మాప్నుయాత్॥

తా॥ విడచుచుండగా మంత్రమును జపించవలెను. గ్రహణ కాల మున జపించుచునే యుండవలెను. ఇట్లు గ్రహణ సమయమందలి పుర శ్చర్యా విధానముతో తగుఫలమును పొందుదురు.

శ్లో॥ కుర్యా దే వావకాశే తు - తథా హోమం చ తర్పణమ్
నా స్తిచే దవకాశ స్తు - పరేద్యు ర్హోమతర్పణే॥

తా॥ అవకాశమున్నచో అప్పుడే హోమతర్పణము లొనర్చవలెను. అట్టి యవకాశమప్పుడు లేకున్న హోమతర్పణలు మరుదినమున చేయ వలెను.

శ్లో॥ అర్వణం తే ప్రవక్ష్యామి - మంత్రాణా మితరేతరమ్

తా॥ మంత్రములకు అ ర్వ ణ వి ధా నా దు లు చెప్పుచున్నాను. ఓ మైత్రేయా! వినవలసినది,

శ్లో॥ స్వప్నద త్తే స్త్రీయాద త్తే - మాలామంత్రేఽత్ర బీజకే
శ్రీవిద్యా సిద్ధవిద్యాఖ్యాం - సిద్ధారీ నై్నవ శోధయేత్॥

తా॥ స్వప్నమునందీయబడిన మంత్రమునకు, స్త్రీదత్తమంత్రము నకు, మాలామంత్రమునకు, బీజమంత్రమునకు, శ్రీవిద్యకు, సిద్ధవిద్య యన్ను సిద్ధ, అరిస్థానముల వివేచన మవసరములేదు.

శ్లో॥ స్త్రీదత్తం స్వప్నలబ్ధం వా - భాషామంత్రం త్వశాబరం
ప్రణవం వైదికం చైవ - అరి మిత్రం న శోధయేత్॥

తా॥ స్త్రీదత్త మంత్రమునకు, స్వప్నమునలబ్ధమైన మంత్రమునకు, శాబరముకాని భాషామంత్రమునకు, ఓంకారమునకు, వైదికమంత్రము లకు అరి, మిత్రస్థానవివేచన మవసరములేదు.

శ్లో॥ ప్రణవ త్ర్యక్షరీ భూయా - ద్వ్యక్షరా షడక్షరః
ప్రాసాదా హంసరూపీ చ - సర్వసాధారణా స్మృతాః॥

తా॥ ప్రణవముతోకూడిన త్ర్యక్షరియగుచున్నది. వ్యోమభావముతో కూడిన షడక్షరీమంత్రమగుచున్నది. ఇది అనుగ్రహరూపము. వివిధము, సర్వసాధారణముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ తతోఽతిరిక్త మంత్రాణాం - శోధయే దాత్మనోఽర్పణమ్॥

తా॥ తద్భిన్న మంత్రములన్నిటికి అర్పణవిధానము తనకనువగునదిగా చూచుకొనవలెను.

శ్లో॥ జననం జీవనం చైవ - తాడనం బోధనం స్మృతమ్
అథాభిషేకో విమలీ - కరణాఽఽప్యాయినీ పునః
తర్పణం దీపనం గుప్తిః - దశైతా మంత్రసంస్క్రియాః॥

తా॥ మంత్రసంస్కారములు మంత్రోత్పత్తి, మంత్రజీవనము, తాడనక్రియ, బోధనము, మంత్రాభిషేకము, విమలీకరణము, అప్యాయనము, తర్పణము, దీపనము, మంత్రగోపనము అని పదివిధములుగా చెప్పబడుచున్నవి.

శ్లో॥ చింతామణిం కార్తవీర్యం - నామత్రయ సుదర్శనమ్
ఆంజనేయం హయగ్రీవం - రామమంత్రం న శోధయేత్॥

తా॥ చింతామణిమంత్రము, కార్తవీర్యమంత్రము, సుదర్శనము, ఆంజనేయము, హయగ్రీవము, రామమంత్రము — వీనికి అర్పణమును చూడనవసరములేదు.

శ్లో॥ సుదర్శనో వరాహ శ్చ - నారసింహ స్తథైవ చ
శ్రీమ దష్టాక్షరీ చైవ - చత్వారో మంత్రసత్తమః॥

తా॥ సుదర్శనమంత్రము, వరాహమంత్రము, నారసింహమంత్రము శ్రీమదష్టాక్షరీమహామంత్రము ఈ నాల్గును మంత్రశ్రేష్ఠములు.

శ్లో॥ సుదర్శనో విశేషేణ - చతుర్ణాం శ్రీఘ్రసిద్ధిదః
సర్వేషాం మంత్రజాలానాం - వాగ్భవం భువనేశ్వరమ్
మహాలక్ష్మీం పురస్కృత్య - జపే త్సర్వార్థసిద్ధయే॥

తా॥ సుదర్శనమంత్రము విశేషముగా నాల్గింట శీఘ్రముగా సిద్ధి నిచ్చునది. అన్నిమంత్రములందు వాగ్భవబీజ సంయుతమగు శ్రీభువనేశ్వరీ మంత్రమును సర్వసిద్ధికొఱకై లక్ష్మీబీజమును పురస్కరించి అనుష్ఠించవలెను.

శ్లో॥ తారాదిం వా సరాదిం వా - యది నాఽస్కృత వాఽపి వా
వాఙ్మయాదిక మంత్రాణాం - జపః ప్రోక్తి శ్రీ దోషహృత్॥

తా॥ నక్షత్రాదులు, వారాదులు ఉన్నను, లేకున్నను భాషారూపమైన మంత్రముల ననుష్ఠింపవచ్చును. దోషము కాదు.

శ్లో॥ ప్రసాదం ప్రణవం లక్ష్మీం - అష్టార్ణం ద్వాదశాక్షరీం
గోపాలం వామనం విష్ణుం - మిత్రారీ నైవ శోధయేత్॥

తా॥ అనుగ్రహరూపమగు ప్రణవమునకు, లక్ష్మీమంత్రమునకు, అష్టార్ణమంత్రమునకు, ద్వాదశాక్షరీమహామంత్రమునకు, గోపాలమంత్రమునకు, వామనమంత్రమునకు, విష్ణుమంత్రమునకు మిత్రకోష్ఠమా అరికోష్ఠమా యని అర్వణవిధానమును చూడనవసరములేదు.

శ్లో॥ ప్రణవేన విహీన స్తు - త న్మంత్రః ప్రాణహీనకః
సర్వ మంత్రాక్షరాణాం చ - ప్రణవః ప్రాణ ఉచ్యతే।

తా॥ ప్రణవము అనగా ఓంకారము లేనిమంత్రము ప్రాణములేనటువంటిది. (ప్రాణహింసకః అని పాఠాంతరము) అన్ని మంత్రాక్షరములకు ప్రణవమే ప్రాణము.

శ్లో॥ సప్తకోటి మహామంత్రాః - వినా బ్రహ్మాస్త్ర విద్యయా
హనుమ న్మంత్రజాలం వా - మంత్రా నేతి విదు ర్బుధాః॥

తా॥ బ్రహ్మాస్త్ర విద్యలేకున్న ఏడుకోట్ల మహామంత్రములుకాని, హనుమన్మంత్రసమూహమునైనను మంత్రములుకావు అని పండితులు చెప్పుదురు.

శ్లో॥ య స్యోచ్చారణ మాత్రేణ - దేవతాహ్వాన మాచరేత్
దేవతాభి నివిష్టం త - ద్బీజాక్షర ముదాహృతమ్॥

తా॥ దేనినుచ్చరించుటవలన దేవతల కాహ్వానమేర్పడునో దేవతలకు ఉనికిగల యదియే బీజాక్షరమనబడును.

శ్లో॥ మహామంత్రేషు సర్వత్ర - వర్ణసంఖ్యాః వ్యవస్థితాః
క్వచి త్ప్రణవసాహిత్యా త్క్వచి త్ప్రణవం వినా॥

తా॥ ప్రతిమహామంత్రమునకు తప్పక వర్ణసంఖ్య యుండును. కొన్ని మంత్రములం దాసంఖ్య ప్రణవముతో కలిపియుండును. కొన్నింట ప్రణవము లెక్కలేక మంత్రాక్షర సంఖ్య యుండును.

శ్లో॥ తస్మా న్న్యూ నాతిరేకత్వం - సందేహో నైవ యుజ్యతే

తా॥ కావున మంత్రవర్ణములు తక్కువ, ఎక్కువ అని సందేహింప పనిలేదు.

శ్లో॥ మోక్షకామీ శుక్లవర్ణం - పీతం తు ధనకామవాన్
వశ్యకామో ర క్తవర్ణం - మారణం నీలవర్ణకమ్॥

తా॥ తన యభీష్ట దేవతను మోక్షమును కోరువాఁడయినచో తెల్లని వర్ణముగాను, ధనముకోరువాఁడయిన పచ్చనివర్ణముగాను వశీకరణము కోరువాఁడయిన ఎఱుపువర్ణముగాను, మారణముకోరువాఁడు నీలవర్ణముగను.

శ్లో॥ ఉచ్చాటనే ధూమ్రవర్ణం - విద్వేషే హ్యగ్నివర్ణకమ్
సర్వజన వశ్యకామః - పద్మవర్ణ మనుస్మరేత్
అభీష్టదేవతా మేవం - షట్ప్రయోగేషు చింతయేత్॥

తా॥ భూతఉచ్చాటనము కోరువారు ఎక్కువ నలుపు తక్కువ ఎఱుపు కలిసిన ధూమ్రవర్ణముగను, విద్వేషియగువాఁడు అగ్నిరూపముగను, సర్వజనులను వశ్యమొనర్చుకొనగోరువాఁడు పద్మవర్ణముగను

స్మరించవలెను. ఇష్టదేవతను పైరీతిగా షట్చక్రయోగములందు చింతన చేయవలెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖహనుమన్మంత్ర వివరణే
శ్రీ పరాశరమైత్రేయసంవాదే షట్పల్లవాది వివరణం నామ
ఏకోనవింశతిః పటలః॥

వింశతితమః పటలః

## శ్రీ హనుమత్షోడశార్ణవ ప్రభావకథనం

శ్రీ పరాశరః:—

శ్లో॥ హనుమత్షోడశార్ణస్య – మాహాత్మ్య మధికం ద్విజః
శృణు వక్ష్యామి మంత్రో౽యం – భుక్తి ముక్తి ఫలప్రదః॥

తా॥ శ్రీ పరాశరులవారనుచున్నారు. బ్రాహ్మణోత్తముడవగు ఓ మైత్రేయా! హనుమంతుని పదునారక్షరములుకల షోడశాక్షర మహామంత్రమాహాత్మ్యము చాలగొప్పది. లౌకికభుక్తిని అలౌకికముక్తిని ఇయ్యగల ఆ మంత్రమును చెప్పుచున్నాను వినవలసినది.

శ్లో॥ అగస్త్యఋషి రేతస్య – గాయత్రీ ఛంద ఉచ్యతే
సువర్చలావల్లభస్స – హనూమా న్దేవతా భవేత్॥

తా॥ ఈమంత్రము అగస్త్యుడు ఋషి, గాయత్రీ ఛందముగా చెప్పబడుచున్నది. దీనికి సువర్చలానాథుడగు హనుమంతుడు దేవత.

శ్లో॥ బీజం పింగళనేత్రాయ – శక్తిశ్చైవ మహాబలః
ధనంజయసఖా నామ – కీలకం సముదీరితమ్॥

తా॥ పింగళనేత్రాయ అని బీజము. మహాబలః అని శక్తి, ధనంజయ సఖా అని కీలకము చెప్పబడినది.

శ్లో॥ సువర్చలావల్లభ స్స - హనూమాన్ దేవతా భవేత్
తత్ప్రసాద సిద్ధ్యర్థే - వినియోగః ప్రకీర్తితః॥

తా॥ సువర్చలానాథుఁడగు హనుమంతుఁడే దేవత కాన ఆ హనుమంతుని ప్రసాదసిద్ధియందే వినియోగము చెప్పవలెను. అనగా సువర్చలావల్లభ శ్రీహనుమత్ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః అని చెప్పవలెనుట.

శ్లో॥ న్యాసద్వయం తతః కుర్యాత్ - క్రమే ణైవ ముదాహరేత్
అథౌ సంజీవనీ హర్త్రే - కాలనేమి హరాయ చ॥

తా॥ పిదప అంగన్యాసకరన్యాసములు రెండు నాచరింపవలెను. పిదప క్రమముగా నీచెప్పబోవురీతిగా ననవలెను. మొట్టమొదట 'సంజీవనీ హర్త్రేనమః' అని, సంజీవనీపర్వతమును అపహరించినవానికి నమస్కారము అని "కాలనేమి హరాయనమః" అని - కాలనేమిని సంహరించిన వానికి నమస్కారమనియు,

శ్లో॥ భీమసే నాగ్రజా యేతి - భరతం రక్షకాయ చ
ధాన్యమాలీ శాపహర్త్రే - తతః ఛాయా ప్రహారిణే।

తా॥ పిదప భీమసేనాగ్రజాయనమః అని - భీమసేనునికి ముందు పుట్టినవానికి నమస్కారము అని, భరతరక్షకాయనమః అని భరతుని రక్షించినవానికి నమస్కారము అని, "ధాన్యమాలీశాపహర్త్రేనమః" అని - ధాన్యమాలి శాపమును పోగొట్టినవాడా అని, అటుపిమ్మట ఛాయా ప్రహారిణేనమః అని- ఛాయారాక్షసిని సంహరించినవానికి నమస్కారమని,

శ్లో॥ దైవతాంతే కరాంతే చ - చతుర్థ్యా చ నమో భవేత్

తా॥ "దైవతాయనమః" అనియు ననవలెను.

శ్లో॥ అదౌ ప్రణవ ముచ్చార్య - మాయాబీజం తతఃపరమ్
శ్రీం బీజం త తోచ్చార్య - శ్రీపర్ణం చ తతఃపరమ్॥

సువర్చలా వల్లభేతి - హనుమత్పద ముచ్చరేత్
అంతే స్వాహా వదే దేవం - మంత్ర మేనం ప్రపూరయేత్॥

తా॥ మొదట ఓంకారము నుచ్చరించి పిదప మాయాబీజము "హ్రీం" నుచ్చరించి ఆపైన శ్రీం బీజము నుచ్చరించి అటుపైన శ్రీ అను అక్షరమును, సువర్చలావల్లభాయ హనుమతే అని చివరలో స్వాహా అని ఉచ్చరించుచు నీమంత్రమును పూరించవలెను. అనగా "ఓం హ్రీం శ్రీం శ్రీ సువర్చలావల్లభాయహనుమతేస్వాహా" అని మంత్ర మగును.

ధ్యానమ్:-

ఏకే నాభయదం పరేణ వరదం భోజ్యం పరం చాఒపరే
అన్యే నాపి సువర్చలా కుచయుగం హస్తేన సంచిభ్రతః
కారుణ్యామృత పూర్ణలోచన యుగం పీతాంబరాలంకృతమ్
రమ్యం వాయుసుతం చతుర్భుజయుతం ధ్యాయే హనూమత్ప్రభుమ్॥

తా॥ ఒకచేతితో నభయమిచ్చుచు. ఒకచేతితో వరమును ప్రసాదించుచు, ఒకచేత భోజ్యమును, ఒకచేత సువర్చలా కుచమును వహించినట్టియు, దయయును, అమృతముతో నిండిన రెండుకండ్లు కల్గినట్టియు, పట్టుపీతాంబరములను ధరించిన రమ్యమైనట్టియు వాయుకుమారుడును, నాల్గుచేతులతో నున్న హనుమంతుని ప్రార్థించుచున్నాను.

శ్లో॥ లక్ష మేకం పురశ్చర్యామ్ - దశాశం తర్పణం భవేత్
తద్దశాంశం హోమకర్మ - తద్దశాంశం తు భోజనమ్॥

తా॥ పై మంత్రమును లక్షపర్యాయములు పురశ్చర్య జరుపవలెను. అందు పదియవవంతు తర్పణమాచరింపవలెను. అందు పదియవవంతు హోమముచేసి అందు పదియవవంతు సంఖ్యకు సమారాధన మొనర్చి తృప్తిగా భోజనము పెట్టవలెను.

శ్లో॥ అత్రైవోదాహరం తీయ - మితిహాసం పురాతనమ్
బార్హస్పత్యపురం నామ - గంగాతీరే మహామునే,

తా:॥ ఈ విషయమునసే ప్రాచీనకాలమున జరిగిన ఈ గాథ నొ దానిని చెప్పెదరు. ఓపరాశరమహామునీ! గంగాతీరమున బార్హస్పత్యపుర మను పేరుగల

శ్లో॥ స్థితో జనపద స్తత్ర - కపిలోనామ భూసురః
సర్వశాస్త్రార్థ తత్వజ్ఞః - వేద వేదాంగ పారగః॥

తా॥ గ్రామమొకటి కలదు. అచ్చట కపిలుఁడు అను పేరుగల బ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు అన్ని శాస్త్రముల యొక్క అర్థము లెఱిగినవాఁడు. వేదవేదాంగములన్నిటిని చివఱివరకు చదివినవాఁడు.

శ్లో॥ దరిద్రో బహుపుత్ర స్స - స్వీతరాగ స్తు శోధనః
భాగీరథ్యాం జపే న్మంత్రం - హనూమ త్షోడశాక్షరమ్॥

తా॥ దరిద్రుఁడు, అనేకులగు పిల్లలుండినవాఁడు, రాగములు విడచియత్నించి ఈ హనుమత్షోడశాక్షరీ మహామంత్రమును గంగానది యందుండి జపింపసాగెను,

శ్లో॥ ఆసాయం ప్రత్యహం శాకం - గృహీత్వా గృహ మేతిసః
ఇత స్తత స్తస్య భార్యా - యాచిత్వా తండులాదికం
అన్నం పచతి తచ్చాకం - తేన జీవతి నిత్యశః॥

తా। సాయంకాలమువఱకట్లుజపించి శాకముమాత్రము గ్రహించి ఇంటికిచేరుచుండెను- అతనిభార్య ఇటునటుతిరిగి బియ్యము మున్నగునవి యాచించి అన్నము, అతఁడు తెచ్చిన కూరను వండగా ప్రతిదినము దానితో బ్రదుకు చుండెను.

శ్లో॥ ఏవం బహుతిథిం తస్యదేహయాత్రాం ప్రకుర్వతః
వ్యతీతాయ సుఖేనైవ - ప్రత్యహం నిమిషో యథా॥

తా॥ అతఁడు అనేకదినములు ఇట్లే గడుపుచు ప్రతిదినము ఒక నిమిషముగా సుఖముగనె గడుపుటకు

శ్లో. ప్రాత స్స్నాత్వా శుచి ర్భూత్వా - భాగీరథ్యాం శుభోదకే
జపతో హనుమన్మంత్రం - కపిలస్య మహాత్మనః ॥

తా॥ శుభకరములగు గంగానదీజలములందు ఉదయమే స్నానము చేసి శుచియగుచు హనుమన్మంత్రమును జపించు మహాత్ముఁడగు కపిలునకు

శ్లో॥ అవిర్బభూవ హనుమాన్ — ఏకదా భక్తవత్సలః
సువర్చలాపతి శ్శ్రీమాన్ - ధ్యాయమానో రఘూద్వహమ్॥

తా॥ ఒక్కమాటు భక్తులయందు వాత్సల్యముకల్గినట్టియు, సువర్చలాపతియు, రఘువంశతిలకుఁడగు రాముని ధ్యానించునట్టియు హనుమంతుఁడు ప్రత్యక్షమాయెను.

శ్లో॥ చతుర్భుజ శ్చంద్రసమ ప్రభావాన్
సితోపవీతి ర్నవరత్నకుండలః
దుకూల ముక్తామణిహార శోభితః
పిశంగ మౌంజీధవ శోభ్యపుంద్రః॥

తా॥ అతఁడు నాల్గుభుజములుకలవాఁడు. చంద్రునితో సమానమైన కాంతిగలవాఁడు. తెల్లనిజందెము కలవాఁడు. నవరత్నములు పొదిగిన కుండలములు కలవాఁడు. దువ్వలువ గట్టినవాఁడు. ముత్యాలహారముతో ప్రకాశించువాఁడు గోరోజనపు రంగుగల ముంజమేఖలతో ఒప్పినవాఁడు. తెల్లని విలువబొట్టుకలవాఁడునై యుండెను.

శ్లో॥ కరై శ్చతుర్భి శ్చతురోపుమర్థాన్
దదాతి యో భక్తజనాయ నిత్యమ్
సీతా మనోల్లాసకరో హనూమాన్
పునాతి లోకత్రితయం మహాత్మా॥

తా॥ నాల్గుచేతులతో నాలుగైన చతుర్విధపురుషార్థములగు ధర్మార్థ కామమోక్షములను అనుదినము భక్తకోటికి ప్రసాదించు మహాత్ముఁడు,

సీతాదేవిమనస్సున కానందము కల్గించినవాఁడు నగు హనుమంతుఁడు ముల్లోకములను పవిత్రమొనర్చుచున్నాఁడు.

శ్లో॥ జాంబవాన్ వినతా నీలో - పనసో గంధమాదనః
సుషేణ మైంద ద్వివిద - ముఖైః పరివృతః కపిః॥

తా॥ జాంబవంతుఁడు, వినతుఁడు, నీలుఁడు, పనసుఁడు, గంధమాదనుఁడు, సుషేణుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు మున్నగువారితో కూడియున్నవాఁడున్ను,

శ్లో॥ విలోక్య తం స్తోత్రపరంపరాభిః
స్తువ న్నమస్కారపురస్సర ద్విజః
విధాయ పూజా మనసో పచారైః
స్మితో ముదా బాష్పక ణాకులేక్షణః॥

తా॥ అట్టి అందఱికన్న మిన్నగాస్తుతింపదగిన హనుమంతుని చూచి ఆబ్రాహ్మణుఁడు నమస్కారపూర్వకముగా స్తోత్రముచేయుచు మనస్సుననే అతనికి గొప్పగా పూజ లొనర్చి ఆనందబాష్పములతోకూడిన నవ్వుకలవాఁడై,

శ్లో॥ భకోముహూర్తం నిర్మజ్జ - మహా దానందసాగరే
చిరాయ లబ్ధ్వా సంజ్ఞాం వై - ఇద మాహ కథంచన॥

తా॥ భక్తుఁడగు నాతఁడు క్షణకాలము గొప్ప ఆనందము అను సముద్రమున మునిగి చాలసేపటికి మాత్రమే తెలివి నంది ఎట్లో ఈక్రింది విధముగబల్కెను.

శ్లో॥ అద్య ప్రభృతి యోగ్యాహం - త్వయా సందర్శనా త్ప్రభో!
సర్వతాప వినిర్ముక్తా - సన్మరేయం మ యాలయమ్॥

తా॥ ఓదేవా! నిన్ను చూచుటవలన నేనిప్పటినుండి ధన్యుఁడను. అన్నిబాధల నుండి విడిచి పెట్టబడినాడను. ఇకనేనింటివి గూర్చికూడ విచారించను,

శ్లో॥ భక్త్యా సమర్పితం తాత। ఫలం వా పత్ర మేవ వా
మ దనుగ్రహ లాభేన - గృహాణ కపిపుంగవ॥

తా। నన్ననుగ్రహించిన లాభముచే భక్తితో సమర్పించు ఫలమునుకాని పత్రమునుకాని ఓవానరశ్రేష్ఠా। దైవమా। స్వీకరింపుము.

శ్లో॥ జాయా చాఽపి సువర్చలా రవిసుతా దివ్యం చ హేమాంబరమ్
మాణిక్యాంచిత కుండలే శ్రవణయోః కంఠే చ ముక్తావళిః
సుగ్రీ వాంగద గంధమాదన ముఖాః స ర్వార్షదా స్సంతి తే
కిం దాస్యామి మనఃప్రియం హి హనుమాన్ సంపూర్ణకామో భవాన్॥

తా॥ నీభార్య సూర్యదేవుని కుమార్తెయగు సువర్చల. నీవస్త్రము దివ్యమైనది. బంగారపుది, చెవులకు మాణిక్యములు పొదిగిన కుండలములు, కంఠమున ముత్యాలహారమున్నది. సుగ్రీవుడు, అంగదుడు గంధమాదనుడు మున్నగు గొప్పవారెప్పుడు నీప్రక్కనుండువారు, ఇట్లు అన్నికోర్కెలుతీరిన నీమనస్సున కిష్టమైనది ఓ హనుమత్ప్రభో! ఏమీయగలను?

శ్లో॥ ఏవం స హనుమాన్ తస్య - కపిలస్య మహాత్మనః
భక్త్యుద్రేకం సముద్వీక్ష్య - నందయామాస తం వరైః॥

తా॥ ఇట్లను మహాత్ముడగు కపిలుని భక్తియందలి ఆవేశమును చూచి ఆ హనుమంతుడు గొప్పవరములిచ్చి వానిని తృప్తిని జేసెను.

శ్లో॥ న యయాచే వరం కంచి - న్ముముక్షుర్వీతరాగవాన్
హనూమంత ముపా చేదం - ఏతే కే వానరోత్తమాః॥

తా। అ కపిలుడు మోక్షమును కోరినవాడు, రాగములను వీడినవాడు అగుటవలన ఏవరమును కోరలేదు. హనుమంతునితో ఈ వానరోత్తములెవరు? అని పల్కెను.

-9-

శ్రీ హనుమాన్:-

శ్లో॥ గంధమాదన నామ్నావై - పర్వతో ధాతుమండితః
హేమ రంభాతరు వృతః - శ్రీమాన్ శిఖరభూషితః

తా॥ శ్రీ హనుమంతుఁ డిట్లు చెప్పెను. ఈతఁడు గంధమాదనుఁ డను పేరుగల పర్వతుఁడు. గైరికాదిధాతువులతో ప్రకాశించువాఁడు, బంగారు అరటిలోటలతో కూడినవాఁడు, శోభాయమానమగు శిఖరములతో నొప్పువాఁడు.

శ్లో॥ ఏతే తత్ర మహాభాగా - స్సంతి మత్పార్షదః ద్విజ
జాంబవాన్ వినతో నీలః - పనసో గంధమాదనః
సుషేణ మైంద ద్వివిదా - మమ కార్య ధురంధరాః॥

తా॥ ఓబ్రాహ్మణోత్తమా! ఈ యున్నవారు మహామహులగు నా పరిషత్తువారు. ప్రక్కనుండువారు. జాంబవంతుఁడు, వినతుఁడు, నీలుఁడు, పనసుఁడు, గంధమాదనుఁడు, సుషేణుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు అనువారు. నాకు సంబంధించిన కార్యములు నెరవేర్చుటలో సమర్థులు.

శ్లో॥ నిత్యాభిషేకం కుర్విన్ తు - ధూప దీప ఫలప్రదః

తా॥ ప్రతిదినము అభిషేకముచేయుచు ధూపదీప నైవేద్యము చేసినవాఁడవైతివి.

శ్లో॥ దినాభిషేక తీర్థేన - వాలాగ్రా త్ప్రఖ్యాతేన చ
వాలసాగర నామ్నాత్ర - నదీ జాతా సుపావనీ॥

తా॥ ప్రతిదినము అభిషేకమొనర్చిన జలముచే వాలాగ్రమను ప్రఖ్యాతినంది "వాలసాగరము" అను పేరుగల పవిత్రమగు నది ఇచ్చట పుట్టినది.

శ్లో॥ తత్ర స్నాత్వా చ పాపాత్మా - శుద్ధో భవతి మానవః
సర్వసిద్ధి మవాప్నోతి - శీఘ్రమేవ న సంశయః
అనే నారాధనే నాహం సంతుష్టో ద్విజసత్తమః

తా॥ అట స్నానముచేసిన పాపాత్ముఁడగు మానవుఁడును శుద్ధుఁడగును. వెంటనే నిస్సందేహముగా సర్వము వానికి సిద్ధించును- ఓ బ్రహ్మణోత్తమా అట్టి దీని నారాధిచుటచే నేను సంతోషించినవాఁడ నౌదును.

శ్లో॥ వరయధ్వం పరా న్యాయం - ఇ త్యవోచ న్మహాత్మనః

తా॥ అని వారినిపొడ వలయునది కోరుమనెను.

శ్లో॥ ఊచు స్తే పరమప్రీతా - జాంబవ త్ప్రముఖా ఇమే
ప్రాప్నుయామః పరం పూజా - భవతా ససుఖం వయమ్॥

తా॥ జాంబవంతుఁడు మున్నగు ప్రముఖులు మిక్కిలి సంతసించి నీచే ఉత్తమపూజ నందుచున్నాము, వేరు వలయునది లేదనిరి, హనుంతుఁడిట్లనెను.

శ్లో॥ ఉత్తమా స్త న్మహాభాగాన్ - ఆరాధ్య ప్రథమం ద్విజః
అనంతరం తు తత్పూజాం - కుర్వంతు మమ చోత్తమామ్॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! మొట్ట మొదట ఉత్తములగు ఆ మహానుభావులనే పూజించి పిదపనే ఉత్తమమగు పూజను నాకొనర్చవలెను.

శ్లో॥ మద్భక్తారాధనా దేవ - అత్యంత పరితోషవాన్
మద్భక్త స్యావమానేన - హ్యత్యంత మవమానితః॥

తా॥ నేను నా భక్తులను అరాధించుటవలననే మిక్కిలి సంతుష్టుఁడనౌదును. నాభక్తులనవమానించుటనే మిక్కిలి యవమాన మొనర్చినట్లుగా నెంతును.

శ్లో॥ మ మావతారాః బహవః - స్వరూపాని బహూని చ
యథా మాం భజతే భక్త - స్తథై వావిర్భవా మ్యహమ్॥

తా॥ నాఅవతారములు పెక్కులు. నారూపములున్ను అనేకములు. నాభక్తుఁడు నన్నెటుల సేవించునో ఆరూపములోనే వానికి దర్శనమిత్తును.

శ్లో॥ ఏవ ముక్తస్తు కపిలో - నమస్కృ త్యాంజనాసుతమ్
ఏవం హితోపదేశేన - తోషయిత్వా ద్విజోత్తమమ్॥

తా॥ అంజనాకుమారుఁడగు హనుమంతుని నమస్కరించినవాఁడై కపిలుఁడు పైరీతిగా చెప్పబడెను. ఇట్లు ఆ బ్రాహ్మణుని మంచిమాటలతో తృప్తిపఱిచినవాఁడై

శ్లో॥ జగామ మనసా రామం - చింతయ న్నంజనాసుతః
సంధ్యా ముపాస్య విధివత్ - కపిల స్సదనం యయౌ॥

తా॥ అంజనేయుఁడు రాముని మనసున చింతన మొనర్చుచు వెడలెను, యథావిధి సంధ్యావందనమాచరించువాఁడై కపిలుఁ డింటికేగెను.

శ్లో॥ తస్య భార్యావద ద్విప్రం - శాకం నానీతవా నసి
సోఽవదత్తాం మద్య సాధ్వీ! - హనూమాన్ జపత స్సతః॥

తా॥ అతనిభార్య అతనితో శాకమును తీసికొనిరాకపోవుటను గూర్చి పల్కగా నాతఁడు ఓ ఉత్తమురాలా! నేడు నేను జపముచేయుచుండగా

శ్లో॥ భగవా న్భక్తవాత్సల్యా - న్మమ ప్రత్యక్షతాం గతః
తేన సంభాషమాణస్య - ప్రత్యుత్థా నాభివందనైః
స్తువతో నావకాశో భూ - చ్ఛాక స్యాహరణే మమ॥

తా॥ భగవానుఁడగు హనుమంతుఁడు భక్తులయందు వాత్సల్యము కలవాఁడగుటవలన నాకు ప్రత్యక్షమయ్యెను. ఎదురేగి నమస్కరించి సంభాషించుటచేత, స్తోత్రము చేయుటచేతను నాకు శాకమును తీసికొని వచ్చుట కవకాశము లేకపోయినది.

శ్లో॥ ఇతిశ్రుత్వా వచ స్తస్య - భార్యా కౌతుకాన్వితా
హనుమాన్ యది తే బ్రహ్మన్ - దేవః ప్రత్యక్షతాం గతః
అస్మ ద్గృహే మహాత్మ్యాకర - దారిద్ర్య స్థితిః కథం?

తా॥ అను అతనిమాటలను విని అతనిభార్య సంతోషముతో కూడినదై! ఓ బ్రాహ్మణవర్యా! శ్రీ హనుమానుఁడే మీకు ప్రత్యక్షమైనచో నింక మనయింట ఇంత దారిద్ర్య మెట్లుండును?

శ్లో॥ దైవం యది భవే త్సత్యం - ప్రత్యక్షం వే భవాద్యది
సర్వేకామాః ప్రసిద్ధ్యంతి - హూఽవిద్యేతి మే మతిః॥

తా. దైవమే ఉన్నమాట సత్యమైనచో అతఁడు ప్రత్యక్షమగుట నిశ్చయమైనచో అజ్ఞానము తొలగిపోవునని సమస్తములైన కోర్కెలు నెరవేరునని నా యుద్దేశ్యము.

శ్లో॥ త్వ త్ప్రసాదా స్త్వయా లబ్ధాః - కుమారా శ్చ కుమారికాః
బహవ సూర్యసంకాశాః - చంద్రరేఖాసమా ఇమాః।

తా॥ మీ యనుగ్రహమువలన చాలమంది సూర్యునితో సమాను లగు కుమారులు, చంద్రరేఖతో సమానులగు చాలమంది కుమార్తెలు నాకు కల్గిరి-

శ్లో॥ నాహ్నా ప్యేషాం న వస్త్రం వా - న సువర్ణాది భూషణమ్
న వివాహో ద్యుత్సవానాం - మ న్మనోరథసిద్ధయః॥

తా॥ వీరికి పేరుకైన గుడ్డలుకాని బంగారు అభరణములు కాని లేవు. వీరి వివాహము నందు నాకున్న కోరిక తీరుటయనునది కూడలేదు.

శ్లో॥ కిం కేవలై ర్వేదపాఠైః - శ్రౌత స్మార్తాది కర్మభిః
న హితం దహ్యమానానాం - బాలానాం జఠరాగ్నినా॥

తా॥ కేవలము ఈ వేదపాఠములవలన శృతి, స్మృతులు చెప్పిన కర్మలాచరించుటవలన ప్రయోజనము? జఠరాగ్నిచే దహించుకుపోవునట్టి పిల్లలకు కూడ అవి మేలు చేయలేవే.

శ్లో॥ కథం రక్షతి దైవం తే - హనుమాన్ వరజో హ్యతః
కథం వా త్రాయతే సోఽస్మాన్ - క్షుధార్తాన్ సహపుత్రకాన్

తా: నీ దైవమగు హనుమంతుఁడు ఎట్లురక్షించగలఁడు? అతడు ఆకలిచే బాధపడునట్టి, అట్టిపుత్రులుకల్గినట్టి మనలనెట్లు కాపాడగలఁడు?

శ్లో॥ అవిజ్ఞాయ తథా ప్యన్నం - మృతా నస్మా నవ త్యసౌ?

తా। అన్నమువలయు నీస్థితిని తెలిసికొనక మనలను చనిపోయిన పిదప కాపాడునా?

శ్లో॥ పితా మే న విజానాతి - భవంతం పురుషాధమమ్
అహో దత్త సుతా బాలాః - మన స్యైవాన్న భోజినః॥

తా॥ నాతండ్రికి మీరిటువంటి పురుషాధములని తెలియదు. అందుకే నన్ను మీకిచ్చి చేసిరి అయ్యో! కుమారులు, కుమార్తెలు మానసిక భోజనమే చేయువారైరికదా!

శ్లో॥ పటచ్చరైః కందమూలైః - పత్ర శాక బిసైర్జలైః
భృత్యా చోపార్జితై ర్ధాన్యై - అపర్యాప్తై శ్చ వస్తుభిః॥

తా॥ పాతగుడ్డలతోడను, దుంపలువ్రేళ్ళతోడను, ఆకులు, తూరలు, తామరతూండ్లు, నీరు మొదలగువానితోను, చాకిరిచేసి సంపాదించిన గింజలతోను, ఇట్టి సరిగాచాలని వస్తువులతో

శ్లో॥ శరీర స్థితి మాత్రేణ - పుత్రా జీవంతి మే భృశమ్
హితం సర్వ మపి త్యక్త్వం - తపసా చైవ తేన తే॥

తా॥ నాబిడ్డలు కేవలం దేహముయొక్క ఉనికితో జీవించుచున్నారు. నీతపస్సు చేతనే మేలంతయు పీడబడినది.

శ్లో॥ వివాహా ద్యుత్సవై రన్యైః - తథా పుంసవనాదిభిః
ప్రీతిదానై శ్చ బంధుభ్యో - ముకుం దారాధ నోత్సవైః॥

తా॥ ఇతరగృహస్థులైనచో వివాహము మున్నగు నుత్సవములతోను, పుంసవనాదులతోను, బంధువులకొఱకు ఇష్టములైనవిచ్చుటచేతను దేవదేవుని ఆరాధనములతోను,

శ్లో॥ వైతానిక క్రియాభి శ్చా - ప్యాతిథ్యేన చ సర్వదా
హృష్ట పుష్టా శ్చ దృశ్యంతే - న పోష్యా గృహమేధినః॥

తా॥ జితగాంద్రపసులచేతను, ఎల్లప్పుడు అతిథ్యముల నొసగుట ద్వారాను, పోషింపబడుస్థితిలేక ఆనందముతోను, బలముతోను కాన వచ్చుచున్నారు.

శ్లో॥ ఇతి శ్రుత్వాఽవద ద్విప్రో - భార్యాం దారిద్ర్యకర్శితామ్
శ్రుణు మూఢే! న భోగార్థం - తపో మే ముక్తికారణమ్॥

తా॥ అని యనగా విని కపిలుఁడు దారిద్ర్యముచే కృశించిన భార్యతో నిట్లనెను. ఓమూఢురాలా? వినుము. నాతపస్సు భోగమునాసించి కాదు. ముక్తికొరకై చేయుచున్నాను.

శ్లో॥ సాహిత్వాఽవద త్సాధ్వీ - న దదా త్యైహికం సుఖమ్
అముష్మికం కథం దద్యా - ద్దైవతం యోగిదుర్లభమ్॥

తా॥ అనగా అంతట ఆమె నవ్వి ఇట్లనెను. ఇహమునకు సంబంధించిన సుఖములనే ఈయలేకున్న ఆదైవము యోగులకే దుర్లభమైన పారలౌకిక ప్రయోజనము నెట్లీయగలడు?

శ్లో॥ ఇతి శ్రుత్వా తదా విప్రో - హనుమ ద్ద్వేషణం వచః
తస్మా ద్దేశా దపక్రామ - ద్వీతరాగ స్తపోధనః॥

తా॥ అనగా నట్టి హనుమంతుని ద్వేషించినమాటనువిని రాగత్యాగియు, తపస్సే ధనముగా గలవాఁడునైన ఆబ్రహ్మఁణుఁడు ఆప్రదేశము నుండి వెడలిపోయెను.

శ్లో॥ తతః ప్రాదురభూ త్తత్ర - హనుమద్భక్తవత్సలః

తా॥ అంత నచ్చట భక్తులయందు వాత్సల్యముకల హనుమంతుఁడు ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ దైత్యానా మశని స్సుపర్వణాం కపివర స్సాక్ష దంజనాయా శ్శిశుః
మృత్యూ రావణరాక్షసస్య నితరాం రామాను ప్రాణదః
సీతాహర్ష ధురంధరో రఘుపతేః - కార్య ప్రధానాగ్రణీః
యోగిధ్యేయ సుపర్వలా ప్రియసఖ స్తన్మందిరం ప్రావిశత్॥

తా॥ రాక్షసులకు పిడుగువంటివాఁడును, నరులకు కపిశ్రేష్ఠుఁడును, అంజనాదేవి బిడ్డయు' రావణుడను రాక్షసునకు సాక్షాత్తు మృత్యువైన వాఁడును, రామునిసోదరుడగు లక్ష్మణునకు ప్రాణమొసంగినవాఁడును, సీతాదేవియొక్క ఆనందమునకు కారకుడయిన మహామహుఁడును, రఘు రాముని కార్యము నెరవేర్చువారిలో మిన్నయగు మొదటివాడును. యోగు లచే ధ్యానింపబడువాఁడగు సువర్చలాప్రియుఁడు ఆ మందిరమును ప్రవే శించెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీ పరాశరమైత్రేయసంవాదే
శ్రీ హనుమత్ షోడశార్ణవ మహామంత్ర ప్రభావకథనం
నామ వింశతితమః పటలః

## ఏకవింశతితమ పటలః

# కపిలచరిత్ర కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ ఉవాచ కుశలం భార్యా - తవ కిం వక్తి మే వద
త మువాచ మహాబాహూ - పోష్యవర్గస్యకారణాత్॥

తా॥ పరాశరులవారీ రీతిగా మైత్రేయమహామునితో చెప్పఁజొచ్చిరి. శ్రీ హనుమంతుడు ప్రత్యక్షమై కపిలునితో ఓ బ్రాహ్మణుడా! నీవు కుశ లమా యనియడిగి నీభార్య ఏమనుచున్నదో నాకు చెప్పవలసినది. అనగా నాతడు హనుమంతునితో ఓమహానుభావా! నేను పోషింపవలసిన వారుం డుటచే

శ్లో॥ వన్యశాక ముపాదాయ - జపాంతే గృహ మాగతః
నయామి దివసా నద్య - శాకం నానీతవా నహమ్॥

తా॥ జపానంతరము వనమునందలి కూరలను తీసికొని యింటికి దెచ్చుచు కాలము గడుపుచుంటిని. కాని నేడు కూరను తీసికొనిరాలేదు.

శ్లో॥ అత ఏవంవిధా వాచః - క్షుధార్తా వక్తి మా మితి
ప్రహ స్యోవాచ విప్రేంద్రం - హనుమా న్పూతభావనః॥

తా॥ అందుచే ఆకలిగొన్న నాభార్య నన్నిటులన్నది యనిచెప్పగా పరమాత్ముఁడగు హనుమంతుఁడు నవ్వి ఆబ్రాహ్మణోత్తమునితో నిట్లనెను.

శ్లో॥ వరం వరయ భద్రం తే - మా కురు ష్వాత్ర సంశయమ్
శ్రుత్వా హనుమతో వాక్యం - కపిలో హృష్టమానసః॥

తా॥ నీకు మేలగునట్టివరమును కోరవలసినది సందేహముపీడి యడుగుము అన హనుమంతుని వాక్యములువిని కపిలుడు సంతసించిన మనస్సుకలవాడై -

శ్లో॥ ఉవాచ వచనం ధీమాన్ - దేశకాలోచితం యథా
పర మన్యం న యాచేఽహం - త్వత్పాదాంబుజ భక్తితః॥

తా॥ బుద్ధిమంతుఁడగు కపిలుడు దేశకాలోచితముగా 'ఓ హనుమ త్ప్రభూ! నీపాదపద్మముల భక్తి నిమించి ఇతరమగు వరమును నేను కోరను' అని పల్కెను.

శ్లో॥ తతః ప్రోవాచ హనుమాన్ - భక్తిం ముక్తిం దదామి తే
తవ భార్యాం వద బ్రహ్మన్ - పశ్చాద్భాగే గృహస్యతే।

తా॥ పిమ్మట హనుమంతుడిట్లనెను. ఓబ్రాహ్మణుఁడా! నీకు భక్తిని ప్రసాదించుచున్నాను. నీభార్యతో నిట్లుచెప్పుము- నీయింటి వెనుకభాగమున

శ్లో॥ బదరీవృక్షమూలే తు - నిక్షేపో వర్తతే మహాన్
త ద్గృహీత్వా ధనం ప్రాజ్యం - యథేష్టం భుజ్యతా మితి॥

తా॥ రేగిచెట్టుయొక్క కుదుట గొప్పనిధి కలదు. అట్టి పెద్ద ధన సంపత్తిని తీసికొని యథేచ్ఛగా ననుభవించుము. అని

శ్లో॥ తథై వోక్తా స్వపతినా - ప్రహస్య ప్రాహ తం ద్విజమ్
అహం తు మందభాగ్యాస్మి - మాదృశీ న జగత్త్రయే॥

తా॥ అట్లు కపిలునిచే చెప్పబడినదై అతని భార్యనవ్వి బ్రాహ్మణు నితో నిట్లనెను. నేను మందభాగ్యురాల నైతిని. నావంటిది ముల్లోకముల నుండదు.

శ్లో॥ యతో దారిద్ర్యదుఃఖేన - సర్వేషా మస్మి గోచరా
గృహే తు పరుషం చోర - మాదిశ్య బిలభేదనే॥

తా॥ ఎందువలనన లేమివలని దుఃఖమున నేనందఱిచేతను చూడ బడుచుంటిని. కఠినాత్ముడగు దొంగను కన్నమువేయుటకై ఇంటియందు నియోగించి

శ్లో॥ వృథా మాం బాధతే బ్రహ్మన్ - ఏత ద్దైవస్య వంచనమ్
అథవా విద్యతే నాథ ! కటహో ధనసంపదామ్॥

తా॥ వ్యర్థముగా నన్ను బాధించుచున్నాడు? ఇది దైవముయొక్క వంచనము, నాథా ! కాకున్న ధనసంపదలయొక్క బిందె యనునది యుండునా ?

శ్లో॥ త ముద్ధర్తుం కథం నాలం - దైవం తే గిరిభేదకమ్
కథం వా శక్తి రుద్ధర్తుం - శాకసాత్కృతవర్త్మనః
నితాంతకృశదీనాయాః - క్షుధితాయా దివానిశమ్॥

తా॥ ఆనిధిని పెకలించుటకు కొండలను పిండిచేయగల నీదైవ మెందుకు సమర్థుడుకాడు ? మనబోటి కూరనారల కఠినమగు బ్రతుకులు కలవారికి దానిని పెకలించగల శక్తి ఎట్లుండును ? ఎల్లప్పుడు కృశించుటచే

దీనముగనుండువారికి, రేబవళ్ళు ఆకలిగొని యుండువారికి దానిని పెకలి
గించు శక్తి ఏరీతిగ నుండును ?

శ్లో॥ అస్మాసు య ద్యనుక్రోశః - కపిరాజస్య ధీమతః
ఉద్ధృత్య నఖాగ్రేణ - దీయతాం ధనపేటికా॥

తా। సర్వజ్ఞుడగు ఆవానరశ్రేష్ఠునకు మనపై కనికరమునునది
యున్నచో కొనగోటితో కలిమికల పెట్టెను పెకలించి

శ్లో॥ అస్మాక మతిమూఢానాం - హతభాగ్యోపజీవినామ్
న చాసి మహతో లోకే - విద్యతే శక్త్యగోచరః॥

తా॥ మిక్కిలి మూఢులమగునట్టి. మందభాగ్యులమై జీవించునట్టి
మనకిచ్చుగాక- ఈ మహాప్రపంచమున నాతనిశక్తికి అసాధ్యమైన దేదియు
లేదు.

శ్లో॥ గిరిం చ గిరిశృంగాణి - వహతో లీలయా కపేః
నిక్షేపపాత్రాహరణే - కియా న్భారో భవిష్యతి॥

తా। పర్వతమును, పర్వతశిఖరములను విలాసముగ ధరించిగల
ఆకపివీరునకు నిధి కల పాత్రనుదెచ్చుట యెంతమాత్రపు బరువు ?

శ్లో॥ ఉపచ్ఛందేన వాక్యేన - న సంతోషో భవే దిం
ఇతి శ్రుత్వా తు హనుమాన్ - నిద్రాం చ భజతే వధూః॥

తా॥ కావున పైపల్కినమాటలచే నాకు సంతోషము కల్గుటలేదు.
అని కపిలునిభార్య అనగా హనుమంతుడు దానిని విని ఆమె నిద్రించు
చుండగా

శ్లో॥ తతో గత్వా ధనస్థానం - హనుమా న్పాదకుట్టనైః
భిత్త్వా తద్ధనపాత్రం మే - శిరసి స్థాపయ ద్విజ ।

తా॥ అపిమ్మట ధనస్థానమునుచేరి హనుమంతుడు పాదమును
గుచ్చుటద్వారా అధనపాత్రను బయటకు పెకలించి ఓబ్రాహ్మణుడా !
నిధిపాత్రను నాశిరముపై నుంచుము.

శ్లో॥ ఇత్యుక్తః ప్రాహ తం విప్రః - కథం తే శిరసి ప్రభో ।
స్థాపయామీదృశం భార - మపరాధస్య కారణమ్॥

తా॥ అని చెప్పబడినవాఁడై బ్రాహ్మణుఁడగు కపిలుఁడు ఇట్లనెను. ఓమహానుభావా! అపరాధమునకు కారణమగు ఈ బరువును మీతలపై నెట్లుఉంచగలను?

శ్లో॥ త మువాచ హరి ర్విప్రం - మమభక్తార్థ భారతః
న మే గ్లాని ర్భవే దేవ - మహాత్మా న తు సీదతి॥

తా॥ అనగా విని హనుమంతుఁ డాబ్రాహ్మణునితో నాభక్తుల విషయమై వహించుభారము నాకు గ్లానిని కల్గించదు. మహాత్ములెన్నడును సోమరితనమును బూనరు.

శ్లో॥ పురాఽహం సేతుబంధార్థం - సముద్రే రామచోదితః
కనకాచల మాలోక్య - వాలేనోద్ధర్తు మీప్సితః॥

తా॥ పూర్వము నేను సముద్రమున సేతువును బంధించునిమిత్తమై శ్రీరామునిచే ప్రేరేపింపబడి మేరు పర్వతమునుచూచి నాతోకతో దానిని పెళ్ళగించికొని పోఁదలంచితిని-

శ్లో॥ ఏత ద్జ్ఞాత్వా సురశ్రేష్ఠో - మాం ప్రార్థయితు మాగతః
అవోచం త్రిదశా స్సర్వే - లోకపాలా మరుద్గణాః॥

తా॥ ఈ విషయమును తెలిసికొని దేవేంద్రుఁడు నన్ను ప్రార్థించుటకువచ్చెను- అందఱు దేవతలును, లోకపాలకులును, మరుద్గణములును,

శ్లో॥ వసవ స్సిద్ధసాధ్యా శ్చ - గంధ ర్వాప్సరసాం గణాః
దేవర్షయో వస న్త్యత్ర - కథం నేతు మిహార్హసి॥

తా॥ వస్తువులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, అప్సరసలు, దేవర్షులును ఇందు నివసించుచున్నారు. కాన ఎట్లు తీసికొనిపోఁదగి యున్నావు?

శ్లో॥ విరించి నైవ ముక్తోఽహం - అవోచం భారతీపతిమ్॥

తా॥ అని బ్రహ్మదేవునిచే నేను చెప్పబడినవాడనై వాణీపతితో నిట్లంటిని.

శ్లో॥ రామో దాశరథి శ్రీమాన్ - సత్యసంధో మహాబలః
రావణం జేతుకామస్సన్ - సేతుబంధం సముద్యతః॥

తా॥ శ్రీమంతుఁడు. సత్యసంధుఁడు. మహాబలవంతుఁడు, దశరథ సుతుఁడు నగు శ్రీరామచంద్రుఁడు రావణునిజయించు కోర్కెకలవాఁడై సేతువును బంధింపబూనెను.

శ్లో॥ తదర్థ మేనం హేమాద్రిం - శీఘ్రం నేతు మిహాగతః
కి మన్యైః పర్వతిస్తోత్రైః - ఇతి మత్వా నియంత్రితః॥

తా॥ అందుకొఱకై ఈ బంగారుకొండను వెంటనే గొంపోవ నిటకువచ్చితిని. ఇతరములగు స్వల్ప పర్వతములతో నేమిపని యని తలచి ఇందు నియోగింపబడితిని.

శ్లో॥ ప్రసారయామి లాంగూలం - తస్యాగ్రే సర్వదేవతాః
తిష్ఠం త్విమం మహాశైలం - న త్యజామి కథంచన॥

తా॥ దానిపై సర్వదేవతలు నుందురుగాక. ఎట్లును ఈ మహా పర్వతమునువీడను. ఇదే నాతోరను పంపుచున్నాను.

శ్లో॥ శ్రుత్వా తు మే బలోపేతం - చలవాక్యం పితామహః
ఉపాయేన జగత్కర్తా - సుందరం రామవిగ్రహమ్॥

తా॥ అన్న నాబలవత్తరములగు పల్కులను బ్రహ్మవినవాడై జగత్తునకే సృష్టికర్తయగు నాతడు ఉపాయముతో అందమైన రాముని విగ్రహమును.

శ్లో॥ కల్పయిత్వా తన్మకేన - మాం న్యవారయ దీశ్వరః
వృత్తాంత మేత ద్జ్ఞాత్వాఽపి - రామశాసన గౌరవాత్
అహం మేరుం పరిత్యజ్య - గిరీ నన్యా న్గృహీతవాన్॥

తా॥ తయారుచేసి సమర్థుడగు నాతడా నెపమున నన్ను నివారించెను. ఆ వృత్తాంతమంతయు తెలిసి నప్పటికిని రామశాసనమందలి గౌరవముతో నేను మేరుపర్వతమునువీడి మిగిలిన కొండలను తీసికొని వెడలితిని.

శ్లో॥ మదానీతై శ్చ పై రామో - బంధయామాస సాగరమ్
అతో ధనకటాహో౽యం - న మే భారాయ కల్పతే॥

తా॥ రాముఁడు నాచే తీసికొనిరాబడిన పర్వతములతోనే సముద్రము నకు సేతువు నిర్మించెను. కావున ఈనిక్షేపపాత్ర నాకు బరువుకాజాలదు.

శ్లో॥ ద్విజ స్సంచోదితో౽ప్యేవం - కపీంద్రేణ మహాత్మనా
న మేనే తస్య తద్భారం - మూర్ధ్నా వాహయితుం పునః।

తా॥ అని ఇట్లు మహాత్ముఁడగు వానరశ్రేష్ఠునిచే తెలియజేయ బడినను బ్రాహ్మణుఁడగు కపిలుఁడు హనుమంతుని శిరస్సుచే ఆతని యాభారమును మోయింపనిచ్చగించలేదు.

శ్లో॥ కపీంద్రో౽పి నిరీక్ష్యైవం - తస్యభక్తి మహైతుకీమ్
స్వయమే వానుమేన తం - భార ముద్వోఢు మాదరాత్॥

తా॥ కపిశ్రేష్ఠుడగు నాహనుమంతుడు ఆతని అవ్యాజభక్తినిచూచి తాను ఆదరముతో ఆ భారమును మోయనిశ్చయించుకొనెను.

శ్లో॥ ఇతి నిశ్చిత్య మనసా - భార ముద్వాహ్య మౌళినా
నిద్రాణో ర్ద్విజభార్యాయాః - పురోదేశే న్యపాతయత్॥

తా॥ పైరీతిగా తనమనమున నిశ్చయించుకొనినవాఁడై ఆభారము నంతను తలపై కెత్తుకొని నిద్రయందు నిమగ్నురాలైన ఆబ్రాహ్మణుని భార్యఎదుట నుంచెను.

శ్లో॥ తతః కపిల మాహూయ - హనుమా న్భక్తవత్సలః
ఆముష్మికం చ దాస్యామి - త్యుక్త్వై వాంత రధీయత॥

తా॥ అటుపిమ్మట కపిలుని భక్తవత్సలుఁడగు హనుమంతుడు పిలచి నీకు ముక్తికితగిన యోగ్యతను కూడ ఇచ్చుచున్నాను. అని వెంటనే అంతర్ధానమందెను.

శ్లో॥ సా వధూః ప్రాత రుత్థాయ - ధనరాశిం విలోక్య తమ్
కౌతూహల సమావిష్టా - ప్రోవాచ స్వపతింసతీ॥

తా। కపిలుని భార్య ఉదయమునలేచి ఆ ధనరాశిని చూచి మిక్కిలి సంతసముతో కూడినదై తనభర్తతో విట్లనెను.

శ్లో॥ తపఃప్రభావం విప్రేంద్ర - తవ పూర్వ మజానతీ
సాధారణం ద్విజం మత్వా - త్వాం తు లోకవిలక్షణమ్॥

తా॥ ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుఁడా ! వెనుక నీ తపః ప్రభావము తెలియనిదాననై లోకవిలక్షణులగు తమ్ము సామాన్య బ్రాహ్మణునిగానే తలచి.

శ్లో॥ దారిద్ర్యకర్శితా నిత్యం - క్షుత్క్లాన్తై శ్చైవ బాలకైః
అవోచ మహ మేతావత్ - త ద్భవాన్ క్షంతు మర్హసి॥

తా॥ అనుదినము దారిద్ర్యముచే కృశించినదాననై ఆకలిచే నకనకలాడు బిడ్డలచే భరింపజాలక అట్లు పల్కితిని. దానికి నీవు తప్పక క్షమింపవలెను.

శ్లో॥ ఇత్యుక్తో బ్రాహ్మణశ్రేష్ఠో - భార్యా సుత సమన్వితః
భుక్త్వా భోగా న్వీతరాగః - కాలే ముక్తి మవాప సః॥

తా॥ అని భార్యచే క్షమాపణము చెప్పబడినవాఁడై ఆఉత్తమ బ్రాహ్మణుఁడు భార్యాపుత్రులతో కూడినవాఁడై యథేచ్ఛగా సాంసారిక భోగము లనుభవించి రాగత్యాగియై సకాలమున ముక్తినందెను.

శ్లో॥ ఇత్యేవం షోడశార్ణస్య - మహిమా స హనూమతః
కథిత స్తవ మైత్రేయ ! పునః కిం శ్రోతు మిచ్ఛసి॥

తా॥ అని ఇట్లు హనుమంతుని షోడశార్ణమహిమ నీకు చెప్ప బడినది. ఓమైత్రేయా! ఇంకను ఏమి వినగోరు చున్నావో చెప్ప వలసినది.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశరమైత్రేయ సంవాదే
షోడశాక్షరీప్రభావ కపిలచరిత్రకథనం నామ
ఏకవింశతితమః పటలః

ద్వావింశతితమ పటలః

## కశ్యప చరిత్ర కథనం

మైత్రేయః

శ్లో॥ మహాదేవాంశ సంభూతం - వాయునా ప్రేరితం బలాత్
అంజనాగర్భ సంభూతం - హనుమంత ముపాస్మహే॥

తా॥ మైత్రేయమహాముని ఇట్లనెను. పరమేశ్వరుని అంశచే పుట్టినట్టియు, వాయుదేవుని యనుగ్రహముచే అంజనాదేవి గర్భమునుండి ఉద్భవించిన హనుమంతుని సేవించుచున్నాను.

శ్లో॥ హనూమన్మంత్ర మాహాత్మ్యం - శ్రుతం విస్తరతో మయా
తద్భక్తానాం ప్రభావం చ - శ్రోతు మిచ్ఛా మ్యహం ప్రభో ॥

తా॥ ఓ పరాశరమహామునీ! విపులముగా హనుమన్మంత్ర మాహాత్మ్యమును వింటిని. ఇప్పుడు నేనా హనుమంతుని భక్తులప్రభావ మును విన నుత్సుకత నున్నాను.

శ్రీ పరాశరః

శ్లో॥ బ్రహ్మావర్త ఇతి గ్రామః - సర్వసంప త్సమృద్ధిమాన్
బ్రాహ్మణః కశ్యపో నామ - స్థిత స్తత్ర గృహా శ్రమీ॥

తా॥ శ్రీ పరాశరులవారు ఈ రీతిగ చెప్పఁదొడఁగిరి. సర్వవిధములసంపత్తులతో తులతూగు బ్రహ్మపర్తమను పేరుగల గ్రామము కలదు. అందు కశ్యపుఁడను పేరుగల గృహస్థుఁడుండెను.

శ్లో॥ సదాచారరత శ్శాంతో - వేదవేదాంగ పారగః
హనూమంతం భజ న్నిత్యం - అర్ఘ్య పాద్యాసనాదిభిః॥

తా॥ అతఁడు సదాచారమునం దిష్టముకలవాఁడు. శాంతిస్వభావుఁడు, వేదవేదాంగములు సాంతముగ చదివినవాఁడు. ప్రతిదినము హనుమంతుని సేవించుచు అర్ఘ్యము, పాద్యము, ఆసనము మున్నగువానిచేతను,

శ్లో॥ పుష్పైః పత్రై ర్ధూప దీపైః - బలిభి ర్వ్యంజనైః సహైః
నామసంకీర్తనై ర్ధ్యానైః - సదారాధన తత్పరః॥

తా॥ పుష్పములచేతను, ఆకులచేతను, ధూప దీపములచేతను, నామసంకీర్తనచేతను, ధ్యానముచేతను ఎల్లప్పుడు ఆ హనుమంతుని యారాధనమునందే మగ్నుడై యుండువాఁడు.

శ్లో॥ ఏవం నివసత స్తస్య - విప్రస్య ద్విజపుంగవ ।
హనూమా నేవ సర్వత్ర - సర్వేషాం హృది సంస్థితః॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! మైత్రేయా! ఇట్లు నివసించు వానికి ధర్మ మెచ్చటనుండునో అచ్చటనుండు హనుమంతుఁడు ధనవంతుల హృదయములయందుండి వారై,

శ్లో॥ ప్రేరయన్ సర్వవస్తూని - తద్గేహాయ స నిత్యశః
ధనేన బహునా తేన - స వృద్ధిమాప ద్విజోత్తమః॥

తా॥ వారిని ప్రేరేపించి ప్రతిదినము అన్ని వస్తువులు కశ్యపున కిప్పించుచుండెడివాడు. ఆ గొప్పధనముతో నాతఁడు సమృద్ధుఁ డయ్యెను.

శ్లో॥ తస్య హర్మ్యం ఘనం దీర్ఘం - విశ్వ న్నిశ్చలశోభితమ్
అవకాశం ప్రతీక్షన్తే - కరో త్యేవ గతాగతమ్।

తా॥ పాపాత్ముఁడగు ఒకదొంగ ఆతనిధనమును అపహరింప దలచినవాఁడై అవకాశముకొఱకై ఎదురుచూచుచు రాకపోకలు సాగించుచుండెను.

శ్లో॥ యదా యదాఽఽం తద్గృహ మేతి చోరః
తదా తదా భిన్న విచిత్రవేషః
విభీషయ త్యేవ నిగూఢరూపః
కపిప్రవీరః పరవీరహంతా॥

తా॥ ఎప్పుడెప్పుడైతే దొంగలోనికి ప్రవేశించునో అప్పుడప్పుడు పెక్కువిధముల వేషములు కలవాఁడై అన్యులకుతెలియని రూపమునొంది శత్రువీరులను నాశనమొనర్చు ఆ వానరవీరుఁడగు హనుమంతుఁడు భయపెట్టుచుండెను.

శ్లో॥ దండీ కదాచి న్ముసలీ కదాచిత్
ఖడ్గీ కదాచి త్కవచీ కదాచిత్
శిఖీ కదాచి ద్విశిఖీ కదాచిత్
విప్రః కదాచి త్పృభటః కదాచిత్॥

తా॥ ఒకప్పుడు దండమునుధరించియు, ఒకప్పుడు రోకలిని దాల్చియు, ఒకప్పుడు కత్తిబట్టియు, మఱియొకప్పుడు కవచమును బూనియు, బాణమునుధరించి యొకమాఱు పాఱనుధరించి యొక్కమాఱు, బ్రాహ్మణునిగా నొక్కమాటు, సేవకునిగా ఒక్కమాటు

శ్లో॥ ఏవం సదా రక్షణతత్పరః ప్రభుః
విలోచనం పశ్య యథా కపీంద్రః
స్వ భక్తవాత్సల్య మథ ప్రకాశయన్
గృహేతుకామో న హి దర్శనం గతః॥

తా॥ ఇట్లు ఎల్లప్పుడు రక్షణయందే నిమగ్నుఁడైన ఆ మహానుభావుఁడు హనుమంతుడు కంటినిరెప్పకాచి నట్లుండి తనభక్తునియందు వాత్సల్యమును చూపుచు అనుగ్రహించువాఁడై కానరాక యుండెను.

శ్లో॥ అవకాశం తతో లబ్ధ్వా - సంతోషేణ మలిమ్లుచః
చిరాయ చింతయామాస - ప్రాప్తమేవ మహాధనమ్॥

తా॥ పిమ్మట ఆ దొంగ అవకాశము పొంది సంతోషించినవాఁడై చాలాకాలమునకుగా ఆ మహాధనము తనకు లభించినదని యెంచెను.

శ్లో॥ అద్యాస్య విప్రస్య గృహం ప్రవిష్టః
ప్రాజ్యం ధనం ప్రాప్య నయామి గేహం
భార్యాం చ యువతిః తనయా న్కుమారికాన్
సంతోషయిష్యామి స హాత్మబంధుభిః॥

తా॥ నేడీ బ్రాహ్మణుని ఇంట ప్రవేశించి మహాధనము నంతను గ్రహించి ఇంటికిపోయెదను. యౌవనవతి యగు నా భార్యను, పుత్రులను, పుత్రికలను, ఆత్మబంధువులను సంతోషపెట్టెదను.

శ్లో॥ ఇతి బద్ధ్వా పరికరం - చతుష్పృహ బంధుభిః
ఆజగా మాస్య విప్రస్య - గేహం పాటచ్చరః ఖలః॥

తా॥ అని నడుముబిగించి నల్గురుబంధువులతో కూడినవాఁడై దుర్మార్గుడగు ఆ దొంగ కశ్యపుని ఇంటికి వచ్చెను.

శ్లో॥ నిశి సర్వేషు సుప్తేషు - ధనం హర్తు మథైకదా
కుడ్యం భిత్త్వా ఖనిత్రేణ - ప్రవేష్టు ముపచక్రమే॥

తా॥ రాత్రి సమయమున అందరు నిద్రించుచుండగా గడపారతో గోడకు కన్నముచేసి ప్రవేశింప బూనుకొనెను.

శ్లో॥ హనుమా నపి సర్వాత్మా - భక్తపాలన దీక్షితః
ప్రవిశంతం బిలద్వారా - చోరం జగ్రాహ పాణినా॥

తా॥ సర్వాత్ముఁడగు హనుమంతుఁడును భక్తుని రక్షించుటయందు దీక్షకలవాఁడగుటవలన కన్నముగుండా ప్రవేశించు దొంగను చేతితో పట్టుకొనెను.

శ్లో॥ కాశ్యపం వేష మాశ్రిత్య - చోరాంతిక ముపాగతః
దృష్ట్వా చోరానుగా శ్చైనం - దుద్రువు ర్భయవిహ్వలాః॥

తా॥ హనుమంతుడు కశ్యపుని వేషము ధరించి దొంగ ఎదుటకు వచ్చెను. వానిని చూచుటతోడనే తోడు దొంగలు భయముచే వణకుచు పరుగిడిరి.

శ్లో॥ బలా దాకృష్యమాణేఽపి - గృహీ త్వోరుయుగే ముహుః
న పర్గచ్ఛతి లోభేన - బ్రహ్మస్వేషు మలిమ్లుచః॥

తా॥ బలముగ లాగబడుచున్నను పెనుగులాడుచు బ్రాహ్మణుని సంపదలయందలి లోభముచే ఆ దొంగ బయల్వెడలకయుండెను.

శ్లో॥ న హినస్తి కపి శ్చైనం - సర్వభూత దయాపరః
నివర్తయితుకామ స్సన్ - అచకర్ష పునః పునః॥

తా॥ సర్వ ప్రాణులయందు దయకల హనుమంతు, డాతనిని హింసించక దుష్కార్యమునుండి మరలించు కోర్కెతో మాటిమాటికీ లాగజొచ్చెను.

శ్లో॥ చోర స్తు ధనలోభేన - బలదర్పేణ భూయసా
మా మాక్రష్టు మయం విప్రో - నాల మి త్యేవమన్యతే॥

తా॥ దొంగయు బ్రాహ్మణుని ధనమందలి అత్యాశతోను, మిక్కిలి బలగర్వముతోను నన్నీ బ్రాహ్మణుడు లాగలేడులెమ్మని తలచెను.

శ్లో॥ కపి స్త్వాకృష్య చోరం వై - తాడయామాస ముష్టిభిః
ఇదమే వైనస స్తస్య - ప్రాయశ్చిత్త మి తీరయన్

తా॥ హనుమంతుడును ఆదొంగను లాగివైచి వాని పాపమునకు ప్రాయశ్చిత్తమిదియే యనుచు పిడికిళులతో కొట్టమొదలిడెను.

శ్లో॥ అహతోఽపి న చ క్రంద - భిదురై రివ ముష్టిభిః
తథా హనూమా న్సర్వజ్ఞః - కశ్యపస్య స్వరూపధృత్॥

తా॥ వజ్రాయుధమువంటి పిడికిళులతో మోదినను ఆ దొంగ ఆక్రందనము చేయలేదు. అట్లు సర్వజ్ఞుడగు కశ్యపరూపధారియగు హనుమంతుడు

శ్లో॥ కః కోఽత్ర ఇతి శబ్దేన - ఉచ్చైశ్చోర మథాగిరత్
న జానంతి యథా గేహే - సర్వేఽపి గృహవర్తినః॥

తా॥ ఎవఁడెవఁడనుచు ఇంటియందుండు నెవ్వారికి తెలియకుండు నట్లే పెద్దగా ఆదొంగను విసరెను.

శ్లో॥ తథా గృహీత్వా తం చోరం - బహి రానీయ వేగతః
ముష్టి జాను పదాఘాతైః - అకుట్టయ దరిందమః॥

తా॥ అట్లు ఆదొంగను గ్రహించి వేగముగా బయటకు గొనివచ్చి పిడికిళ్ళతోను, మోకాలు దెబ్బలతోను, పాదముల తాడనములతోను మోదెను.

శ్లో॥ అశక్తః క్రంధితుం భూయో - ధైర్యేణ త్రపయా పునః
అసోఢవేదన శ్చోరః - ఉచ్చైశ్చక్రంద దీనవత్॥

తా॥ ఆక్రోశించుటకు మిక్కిలి అసమర్థుడై, ధైర్యము వలనను, సిగ్గుచేతను ఆక్రోశించలేక చివరకు బాధకు తాళజాలక దీనుఁడై బిగ్గరగా ఏడ్చెను.

శ్లో॥ తస్యాక్రందన శబ్దేన - సంబుద్ధాః ప్రాతివేశికాః
విలోక్యామనయంత స్తే - తథా తం గృహమేధినమ్॥

తా॥ అతనిరోదనచే సేవకులందరు మేల్కొనిరి. వారు ఆస్థితిని చూచి దొంగకు, అట్లే బ్రాహ్మణునకు సరిచెప్పువారై

శ్లో॥ రాజభృత్యా వధం కుర్యు ర్జ్ఞాయే యు ర్యది యామికాః
ఇతి చోరం వినిర్భర్త్స్య - పున రేవం న కుర్వితి॥

తా॥ తలారివారికి తెలిసినచో రాజభటులచే చంపింతురు. ఇక నెన్నడు ఇట్టిపని చేయకుము. అని దొంగను అదలించి

శ్లో॥ కృపయా మోక్షయిత్వా తం - సర్వే జగ్ము ర్యథాగతమ్॥

తా॥ దయతో వానిని విడిపించి అందఱు తమతమ ఇండ్లకు వెడలిరి.

శ్లో॥ తతః ప్రాత స్సముత్థాయ - కశ్యపో బ్రాహ్మణోత్తమః
భిత్తిరంధ్రం సమాలోక్య - విస్మయం పరమం గతః॥

తా॥ అటు పిమ్మట ఉదయముననే బ్రాహ్మణోత్తముఁడగు కశ్యపుఁడు నిదురలేచి గోడకు కన్నమును చూచి మిక్కిలి ఆశ్చర్యము నందెను.

శ్లో॥ బహి రాగత్య త ద్వీ థ్యాం - చోరా శ్చోరా ఇతి బ్రువన్
క్రందయామాస త చ్ఛ్రుత్వా - త మూచుః ప్రాతివేశికాః॥

తా॥ అతఁడు అ వీధియందు బయటకువచ్చి దొంగలు దొంగలనుచు విలపించెను. అది విని సేవకులాతనితో నిట్లనిరి.

శ్లో॥ అకాండే క్రియతే బ్రహ్మన్ - కి మిదం క్రందనం వృథా
అస్మాభి ర్మోచిత శ్చోరో - నిష్పిష్టో భవతా నిశి॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! ఆ సమయమునందు వ్యర్థముగ నిట్లు విలపించుచుంటివేమి? రాత్రి నీచే మోదబడిన దొంగ మాచే విడిపింపబడినాఁడు.

శ్లో॥ యామికా యది శృణ్వంతి - హ్యనర్థ స్తు మహా న్భవేత్
ఇత్యుక్తః కశ్యపో విప్రః - తూష్ణీం చింతాపరోఽభవత్।

తా॥ తలారివారు వినినయెడల మిక్కిలియాపద వాటిల్లగలదు. అని చెప్పబడినవాఁడై బ్రాహ్మణుఁడగు కశ్యపుడు మిన్నక విచారించువాఁడయ్యెను.

శ్లో॥ హనుమత్కృత్య మేతద్ది - నాన్యథా భవ తీదృశమ్
చోరఏవ మహాధన్యో - హనుమ న్మూర్తి దర్శనాత్॥

తా॥ ఇది తప్పక హనుమంతుఁడు చేసినపనియే వేఱువిధముస నిట్లుకాదు. హనుమంతుని చూచుట వలన నిజముగా దొంగయే మిక్కిలి ధన్యుడు.

శ్లో॥ పాణి పాదతల స్పర్శం - ప్రాప్తో నాస్తి తు త న్మమః

తా॥ అతఁడు స్వామి హస్త పాద తలముల స్పర్శను పొంద గల్గినాఁడు. అట్టిది నాకు ప్రాప్తించలేదు.

శ్లో॥ సదా తదారాధన తత్పరోఽపి
న ప్రాప్తవ వాహ మముష్యదర్శనం
చిరం మహాపాప పరాయణస్య
చోరస్య దేవః కథ మావిరాసీత్ ?

తా॥ ఎల్లప్పుడు అతనినే ఆరాధించుచున్నను నేనాతని దర్శన మును పొందలేకపోతిని. చాలా కాలముగా పాపపూర్ణుఁడై యున్న దొంగకు దేవుఁడగు హనుమంతు డెట్లు సాక్షాత్కరించెను ?

శ్లో॥ మలిమ్లుచో యో మనుజాధమః కథం
మునీంద్రబృందై రపి మాననీయః ?
య మాంజనేయో నిజపాదపంకజైః
సంమర్ధయామాస కరాంబుజై రపిః॥

తా॥ ఎవనినైతే ఆంజనేయుఁడు తన పాదపద్మములతోను కర కమలములతోను మర్దించెనో అని మనుజాధముడగు దొంగ ముని శ్రేష్టుల సమూహముకంటెను పూజ్యుఁడెట్లగును.

శ్లో॥ అహం తు నిర్భాగ్యతరో వృథోద్యమః
ఖల శ్చ నీచోఽతినృశంసచేష్టితః
కథం త మద్రాక్ష మహం కపీశ్వరం
తపోబలే నాతి నికృష్ట కర్మణా॥

తా॥ నేను నిర్భాగ్యుఁడను. వ్యర్థప్రయత్నములు కలవాఁడను. నీచుఁడను. మిక్కిలి అధమమగు చేష్ట కలవాడను. నేను మిక్కిలి నీచకర్మయగు తపోబలముచే హనుమంతునెట్లు చూడగలను ?

శ్లో॥ చోరోఽపి తే నైవ సమీక్షితో మహాన్
సాక్షాత్కృతో నైవ మ యాఘమూర్తినా
శ్రుతో మయా చోర కపీశ్వ రోద్యమో
మదీయ దౌర్భాగ్యవిభూతి రీదృశీ।

తా॥ దొంగకూడ ఆ హనుమంతునిచే చూడబడుటచే గొప్పవాడే. పాపరూపుడనగు నాకా సాక్షాత్కార యోగములేదు. నాచే దొంగ, హనుమంతులవిషయము కేవలము వినబడినది, నా దౌర్భాగ్యసంపత్తి ఇట్టిదేకదా !

శ్లో॥ అథవా మ య్యనుక్రోశో - విద్యతే మారుతే ర్ధ్రువమ్
కథం రక్షితు మారబ్ధః - చోరం మత్పీడనోద్యమమ్॥

తా॥ కాక నాయందు కనికరమే నిజముగా హనుమంతునకున్న యెడల నన్ను బాధింపవచ్చిన దొంగను ఎట్లు అనుగ్రహించును ?

శ్లో॥ యోగీశ్వరాణా మపి యత్నదుర్లభం
య ద్దర్శనం కించ సురాసురాణాం
పాపీయసా దృష్టి పథం గతో యః
తం వానరేంద్రం శరణం భజామి॥

తా॥ ప్రయత్నించినను యోగీశ్వరులకు ఏదర్శనము లభింపదో, ఏ దర్శనము దేవదానవులకునైతము లభింపదో పాపిదృష్టి పథమునను ఎవడుపడెనో అట్టి కపిశ్రేష్ఠుని శరణువేడుచున్నాను.

శ్లో॥ లక్షయోజన విస్తీర్ణం - ద్విల క్షోన్నత భాస్కరం
నమోఽస్తు వాయుపుత్రాయ - గ్రసతే బాలలీలయా॥

తా॥ లక్షయోజనముల విస్తీర్ణముకల్గి రెండులక్షల ఉన్నతకిరణములుకలవానిని బాలక్రీడగా మ్రింగు వాయుపుత్రునకు నమస్కారము.

శ్లో॥ ఉదయాస్తాచల ద్వంద్వే - పాదమూలం ప్రసార్య చ
అధ్యేతుం భాస్కరా ద్వేదాన్ - అఖిలా న్సృష్ఠాశే నమః

తా॥ ఉదయపర్వత అస్తాద్రులు రెండిట పాదమూలములనుంచి సూర్యునివలన సమస్తవేదములను నేర్చుకొను హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ సర్వ వేదాంత వేద్యాయ - పూర్ణాయ పరమాత్మనే
సచ్చిదానంద రూపాయ - భవిష్య ద్బ్రహ్మణే నమః

తా॥సమస్తవేదవేదాంగములు తెలిసినట్టియు, పూర్ణస్వరూపుడును, పూర్ణస్వరూపుడును, సత్యస్వరూపుడు. జ్ఞానస్వరూపుడు, ఆనందస్వరూపుడునై భవిష్యత్కాలమున బ్రహ్మకానున్న హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ ఇత్య సౌ కశ్యపో విప్రః - స్మర న్హనుమతః కృపాం
బుభుజే సకలా న్భోగాన్ - పుత్రమిత్రకళత్రవాన్॥

తా॥ అని ఆ బ్రాహ్మణుడగు కశ్యపుడు హనుమంతుని దయను వేడువాడై పుత్రులతోను, స్నేహితులతోను, భార్యతోను గూడి సమస్తమూలైన భోగములను అనుభవించెను.

శ్లో॥ భుక్త్వా తు సకలా న్భోగాన్ - ఇంద్రాద్యై రపి దుర్లభాన్
అంతే జగామ కైవల్యం - హనుమత్కృపయా ద్విజః॥

తా॥ ఇంద్రాదులకును లభింపని సమస్త సుఖములను అనుభవించిన వాడై ఆ బ్రాహ్మణుడు హనుమంతుని దయచే చివరకు మోక్ష పదమును పొందెను.

శ్లో॥ మైత్రేయ ! వాయుతనయస్య హరేః ప్రభావం
భక్త్యా శృణోతి కథయ త్యమలం జనేభ్యః
య స్సర్వకామనివహం పరిభుజ్య లోకే
సంసారతాపవిరతిం స పుమా న్లభేత్॥

తా॥ ఓ మైత్రేయమహాముని; వాయునందనుఁడగు హనుమంతుని పాపనాశకరమగు ప్రభావమును భక్తితో నెవఁడువినునో, ఎవడు చెప్పునో అట్టివాడు లోకమందలి ఐహికసుఖములన్నిటిని పొంది చివరకు సంసారతాపమును వీడి ముక్తినందును.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పరాశరామైత్రేయ సంవాదే
కశ్యప చరిత్ర కథనం నామ ద్వావింశతితమ పటలః

త్రయోవింశంతితమ పటలః

## హరిశర్మ చరిత్ర కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ పున ర్వక్ష్యామి మైత్రేయ - హనుమద్భక్త సత్కథామ్
శృణు ష్వావహితో బ్రహ్మన్ - మనో మే సుప్రసీదతి॥

తా॥ శ్రీపరాశరమహాముని ఇట్లు చెప్పమొదలిడిరి. ఓ మైత్రేయా! హనుమద్భక్తుని సత్కథను మరల వేఱొకటి చెప్పుచున్నాను. సావధానుఁడవై వినవలసినది. నా మనస్సు అట్లు చెప్పుట కిచ్ఛగించుచున్నది.

శ్లో॥ పుణ్యే గోదావరీతీరే - మహాముని నిషేవితే
బ్రాహ్మణో హరిశర్మేతి - న్యవస త్కుశతర్పణే॥

తా॥ మహామునులచే చక్కగా సేవింపబడు పుణ్యప్రదమగు గోదావరినదియొడ్డున కుశతర్పణమను గ్రామమున హరిశర్మ యను పేరుగల బ్రాహ్మణుఁడు నివసించుచుండెను.

శ్లో॥ వేదవేదాంగ పారజ్ఞో - దృఢ భక్తో హనూమతి
తస్య మంత్రార్చన ధ్యాన - నామకీర్తన తత్పరః॥

తా॥ అతడు వేదవేదాంగములు పూర్తిగా చదివినవాఁడు, హనుమంతునియందు నిశ్చలమగు భక్తికలవాఁడు. ఆ హనుమంతుని మంత్రానుష్టానము, అర్చనము, ధ్యానము, నామసంకీర్తనము మున్నగు వానియందే నియమితుఁడై యుండువాఁడు.

శ్లో॥ సత్యవాదీ తపోనిష్ఠో - విశుద్ధాత్మా జితేంద్రియః
గురౌ చ హనుమ ద్భక్తే - ష్వన్యవిద్వత్సు సత్సు చ॥

తా॥ సత్యమునే పల్కువాడు, తపోనిష్ఠ కలవాడు, విశుద్ధమగు ఆత్మకలవాడు ఇంద్రియ నిగ్రహము కలవాఁడు, గురువునందును, హనుమద్భక్తుల యందును, ఇతరపండితులందును, సత్పురుషులయందును

శ్లో॥ వినీత స్సత్యసంపన్నః - సర్వభూతహితే రతః
కరోతి హనుమ త్ప్రీత్యై - శ్రౌత స్మార్తాదికాః క్రియాః

తా॥ వినయము కలవాఁడు, సత్యసంపత్తి సంయుతుఁడు, సమస్త ప్రాణికోటి సుఖమును కోరువాఁడును. అతఁడు హనుమంతుని ప్రీతి కొఱకై వేద విహిత కర్మలను, ధర్మశాస్త్రములు చెప్పిన కర్మలను ఆచరించుచుండెను.

శ్లో॥ ఏకదా చింతయామాస - స తు తీర్థపరాయణః।

తా॥ ఒకప్పుడు తీర్థయాత్రల యందిష్టుఁడగు నాతడిట్లు ఆలోచింపదొడగెను.

శ్లో॥ అహం సంసారజలధౌ - నిర్మగ్నో దురితాలయే
బద్ధ్వా భార్యాం సుతా న్కంఠే - తరితుం నైవ శక్తిమాన్॥

తా॥ నేను పాపనిలయమగు సంసార సముద్రమున మునిగి యున్నాను. దానికితోడు కంఠమునందు భార్యను, బిడ్డలను కట్టుకొని ఆ సాగరమున దాటలేకున్నాను.

శ్లో॥ కి మియం మమ దుర్బుద్ధిః - హనుమన్నామ్ని సంస్థితే
పారం గంతు మశక్తస్సన్ - కార్పణ్యం పరమం గతః।

తా॥ నాకీ దుర్బుద్ధి ఏమి? దివ్యమగు హనుమన్నామము ఉండగా ఒడ్డునకుచేర నశక్తుఁడనగుచు దయనీయ స్థితిని పొందితినేమి?

శ్లో॥ తస్య ప్రసాద తస్సర్వ - పుణ్యక్షేత్రాణి పర్యటన్
సర్వపాప వినిర్ముక్తో - గచ్ఛామి పరమం గతిమ్॥

తా॥ అతని యనుగ్రహముచే పుణ్యక్షేత్రము లన్నింటిని పర్యటించుచు సమస్తములగు పాపములను పోగొట్టుకొని ఉత్తమగతికి చేయుదును.

శ్లో॥ ఏవం నిశ్చిత్య విప్రేంద్రో - నిర్గత్య స్వగృహా త్తదా
శ్రీశైలమార్గతో గచ్ఛన్ - ఆససాద మహానదీమ్॥

తా॥ ఇట్లు హరిశర్మ నిశ్చయించుకొని అప్పుడే తన గృహము నుండి బయల్వెడలి శ్రీశైలమార్గముగుండా వెడలుచు గొప్పనదిని చేరెను.

శ్లో॥ కృష్ణవేణీం మహాభాగాం - కృష్ణదేహ సముద్భవామ్
తత్ర స్నాత్వా చ పీత్వా చ - తర్పయిత్వా పితౄ నథ॥

తా॥ కృష్ణుని దేహమునుండి పుట్టినదియు, స్వచ్ఛయునగు కృష్ణానదీమతల్లినిచేరి అచ్చట స్నానాపానాదికమును, పితృతర్పణాదిక ములను నిర్వహించి పిమ్మట

శ్లో॥ నివాసం పార్వతీజానేః - సంప్రాప్తః శ్రీగిరిం ద్విజః
తత్ర గత్వా మహాదేవం - దేవదేవం వృషధ్వజమ్॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడు పార్వతీపతియగు పరమేశ్వరుని నివాస మగు శ్రీశైలమును చేరెను. అటకేగి దేవదేవుఁడు, మహాదేవుడు వృష భము ధ్వజ చిహ్నముగా గలవాఁడు నగు శివుని

శ్లో॥ ప్రణమ్యారాధనం చక్రే - భవానీసహితం శివమ్॥
తతో గచ్ఛన్స విప్రేంద్రో - గరుడాద్రి దిదృక్షయా॥

తా॥ నమస్కరించి పార్వతీసహితుడగు శివుని అర్చించెను. అటు పిమ్మట గరుడాద్రిని చూచుకోర్కెతో నా బ్రాహ్మణుడు వెడలుచు

శ్లో॥ ఆససాద మహాపుణ్యం - శ్రీమా న్ఛ్రీసు దహోబిలమ్
తత్ర లక్ష్మీ సమాయుక్తం - నృసింహం కరుణాలయమ్॥

తా॥ శుభసంయుతుఁడగు నాతఁడు మహాపుణ్యప్రదమగు అహోబిలక్షేత్రమును చేరెను. అచ్చట లక్ష్మీదేవితో కూడియున్నట్టి, కరుణామయుఁడైనట్టి, నరసింహమూర్తిని

శ్లో॥ త్రైలోక్యనాథం దేవేశం - ప్రహ్లాద ప్రణవం హరిమ్
శ్రీ భూమి సహితం దేవం - శ్రీనికేతం నరం హరిమ్॥

తా॥ ముల్లోకములకు ప్రభువైనవానిని, దేవతలందఱకు నాయకుఁడైనవానిని ప్రహ్లాదుని నమస్కారముల నందినవానిని, విష్ణువును, శ్రీదేవి, భూదేవులతో కలసియున్నవానిని, ప్రభువైనవానిని, లక్ష్మీనిలయుఁ నరుడు సింహములైనవానిని

శ్లో॥ హిరణ్యకశిపుఘ్నం తం - భక్తాభీష్ట వరప్రదమ్
భక్తిపూర్వం నమస్కృత్య - స్తోత్రైస్తుష్టావ చక్రిణమ్॥

తా॥ హిరణ్యకశిపుని చంపినవానిని, భక్తుల ఇష్టవరముల నొసగువానిని. చక్రముధరించినవానిని భక్తిసహితుడై నమస్కరించి స్తోత్రములచేత స్తుతించెను.

శ్లో॥ సరః స్థానాని పుణ్యాని - సమారాధ్య మహామతిః
తర్పయిత్వా పితౄం స్తత్ర - వేంకటాఖ్య గిరిం గతః॥

తా॥ బుద్ధిశాలియగు నతఁడు పుణ్యప్రదములను తీర్థప్రదేశముల నారాధించి అట పితృదేవతలకు తర్పణములిచ్చి వేంకటాచలమునకు వెడలెను.

శ్లో॥ మార్గే చండాంశు కిరణైః - తప్తదేహః క్షుధాతురః
తృష్ణా పరీతస్త స్మార్గే - మూర్ఛితో న్యపత ద్భువి॥

తా॥ మార్గమధ్యమున తీక్ష్ణమగు సూర్యకిరణములచే దేహము తపింపబడినవాఁడై ఆకలిబాధ నందినవాఁడై దాహము వ్యాపింపగా ఆ మార్గముననే మూర్ఛిల్లి భూమిపై పడెను.

శ్లో॥ హనుమా న్భక్త వాత్సల్యాత్ - దృష్ట్వా విప్రం కృతశ్రమమ్
ఆగత్య శూద్రరూపేణ తమువాచ దయాకులః॥

తా॥ భక్తులయందు వాత్సల్యము కలవాఁడగుట వలన శ్రమ నందియున్న బ్రాహ్మణుని చూచి శూద్ర రూపమునవచ్చి దయతో కూడినవాఁడై ఇట్లుపల్కెను.

శ్లో॥ ఉత్తిష్ఠ విప్ర కిం శేషే — భూమా వాతప తాపితః
కిమర్థ మాగతః కిం వా - త వాగమన కారణమ్॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా ! లెమ్ము. ఎండచే తపింప బడిన వాఁడవై ఈ శేషగిరి భూములయందు పడితివేమి ? ఏ ప్రయోజన మాసించి ఇటకు వచ్చితివి ? నీ రాకకు కారణమేమి ?

శ్లో॥ ఇత్యుక్తః ప్రాహ తం శూద్రం - వేంకటేశ దిదృక్షయా
సమాగతః క్షుధార్తోఽహం - మూర్ఛితో విజనే పథి॥

తా॥ అని అడుగుబడి ఆ హరిశర్మ శూద్రునితో నిట్లనెను. నేను వేంకటేశ్వరస్వామిని చూచు కోర్కెతో నిట్లు వచ్చితిని. ఆకలిచే బాధింపబడినవాడనై నిర్జనమగు నీ మార్గమున మూర్ఛబోతిని.

శ్లో॥ ఉవాచా సౌ మ మాభ్యాసే - పేటికాయాం మహాగుణమ్
వర్తతేఽన్నం ప్రదాస్యామి — భుక్త్వా తృప్తి మవాప్స్యసి।

తా॥ అనగా శూద్రు డిట్లనెను. నావద్దనున్న పెట్టెయందు అన్నముకలదు. దానిని పెట్టెదను. తిని తృప్తిని పొందుము.

శ్లో॥ ఉవాచ త్వం శూద్రవర్ణః - కథమశ్నా మ్యహం ద్విజః
సుపక్వాని ఫలాని త్వం - దేహి కారుణ్య మస్తిచేత్॥

తా॥ అనగా హరిశర్మ నీవు శూద్రుఁడవు. బ్రాహ్మణుఁడనగు నేనెట్లు భుజింతును ? నాయందు దయయున్నచో నీవు పక్వములైన ఫలములను నాకిమ్ము.

శ్లో॥ ఇత్యుక్త స్స దదౌ పక్వ - ఫలాని వివిధాని చ
రంభా మ్రబదరీ జంబూ - కపిత్థ పనసాని చ॥

తా॥ అని చెప్పబడినవాఁడై ఆతఁడు బాగుగా పండినట్టియు, వివిదములైనవియునగు అరటి, మామిడి, రేగు, నేరేడు, వెలగ, పనస పండ్లను

శ్లో॥ ఆనీ యామృతకల్పాని - సుగంధీని ద్విజాతయే
భక్షయిత్వా ద్విజ స్తృప్తి - మవాప్య విగత శ్రమః॥

తా॥ అమృతముతో సమానమైనవానిని మంచివాసనలు కలవానిని దెచ్చి ఆ బ్రాహ్మణున కిచ్చెను. అతఁడు వానినితిని తృప్తినంది శ్రమనంతను పోఁగొట్టుకొనినవాఁడై

శ్లో॥ తేన సంభాషితుం బుద్ధ్యా - సమంతా దవలోకయన్
న దదర్శ ద్విజ శ్శూద్రం - విస్మయం పరమం గతః॥

తా॥ ఆతనితో మాటాడు కోర్కెగలవాఁడై పరిసరము లన్నియు చూచుచు శూద్రుని కానరాకపోవుటకు మిక్కిలి ఆశ్చర్యమునందెను.

శ్లో॥ కి మాశ్చర్య మిదం శూద్రో - మహ్యం దత్వా ఫలాని చ
క్షణేనాఽంతర్దధే కోఽయం - హనూమా న్వా భవిష్యతి।

తా॥ ఏమి ఆశ్చర్యము ? శూద్రుఁడు నాకు ఫలముల నిచ్చి క్షణములో మాయమయ్యెను. ఈతఁడెవఁడు ? హనుమంతుఁడే యగునా ?

శ్లో। బాల్యా త్ప్రభృ త్యర్చయతో - జపతః స్తువత స్సదా
స్వరూపం ద్రష్టు కామస్య - హనూమా న్వానరో త్తమః॥

తా॥ బాల్యము మొదలుకొని ఎల్లప్పుడు సేవించునట్టియు, జపించునట్టియు, స్తోత్రము చేయునట్టియు, స్వరూపమును చూడగోరునట్టి నాకు వానరోత్తముఁడగు హనుమంతుడు

శ్లో॥ కదాచి దపి మే ప్రీతో - న హి ప్రత్యక్షతాం గతః
పాపీయసో మే దౌర్భాగ్యం - మహ దస్తి న సంశయః॥

తా॥ ఎన్నడును ప్రీతుఁడై ప్రత్యక్షముకాలేదు. నిస్సంశయముగ పాపపూర్ణుఁడనగు నాకు మిక్కిలి దురదృష్టముకలదు.

శ్లో॥ మహాపదం వా గచ్ఛామి - ప్రవేక్ష్యామి హుతాశనమ్
వదంతి వేదతత్త్వజ్ఞాః దైవ మస్తీతి సర్వదా॥

తా॥ నేను మహాపదపాలఁబడుదును. లేదా అగ్నియందు ప్రవేశింతును- దేవుఁడున్నాఁడనియే వేదతత్త్వము నెఱిగినవారెల్లప్పుడు చెప్పుచున్నారు.

శ్లో॥ సంశయో మే మహా నత్ర - మిధ్యేవ ప్రతిభాతి మే
ఇతి చింతాపరే విప్రే - హనూమా న్కృపయాఽన్వితః॥

తా॥ ఈ విషయమున నాకుమాత్రము ఎంతయో సందేహము కలదు. అంతయు అబద్ధముగా తోచుచున్నది. అని బ్రాహ్మణుండు విచారించుచుండగా హనుమంతుఁడు దయతోకూడినవాడై

శ్లో॥ స్వరూపం దర్శయామాస - దేవానా మపి దుర్లభమ్॥

తా॥ దేవతలకు సైతము దుర్లభమైన తన స్వరూపమును చూపెను-

శ్లో॥ కంఠే హారం శ్రవణపుటయోః కుండలే స్కంధదేశే
బ్రాహ్మం సూత్రం కరకమలయోః కంకణా న్యంచితాని
మధ్యే పీతం కనకవసనం చోర్ధ్వపుండ్రం లలాటే
వామే దేవీం మిహిరతనయాం బిభ్రతం వానరేంద్రమ్॥

తా॥ కంఠమునందు హారమును, చెవులకు కుండలములను, భుజప్రదేశమున యజ్ఞోపవీతమును, చేతులకు అందమైన కంకణములను, కటిభాగమున పసుపు పచ్చగనున్న బంగారు వస్త్రమును, లలాటప్రదేశ

మున నూర్ధ్వపుండ్రమును, ఎడమపార్శ్వమున సూర్యుని కుమార్తెయగు సువర్చలను ధరించియున్న కపీంద్రుని

శ్లో॥ విలోక్య విస్మితో భూత్వా - ప్రణమ్య శిరసా హరిమ్
స్తోత్రైశ్చ వివిధై ర్నత్వా - ప్రదక్షిణపురస్సరమ్॥

తా॥ చూచి ఆశ్చర్యచకితుఁడై ఆవానరేశ్వరునకు శిరసా నమస్కరించి వివిధములగు స్తోత్రములచే భజించి ప్రదక్షిణపూర్వకముగ నమ్రుఁడై

శ్లో॥ ననామ శిరసా భూయో - హరిశ ర్మాంజనాసుతమ్
బాల్యా త్ప్రభృతి తే రూపం - ద్రష్టుకామోఽహమీశ్వరమ్॥

తా॥ హరిశర్మ ఆంజనేయునకు పలుమార్లు నమస్కరించి ఇట్లనెను. బాల్యమునుండియు నేను నీ దివ్యరూపమును చూచు కోర్కెతో నున్నాను.

శ్లో॥ భవాన్కదాచి దపి మే - న చక్షు ర్విషయం గతః
ఇతి దుఃఖాకుల స్యాసీః - భవా న్లోచన గోచరః॥

తా॥ ఎన్నడును నీవు నాకన్నులకు కానరాలేదు అని దుఃఖించు నాకు నీవు కన్నులకు కానవచ్చితివి.

శ్లో॥ ధన్యోఽహం కృతకృత్యోఽహం - నాస్తి మ త్సదృశో భువి
ఇ త్యుక్తః ప్రాహ హనుమాన్-నాఽహం వర్తే త్వయా వినా॥

తా॥ ధన్యుఁడనైతిని. కృతకృత్యుఁడనైతిని. భూమిపై నావంటి యదృష్టవంతుఁడు లేఁడు అని అనగా హనుమంతుఁ డిట్లనెను. ఓయీ! నీకంటె భిన్నముగా నేనుండుటలేదు.

శ్లో॥ నిగూఢరూప స్సతతం - త్వయి భక్తిపరాయణః
మమ భక్త ఇతి బ్రహ్మన్ - ఇదానీం క్షుద్రరూపిణా।

తా॥ ఓ భక్తిపూర్ణుఁడా! రూపమున కానరానివాఁడనై ఎల్లప్పుడు నీ విషయమునందే యుంటిని. యిప్పుడు కూడ ఓ బ్రాహ్మణుఁడా! నాభక్తుఁడవని ప్రాదుర్భావము నంది

శ్లో॥ ఫలై రమృతపిండాభైః - భవా న్సంతర్పితో మయా
వరం వరయ భద్రం తే - ప్రసన్నోఽహం త వానఘ!

తా॥ అమృతముతో సమానములగు పండ్లను నీకు తృప్తిగా నిచ్చితిని. ఓ పుణ్యాత్ముఁడా! నీయందు నేను ప్రసన్నుఁడనైతిని. నీకు కావలసిన మేలగు వరమును కోరుకొమ్ము.

శ్లో॥ ఇత్యుక్తః ప్రాహ విప్రేంద్రః - తవ పాదాబ్జ భక్తితః
త్వ ద్భక్తజనవాత్సల్యాత్-నాన్య మిచ్ఛా మ్యహం వరమ్।

తా॥ అనగా హరిశర్మ ఇట్లనెను. ఓ మహానుభావా! నీ భక్తజనులయందుండు కరుణవలన నీ యొక్క పాద పద్మములయందలి భక్తి కన్న వేరు వరమును కోరను.

శ్లో॥ ఇతి శ్రుత్వాఽవద ద్విప్రం - హనూమా న్భక్తవత్సలః
భుక్తిం ముక్తిం ప్రదాస్యామి - త్యుక్త్వై వాంతరధీయత॥

తా॥ అని యన విని భక్తులందు దయకల హనుమంతుఁడు బ్రాహ్మణునితో 'నీకు ఇహమున సుఖ భోగములను, పరమున ముక్తిని ఇచ్చుచున్నాను' అని అంతర్ధానమందెను.

శ్లో॥ హరిశర్మాఽపి సంతుష్టః - ప్రభావం శ్రీహనూమతః
స్మర న్వేంకటశైలస్థం - వేంకటేశ ముదీక్షితుమ్॥

తా॥ హరిశర్మయు సంతోషించినవాఁడై శ్రీహనుమంతుని ప్రభావమును స్మరించుచు వేంకటాచలమున నున్న శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకు

శ్లో॥ గత్వా కుమారసరసీం - సంప్రాప్తః పాపనాశనమ్
తత్ర స్నాత్వా చ పీత్వా చ - సంతర్ప్య చ పితౄ నథ॥

తా॥ వెడలి పాపనాశనమును కుమారసరస్సును చేరి యట స్నాన పానములాచరించి పితృదేవతలకు తర్పణము లాచరించి పిమ్మట

శ్లో॥ శ్రీ వైకుంఠం పరిత్యజ్య - లక్ష్మ్యాసహ ముదాయుతమ్
ఆనందనిల యాంతస్థం - నారాయణ ముదైక్షత॥

తా॥ వైకుంఠపురమును వీడి లక్ష్మీదేవితోకూడి సంతోషముగ ఆనందనిలయమునయున్న శ్రీమన్నారాయణుని తిలకించెను.

శ్లో॥ ప్రణమ్య శిరసా భూయః ప్రదక్షిణపురస్సరమ్
నానావిధైః స్తోత్రజాలైః - స్తుత్వా మదమవాప సః॥

తా॥ అటు ప్రదక్షిణపూర్వకముగ లక్ష్మీ శిరసా నమస్కరించి పెక్కువిధముల స్తోత్రములతో ప్రార్థన మొనర్చి సంతసమందెను.

శ్లో॥ ప్రసాదాన్నం సమాసాద్య - మధురం పావనం హరేః
సర్వపాప వినిర్ముక్తో - బభూవ విగతజ్వరః॥

తా॥ మధురమైన, పవిత్రమైన విష్ణుమూర్తి ప్రసాదాన్నమును పొంది పాప తాపములన్నియు పోగొట్టు కొనగల్గెను,

శ్లో॥ సమస్త తరు సంచితం - సకల పుష్ప సువాసితమ్
సహస్ర గిరి నిర్ఝరం - సకల సింహ శా బాకరమ్
విశాల సరసీయుతం - వివిధ విద్వ దారాధితమ్
సరోజ వనవాసినీ - సఖవిలాస సంచారితమ్॥

తా॥ అన్నిరకముల చెట్లతోను ప్రకాశించునట్టి అన్ని రకముల పూవులతోను విలసిల్లునట్టి, వేలకొలది సెలయేళ్ళు కల్గినట్టి, అనేకముగా సింహపుపిల్లలు కల్గినట్టి విశాలమగు సరస్సుతో కూడియున్నట్టి, అనేక పండితులచే కొనియాడబడినట్టి, పద్మవనవాసినులు పూలు కోయుచుండ వారిగోళ్ళయొక్క విలాసమయి సంచారముకలిగినట్టి

శ్లో॥ శేషాచలం సమాలోక్య - వైకుంఠేచ్ఛాం పరిత్యజన్
ఉవాస కతిచి న్మాసాన్ - ముకుం దారాధ నేచ్ఛయా॥

తా॥ శేషాచలమునుచూచి వైకుంఠమందలి కోర్కె కూడ త్యజించినవాఁడై విష్ణువు నారాధించు కోర్కెతో కొన్ని మాసము లుండెను.

శ్లో॥ తతో వరదరాజం తు - స్థితం కాంచ్యాం విలోక్య చ
శ్రీరంగ దివ్యభవనం - ద్రష్టుకామో యయౌ ద్విజః।

తా॥ పిమ్మట కంచియందుండు వరదరాజస్వామిని చూచి ఆ బ్రాహ్మణుఁడు శ్రీరంగమును చూచుకోర్కెతో వెడలెను.

శ్లో॥ తత్ర చోభయ కావేరీ - మధ్యే శ్రీరంగమందిరే
స్వయం వ్యక్తం జగన్నాధం - భుజంగశయ మీశ్వరమ్॥

తా: అట ఉభయకావేరుల మధ్యభాగముననున్న శ్రీరంగపుమందిర మున స్వయముగా వెలసినటువంటి జగన్నాధుని పరాత్పరుఁడగువానిని, ఆదిశేషుఁడు శయనముగా కలవానిని,

శ్లో॥ లక్ష్మీ భూమి సమాయుక్తం యుక్తం పరమయోగిభిః
చంద్రపుష్కరిణీ తీరే - విరాజంతం శ్రియఃపతిమ్॥

తా॥ శ్రీదేవితోను, భూదేవితోను కూడియున్న వానిని, పరమ యోగి బృందముతో నున్నవానిని, చంద్రపుష్కరిణీ తీరమున విలసిల్లు లక్ష్మీపతిని

శ్లో॥ దృష్ట్వా స్తుత్వాస్తవై ర్భూయో - ముదా పరమయా యుతః
తత్ర స్నాత్వా చపీత్వా చ - సంతర్ప్య చ పితౄ నథ॥

తా॥ చూచి అనేక స్తోత్రములచేత ప్రార్థనసల్పి మిక్కిలి ఆనంద మంది యందు స్నానమాచరించి ఆచమనాదికమొనర్చి పితృదేవతలకు తర్పణలొసంగినవాఁడై పిదప

శ్లో। మహాపాపహరం సేతుం - దృష్ట్వా తీర్థం హనూమతః
తస్య తీరే హనూమంతం - విలోక్య త మపూజయత్॥

తా॥ పాపములనన్నిటిని పోగొట్టజాలు సేతువును చూచి, అట్టి హనుమత్తీర్థమును దర్శించి ఆయొడ్డున హనుమంతునిచూచి పూజించెను.

శ్లో॥ తతో రామేశ్వరం దేవం - అర్చయామాస స ద్విజః
తస్మా ద్దేశా త్సమృద్ధార్థః - పున స్స్వగృహ మాగతః
భుక్త్వా భోగా న్స ధర్మాత్మా - కాలే ముక్తి మవాప హ॥

తా॥ ఆ పిదప హరిశర్మ రామేశ్వరుని పూజించెను. ఆ దేశము నుండి సమృద్ధిగ ధనమును సంపాదించుకొని మరల స్వగృహమునకు వచ్చినవాఁడై ధర్మాత్ముఁడగు నాతఁడు సకలభోగముల ననుభవించి చివరకు మోక్షము నందెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే
హరిశర్మచరిత్ర కథనం నామ త్రయోవింశతితమ పటలః

చతుర్వింశతితమ పటలః

## నిత్యకర్మ విధాన కధనం

మైత్రేయః

శ్లో॥ హనూమా న్బలసంపన్నో - హ్యంజనానంద వర్ధనః
కస్మిన్ దేశే నివసతి - కి మాచరతి సర్వదా,

తా॥ మైత్రేయ మహాముని ఇట్లడిగిరి. ఓ పరాశర మహామునీ! బలసంపన్నుఁడును, అంజనాసుతుఁడునగు హనుమంతుఁ డేదేశమున వసించుచున్నాఁడు? ఎల్లవేళల నేమిచేయుచున్నాఁడు?

శ్లో॥ కీదృశా పార్షదా స్తస్య - కిం కుర్వ న్తి మహాత్మనః?
కి మాహారో విహారో వా - కాలక్షేపం కథం హరేః?

తా॥ ఆతని సహచరులెట్టివారు? ఆ మహాత్మునకు వారెట్లు సేవలొనర్తురు? ఆ హనుమంతుని కాహారమేమి? విహారమెట్లు? వానికి కాలక్షేప మెట్లు జరుగును?

శ్లో॥ శ్రోతు మిచ్ఛా మ్యహం బ్రహ్మన్ - వక్తు మర్హసి సువ్రత ।

తా॥ ఈ విషయములు నేను వినగోరుచున్నాను. వ్రతనిష్ఠుడవగు ఓ మహాముని ! నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ సాధు పృష్టం త్వయా విద్వన్ - హనూమ చ్చరితం శుభమ్
శృణు ష్వైకమనా భూయో - వక్ష్యామి మునిపుంగవ ।

తా॥ శ్రీ పరాశర మహాముని ఇట్లు చెప్పమొదలిడెను. ఓ విద్వచ్ఛ్రేష్ఠుఁడా ! మున్యగ్రగణ్యుఁడా ! నీచే బాగుగా నడుగబడినది. శుభప్రదమగు హనుమంతుని చరిత్రమును చెప్పుచున్నాను. సావధానుఁడవై వినవలసినది.

శ్లో॥ సుమేరోః నైరృతే భాగే - పర్వతో గంధమాదనః
సర్వపాదప సంకీర్ణో విచిత్రో ధాతుమండితః॥

తా॥ మేరుపర్వతమునకు నైరృతిదిక్కున గంధమాదన మనుపేరుగల పర్వతము కలదు. అది అన్ని విధములగు చెట్లతోడను వ్యాపించియున్నది. విచిత్రములగు ధాతుసంపదలచే ప్రకాశించుచుండునట్టిది.

శ్లో॥ నానా శకుంత విరుతైః - నానా కుసుమరాశిభిః
సువర్ణ కదళీ షండైః - నీరంధ్ర ఫలరాజభిః॥

తా॥ నానా విధముల పక్షులకూతలతోను, వివిధములగు పుష్పముల సమూహములతోను, బంగారు అరటి తోటలతోను దట్టమగు మంచి పండ్లతోను కూడినది.

శ్లో॥ మునీనాం పర్ణశాలా శ్చ - బ్రహ్మయజ్ఞ సుశోభనాః
గంధర్వమిధునానాం చ - క్రీడాకుంజా స్సహస్రశః॥

తా॥ అట వేదాధ్యయనాదికముతో ప్రకాశించు మునుల పర్ణశాలలు, గంధర్వ మిధునములు ఆటలాడుకొను వేలకొలది పొదరిండ్లును, 'బహువస్త్రశోభనాః' అని పాఠాంతరము.

శ్లో॥ ఏలా లవంగ తక్కోల - చంద నాగరు శాఖినః
కర్పూర రంభా జంబీర - మాతులుంగ కదంబకాః॥

తా॥ ఏలక, లవంగము, తక్కోలము, మంచిగంధము మున్నగు చెట్లును, కర్పూర, అరటి, నిమ్మ, మాధిఫల కదంబకాదులు,

శ్లో॥ నారికే ళామ్ర పనస - జంబూ ఖర్జూర దాడిమాః
ద్రాక్షా బదర నారింగ - సేమంతీ చంపకాదయః॥

తా॥ కొబ్బరి, మామిడి, పనస, నేరేడు; ఖర్జూరము, దానిమ్మ ద్రాక్ష, రేగు, నారింజ, చేమంతి, సంపెంగ మొదలైనవియు,

శ్లో॥ పున్నాగ అశోక మాలత్యః - వాసంతీ నవమల్లికాః
తాలా స్తమాలా హింతాళాః - వకుళాః కేతకాదయః॥

తా॥ పున్నాగ, అశోక, జాజి, అడవిమొల్ల మల్లె, తాడి,తమాల, గిలక తాడి, పొగడ, మొగలి మున్నగునవియు అందు కలవు.

శ్లో॥ తత్రత్య సర్వసత్వానాం - జాతివైరం న విద్యతే
తరవ స్సర్వకాలేషు - ఫలితా స్తత్ర పుష్పితాః॥

తా॥ అటనున్న ప్రాణికోటియందు జాతివైరములేదు. అనగా ఎలుక పిల్లి మున్నగువాని పరస్పర శత్రుత్వము కూడ నచ్చటలేదు. అన్నికాలములందు నచ్చటిచెట్లు పూయుచు కాయుచు నుండును.

శ్లో॥ పుష్పాంబు కుల్యా సర్వత్ర - కస్తూరీ మృగిణ స్తథా
బహు కుంకుమ కేదారాః - స న్తి కర్పూరరాశయః॥

తా॥ అంతటను పూదేనెల కాలువలు, కస్తూరి మృగములు అనేక కుంకుమమళ్ళు, కప్పురపు తిన్నెలును కలవు.

శ్లో॥ ఏవం విచిత్ర శైలేంద్రే-కపీంద్రో గంధమాదనే
మనోహరైః మహాకుంజైః - మకరంద సరోవరైః॥

తా॥ ఇట్టి విచిత్రమగు పర్వతశ్రేష్ఠము గంధమాదన పర్వతమున హనుమంతుఁడు మనోహరములగు గొప్ప పొదరిండ్లతోను, పూదేనెల సరస్సులతోను

శ్లో॥ సర్వర్తు గుణ సంపన్నే సర్వప్రాణి సుఖావహే
గిరినిర్ఝర సాహస్రైః - శతైశ్చ కమలాకరైః॥

తా॥ అన్ని ఋతువుల గుణములతోను కూడిన సమస్తములగు జీవులకు సుఖమునిచ్చు, సెలయేళ్ళ సహస్రములతోను, సరస్సుల వందలతోను,

శ్లో॥ సింహ వ్యాఘ్ర వరాహైశ్చ - శరభైర్గవయైశ్శశైః
మృగైరన్యైర్ద్విజైరన్యైః . శ్వాపదైశ్చ సమాకులే॥

తా॥ సింహములతో, పులులతో, పందులతో, ఒంటెలతో, గురుపోతులతో, కుందేళ్ళతోను, అనేకములగు జంతువులతోను అనేకములగు పక్షులతోను, హింసా మృగములతోను సంకులమైయుండున దానియందు

శ్లో॥ తత్ర దివ్యగుహా రమ్యా - విశాలా యుక్తమారుతా
దశయోజన విస్తీర్ణ - సువర్ణమణిరంజితా॥

తా॥ అచ్చట రమ్యమైనదై, విశాలముగానుండి చక్కనిగాలి వచ్చునది, పదియోజనముల విస్తీర్ణమగు బంగారముచే మణులచే ప్రకాశించునది యగు గుహ కలదు.

శ్లో॥ తస్యాం హనూమ త్ప్రీత్యర్థం - నిర్మితా విశ్వకర్మణా
మహేంద్ర స్యాజ్ఞయా రత్న - శాలా సౌవర్ణశాలికాః॥

తా॥ అందు హనుమంతునికొఱకై ఇంద్రుని అజ్ఞచే విశ్వకర్త వలన రత్నశాలలు సువర్ణశాలలు నిర్మింపబడినవి.

శ్లో॥ కాశ్చి ద్గారుడ శాలాశ్చ - కాశ్చి న్మౌక్తిక శాలికాః
ఇందనీలమయా శ్శాలాః - ప్రవాళ ఖచి తాంతరాః॥

తా॥ ఇంకను కొన్ని గరుడపచ్చలచే నేర్పరుపబడిన శాలలు కొన్ని ముత్యములచే నిర్మింపబడిన శాలలు, ఇంద్రనీలమణులచే నింపబడిన శాలలు, పగడములు లోనపొదిగిన శాలలు,

శ్లో॥ పద్మరాగమయాః కాశ్చిత్ - కురువిందై శ్చ భూషితాః
వైఢూర్య మణికుడ్యా శ్చ - శుద్ధస్ఫటిక వేదికాః॥

తా॥ పద్మరాగమయములగు శాలలు కొన్ని, కొన్ని కురువిందలచే నలంకరింపబడినవి. ఇంకను వైఢూర్య మణులు పొదిగిన గోడలు, స్వచ్ఛస్ఫటికములచే నిర్మింపబడిన వేదికలును

శ్లో॥ శాత కుంభమయా స్తంభాః-దాంతరాజిత తోరణాః
పుష్యరాగమయ ద్వారాః — మణికుట్టిమ భూమయః।

తా॥ బంగరుమయమైన స్తంభములు, దంతములచే ప్రకాశించు తోరణములు, పుష్యరాగమయములగు ద్వారములు, మణులచే పొదగబడిన భూములును 

శ్లో॥ ముక్తా వితాన సాహస్రైః-గ్రథితా శ్శ సంతతః
మహా సంస్కరణోపేతాః-వైజయంతాధిక ప్రభాః।

తా॥ అంచులందు కొన్నివేల ముత్యములచే పొదగబడినవి, గొప్పగా సంస్కరింపబడినవి, వైజయంతమును మించిన కాంతులు కలవియును

శ్లో॥ సుధర్మా తుల్య సౌభాగ్యాః-విచిత్రా పుష్పకోపమాః
సువర్చలా యుతో నిత్యం - తాసు క్రీడతి మారుతిః

తా॥ దేవసభయగు సుధర్మతో సమానమైన సౌభాగ్యము కలవి. పుష్పకవిమానముతో పోల్చుటకు తగిన విచిత్రమైనవియును, వానియందు హనుమంతుడు, అతని భార్యయగు సువర్చలతో కలసి విహరించుచుండును. 

శ్లో॥ హనుమాన్ ప్రాత రుత్థాయ - స్మరన్ రామం గుణోత్తమమ్
పద్మాక్ష తులసీమాలా నూర్ధ్వపుండ్రం చ ధారయన్॥

తా॥ హనుమంతుఁ డుదయముననే లేచి, గుణములచే నుత్తముఁ డగు రాముని స్మరించుచు, పద్మముల, రుద్రాక్షల, తులసిపూసల మాలికలను, నిలువుబొట్టును ధరించుచు.

శ్లో॥ కృత్వా మైత్రాదికం సర్వం - ప్రతిష్ఠాం దేవతాలయమ్
రాఘవం జానకీనాథం - భరతాదిభి రూర్జితమ్॥

తా॥ సూర్యోపాసనాదికమంతను నెరవేర్చి దేవతాలయమును ప్రతిష్ఠించి జానకీనాథుఁడును, భరతాదులతోనున్న శ్రీరామచంద్రుని

శ్లో॥ అర్ఘ్యపాద్యాదిభి ర్ధూపైః - దీపై ర్బలిభి రుత్తమైః
తులసీ పుష్పమాలాభిః గంధ కస్తూరికాదిభిః॥

తా॥ అర్ఘ్యపాద్యములతోడను, ధూపములు, దీపములు, ఉత్తమములగు నైవేద్యములతోడను, తులసీ మాలలతోను, పూలమాలలతోను, మంచిగంధము, కస్తూరి మున్నగు సుగంధద్రవ్యములతోను,

శ్లో॥ ఆరాధయిత్వా దేవేశం-పార్షదై స్సహ భక్తమాన్
నృత్త గీతాదిభి ర్వాద్యైః-ప్రతూర్యై ర్బహుభి స్తవైః॥

తా॥ దేవదేవుని అనుచరులతోకూడి భక్తిపరుఁడై ఆరాధించి నృత్తము, గీతము మున్నగువానితోను, వాద్యములతోను, తూర్యనాదముల తోను, అనేకవిధములగు స్తోత్రములతోను,

శ్లో॥ పులకాంచిత సర్వాంగో-బాష్పపర్యాకు లేక్షణః
ధ్యాయ న్ముహూర్తం నిశ్చేష్టో - పరమానంద సంప్లుతః॥

తా॥ దేహమంత గగుర్పాటునందినవాఁడై కన్నీటితో నిండిన చూపు కలవాఁడై ధ్యానించుచు క్షణకాలము నిశ్చేష్టుఁడగుచు పరమానందమయుఁడగుచు

శ్లో॥ తతో భాగవతాన్ ధన్యాన్-అర్చయిత్వా మహామతిః
రామోపభోగ త్వగ్గంధ-వాసాలంకార భూషితః॥

తా॥ పిదప బుద్ధిశాలియగు నాతఁడు ధన్యులగు భాగవతోత్తములందఱ నర్చించి రామునిచే ననుభవింపబడిన మైపూత, వస్త్రము అలంకారము మున్నగు వానిచే నలంకృతుఁడై

శ్లో॥ తస్మై వోపనిష త్పుణ్య-మీమాంసా శ్రవణోత్సుకాన్
ఆనందయితు మాసీనే_హనూమతి వరాసనే॥

తా॥ ఆ శ్రీరామచంద్రుని గూర్చి ఉపనిషత్ప్రవచనములు, మీమాంసాప్రవచనములు వినగోరువారి నానందింపఁజేయు హనుమంతుడు శ్రేష్ఠమగు ఆసనమున నాసీనుఁడుకాగా

శ్లో॥ సేవార్థం కపిసింహస్య - సాయం ప్రాత స్సమాహితః
గంధ ర్వాప్సరసో దేవాః - సిద్ధా స్సాధ్యా శ్చ చారణా॥

తా॥ ఆ వానరేశ్వరుని సేవించు నిమిత్తము సాయం సమయమున, ఉదయముననుు సమూహముగా గంధర్వులు, అప్సరసలు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు, చారణులు.

శ్లో॥ విద్యాధరా శ్చ యక్షా శ్చ-నాగా శ్చ సహకిన్నరాః
సమాగమ్య ప్రయత్నేన-మునయః పరమర్షయః॥

తా॥ విద్యాధరులు, యక్షులు, నాగులు, కిన్నర మిధునములు, ప్రయత్నపూర్వకముగా కూడినవారై మునులు, పరమఋషులను

శ్లో॥ ఆరాధయంతో సతతం - గా నోపాయన పాణయః
గంధ పు ష్పాక్షతై శ్చైవ-బలిభి ర్ధూప దీపకైః॥

తా॥ ఎల్లప్పుడు ఆరాధించువారై గానవిశేషములు, బహుమానములు చేతులందుకలవారై గంధము, పుష్పములు, అక్షతలతోను, ధూపదీపనైవేద్యములతోను,

శ్లో॥ దివ్యాంబరై ర్భూషణై శ్చ-ఫలై రమృతసన్నిభైః
నృత్యంత శ్చాऽపి గాయంత-స్తువంతః పుష్కలై స్తవైః
ఏవంసంభావయంతి స్తే-గచ్ఛ న్త్యేవయథాగతమ్॥

తా॥ దివ్యవస్త్రములతోను, అలంకారములతోను, అమృతముతో సమానములగు పండ్లతోను అర్చించి నృత్యమొనర్చుచు, పాడుచు సమృద్ధిగా స్తవములతో స్తోత్రముచేయుచు నిట్లు హనుమంతుని సేవించువారై వారు వచ్చినరీతిగా పోవుచుండిరి.

# సర్వదేవతాస్తుతిః

గద్య :- శ్రీ వర, మఖిల వేదస్వరూప, మమిత ప్రతాపం అంజనా గర్భ సంభూతం, అఖిల భువన ప్రఖ్యాతం, కేసరి ప్రియనందనం, కౌండిన్య వంశోద్భవం, కబళీకృత బాలభానుం, గంధవహ సూనం, సుగ్రీవ సచివం అమిత ప్రభావం, రామకార్య ధురంధరం, రాక్షస సంహారం, సాగర లంఘన జంఘాలం, సామగాన లోలం, దశగ్రీవ దర్పహరం, దారితాక్షప్రముఖాసుర నికరం, సీతాశోక వినాశనం, శ్రీరామ ప్రీతి వర్ధనం, మకరీ శాపమోచనం మర్దిత కాలనేమిం, మైరావణ మర్దనం, సౌమిత్రి ప్రాణదాతారం, సకల లోకాధారం, శ్రీ సీతారామయోః పరమసంతోషయోగ కారణం, శ్రితభక్త మందారం, భవిష్య ద్బ్రహ్మ రూపం, భగవ త్స్వరూపం, ఘనవాల రోమ నిర్మిత శివలింగం, కరుణాంతరంగం, ఉదయాస్తాచలార్పితపాదయుగళం, సురముని వినుత సుచరితం, శ్రీసువర్చలాకళత్రం, భక్తప్రతిజ్ఞా నిర్వహణ చాతుర్యం, భుక్తి ముక్తి దాయకం పురుష వరేణ్యం, ఆదిపురుషం, అతి విజయం, శ్రీమంతం హనుమంత ముపాస్మహే॥

తా॥ పైరీతిగా దేవతలందఱు హనుమంతుని స్తోత్రము చేయుదురు.

శ్లో॥ ఇత్యాశ్చర్యకరం తస్య - సుందరత్వం సురాదయః
దృష్ట్వా భవన్తి నిశ్చేష్టాః - కాలే మదన మోహితాః॥

తా॥ అని యతి ఆశ్చర్యకరమగు అతని సుందరత్వమును దేవతాదులే చూచి ఆయాసమయముల మదన సమ్మోహితులగు నట్లుగా చేష్టలుడిగిన వారగుచుండిరి.

శ్లో॥ లావణ్యం సర్వలోకస్య - రాశీభూత మివ స్థితమ్
దృష్ట్వాత్మానం వినిందంతి - జయంత మదనాదయః॥

తా॥ సమస్తలోకముయొక్క తేజస్సంతయు కుప్ప బోయబడెనో యనునట్లున్న అతనినిచూచి మిక్కిలి అందమైనవారగు జయంతుఁడు, మన్మధుఁడు తమ్ముతాము నిందించుకొనజొచ్చిరి.

శ్లో॥ వాయోః కుమారో బలవాన్ - పుణ్యగంధమయ శ్శుచిః
వారణ్యవర్ణో దీర్ఘాంగో - పృధువక్త్రః కపీశ్వరః॥

తా॥ వాయుకుమారుఁడగు హనుమంతుఁడు బలవంతుఁడు. పుణ్య వాసనలతో నుండినవాడు. శుచియగువాఁడు, ఏనుగురంగు కలవాఁడు, పొడవైన దేహము కలవాఁడు, పెద్దదైన నోరుకలవాఁడు- మర్కటములకు నాయకుఁడు.

శ్లో॥ రూపం ధారయతే దివ్యం - తత్తత్కాలే యథోచితమ్
వదనామృత కాసార - సంభూత నయనాంబుజః॥

తా॥ అతఁడు ఆయాకాలములకు తగిన దివ్యములగు రూపములను ధరించుచుండును. ముఖము అను అమృతసరస్సున బుట్టిన పద్మములా అన్నట్లుండిన నయనములు కలవాఁడు.

శ్లో॥ గంగాప్రవాహ విలస - ల్లాంగూల కృత మేరువత్
విలక్షణతమ శ్చాఽస్మిన్ - రత్నసింహాసనే స్థితః॥

తా॥ గంగాప్రవాహమువలె విలసిల్లు లాంగూలము వలన చేయబడిన మేరుపర్వతమువలె విశేషలక్షణ యుతుఁడై రత్నసింహాసనమున కూరుచున్నవాఁడై.

శ్లో॥ దదాతి సకలాన్ కామాన్ - వాఖ్యాయన్ బ్రహ్మసంహితామ్
అపచారక్షమీ వీర్య శౌర్యతేజః పరాక్రమః॥

తా॥ బ్రహ్మసంహితను వ్యాఖ్యాన మొనర్చుచు సమస్తములగు కోర్కెల నిచ్చుచున్నాఁడు. అపచారమును క్షమింపగల వీర్యశౌర్య తేజః పరాక్రమములు కలవాఁడు.

శ్లో॥ రత్నతేజప్రభా సూర్యే - యథా చంద్రేఽపి చంద్రికా
మూర్తిత్రయాత్మకే తస్మిన్ - నిత్యం సన్తి స్వభావతః॥

తా॥ సూర్యునియందుండు రత్నకాంతులు, చంద్రునియందుండు వెన్నెలయు త్రిమూర్త్యాత్మకుఁడగు నాతనియందు సహజముగానే యెల్లప్పుడు ఉండును.

శ్లో॥ శృత్వాదృష్ట్వా చరిత్రాణి - భూ ర్భువ స్స్వర్గవాసినః
మహా ర్జన స్తం స్సత్య - లోకస్థా అపి నిత్యశః

తా॥ అతని చరిత్రను విని, చూచియు భూలోక భువర్లోక స్వర్గలోక వాసులును, మహర్లోక జనలోక తపోలోక సత్యలోకములందుండు వారును ఎల్లప్పుడు

శ్లో॥ అద్భుతం పరమం గత్వా - సంస్తువన్తి మహాత్మనః
తతో మధ్యాహ్నసమయే - నిర్వర్త్యావశ్యక క్రియాః॥

తా॥ ఆమహానీయునిగూర్చి మిక్కిలి యాశ్చర్యముపొంది స్తోత్రము చేయుచుందురు. పిదప శ్రీహనుమంతుఁడు మధ్యాహ్నసమయమున చేయఁదగు కార్యములను నిర్వహించి

శ్లో॥ పూర్వవ ద్రామచంద్రస్య - సమారాధన మీహతే
త చ్చేష ఫల మూ లాన్న - మాస్వాద్య స మహామతిః

తా॥ వెనుకటివలెనే మరల శ్రీరామచంద్రుని అర్చనయందాసక్తుఁడగును, ఆమహాత్ముఁ డట్లర్చించగా మిగిలిన పండ్లను, మూలములను, అన్నమును సేవించి

శ్లో॥ రామాయణకథాం దివ్యాం - పురా వాల్మీకినా కృతామ్
ఆసాయ మనుసంధత్తే - రామ సంతోషకారణాత్॥

తా॥ పూర్వము వాల్మీకిచే రచింపబడిన దివ్యమగు రామాయణకథను శ్రీరామచంద్రునకు సంతోషకారణమగుటచే సాయంత్రమువరకును చదువును.

శ్లో॥ కృత్వా సాయంతనం కర్మ - పూర్వవ జ్జానకీపతిమ్
అభ్యర్చ్య రామమంత్రార్థ - తత్పరో ధ్యానసంభృతః॥

తా॥ సాయంసమయమున నిర్వహింపదగు కర్మనాచరించి వెనుకటివలెనే జానకీపతియగు రామునర్చించి రామమంత్రార్థతత్పరుఁడై ధ్యానమున నుండి

శ్లో॥ యోగనిద్రా మనుభవన్ - సుఖశయ్యాం భజ త్యసౌ
కదాచి దుష్ట్రి మారుహ్య మనోవేగం మహాబలమ్॥

తా॥ యోగనిద్రదననుభవించుచు సుఖముగా శయనతృప్తినందును, ఒకప్పుడు మనోవేదముకల్గిన, గొప్ప బలముకల ఒంటెనెక్కి

శ్లో॥ పర్యటన్ సకలాన్ లోకాన్ - సంతోషయతి దేవతాన్
ఏవం దృష్ట్వా హనుమతో - మహిమానం మహాద్భుతమ్॥

తా॥ అన్నిలోకములు పర్యటించుచు దేవతలను సంతోషపరచుచుండును. ఇట్లు హనుమంతుని ఆశ్చర్యకరమగు శక్తిని చూచి

శ్లో॥ ఇంద్రాదయో లోకపాలాః - విస్మయం పరమం గతాః
హనుమ ద్విగ్రహా నష్ట - దిక్షు సంస్థాప్య భక్తితః॥

తా॥ ఇంద్రుఁడు మొదగు లోకపాలురు మిక్కిలి విస్మయమందినవారై హనుమద్విగ్రహములను భక్తితో ఎనిమిదిదిక్కులందును ప్రతిష్ఠించి

శ్లో॥ త త్పార్ష దేభ్యః ప్రదదుః - అష్టౌ తే గంధమాదనే
గుహాయాః పూర్వదిగ్భాగే - దూరత స్సరసీతటే॥

తా॥ ఆహనుమంతుని పార్షదులకు వానిని సమర్పించిరి. గంధమాదన పర్వతమున గుహకు తూర్పుదిక్కున దూరముగా సరస్సుయొక్క యొడ్డున

శ్లో॥ హనూమంతం ప్రతిష్ఠాప్య - శక్రో జాంబవతే దదౌ
ఆగ్నేయే పావకః శ్రీమాన్ - అంజనేయనిధిం శుభామ్॥

తా॥ హనుమంతుని ప్రతిష్ఠించి దేవేంద్రుఁడు జాంబవంతునకిచ్చెను. అగ్నేయదిక్కున అగ్నిదేవుఁడు అంజనేయుని శుభప్రదమగు ప్రతిష్ఠను

శ్లో॥ సంస్థాప్య విధివ ద్భక్త్యా - వినతాయ దదౌ ప్రభుః
తథైవ దక్షిణే భాగే - ధర్మరాజ స్సుభక్తిమాన్॥

తా॥ యథావిధి భక్తితోనొనర్చి వినతునకు సమర్పించెను. అట్లే దక్షిణదిక్కునందు భక్తిమంతుఁడగు యమధర్మరాజు

శ్లో॥ నీలాయ ప్రదదౌ దేవో - హనుమ త్ప్రతిమాం శుభామ్
నైర్‌ృతేఽప్యథ దిగ్భాగే - ఫలాదానమధీశ్వరః॥

తా॥ శుభప్రదమగు హనుమత్ప్రతిమను నీలునకు సమర్పించెను. పిమ్మట నైరృతిదిక్కున నిరృతి

శ్లో॥ పనసాయ దదౌ ప్రీత్యా - హనుమ న్మూర్తి మస్పృశన్
వరుణః పశ్చిమే భాగే వ్యావాహ్యా హనుమత్తనుమ్॥

తా॥ పనసునకు ప్రీతితో హనుమన్మూర్తిని స్పృశించుచు నిచ్చెను. వరుణుఁడు పశ్చిమదిగ్భాగమున హనుమద్రూపమును ఆవాహనమొనర్చి

శ్లో॥ గంధమాదన పూజార్థం - సమారాధ్య దదౌ సుధీః
వాయుర్వై వాయుదైవత్యే - హనూమ ద్విగ్రహం శుభమ్॥

తా॥ గందమాదను నర్చించుటకై పూజనొనర్చి సమర్పించెను. వాయుదేవుఁడు వాయువ్య దిగ్భాగమున శుభప్రదమగు హనుమన్మూర్తిని

శ్లో॥ ఆంజనేయప్రియార్థం వై - సుషేణా యార్పయే త్సుధీః
కుబేర స్సోమదిగ్భాగే - యక్ష గంధర్వ నాయకః॥

తా॥ ఆంజనేయుని తృప్తిపరచుటకై సుషేణునకు సమర్పించెను. ఉత్తరదిక్కున యక్షగంధర్వనాయకుఁడగు కుబేరుఁడు.

శ్లో॥ హనూమతి ప్రతికృతం - మైందాయ ప్రతిపాదయత్
ఈశాన్యే పార్వతీనాథః - శంకరో లోకశంకరః॥

తా॥ హనుమంతునికై చేసినదానిని మైందున కర్పించెను, ఈశాన్యదిక్కున పార్వతీపతియు, లోకములకు శుభమొనర్చునట్టియు శంకరుఁడు

శ్లో॥ హనూమ దుపమాం దేవో - ద్వివిదాయ ప్రదత్తవాన్॥

తా॥ హనుమంతుని ప్రతిమను ద్వివిదునకు సమర్పించెను.

శ్లో॥ దేవైఃకృతాభిషేకోత్థ - తీర్థేన హనుమత్ప్రభుః
వాలాగ్రాత్ప్రచ్యుతే తేన - నద్యాస్తే వాలసాగరాః॥

తా॥ ఆదేవతలచే చేయబడిన అభిషేకములవలన నేర్పడిన ఆజలముచే హనుమంతుఁడు తోకచివఱ భాగముతో సమూహమొనర్చుటచే ఆ నదులు వాలసాగరములు.

శ్లో॥ రాజహంస సహస్రాణి - సువర్ణ కమలాని చ
స్వర్ణభ్రమర బృందాని - చక్రవాకాని తత్ర వై॥

తా॥ అచ్చట వేలకొలది రాజహంసలును, బంగారు కమలములు, బంగరుతుమ్మెదల సమూహములు, చక్రవాకములును ఉండును.

శ్లో॥ హైమ వేతస కుంజేషు - గంధ ర్వాప్సర సాంగనాః
క్రీడంతి మిధునీభూయాః - తత్ర పుష్ప ఫలేషు చ।

తా॥ బంగరుప్రబ్బలి పొదరిళ్ళయందు గంధర్వ, అప్సరస్త్రీలు జంటలుగాకూడి యచటి పుష్పఫలములం దాడుకొనుచుందురు.

శ్లో॥ తస్యాం సర్వే నిమజ్జంతే - మునయో దేవమానుషా
చతుర్విధా న్పురుషార్థాన్ - ప్రాప్నువంతి సునిర్మలాః॥

తా॥ ఆ నదియందు మునులు, దేవతలు, మనుష్యులు అందరును మునుగుచుందురు. నిర్మలులై ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములు పొందుచుందురు.

శ్లో॥ ఏవం మహాత్మా పవనాత్మజో హరిః
రామాభిధానస్య పరస్యపుంసః
నిత్యం సమారాధనతత్పరో బలీ
ప్రతీక్షతే బ్రహ్మపదం భవిష్యతి॥

తా॥ ఇట్లు మహానుభావుఁడు. వాయుపుత్రుఁడు అగు హనుమంతుఁడు రాముఁడను పేరుగల పరమపురుషుని అర్చించుటయందే ఎల్లప్పుడు నిమగ్నుడై యుండి భవిష్యత్కాలమున బ్రహ్మపదమునందుటకై సిద్ధముగనున్నాఁడు.

శ్లో॥ చతుర్భుజో భక్తజనావళీభ్యః
సింహాసనే రత్నమయే నిషణ్ణః
అధ్యాపయన్ తారకమంత్రరాజం
విరాజితేఽసౌ కమలాసనో యథా॥

తా॥ ఈతఁడు నాల్గుచేతులు కల్గినవాఁడై రత్నమయమగు సింహాసనమున కూర్చుండి భక్తజనులచే తారకమంత్రమును చెప్పించుచు బ్రహ్మదేవునివలె ప్రకాశించుచుండెను.

శ్లో॥ చతుర్ముఖః పంచముఖ శ్చ షణ్ముఖ
స్సహస్రజిహ్వాదయ సమ్ముఖా వా
త్రిమూర్తితేజోమయ మాంజనేయం
జ్ఞాతుం సమర్థోఽస్తి న హి త్రిలోక్యామ్॥

తా॥ బ్రహ్మవిష్ణు మహేశ్వరస్వరూపుఁడగు ఆంజనేయును తెలిసికొనుటకు చతుర్ముఖబ్రహ్మ, పంచముఖబ్రహ్మ, కుమారస్వామి, శేషుఁడుసైతము ముల్లోకముల నొక్కఁడును సమర్థుఁడులేడు.

## అథ సప్తాక్షరీ మంత్ర విధానం

శ్లో॥ అథ మంత్రం ప్రవక్ష్యామి - సప్తవర్ణహనూమతః
యో దదాతి నృణాం లోకే - పురుషార్థాం శ్చతుర్విధాన్।

తా॥ పిమ్మట లోకమున నరులకు చతుర్విధ పురుషార్థములను ప్రసాదించు హనుమంతుని సప్తవర్ణ మహామంత్రమును చెప్పుచున్నాను.

శ్లో॥ ఉచ్చార్య తారం శ్రీవర్ణం - తతో హనుమతే నమః
అంగన్యాస కరన్యాసౌ - మూలమంత్రేణ సంస్పృశేత్

తా॥ తరింపజేయునట్టి శ్రీ వర్ణమును ఉచ్చధ్వనిగా పలికి పిదప హనుమతేనమః అనవలెను. అంగన్యాస కరన్యాసములు మూలమంత్రము తోనే యొనర్చవలెను.

శ్లో॥ ఇదం సప్తాక్షరం లబ్ధ్వా - గురో ర్లక్షత్రయం జపేత్
తత్త ద్దశాంశతః కుర్యాత్ - తర్పణం హోమ భోజనే॥

తా॥ హనుమంతుని ఈసప్తాక్షరమంత్రమును పొంది మూడు లక్షలు జపమొనర్చవలెను. దానియందు పదవవంతు తర్పణమును, అందు పదవవంతు హోమమును, అందు పదవవంతు అన్నప్రదానము చేయ వలెను.

శ్లో॥ ఋషి శ్శౌనకఏవా త్ర గాయత్రీ ఛంద ఏవ చ
హనుమా న్దేవతా బీజం - మారుతాత్మజ ఏవ చ॥

తా॥ ఈమంత్రమునకు శౌనకుడు ఋషి గాయత్రి ఛందస్సు హనుమాన్ దేవత మారుతాత్మజ బీజము చెప్పవలెను.

శ్లో॥ శక్తి రత్రాంజనాసూనుః - వాయుపుత్ర స్తు కీలకమ్
దిగ్బంధనం తు గాయత్ర్యా - కృత్వా ధ్యానం సమాచరేత్॥

తా॥ అంజనాసూనుశ్శక్తిః అని, వాయుపుత్రః కీలకం అని చెప్పి గాయత్రిచేతనే దిగ్బంధనమొనర్చి ధ్యానము చేయవలెను.

ధ్యానం.

శ్లో॥ చింతితార్థప్రదం దేవం - శాంతాకారం మహాప్రభుమ్
సంతతం చింతయే చ్చిత్తే - హనూమంత మనూపమమ్॥

తా॥ కోరినకోర్కెల నిడుదేవుని, శాంతస్వరూపుని, మహా సమర్థుని, నిరుపమానుఁడగు హనుమంతుని ఎల్లప్పుడు మనసున చింతించవలెను అని ధ్యానమొనర్చవలెను.

శ్లో॥ ఋక్ష వానర గోపుచ్ఛ - ఇమం మంత్ర ముపాసతే
జాంబవాన్ వినతో నీలః పనసో గంధమాదనః
సుషేణ మైంద ద్వివిదాః - ప్రధానా స్తత్ర వానరాః॥

తా॥ ఎలుగుబంట్లు, కోతులును ఈమంత్రము నుపాసించును. జాంబవంతుఁడు, వినతుఁడు, నీలుఁడు, పనసుఁడు, గంధమాదనుఁడు, సుషేణుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు నీవిషయమున ప్రధానవానరులు.

శ్లో॥ అన్యే చ బహవ శ్శూరాః - మహాత్మానో మహాబలాః
పరివారై స్త్రయస్త్రింశ - త్కోట్యర్బుద గణై ర్వృతః॥

తా॥ ఇంకను అనేక శూరులు, మహాత్ములు, మహాబలవంతులు కలరు. ముప్పదిమూడుకోట్ల అర్బుదముల గణము పరివారముతో కూడిన వాఁడై

శ్లో॥ అకుతోభయ సంచారో - ఏవం స రమతే హరిః
నమస్కారా శ్చ సాష్టాంగా - పంచసంఖ్యా ప్రకీర్తితాః॥

తా॥ దేనికి భయపడనివాఁడై ఆహనుమంతుడు సంచరించుచుండును. అతనికి సాష్టాంగనమస్కారములును ఐదుగా చెప్పబడినవి.

శ్లో॥ ప్రదక్షిణ విధి స్తద్వ - త్కథిత శ్రీహనూమతః॥

తా॥ అట్లే శ్రీహనుమంతుని ప్రదక్షిణ విధానముకూడా చెప్పబడినది.

శ్లో॥ ఆదౌ నీలం నమస్కృత్య - పశ్చా చ్ఛ్రీహనుమత్ప్రభుమ్
యః కరోతి నమస్కారం - స ధన్యో లోకపావనః॥

తా॥ మొదట నీలునకు నమస్కరించి పిదప శ్రీహనుమంతునకు నమస్కరించినవారు ధన్యులై లోకమున పవిత్రులౌదురు.

శ్లో॥ హనుమ ద్దక్షిణే భాగే – స్థితో నీల స్సు సేవితః॥
పశ్చా త్సేవ్యో మహాభక్త్యా – హనూమా న్మునిసత్తమ॥

తా॥ హనుమంతునకు దక్షిణభాగమునసుండు నీలుఁడు సేవింపబడిన పిదపనే ఓమైత్రేయమహామునీ ! హనుమంతుఁడు మిక్కిలి భక్తితో సేవింపదగినవాడు.

శ్లో॥ జ్యేష్ఠ శుద్ద దశమ్యాం చ – పద్మబంధు స్సువర్చలామ్
హనూమతే దదౌ బాలాం – స్వ తనూజాం మహాత్మనే॥

తా॥ జ్యేష్ఠశుద్ధదశమియందు సూర్యభగవానుఁడు తన కుమార్తె యగు సువర్చలను మహాత్ముఁడగు హనుమంతున కొసంగెను-

శ్లో॥ అంజనాగర్భ సంభూతం – బహు వానర సంయుతమ్
సర్వదేవమయం దేవం – హనూమంతం నమా మ్యహమ్॥

తా॥ అంజనాదేవి గర్భమున జనించినట్టియు, అనేక వానరులతో కూడిన సర్వదేవాత్మకుడగు శ్రీహనుమంతునకు నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ జ్యేష్ఠ శుద్ద దశమ్యాం చ – భక్త్యా పూజాం కరోతి యః
ఉపచారైః హనుమతే – స భవే త్సమనోరథః॥

తా॥ జ్యేష్ఠశుద్ధ దశమియందు భక్తితో సర్వోపచారములతో హనుమంతుని పూజ నెవడు చేయునో అతఁడుకోరెక్కలన్నిటిని పొందగల్గును.

శ్లో॥ బీజావాపే వివాహే చ – ప్రయాణే ప్రభుదర్శనే
సింహ శ్చ మకర వ్యాఘ్రః సర్పదోషాది సంకటే॥

తా॥ విత్తులుచల్లుటయందును లేదా బీజాక్షరములను మంత్రమున నుంచుటయందును, వివాహమునందును, ప్రయాణమునందును ఇట "ప్రయాగే" అని పాఠాంతరము కాన ప్రయోగములు చేయుట యందును, రాజును దర్శించుటయందును, సింహము, మొసలి, పులి, పామువంటివాని

దోషమున కష్ట మేర్పడి నపుడును - ఇట "స్వాపనే" అని పాఠాంతరము కాన నిద్రయందును

శ్లో॥ అపత్కాలేఽప్యరణ్యే చ - న వ్యాభరణ ధారణే
నదీ సముద్ర తరణే - గృహస్తంభే మహాభయే॥

తా॥ అపత్కాలమునను, అరణ్యమందును, క్రొత్త ఆభరణములను ధరించునపుడును, నదులను సముద్రములను దాటునపుడును. ఇంటినిట్టాడు కూలుటయందలి మహాభయమునను లేక గృహనిర్బంధమేర్పడిన భయ స్థితియందును

శ్లో॥ గృహ ప్రవేశ యుద్ధే చ - విద్యాభ్యాసే చ సంగమే
క్షుతే ద్యూతే వినోదే చ - జృంభణే శుభకర్మసు॥

తా॥ గృహప్రవేశమునందును, యుద్ధమునందును, విద్యాభ్యాసము నందును, సంభోగమునందును, ఆకలియందును, జూదమునందును, వినోదమునందును. అవులింతయందును శుభకర్మలయందును

శ్లో॥ ధారణే నవ్యవస్త్రాణాం - ఔషధే భోజనే తథా
దుర్దర్శన మహోత్పాతే - గజాశ్వారోహణే తథా॥

తా॥ క్రొత్తగుడ్డలు కట్టునపుడును, మందుపుచ్చుకొనునపుడును, భోజనమునను, చెడు కన్పడిన భయమునను, తెలియకవచ్చు కీడునందును ఏనుఁగును, గుఱ్ఱమును ఎక్కునప్పుడును,

శ్లో॥ భూత ప్రేత పిశాచాది - సంకటే స్ఫోటకే తథా
దుస్స్వప్నేఽపి మహావ్యాధౌ తాప శీతజ్వరేఽపి చ॥

తా॥ భూత ప్రేత పిశాచాది కష్టమువచ్చినపుడును, స్ఫోటకము పోసినపుడును, చెడ్డకలవచ్చినపుడును, గొప్పవ్యాధి వచ్చినపుడును, ఉష్ణ జ్వరమందును, చలిజ్వరమందును,

శ్లో॥ పవిత్రం హనుమన్నామ - ద్వాదశావృత్తి మాత్రతః
యే స్మరంతి జనా స్తేషాం - కార్యసిద్ధి ర్భవే ద్ధ్రువమ్॥

హరిః ఓం తత్సత్

తా॥ పవిత్రమగు హనుమన్నామమును ఎవరు పండ్రెండు మార్లు స్మరింతురో వారికి నిశ్చయముగ కార్యసిద్ధి జరుగును,

ఇతి శ్రీపరాశరసంహితాయాం శ్రీ సువర్చలా హనుమద్దేవతా నిత్యకర్మవిధానకథనం నామ చతుర్వింశతితమ పటలః

పంచవింశతితమ పటలః

## శ్రీహనుమన్మాలామంత్ర వివరణం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పంచాస్య హనుమన్మాలా - మంత్రం మే వద సద్గురో ।

తా॥ మైత్రేయమహాముని పరాశరునితో నిట్లనెను, 'ఓ గురుదేవా! పంచముఖ హనుమన్మాలా మంత్రమును నాకు చెప్పవలసినది' అని

శ్రీ పరాశరః

శ్లో॥ సరహస్యం ప్రవక్ష్యామి - బ్రహ్మ విష్ణ్వీశ కల్పితమ్
పార్వత్యై చ పురా ప్రోక్తం - శంకరేణ మహాత్మనా
మైత్రేయ తత్ ప్రవక్ష్యామి - శృణు ష్వా నన్య మానసః॥

తాః శ్రీపరాశరులవారంత నిట్లనిరి. ఓమైత్రేయా ! బ్రహ్మ విష్ణు మహేశ్వరులచే కల్పింపబడినది అతని తత్త్వమును రహస్యవిషయము లతో కూడ చెప్పుచున్నాను. ఇది మహాదేవుడగు శంకరునిచే పూర్వము పార్వతీదేవికి చెప్పబడినది. దానిని చెప్పుచున్నాను సావధానుడవై వినుము,

శ్లో॥ శ్రీకరాకార దృబ్మూర్తే • మోహితాఖిలమూర్తయే
స్త్రీ పుం సమాయ మహతే - మరేశాయ నమోనమః॥

తా॥ సంపత్ప్రదమగు చూపులుకల్గి సమస్తమును మోహింపచేయువాఁడును, స్త్రీ పుంసమతత్త్వుఁడైన పరాత్పరునకు నమస్కారము,

శ్లో॥ వాగర్థ సృష్టివిషయే సురవైరి నిబర్హణే
రామ దృక్పద్మ రవయే - భవిష్య ద్బ్రహ్మణే నమః॥

తా॥ పలుకులయొక్క, తదర్థముయొక్క నిర్మాణమునకు కారకుఁడైనవాఁడును రాక్షసులను సంహరించు వాఁడును, రాముని కండ్లు అను పద్మములకు సూర్యునివంటివాఁడును భవిష్యత్తునందలి యుగములకు బ్రహ్మయైనవాఁడు నగు హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ తద్రహస్య మిదం మంత్రం - సాంగం సమ్య గ్బ్రవీమి తే
తం శృణు ష్వైకచిత్తేన - గుహ్య మిష్టార్థదం మునే ।

తా॥ ఓమైత్రేయమహామునీ ! రహస్యమగు నీమంత్రమును అంగసహితముగా చెప్పుచున్నాను. రహస్యమై ఇష్టములగు కోర్కెల నిచ్చు దీనిని ఏకాగ్రతచిత్తుఁడవై వినవలసినది.

శ్లో॥ మంత్రోద్ధారం చ యంత్రంచ - ఛందర్షి న్యాస దేవతాః
మంత్రసంగ్రహ మే వాస్య - పురశ్చర్యా క్రమంపునః॥

తా॥ మంత్రోద్ధారమును, యంత్రమును, ఆమంత్రపు ఛందస్సును, ఋషిని, అంగన్యాసకరన్యాసములను, దేవతను, మంత్రసంగ్రహమును, మంత్రపురశ్చర్యా విధానమును,

శ్లో॥ నిత్యమంత్రక్రమం చాఽపి - ప్రయోగస్య పృథక్పృథక్
తత్తదాసన భేదాం శ్చ - మాన కాల ఫలా న్యపి ।

తా॥ నిత్య మంత్ర క్రమమును, వేఱువేఱువిధముల ప్రయోగములను. ఆయా ఆసనభేదములను, నియమము, కాలము, మంత్రఫలమును,

శ్లో॥ హవచ క్రమ మేవాంగ - కలశై రభిషేచనమ్
కాల విజ్ఞానమానస్య - విభూతి ర్యోగ మేవ చ॥

తా॥ హోమవిధానము, కలశములతో నభిషేకవిధానము సమ యజ్ఞతతో చేయువాని కేర్పడు ఐశ్వర్యయోగము.

శ్లో॥ స్వ స్వరూపానుసంధాన - మేవమా ద్యత్ర సన్తి వా
సర్వా నేతాన్ క్రమాన్ వక్ష్యే - వివిచ్యైవ పృథక్ పృథక్

తా॥ స్వస్వరూపాను సంధానాదు లేవైననున్న నవి సమస్తము క్రమముగా వేఱువేఱుగ వివేచించి చెప్పుచున్నాను.

శ్లో॥ శృణు ష్వావహితో భూత్వా - సమ్య గ్వక్ష్యామి పార్వతి
ఆపదుద్ధారకం దివ్యం - అయత్నఫలదం నృణామ్

తా॥ ఓపార్వతీ పైవిషయముల నన్నిటిని సావధానుఁడనై చెప్పు, చున్నాను వినుము. ఇది ఆపదలబారినుండి రక్షించునది. దివ్యమైనది యత్నించకనే నరులకు ఫలమిచ్చునది.

శ్లో॥ సర్వేషాం చైవ లోకానాం - సాధనం త్వభిలాషితం
విశేషతో నృపాణాం చ - శత్రు విద్రావకం మహత్॥

తా॥ ప్రజలందఱకు సాధనమైనది. అభిలషిత మైనదియు. విశే షించి రాజులకు నెంతయు శత్రు వినాశకరము-

శ్లో॥ స్తంభ నోచ్చాట నోద్ధారం - శాంతి ప్రజ్ఞా వివర్ధనం
అంగన్యాస కరన్యాస - దేహన్యాస సమన్వితమ్॥

తా॥ దుష్టముల స్తంభించుటకు పిశాచముల పారద్రోలుటకు యోగ్యమైనది, శాంతిని, ప్రజ్ఞను వృద్ధిపొందించునది. అంగన్యాసము, కరన్యాసము, దేహన్యాసమును కల్గియుండునదియు,

శ్లో॥ నవన్యాస సమాయుక్తం - సాంగావరణ పూర్వకమ్
బహుమంత్రాన్వితం యంత్ర - మూలమంత్ర పురస్సరమ్॥

తా॥ నవన్యాసములతో కూడినది. అంగసహితమై ఆవరణలతో కూడియున్నది. అనేక మంత్రములతో కూడి యంత్రము, మూలమంత్రము గల్గియుండునది.

శ్లో॥ ప్రత్యర్థికృత మంత్రాగ్ని - యంత్రౌద్యాయ నాశనమ్
పాప శోక ప్రశమనం - సర్వశత్రు విమర్దనమ్॥

తా॥ విరోధులు ప్రయోగించిన మంత్రయంత్రాదులను నాశనమొనర్చునది, పాపమును, శోకమును పోగొట్టునది. సర్వశత్రువులను నాశనమొనర్చునది

శ్లో॥ జ్వరాపస్మార రోగాణాం- క్షయాదీనాం విశేషతః
నాశనం స్మృతి మాత్రేణ- మంత్రరాజ ప్రభావతః॥

తా॥ ఈ మంత్ర రాజము యొక్క ప్రభావముచే సంస్మరించిన మాత్రమున జ్వరములు. అపస్మారములు, రోగములు, క్షయాదికములు తొలగిపోవును.

శ్లో॥ రాజ చోర గ్రహాదీనాం- శమనం సుఖవర్ధనమ్
చిత్తశుద్ధికరం మోక్ష- దాయకం సర్వసిద్ధిదమ్॥

తా॥ ఈ మంత్రము రాజభయమును, చోరభయమును, దుష్టగ్రహభీతిని పోగొట్టునది. సుఖమును పెంపొందించునది, మనశ్శాంతి నిచ్చునది సర్వసిద్ధుల నొసగునది, మోక్షమునుకూడా నిచ్చునది.

శ్లో॥ రహస్యాతిరహస్యం శ్రీ కరం త్రైలోక్య దుర్లభమ్
స్నేహా ద్వక్ష్యామితే మంత్రం- మంత్రసారం చ త్వం ప్రియే॥

తా॥ మిక్కిలి రహస్యమైనది, ముల్లోకములందు దుర్లభమైనది. ఓ ప్రియురాలా! అత్యంత మిష్టురాల వగుటచే నీకీ మంత్రమును చెప్పుచున్నాను.

శ్లో॥ మామక ప్రియ మత్యంతం- సర్వోత్కృష్ట మనుత్తమమ్
సర్వకామార్థదం రాజ్య- భోగ శ్రీకర ముత్తమమ్॥

తా॥ నాకు మిక్కిలి ఇష్టమైనది, అన్నిటికిమించి గొప్పది, అన్ని కోర్కెలు దీర్చునది, రాజ్యభోగ సంపదలనిచ్చు నుత్తమమైనది.

శ్లో॥ అవితర్క్య మనిర్దేశ్యం- దేవ దానవ దుర్లభమ్
అవికాస్య మిదం మంత్రం- సర్వశక్తిద మద్భుతమ్॥

తా॥ వితర్కించదగినది, నిర్దేశింపదగనిది, దేవతలకును, రాక్షసులకును లభింపనిది, బయల్పరచదగనిది ఈ మంత్రము అద్భుతమై అన్ని శక్తులను ఇచ్చునట్టిది.

శ్లో॥ స్మరణా దేవ నశ్యంతి- భూత ప్రేత పిశాచకాః
విద్రవంతి భయాద్భ్రాంతాః శక్రస్యే వాసురాదయః।

తా॥ స్మరించినమాత్రముననే భూత ప్రేత పిశాచాదులన్నియు భయమునంది ఇంద్రునకు రాక్షసులు భయపడి పారిపోవునట్లు పారిపోవును.

శ్లో॥ పఠేద్వా ధరయే ద్ధస్తే- పూజయే ద్వాపి పుస్తకే
చోరాగ్నిజం భయం నాస్తి- బాలరోగ గ్రహాదికమ్॥

తా॥ ఈ మంత్రమును పఠించినను, హస్తముననుంచుకొనను పుస్తకముననుంచి పూజించినను, దొంగవలని భయము, అగ్ని భయము, బాలరోగభయము, బాలగ్రహ భయమును ఉండదు.

శ్లో॥ నాస్తి మారీభయం తత్ర- సర్వత్ర స్సుఖ మాప్నుయాత్
ఆయురారోగ్య మైశ్వర్యం - పుత్రపౌత్రాది సంపదమ్॥

తా॥ ఈ మంత్రమున్నచోట మారివలని భయముండదు. అంతటను సుఖము పొందగల్గును. ఆయువు, ఆరోగ్యము, ఐశ్వర్యము, పుత్ర పౌత్రాది సంపదయు,

శ్లో॥ లభంతే జాతక స్యాస్య- పుస్తకస్యాఽపి పూజనమ్
మంత్ర యంత్రాది సంహార- మపమృత్యుం తరిష్యతి॥

తా॥ దీనిచే పొందుదురు ఈ మంత్ర గ్రంథము యొక్క పూజనము. మంత్ర యంత్ర సంబంధములగు నాశమును, అకాలమందలి మృత్యువును కూడ తొలగించును.

శ్లో॥ కాలమృత్యు మతిక్రమ్య- జీవేద్యుక్తాయుషం నరాః
యో నిత్యం జపతే తస్య- సమ్య గ్వక్ష్యామి తత్ఫలమ్॥

తా॥ నరులు దీనిచే కాలమందలి మృత్యువును సైతం మధిగమించి యోగ్యమగు నాయువుతో జీవింతురు. ఎవడు నిత్యమాతని ఈ మంత్రమును జపించునో వానికేర్పడు ఫలమును చెప్పుచున్నాను.

శ్లో॥ సేవకా ఇవ భూపాలాః- దాసీజన ఇ వాంగనాః
వశ్యా భవంతి చావశ్యం - ఫలాయంతే చ శత్రవః॥

తా॥ రాజులు సేవకులవలెను, స్త్రీలందఱు దాసీ జనము వలెను తప్పక వశులగుదురు. శత్రువులందరు భయమున పరిగిడుదురు.

శ్లో॥ న చోరాది భయం తత్ర- నాస్తి వ్యాధి మృగా ద్భయమ్
లాభాస్తే సిద్ధయ స్సర్వ- విధా హనుమదాజ్ఞయా॥

తా॥ అచ్చట దొంగలభయము ఉండదు. వ్యాధులవలనగాని జంతువుల మూలమునగాని భయము ఉండదు, హనుమంతుని యాజ్ఞచే సర్వ లాభములు సర్వ సిద్ధులును

శ్లో॥ నాభిదఘ్న జలే సమ్యక్- జపే ద్వా సిద్ధి మాప్నుయాత్
అయుతం జపత స్తస్య- భవే ద్వై బంధమోక్షణమ్॥

తా॥ బొడ్డువరకు లోతుగ జలమున నుండి జపించినచో సిద్ధించును. పదివేలు జపము చేసిన వానికి బంధము నుండి విముక్తి యేర్పడును.

శ్లో॥ సలోకకామదం సద్యః-శృణు పంచదశాక్షరమ్
ఏత ద్విజ్ఞానమాత్రేణ- సర్వ శత్రుజయం భవేత్॥

తా॥ లౌకికములగు కోర్కెలన్నిటిని వెంటనే తీర్చునట్టి పదునైదక్షరముల మంత్రమును వినుము. దీనిని తెలిసికొన్న మాత్రముననే శత్రుజయము సిద్ధించును.

శ్లో॥ సర్వైశ్వర్యకరం హృద్యం- సర్వ కామప్రదం నృణామ్
ఖేచరత్వం చ ఘటికా -చాఽదృశ్యాఽచాఽపిచాఽంజనమ్

తా॥ ఇది సమస్త భాగ్యములనిచ్చునది మనసున కింపగునట్టిది. నరులకు అన్ని కోర్కెలు తీర్చునట్టిది. ఆకాశమునందు సంచరింపజేయునది. అదృశ్య శక్తి నిచ్చునది అంజనశక్తిని.

శ్లో॥ మృత సంజీవనం పాదు- కాగితంచ దదా త్యసౌ
వంచవక్త్రస్య హనుమా- ను క్తానుష్ఠానకారిణః॥

తా॥ మృత సంజీవన శక్తిని, పాదుకాగతిశక్తిని పంచవక్త్ర హనుమంతుఁడు ఈ మంత్రము ననుష్ఠించువారికిచ్చును.

శ్లో॥ తస్మా త్సర్వ ప్రయత్నేన- యంత్రోద్ధారణ పూర్వకమ్
మంత్ర స్వరూపం విజ్ఞాయ- యంత్రం చాఽపి విశేషతః॥

తా॥ కావున గొప్ప ప్రయత్నముతో యంత్రోద్ధారణ పూర్వకముగా మంత్ర స్వరూపమును, విశేషముగా యంత్రమును సైతము తెలిసికొని

శ్లో॥ హనుమ న్మనుముఖ్యేషు- సర్వకామార్థ సిద్ధయే
ఇమ మేవ పరం జప్యం- మంత్రరాజం మ యోచ్యతే॥

తా॥ సర్వ కామ్యములు నెరవేరుటకు హనుమంతుని ముఖ్య మంత్రములలో ఇదియే ప్రశస్తమై జపింపదగినది. అట్టి మంత్ర శ్రేష్ఠము నాచే చెప్పబడుచున్నది.

శ్లో॥ ఆ ధేవానిం జగత్పూజ్యం- వంచవక్త్ర హనూమతః
పంచాక్షరీ మహామంత్రం- షట్పల్లవ సమన్వితమ్॥

తా॥ ఇప్పుడు లోకముచే పూజింపబడినట్టియు, పంచముఖ హనుమంతుని పంచాక్షరీ మహా మంత్రమును నమః, వషట్, ఖేఖే, హుం, వౌషట్, ఫట్, అను షట్పల్లవములతో కూడినది చెప్పబడుచున్నది.

శ్లో॥ హరిం నృసింహం పక్షీంద్రం వరాహం తురగాననమ్
షట్పల్లవేన సంయుక్తం- మంత్రమిష్టార్థదం నృణామ్॥

తా॥ వానరము, నారసింహము, గరుడము, వరాహము, అశ్వముల ముఖములుకలది, షట్పల్లవములతో కూడినది, నరులకు కోర్కెల దీర్చునట్టి మంత్రము.

శ్లో॥ పంక్తి శ్ఛందో ఋషి స్తస్య - ఈశ్వరః పరికీర్తితః
దేవతా పంచవక్త్రాఖ్యా - హనుమా న్బీజ మైశ్వరమ్॥

తా॥ పంక్తిచ్ఛందము, ఈశ్వర ఋషియు చెప్పబడినది. పంచవక్త్రహనుమాన్ దేవత, ఈశ్వర బీజము.

శ్లో॥ నృసింహశక్తి రిత్యుక్తా - ఫట్ కీలక ముదీరతమ్
క రాంగన్యాస మే వాస్య - మంత్రే ణైవ సువిన్యసేత్॥

తా॥ నృసింహశ్శక్తిః అని, ఫట్ కీలకం అని చెప్పబడినది. అంగన్యాస కరన్యాసము లీమంత్రముచేతనే దీనికి చెప్పబడినవి.

శ్లో॥ శిరో వదన హృ త్కుక్షీ - గుహ్య వ్యాపక మాచరేత్
మంత్రాక్షర విధానస్య - న్యాసం సమ్య క్ప్రకీర్తితమ్॥
దిగ్బంధనం తు పూర్వేణ - ధ్యాయే ద్దేవం సమీహితః।

తా॥ శిరస్సు, ముఖము, హృదయము, గూహ్య ప్రదేశములందు వ్యాపన మాచరింపవలెను. మంత్రాక్షర విధానమునకు న్యాసము మిక్కిలి చెప్పబడినది. పూర్వమువలె దిగ్బంధనమొనర్చి హనుమంతుని భక్తితో ధ్యానము చేయవలెను.

ధ్యానం

శ్లో॥ వందే వానర నారసింహ ఖగరాట్ క్రో డాశ్వ వక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచ నయనం దేదీప్యమానం రుచా
హస్తాబ్జైరసి ఖేట పుస్తక సుధాకుంభాం కుశాద్రీన్ హలం
ఖట్వాంగం ఫణి భూరుహం చ దధతం సర్వారిదైత్యాపహమ్॥

తా॥ ఇది ధ్యానము. వానర, నృసింహ, గరుడ, వరాహ, అశ్వ ముఖములతో కూడినట్టియు, అనేకా లంకారములు కల్గినట్టియు, మూడై

దుల నేత్రములు కల్గినట్టియు, కాంతితో ప్రకాశించునట్టియు చేతులతో కత్తి డాలు, పుస్తకము, అమృతకలశము, అంకుశము, పర్వతమును, నాగటిని, మంచపుకోటిని, పామును, చెట్టును ధరించునట్టియు, గర్వించిన శత్రువులగు రాక్షసుల సంహరించువానికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ అథ మంత్రాంతరం వక్ష్యే - స్వాహాంతం ప్రణవాదికం
హరిమర్కట మర్కటాయ - ఇత్యుక్తం త న్మనుం స్మరేత్॥

తా॥ అటుపిమ్మట వేఱొక మంత్రమును చెప్పుచున్నాను-'స్వాహా' అనునది చివఱను, 'ఓం' అనునది ముందును చెప్పి 'హరి' మర్కట మర్కటాయ' అని యామంత్రమును స్మరింపవలెను.

శ్లో॥ ఛందోమాత్రం తు జగతీ — పృథ గుక్తం మహేశ్వరీ
భేద మేవ హి మంత్రస్య - తత్సర్వం పూర్వమంత్రవత్॥

తా॥ ఓపార్వతి : ఛందస్సుమాత్రము జగతీఛందముగా వేరుగా చెప్పబడినది. ఈ మంత్రమునకు భేదమిదియే. మిగిలినదంతయు పూర్వ మంత్రమువలెనే.

శ్లో॥ ఏవం ధ్యాత్వా జపే న్మంత్రం - నవలక్ష మిమం ప్రియే।
పురశ్చర్యాక్రమం చాగ్రే - హ్యుచ్యతే సర్వసంగ్రహః॥

తా॥ ఇట్లు ధ్యానించి ఓపార్వతీ। ఈ మంత్రమును తొమ్మిది లక్షలమార్లు జపించవలెను. పురశ్చర్యాక్రమ మంతయు సంగ్రహముగ ముందు చెప్పబడుచున్నది.

శ్లో॥ అథ మంత్రాంతరం వక్ష్యే - పంచవక్త్ర హనూమతః
ప్రత్యర్థి కారిత స్యాస్య - శృంఖలస్య విభేదతః॥

తా॥ పిమ్మట శత్రుశృంఖలలను తెగద్రోలు పంచముఖ హనుమంతుని వేరొక మంత్రమును చెప్పుచున్నాను.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య - హరిమర్కట మర్కటః
మర్కటాయా పదం చోక్త్వా - పరిలిఖ్యతి లిఖ్యతే॥

తా॥ మొదట 'ఓం' కరము నుచ్చరించి 'హరిమర్కట'మర్కట అని 'మర్కటాయ' అనుపదముపల్కి 'పరి లిఖ్యతిలిఖ్యతి' అని

శ్లో॥ తతో భూమిత లే త్యుక్త్వా - యది నశ్యతి నశ్యతి
తతో వామకరే త్యుక్త్వా — ప్రతిముంచతి ముంచతి॥

తా। పిమ్మట 'భూమితలే' అని పల్కి, యది నశ్యతి నశ్యతిఅని, ఆపిదప 'వామకరే' అని ప్రతిముంచతి ముంచతి యని

శ్లో॥ అథ శృంఖలికాం చోక్త్వా - మంత్రి మేవం పఠే ద్యది
అష్టోత్తర సహస్రేణ - శృంఖలా న్ముచ్యతే నరః

తా॥ పిమ్మట 'శృంఖలికాం' అని పల్కి ఇట్లు మంత్రమును పఠించినచో వేయియెనిమిదిపర్యాయములతో నరుఁడు సంకెలలనుండి విడువబడును.

శ్లో॥ మాసత్రితయ ముద్దిశ్య - పఠితే నియతః పుమాన్
నామధేయ పదం క్షిప్త్వా - త ద్రిపూ న్నాశయే ద్ధ్రువమ్॥

తా॥ మూఁడుమాసములు ఉద్దేశించి పురుషుఁడు నియమముతో పఠించినచో నామధేయపదము విడువబడి తప్పక ఆ శత్రువును నాశన మొనర్చును.

శ్లో॥ షట్కోణే రిపు మాలిఖ్య - కోణే ష్వనలసంభవాన్
బీజా న్విలిఖ్య తద్బాహ్యే - వాయుబీజాం సమాలిఖేత్॥

తా॥ షట్కోణమునందు శత్రునామము వ్రాసి కోణములందు అగ్ని బీజములను లిఖించవలెను.

శ్లో॥ అంగారే ణైవ సంలిఖ్య - త ద్యంత్రోపరి సంస్థితః
మాసమాత్రం జపేన్మంత్రం - రిపుం నాశయతి ధ్రువమ్॥

తా॥ బొగ్గుతో వ్రాసి ఆ యంత్రముపై నున్నవాఁడై ఒక్క మాసము మంత్రమును జపించవలెను. తప్పక శత్రువును జయించును.

శ్లో॥ అథేదానీం ప్రవక్ష్యామి పంచవక్త్రి హనూమతః
మంత్రోత్పత్తిం చ ఛందశ్చ - దేవతా శక్తి కీలకాన్॥

తా॥ ఇక నిప్పుడు పంచముఖాంజనేయుని మంత్రమును, ఛంద స్సును, ఋషిని దేవతను, శక్తిని, కీలకమును చెప్పుచున్నాను.

శ్లో॥ బీజం దిగ్బంధనం చాఽపి - తన్త్రప్రయోగ పరాక్రమాన్
సతారక సితం చాదౌ - సముచ్చార్యారిమర్దనమ్॥

తా॥ బీజమును, దిగ్బంధనమును, అపంత్ర ప్రయోగమును, విశి ష్టతను చెప్పుచున్నాను. ముందుగా తిరించేను 'హం' యను నక్షరముల నుంచి 'అరిమర్దన' శబ్దము నుచ్చరించి

శ్లో॥ సంబోధన పదం ప్రోక్త్వా - మర్కటాయేతి చోచ్చరేత్
స పంచవక్త్రి హనుమాన్ - దేవతా పరికీర్తితా॥

తా సంబోధనగా పదమును లిక్కి మర్కటాయ అనునది యుచ్చరింపవలెను. దీనికి పంచవక్త్రి హనుమంతుఁడే దేవతగా చెప్ప బడెను.

శ్లో॥ వరాహబీజ ముచ్చార్య - షట్పదం సముదీరయేత్
యోజయే ద్వహ్నిజాయాం తు - ఏషా పంచదశాక్షరీ॥

తా॥ వరాహబీజము నుచ్చరించి షట్పల్లవము నుంచవలెను. పిదప స్వాహాపల్కిన నది పంచదశాక్షరీ మంత్రము. "ఓం హరి అరిమర్దన మర్కటాయ గ్లౌం ఫట్ స్వాహా" అనునది.

శ్లో॥ అస్య ఛందోఽప్యృతవిరా - డీశ్వరో ఋషి రుచ్యతే
స పంచవక్త్రి హనుమాన్ - దేవతా పరికీర్తితా॥

తా॥ దీనికి అప్పృతవిరాట్ ఛందస్సు ఈశ్వరఋషిః అని, పంచి వక్త్రిహనుమాన్ దేవత అని చెప్పబడుచున్నది.

శ్లో॥ బీజం చ శివబీజం స్యా - చ్ఛక్తిస్స్యా ద్దహనాంగనామ్
నవాత్రిషట్పదం చైవ - కీలకం సముదీరితమ్॥

తా॥ శివబీజము, దహనాంగనాశక్తిః, నవాత్రి షట్పదం కీలకము చెప్పబడినది.

శ్లో॥ శత్రుసంహారవే వాస్య - వినియోగ ముదాహృతమ్
షడ్భిర్మంత్రపదై ర్న్యాస - ద్వయం మంత్రాంగమూలతః॥

తా॥ ఈమంత్రము శత్రుసంహారే వినియోగః అని చెప్పబడినది. మంత్రపదములతో నారింటితో అంగన్యాస కరన్యాసములు రెండు నొనర్చ వలెను.

శ్లో॥ కృత్వా దిగ్బంధనం పశ్చా - దక్షరన్యాస మాచరేత్
ఉత్పత్తి స్థితి సంహార — న్యాసాన్ కుర్యా ద్విచక్షణః॥

తా॥ దిగ్బంధనమాచరించి పిదప అక్షరన్యాస మాచరించవలెను. సాలోచనుఁడై ఉత్పత్తిన్యాస। స్థితిన్యాస, సంహారన్యాసము, లాచరింప వలెను.

శ్లో॥ మూలమంత్రాక్షరే ణైవం — మూలవర్ణస్య సక్రమాత్
శిరో లలాట నేత్రాస్య - కంఠ హృ న్నాభి గుహ్యకే।

తా। మూలమంత్రాక్షరములతోనే వర్ణముల క్రమముగా శిరస్సు, నుదురు, కండ్లు, కంఠము, హృదయము, బొడ్డు, గుహ్యప్రదేశము,

శ్లో॥ భుజపార్శ్వే చ పాదే ద్వే - సర్వేణ వ్యాపకం న్యసేత్
న్యాస మేవం క్రమా త్కృత్వా- ధ్యాయే ద్రుద్రాత్మకంహరిమ్॥

తా॥ భుజపార్శ్వములందు, రెండుపాదములందును న్యాస మొన ర్చవలెను, ఈరీతిగా క్రమమున న్యాసమాచరించి రుద్రస్వరూపుడగు హనుమంతు నీరీతిగా ధ్యానము చేయవలెను.

ధ్యానం

శ్లో॥ ధ్యాయే ద్వానర నారసింహ ఖగరా ట్క్రోడాశ్వ వక్త్రాంచితం
పాలాక్ష స్ఫుట పంచవక్త్ర రుచిరం బాలార్కకోటి ద్యుతిం
హస్తై శ్శూలకపాల ముద్గర హలం కౌమోదకీ భూరుహం
ఖట్వాం గాంకుశ పాశ పర్వత ధరం పీతాంబరం వానరమ్॥

తా॥ మర్కట. నృసింహ, గరుడ, వరాహ. అశ్వముఖములతో ప్రకాశించునట్టి, నుదుటి కంటితోనున్న అయిదుముఖముల కాంతికల్గి నట్టియు, కోటిప్రభాతకాల సూర్యులతో సమానమగు కాంతిగల్గినట్టియు. చేతులతో శూలము, కపాలము, సమ్మెట, నాగలి, గద, వృక్షము,

పంచపక్షోపం. అంకుశము పాశము, పర్వతములను ధరించినట్టియు
వచ్చి నిలిచినట్టి వానరశ్రేష్ఠునకు నమస్కరింపవలెను.

ఇతి గ్రంధాంతరే

శ్లో॥ పంచవక్త్రం మహాభీమం - త్రిపంచ నయనై ర్యుతమ్
దశభి ర్బాహుభి ర్యుక్తం - సర్వ కామార్థ సిద్ధిదమ్॥

తా॥ ఐదుముఖములు కలిగినట్టియు, మిక్కిలి భయంకరమైనట్టియు, మూడైదుల కండ్లతో నొప్పినట్టియు, పది భుజములతో నొప్పినట్టియు, అన్ని కోర్కెలం దీర్చునట్టియు,

శ్లో॥ పూర్వే తు వానరం వక్త్రం - హృదయం సూర్యసన్నిభమ్
సూర్యకోటి కరాభాసం - ఉపవక్త్రం సు తేజసమ్॥

తా॥ పూర్వదిశయందు వానరముఖమును కలిగినట్టియు, సూర్యునితో సమానమగు హృదయము కలిగినట్టియు, కోటిసూర్య కిరణములవలె ప్రకాశించునట్టియు, గొప్పతేజస్సుకల వానరముఖము కలిగినట్టి,

శ్లో॥ దంష్ట్రా కరాళ వదనం - భృకుటీ కుటిలేక్షణమ్
అస్య ప్రదక్షిణం వక్త్రం - నారసింహం మహాద్భుతమ్॥

తా॥ కోరలతో భయంకరమైన ముఖముకలిగినట్టి, కనుబొమల ముడితోటి చూపులుకలిగినట్టి, ముఖమునకు దక్షిణముగ అద్భుతమగు నారసింహ ముఖము కలినట్టి.

శ్లో॥ అత్యుగ్ర తేజో జ్వలితం - భీషణం భయనాశనమ్
పశ్చిమం గారుడం వక్త్రం - వజ్రతుండం మహాబలమ్।

తా॥ మిక్కిలి గొప్పతేజస్సుతో ప్రకాశించునట్టి, భయంకరమైనట్టి, భయమును పోగొట్టునట్టి గొప్పబలము, వజ్రాయుధమువంటి ముక్కుకలిగిన పశ్చిమముగ గారుడముఖము కలినట్టి.

శ్లో॥ సర్వ రోగ ప్రశమనం - విష భూత నివారణమ్
ఉత్తరం సూకరం వక్త్రం - కృష్ణదీప్తం నభోనిభమ్

తా॥ సమస్తములైన రోగములను పోగొట్టునట్టి, విషములను, భూతములను అడ్డగించునట్టి, నల్లనైన దేహముకల్గి ఆకాశముతో సమానమైన వరాహముఖ ముత్తరమున కల్గినట్టి.

శ్లో॥ పాతాళే సిద్ధిదం న్నౄణాం - జ్వర రోగాది కృంతనమ్॥
ఊర్ధ్వం హయాననం ఘోరం - దాన వాంతకరం పరమ్॥

తా॥ మనుష్యులకు పాతాళలోకమున సిద్ధినిచ్చునట్టి, జ్వరములు, రోగములు పోగొట్టునట్టి రాక్షసులను మిక్కిలి నాశమొనర్పజాలినట్టి, ఘోరమగు గుఱ్ఱపుతల ఊర్ధ్వభాగమున కలిగినట్టి.

శ్లో॥ యేన వక్త్రేణ విప్రేంద్ర - సర్వవిద్యా వినిర్యయుః
ఏత త్పంచముఖం తస్య - ధ్యాయతా మభయంకరమ్॥

తా॥ ఓమైత్రేయా! ఏముఖములనుండి సర్వవిద్యలు వచ్చెనో అట్టి అభయమిడు నాతని పంచముఖములను ధ్యానించవలెను.

శ్లో॥ ఖడ్గం త్రిశూలం ఖట్వాంగం - పాశ మంకుశ పర్వతౌ
ద్రుమం కౌమోదకీ ముండం - దధానం హల ముత్కటం
ద్వౌముష్టి సంగతౌ మూర్ధ్ని - సాయుధై ర్దశభిర్భుజైః
ఏతాన్యాయుధజాలాని - ధారయంతం యజామహే॥

తా॥ కత్తి, త్రిశూలము, మంచపుకోడు పాశము, అంకుశము, పర్వతము, వృక్షము, గద, శిరస్సు, నాగలి అను ఆయుధసమూహమును పదిచేతులతో ధరించినవానిని అర్చించుచున్నాము.

శ్లో॥ దివ్య మాల్యాంబర ధరం - దివ్య గంధానులేపనమ్
పీతాంబర ధరం దేవం - దివ్యాభరణ భూషితమ్॥

తా॥ దివ్యములగు మాలలను, వస్త్రములను ధరించినట్టి, గొప్పదగు గంధమును మైపూతగపూసినట్టి, గొప్ప ఆభరణములతో నలంకరింపబడిన, పచ్చని వస్త్రము ధరించిన దేవుని

శ్లో॥ ప్రేతాస నోపవిష్టం తం - పంచవక్త్రధరం విభుమ్
వినియోగకరం విశ్వం - మోహనం సర్వసాధనమ్॥

తా॥ శవాసనముపై కూర్చున్నవానిని, ఐదుముఖములు కలవానిని, ఉపయోగశీలిని, జగన్మోహనుని, సర్వసాధకుని,

శ్లో॥ సర్వరోగ ప్రశమనం - సర్వపాప హరం గురుమ్
సర్వశత్రు క్షయకరం - సర్వ సామర్థ్య దాయకమ్॥

తా॥ రోగములన్నిటిని పోగొట్టునట్టి. పాపములన్నిటిని పోగొట్టు

సమర్థతగల్గినట్టి, సమస్తశత్రువులను నాశనమొనర్చునట్టి సర్వసామర్థ్యత నిచ్చునట్టి.

శ్లో॥ పంచవక్త్రం హనూమంతం - సర్వలోకైక పూజితమ్
ఏవం ధ్యాత్వా జపేన్మంత్రం - ప్రత్యహం నియతః పుమాన్॥

తా॥ లోకములన్నిటికి ఏకైక పూజ్యుడైనట్టి పంచముఖ హనుమంతుని ప్రతిదినము మనుజుడు నియమముతో పైరీతిగ ధ్యానించి మంత్రమును జపించవలెను.

శ్లో॥ అష్టోత్తర సహస్రేణ - చాపమృత్యుం తరిష్యతి
కిం వక్తవ్య మిహైవాస్య - ప్రణశ్యంతి క్షుధామయాః॥

తా॥ వేయి ఎనిమిది పర్యాయములు దీని జపించిన బాణము వలన చావునుండి రక్షించును. వేరుగ చెప్పనేల? దీనిచే ఆకలి, రోగములు నాశనమగును.

శ్లో॥ పాపసంఘాః ప్రణశ్యంతి — చైకావృత్త్యైవ తత్క్షణాత్॥

తా॥ ఒక్క ఆవృత్తివలననే ఆక్షణముననే పాపములన్నియు తొలగిపోవును.

శ్లో॥ వానప్రస్థో గృహీ భిక్షుః -అజ్ఞానా ద్గురుదూషకః
అనుక్తమంత్ర జాపీ చ - సురాపీ స్వర్ణవంచకః॥
ద్విరావృత్త్యా చ తత్పాపం - హర త్యేవ న సంశయః॥

తా॥ వానప్రస్థాశ్రమమందున్నవాడును, గృహస్థుడును, సన్యాసియు, అజ్ఞానముచే గురువును నిందించినవాడు, గురూపదేశమందక మంత్రజపముచేయువాడు మద్యపానమొనర్చువాడు, బంగారము దొంగిలించినవాడుకాని రెండుమార్లీ మంత్ర ముచ్చరించినతోడనే ఆపాపమును నిస్సందేహముగ హరించును.

శ్లో॥ బుద్ధిపూర్వ కృతౌఘేషు - గ్రస్తోఽథ గురుతల్పగః
భ్రూణహా గురునిందార్థీ - మిత్రఘ్నో గురువంచకః
త్రివారాభ్యాసమాత్రేణ - పాపరాశింక్షణాద్ధహేత్॥

తా॥ బుద్ధిపూర్వకముగనే పాపసమూహమున పడినవాడు, గురుపత్ని గమనమొనర్చినవాడు, గర్భమును పోగొట్టినవాడు, గురువును

నిందింపజూచినవాఁడు ముమ్మారు దీనిని జపించినమాత్రమున పాపరాశి నంతను పోగొట్టుకొనును.

శ్లో॥ మంత్ర స్యోచ్చారణే నైవ - విద్రవం త్యఘసంచయాః
అవృత్యా షట్సహస్రస్య - సర్వవ్యాధి హరం పరమ్॥

తా॥ మంత్రముయొక్క ఉచ్చారణతోడనే పాపసమూహములన్నియు పోవును. ఆరువేలావృత్తిచే సర్వవ్యాధులు తగ్గిపోవును.

శ్లో॥ భూత ప్రేత పిశా చోగ్ర - బేతాళ బ్రహ్మరాక్షసాః
అష్టోత్తరశ తావృత్యా - వ్యాధయః పూర్వ సంభవాః॥

తా॥ నూటయెనిమిది పర్యాయములతో భూత ప్రేతపిశాచ బేతాళ బ్రహ్మరాక్షసులు, అనాదిగానున్న వ్యాధులును తొలగును.

శ్లో॥ ఐకాహికం చ ద్వ్యాహికం - త్ర్యాహికం చతురాహికమ్
మాసికం జ్వర మత్యుగ్రం - సహస్రావృత్తి మాత్రతః।

తా॥ వేయిమార్లావృత్తిచేసినచో ఒక్కరోజువచ్చిన జ్వరము, రెండురోజుల జ్వరము, మూడురోజుల జ్వరము, నాల్గురోజులజ్వరమును మిక్కిలి ఘోరమగు నెలజ్వరముసైతము తొలగును.

శ్లో॥ క్షయాపస్మార కుష్ఠార్శ - భగంధర మహోదరాః
కర్ణ నేత్రోద్భవాన్ రోగాన్ - సహస్రావృత్తితో హరేత్॥

తా॥ క్షయ, అపస్మారము, కుష్ఠు, అర్శోరోగము, భగందరము, మహోదరవ్యాధి చెవులందు, కండ్లయందు పుట్టురోగములును వేయిమార్లు ఆవృత్తిచేసిన తగ్గును.

శ్లో। ఇతః పరం తు దేవేశి - విస్తరేణ మ యోచ్యతే
యంత్రాంగం మూలమంత్రాంగం - పంచవక్త్ర హనూమతః
మూలమంత్రంచ వక్తవ్యం - యంత్రపూర్వాఙ్గ మాదరాత్॥

తా॥ ఇంతకు తరువాత విషయము విస్తరించి నాచే చెప్పఁబడు చున్నది. యంత్రాంగమునకు ముందే యంత్రాంగము, మూలమంత్రాంగము, పంచముఖహనుమంతుని మూలమంత్రమున్ను చెప్పదగియున్నవి.

ఓం హ్రాం క్ష్రౌం గ్లౌం హుం హ్సౌం ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే ప్రకట పరాక్రమాక్రాంత సకల దిఙ్మండలాయ,

నిజకీర్తి స్ఫూర్తి ధావళ్య వితానాయమాన జగత్త్రితయాయ, అతులబలైశ్వర్య రుద్రావతారాయ, మైరావణ మదవారణ గర్వనిర్వాపణోత్కంఠ కంఠీరవాయ, బ్రహ్మాస్త్రగర్వ సర్వంకషాయ, వజ్రశరీరాయ, లంకాలంకారహారిణే, తృణీకృతార్ణవలంఘనాయ, అక్షశిక్షణవిచక్షణాయ, దశగ్రీవ గర్వపర్వతోత్పాటనాయ, లక్ష్మణప్రాణదాయినే, సీతామనోల్లాసకరాయ, రామమానస చకోరామృతకరాయ, మణికుండల మండిత గండస్థలాయ, మందహాసోజ్జ్వల న్ముఖారవిందాయ, మౌంజీ కౌపీన విరాజత్కటితటాయ, కనకయజ్ఞోపవీతాయ, దుర్వార వారకీలిత లంబశిఖాయ, తటిత్కోటి సముజ్జ్వల పీతాంబరాలంకృతాయ, తప్త జాంబూనద ప్రభాభాసుర రమ్య దివ్యమంగళవిగ్రహాయ, మణిమయ గ్రైవేయాంగద హార కింకిణీ కిరీటోదారమూర్తయే, రక్తపంకేరుహాక్షాయ, త్రిపంచనయన స్ఫుర త్పంచవక్త్ర ఖట్వాంగ త్రిశూల ఖడ్గోగ్ర పాశాంకుశ క్ష్మాధర భూరుహ కౌమోదకీ కపాల హలభృ ద్దశభుజాటోప ప్రతాప భూషణాయ, వానరనృసింహ తార్క్ష్యవరాహ హయగ్రీవానన ధరాయ, నిరంకుశ వాగ్వైభవప్రదాయ, తత్త్వజ్ఞానదాయినే, సర్వోత్కృష్ట ఫలప్రదాయ, సుకుమార బ్రహ్మచారిణే, భరత ప్రాణసంరక్షణాయ, గంభీర శబ్దశాలినే, సర్వపాప వినాశాయ, రామ సుగ్రీవ సంధానచాతుర్యప్రభావాయ, సుగ్రీవాహ్లాదకారిణే, వాలి వినాశకారణాయ, రుద్రతేజస్వినే, వాయునందనాయ, అంజనాగర్భరత్నాకరామృతకరాయ, నిరంతర రామచంద్రపాదారవింద మకరంద మత్త మధుకరాయమాణ మానసాయ, నిజబాల వలయీకృత కపిసైన్య ప్రాకారాయ సకల జగన్మోద కోత్కృష్ట కార్యనిర్వాహకాయ, కేసరీనందనాయ, కపికుంజరాయ, భవిష్యద్బ్రహ్మణే ఓం నమోభగవతే పంచవక్త్రహనూమతే తేజోరాశే ఏహ్యేహి దేవభయం అసురభయం గంధర్వభయం యక్షభయం బ్రహ్మరాక్షసభయం భూతభయం ప్రేతభయం పిశాచభయం విద్రావయ విద్రావయ రాజభయం చోరభయం శత్రుభయం సర్పభయం వృశ్చికభయం మృగభయం పక్షిభయం క్రిమిభయం కీటకభయం ఖాదయ ఖాదయ ఓం నమోభగవతే పంచవక్త్రహనూమతే జగదాశ్చర్యకర శౌర్యశాలినే ఏహ్యేహి శ్రవణజభూతానాం

దృష్టిజభూతానాం శాకినీ ఢాకినీ కామినీ మోహినీ నాం బేతాళ బ్రహ్మ రాక్షస సకల కూశ్మాండానాం విషయదుష్టానాం విషమవిశేషజానాం భయం హర హర మథ మథ భేదయ భేదయ ఛేదయ ఛేదయ మారయ మారయ శోషయ శోషయ ప్రహారయ ప్రహారయ ఠఠఠఠ ఖఖఖఖ ఖేఖే-ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే శృంఖలాబంధ విమోచనాయ ఉమామహేశ్వర తేజోమహిమావతార సర్వవిషభేదన సర్వభయోత్పాటన సర్వజ్వరచ్ఛేదన సర్వభయభంజన ఓం నమోభగవతే పంచవక్త్ర హనూమతే కబళీకృతార్క-మండల భూతమండల ప్రేతమండల పిశాచమండలా న్నిర్ఘాటయ నిర్ఘాటయ, భూతజ్వర ప్రేతజ్వర పిశాచజ్వర మాహేశ్వరజ్వర బేతాళజ్వర బ్రహ్మరాక్షసజ్వర ఐకాహికజ్వర ద్వ్యాహికజ్వర త్ర్యాహిక జ్వర చాతుర్థికజ్వర పాంచరాత్రికజ్వర విషమజ్వర దోషజ్వర బ్రహ్మ రాక్షసజ్వర బేతాళపాశ మహానాగకులవిషం నిర్విషం కురు కురు ఝట ఝట దహ దహ-ఓం నమోభగవతే పంచవక్త్రహనూమతే కాలరుద్ర రౌద్రావతార సర్వగ్రహానుచ్చాట యోచ్చాటయ ఆహ ఆహ ఏహి ఏహి దశదిశో బంధ బంధ సర్వతో రక్ష రక్ష సర్వశత్రూన్ కంపయ కంపయ మారయ మారయ దాహయ దాహయ కబళయ కబళయ సర్వజనా నావే శయ ఆవేశయ మోహయ మోహయ ఆకర్షయ ఆకర్షయ-ఓంనమో భగవతే పంచవక్త్రహనూమతే జగద్గీత కీర్తయే ప్రత్యర్థిదర్ప దళనాయ పర మంత్ర దర్ప నళనాయ పరమంత్ర ప్రాణనాశాయ ఆత్మమంత్ర పరి రక్షణాయ పరబలం ఖాదయ ఖాదయ క్షోభయ క్షోభయ హారయ హారయ త్వద్భక్త మనోరథాని పూరయ పూరయ సకల సంజీవినీనా యకవరం మే దాపయ దాపయ ఓం నమోభగవతే పంచవక్త్రహనూ మతే ఓం హ్రౌం క్షౌం హ్ల్మ్యం గ్లౌం హ్సౌం శ్రీం భ్రీం ఘ్రీం ఓం మ్రాం క్రీం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హుంఫట్ ఖేఖే హుంఫట్ స్వాహా.

గమనిక:— గ్రంథవిస్తర భీతిచేతను అనవసరమగుటవలనను ఈ మాలా మంత్రము మూలము మాత్రమే ఈయబడు చున్నది సకల కార్య సిద్ధికి దీని నెల్లరు నిత్యము ఒక్కమారు కాని, ముమ్మారు కాని పఠింప వచ్చును. తెల్లవారఝామున ప్రతిదినము ఐదుమార్లు మానసికముగ పఠించిన సకల కార్యసిద్ధి, ప్రతి శనివారము దీక్షతో మూడు వేళల చదువుచు ఐదు అప్పములు శ్రీ ఆంజనేయునికి నైవే ద్యము పెట్టవలెను అట్టిదీక్షని నిర్వహించు వారికి స్వామి స్వప్నమున సాక్షాత్కరించునని చెప్పబడుచున్నది.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీపరాశర మైత్రేయసంవాదే
శ్రీ హనుమన్మాలా మంత్రాది వివరణం నామ
పంచవింశతితమః పటలః

---

## —: షడ్వింశ త్పటలః :—

## హనుమన్మంత్ర పురశ్చరణ వివరణము

శ్రీ పరాశరః

శ్లో॥ యస్తృణీకృతబ్రహ్మాస్త్ర సాక స్సర్వసురార్చితః
శౌర్యసర్వంకషప్రజ్ఞా స్తం వన్దే వాయునన్దనమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఎవరైతే బ్రహ్మాస్త్రమునే గడ్డిపోచగా నెంచగల్గిరో, సమస్త దేవతల చేత అర్చింపబడిరో, పరాక్రమముచే నన్నిటిని జయింప

గల్గిరో అట్టి వాయునందనుని శ్రీహనుమంతుని నమస్కరించు చున్నాను.

ఈశ్వర ఉవాచ :-

శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి పురశ్చర్యాక్రమం ప్రియే!
శృణు స్వైకాగ్రచిత్తేన గోప్యం లోకోపకారకమ్॥

తా॥ పూర్వోక్త మంత్రవిధానము లెరిగిన పిమ్మట తత్సిద్ధిని పొందుటకై పురశ్చర్యాక్రమమును చెప్పు చున్నాను. పార్వతీ! మిక్కిలి రహస్యమును, లోకోపకారక మును నైన దీనిని ఏకాగ్రతతో వినవలసినది.

శ్లో॥ పురశ్చర్యా విధానేన వినా మంత్రం న సిద్ధ్యతి
తస్మాత్కార్యా పురశ్చర్యా దేశకాలాది మంత్రతః
పురశ్చర్యా విధీయంతే శృణు వత్స శుభప్రదమ్॥

తా॥ పురశ్చర్యావిధానము లేక మంత్రము సిద్ధించదు. కావున ఆయా దేశ కాలాదికములందు పురశ్చర్యాను యత్నించవలెను. ఓ మైత్రేయా! పురశ్చర్యావిధానము చెప్పబడుచున్నది. శుభప్రదమగు దానిని వినుము.

శ్లో॥ మూఢాదిసంయుతం కాలం పరిత్యజ్య పృథక్ వ్రతః
పరిశుద్ధ శ్శుద్ధ కాలే స్వస్థచిత్తో జితేంద్రియః॥

తా॥ గురుమౌఢ్య శుక్రమౌఢ్యాదులు కల కాలమును వీడి మంచికాలమున గట్టి దీక్షకలవాఁడు. పరిశుద్ధుఁడు యోగ్యమగు మనస్సుకలవాఁడు, ఇంద్రియముల జయిం చినవాఁడు నై

శ్లో॥ ఆలోక్య శుద్ధకాలాదీన్ పునశ్చర్యా ముపక్రమేత్॥

తా॥ శుద్ధకాలము మున్నగునవి యాలోచించి పునశ్చర్యను మొదలుపెట్టవలెను.

శ్లో॥ గ్రీష్మకాలే తు సంతాపే వర్షాకాలాంబు మధ్యమే
శీతకాలే ప్యటవ్యాం తు తత్ర సిద్ధి ర్భవే న్నృణామ్॥

తా॥ గ్రీష్మఋతువున మండుటెండయందు, వర్షాకాలమున నీటిమధ్య, శీతకాలమున అడవియందును మనుజులకు మంత్రసిద్ధియగును.

శ్లో॥ గ్రీష్మకాలేతు మధ్యాహ్నే వర్షాకాలే ద్వసంధ్యయోః
శీతకాలే ప్యర్ధరాత్రౌ జాపక స్స్యేష్టసిద్ధిదా॥

తా॥ గ్రీష్మకాలమున మధ్యాహ్న సమయమున, వర్షాకాలమున ప్రాత స్సాయం సంధ్యా సమయములందు, శీతకాలమున అర్ధరాత్రియందును చేయు పురశ్చర్య జపించువాని కోర్కెలను తీర్చును.

శ్లో॥ వసంతే గహనే యాప్యే గీష్మర్తౌ పర్వతోపరి
వర్షాయా మూమరక్షేత్రే శర త్పులినమధ్యమే॥

తా॥ వసంతర్తువునందు నికృష్టమగు గుహాలయందు, గ్రీష్మర్తువునందు పర్వతశిఖరములందు, వర్షాకాలమున చవిటినేలయందు; శరత్కాలమున ఇసుకతిన్నెల మధ్యయందు పురశ్చర్య నొనర్చ శ్రేష్ఠము

శ్లో॥ హేమంతే సలిలే మధ్యే శైశిరే సికతాస్థలే
ఋతు ష్వేవం ఫలం జ్ఞాత్వా ప్రయత్నేన జపే త్సుధీః॥

తా॥ హేమంతఋతువునందు నీటి మధ్యభాగమున నుండి, శిశిరఋతువున ఇసుకతిన్నెయందుండి ఇట్లు ఆయా ఋతువులందలి ఫలితమును తెలిసి ఉత్తముఁడగువాఁడు ప్రయత్నపూర్వకముగ జపించవలెను.

శ్లో॥ చైత్రమాసేఽర్థహానిస్స్యాత్ వ్యాధినా పీడితో భవేత్
వైశాఖే భూమిలాభస్స్యాత్ జ్యేష్ఠే తు మరణం విదుః॥

తా॥ చైత్రమాసాదిక్రమముగ ఫలము లెట్లుండునన-పురశ్చర్య చైత్రమాసమునందొనర్చిన ధననష్టమేర్పడుట, వ్యాధిచే పీడింపబడుటయు జరుగును. వైశాఖమాసమున భూసంపత్తి యేర్పడును. జ్యేష్ఠమాసమున మరణము సంభవమని యెఱుఁగఁదగును.

శ్లో॥ బంధునాశన మాషాఢే శ్రావణే స్యాయుష్కరం భవేత్
పుత్రహాని ర్భాద్రపదే స్యా దాశ్వీజే న వృద్ధికృత్॥

తా॥ ఆషాఢమాసమున బంధునాశన మేర్పడును. శ్రావణమాసము ఆయుష్కరమైనది భాద్రపదమాసమున పుత్రునకు ప్రమాదమగును. ఆశ్వయుజమాసమున అభివృద్ధి కల్గించదు.

శ్లో॥ కార్తికే వశ్య మాకర్షం మార్గశీర్షే శుభావహమ్
స్థాననాశశ్చ పౌష్యేచ మాఘమాసోఽర్థలాభదః॥

తా॥ కార్తీకమాసమున వశ్యసిద్ధి, ఆకర్షణసిద్ధి యేర్పడును. మార్గశీర్షమాసము శుభప్రదమైనది. పుష్యమాసమున స్థాననాశనమేర్పడును మాఘమాసము ధనప్రయోజనముల నిచ్చునది.

శ్లో॥ ఫాల్గునే పత్నిహానిశ్చ ఏవం మాసఫలం విదుః॥

తా॥ ఫాల్గుణమాసము భార్యకు ప్రమాదము. ఇట్లు మాసఫలములను తెలియవలెను

శ్లో॥ సౌమ్యేష్టకార్య సిద్ధ్యర్థం ప్రజపే దుత్తరాయణే
మారణాద్యుగ్రకార్యార్థం ప్రజపే ద్దక్షిణాయనే ॥

తా॥ సౌమ్యములగు ఇష్టకార్యములు నెరవేరుటకై ఉత్తరాయణమునందు జపించవలెను ఒకరిని చంపుటవంటి ఉగ్రకార్యములు నెరవేరుటకు దక్షిణాయనమున జపించవలెను.

శ్లో॥ స్తంభనం చైవ హేమంతే శైశిరే మారణం విదుః
ఆకర్షణం వసంతే స్యాత్ గ్రీష్మే విద్వేషణం విదుః॥

తా॥ ఇతరులశక్తిని స్తంభింపజేయుటకైనచో హేమంతఋతువున, మారణమునకు శిశిరఋతువున, ఆకర్షణమునకు వసంతఋతువున విద్వేషణమునకు గ్రీష్మఋతువునను పురశ్చర్య తెలియవగును.

శ్లో॥ ఉచ్చాటన స్స్యాద్వర్షర్తౌ వశ్యం చ శరది స్మృతమ్
ప్రజపేత్ సర్వమంత్రాశ్చ సర్వర్తుషు ముముక్షువః॥

తా॥ పిశాచాదికమును పారద్రోలుటకు వర్షఋతువు, వశీకరణకు శరదృతువు ప్రశస్తములు. మోక్షమును కోరువారైనచో అన్ని మంత్రములను అన్ని ఋతువులందు జపించ నగును.

శ్లో॥ ఏవం ఋతుఫలం జ్ఞాత్వా జ్ఞేయం దినఫలం తతః
ప్రతిప ద్విఘ్నకారీ స్యాత్ ద్వితీయాభీష్టదాయికా॥

తా॥ ఇట్లు ఋతుఫలమును తెలిసికొని ఇంక దినఫలమును తెలిసికొనవలెను. పాడ్యమినాడు పురశ్చర్య ఆరంభించుట విఘ్నమును కలుగజేయును; విదియ కోర్కెలను సాధించును.

శ్లో॥ తృతీయా విజయప్రాప్తిః చతుర్థీ ఫలహాఽకృత్
పంచమ్యా మిష్టసిద్ధిస్స్యాత్ షష్ఠీ తూచ్చాటనప్రదా॥

తా॥ తదియ విజయము నిచ్చును. చవితి ఫలితమును చెడగొట్టును; పంచమినాడు ఇష్టసిద్ధియగును; షష్ఠి పిశాచాదుల ఉచ్చాటనమునకు యోగ్యము

శ్లో॥ సప్తమీ కార్యకారీ స్యాత్ అష్టమ్యాం మోహనం విదుః
విద్వేషణం నవమ్యాం తు దశమీ వశ్యకృత్పరమ్ ॥

తా॥ సప్తమి కార్యమును సఫల మొనర్చును; అష్టమి మూర్ఛను కలిగించును; నవమి శత్రుత్వమును తెచ్చును; దశమి మిక్కిలి వశీకరణ మొనర్చునట్టిది

శ్లో॥ ఏకాదశీ జ్ఞానదా చ ద్వాదశీ త్వర్థకృత్పరా
సర్వసిద్ధి స్త్రయోదశ్యాం శత్రువృద్ధి శ్చతుర్దశీ॥

తా॥ ఏకాదశి జ్ఞానప్రదమైనది; ద్వాదశి ప్రయోజనపరమైనది త్రయోదశియందు సర్వము సిద్ధించును. చతుర్దశియందు శత్రువృద్ధి యేర్పడును.

శ్లో॥ ఆకర్షణం పౌర్ణమాస్యాం అమావాస్యాం తు మారణః
ఉపరాగాది సంక్రాంతౌ ప్రమ్కరేషు యథా తథా
మంత్రసిద్ధి ర్భవే న్నూనం సత్యం సత్యం మయేరితమ్ ॥

తా॥ పౌర్ణమియం దాకర్షణసిద్ధి, అమావాస్యయందు

మారణము సంభవము గ్రహణములందు, సూర్యుడు రాశి మారునట్టి సంక్రాంతులందు, పుష్కరములందును తప్పక మంత్రసిద్ధి జరుగును ఈ నాచే చెప్పబడినది మున్నాటికి యదార్థము

శ్లో॥ సూర్యోదయం సమారభ్య ఘటికా దశకం క్రమాత్ ।
సూర్యోదయము మొదలుకొని పది ఘడియలకాలము యోగ్యము

శ్లో॥ వసంత గ్రీష్మ వర్ష ర్తు శర ద్ధేమంత శైశిరాః ।
పురశ్చ ర్యోపదేశానాం యోగేషు శివరాత్రిషు ॥
తా॥ వసంత, గ్రీష్మ వర్ష, శరత్. హేమంత, శిశిర ఋతువు లన్నియును పురశ్చర్య నుపదేశించువారు కూడినప్పుడును, శివరాత్రులయందును-

శ్లో॥ న తిథి ర్న చ నక్షత్రం న మాసో నాఽపి చార్వణం ।
సమంత్రః శుభదః ప్రోక్తః స్వయమాహూయ దీయతే॥
తా॥ తానుగా పిలిచి ఉపదేశించిన దైనచో తిథి, నక్షత్ర, మాస, అర్వణ నియమము లేకుండగనే ఆ మంత్రము శుభము చేకూర్చగలదని చెప్పబడినది.

శ్లో॥ ఏవం దినఫలం జ్ఞాత్వా జ్ఞేయం వారఫలం తతః
మంత్రి స్యారంభణే భాను వాసరో వశ్యకృత్పరః॥
తా॥ ఇట్లు దినఫలమును తెలిసికొని పిమ్మట వారఫలము నెఱుంగవలెను. మంత్రము మొదలుపెట్టుటలో ఆదివారము వశీకరణపరమైనది.

శ్లో॥ ఇందువారే తు మోక్షః స్యాత్ భౌమే మారణ ముచ్యతే
స్తంభనం సౌమ్యవారే స్యాత్ గురౌ చాకర్షణం విదుః॥

తా॥ సోమవారము మోక్షదాయకము. మంగళవారము చంపును. బుధవారము పరశక్తుల స్తంభింప జేయ నుపకరించును. గురువారమాకర్షణకు యోగ్యము.

శ్లో॥ విద్వేషణం భృగోర్వారే స్తంభనం రవినందనే
ఏవం వారఫలం జ్ఞాత్వా జ్ఞేయం కాలఫలం తతః॥

తా॥ శుక్రవారమున విరోధ మేర్పడును శనివారమున స్తంభనమేర్పడును. ఇట్లు వారఫలములనెఱింగిన పిదప కాలఫలముల తెలియనగును.

శ్లో॥ ఉదయం యామపర్యంతం హేమంతే స్తంభనే జపేత్
శైశిరే హ్యస్తమానాది ద్వియామే మారణే జపేత్॥

తా॥ హేమంతఋతువున ఉదయము ఏడున్నర గడియల కాలమువరకు స్తంభనశక్తికై జపించనగును. శిశిరఋతువున అస్తమయము మొదలు పదునైదుగడియల కాలము మారణ శక్తికై జపించవలెను.

శ్లో॥ ద్వియామాద్యంత మాకర్షే వసంతే ప్రజపేత్సుధీః
తృతీయప్రహారే గ్రీష్మే జపేద్విద్వేషకర్మణా॥

తా॥ వసంతఋతువున ఆకర్షణ సిద్ధికొఱకు ఆద్యంతముగ రెండుజాములు జపించవలెను. గ్రీష్మఋతువునందు విరోధ విషయమై మూడవజామునందు జపించ వలెను. (జామనగా ఏడున్నర గడియలకాలము. గడియ అనగా ఇరువదినాల్గు నిముసములు.)

శ్లో॥ వర్షాగమే చతుర్యామే జపే దుచ్చాటనం బుధః
అర్ధరాత్రౌ శరత్కాలే ప్రజపే ద్వశ్యకర్మణి॥

తా॥ వర్షఋతువున ఉచ్చాటనము కొఱకై నాల్గవ జామున విజ్ఞుడు జపించవలెను. శరదృతువున అర్ధరాత్రి యందు వశీకరణకై జపించవలెను.

శ్లో॥ మధ్యాహ్నే సర్వఋతుషు మోక్షార్థీ ప్రియతో జపేత్॥

తా॥ మోక్షమును కోరువాడు అన్నిఋతువులందు మధ్యాహ్న సమయమున ప్రీతితో జపించనగును.

శ్లో॥ నందా భానుసుతోపేతా స్తంభనేఽతి ప్రశస్యతే
భద్రేందుగురుణా యుక్తా వశ్యకర్మణి శస్యతే

తా॥ పాడ్యమి, షష్ఠి, ఏకాదశియును మూడు నంద తిథులనిపించుకొనును. అవి ఆదివారముతో కూడియున్నచో స్తంభనమునకు ప్రశస్తమైనవి అట్లే భద్రతిథు లనబడు విదియ, సప్తమి, ద్వాదశులు వశ్యకర్మయందు ప్రశస్తములు.

శ్లో॥ జయా భృగుసుతోపేతా ప్రశస్తా కర్మణీరితా
రిక్తా భూమిసుతోపేతా శస్తా మారణకర్మణి॥

తా॥ తదియ, అష్టమి త్రయోదశియును జయ అనబడు తిథులు, శుక్రవారముతో కూడియున్నచో కర్మయందు ప్రశస్తమైనవి చవితి నవమి, చతుర్దశులను రిక్తతిథులు మంగళవారముతో కూడి మారణకర్మయందు ప్రశస్తములైనవి

శ్లో॥ పూర్ణ సోమబుధో పేతా ప్రశస్తా శుభకర్మణి

తా॥ పంచమి, దశమి, పౌర్ణమి అనబడు పూర్ణ తిథులు; సోమ, బుధవారములతో కూడినవై శుభకర్మలందు ప్రశస్తములైనవి.

శ్లో॥ దుష్ట తిథ్యృక్ష వారేషు మారణోచ్చాటనాదయః
మంత్రాంగమేషు సర్వేషు ప్రశస్తా శంకరోదితా॥

తా॥ దుష్ట తిథి, నక్షత్రము వారములు మారణ ఉచ్చాటనాది కర్మలకు ప్రశస్తములుగా శంకరునిచే చెప్పబడుచున్నవి.

శ్లో॥ సౌమ్యర్క్ష తిథి వారేషు సౌమ్యకర్మ ప్రశస్యతే
సిధ్యంతి సర్వకార్యాణి సంక్రాంతి గ్రహణాదిషు
సంశోధ్యైవం ప్రకుర్వంతి మాంత్రికా స్తత్వవేదినః॥

తా॥ శుభ నక్షత్ర తిథి వారములందు సత్కర్మలు ప్రశస్తములై యున్నవి. సంక్రాంతులయందు, గ్రహణముల యందును సర్వకార్యములు సిద్ధించును. తత్త్వవిదులగు మాంత్రికులు ఈరీతిగా బాగుగా పరిశోధించియే పురశ్చర్యాదికము చేయుచున్నారు.

శ్లో॥ పూర్వాహ్ణే వశ్యపుష్ట్యర్థం మధ్యాహ్నే స్తంభనే జపేత్
మోక్షే శాంతౌ చార్ధరాత్రౌ తతోర్ధ్వం సర్వకర్మణి॥

తా॥ పూర్వాహ్ణమున వశీకరణకు పుష్టికి చేయవలెను. స్తంభనకొఱకై మధ్యాహ్నము జపించవలెను. అర్ధరాత్రి యందు మోక్షముకొఱకు, శాంతికొఱకు జపించవలెను. ఆపయిన అన్ని కర్మలకొఱకు జపించవగును.

శ్లో॥ ఏవం కాలఫలం జ్ఞాత్వా తతః కల్పోక్తమార్గవత్
అనుక్తకాలా ద్యుక్తం స్యాత్ పుణ్యకాలే సమాగతే॥

తా॥ ఇట్లు కాలఫలమును తెలిసికొని పిదప కల్పమున చెప్పబడిన మార్గమున పుణ్యకాలము ప్రాప్తమైనగా చెప్పబడని కాలమునకన్న పురశ్చర్యకు సౌభాగ్యముగ నుండును

శ్లో॥ పురశ్చర్యోపదేశాదౌ మాంత్రికో౽న్వేషణపూర్వకమ్
సర్వానేతాన్ విదిత్వాథ స్థలం జ్ఞాత్వా సమాహితః॥

తా॥ పురశ్చర్యయొక్క ఉపదేశమునకు ముందుగా మాంత్రికుడు అన్వేషణవిధానపూర్వకముగా సిద్ధస్థలములన్నిటిని తెలిసికొని స్థలము నెఱింగి సిద్ధమైనవాఁడై -

శ్లో॥ శివాలయే నదీతీరే పర్వతాగ్రే జలాశయే
గోగృహే తులసీబిల్వ సమీపే శక్తిమందిరే॥

తా॥ శివాలయమునందు, నదీతీరమునందు, పర్వతముపైన, చెఱువునందు. గోశాలయందు, తులసీవన సమీపమున, లేదా మారేడు వృక్షసమీపమున, అమ్మవారియొక్క మందిరమున,

శ్లో॥ శ్మశానే చాంతరిక్షే చ పాతాళే చ గవాంగణే
పురగ్రామ మహాతీర్థే సాగరే సింధుసంగమే॥

తా॥ శ్మశానమునందు, ఆకాశమునందు, పాతాళమునందు, గోసమూహమునందు, పట్టణమునందు, గ్రామమునందు. మహాతీర్థమునందు, సముద్రమునందు; నదిసముద్రములు కలియుచోట, (గృహాంగణే అని పాఠాంతరము)

శ్లో॥ విష్ణ్వాలయే మహోద్యానే స్వగృహే విపనేఽపి చ
సిద్ధ సాధ్య సుసి ద్ధారీన్ సంశోధ విధివ త్సునః॥

తా॥ విష్ణ్వాలయమునందు, గొప్ప ఉద్యానవనమునందు, స్వగృహమునందు, లేదా అడవియందును అరణ్యమునందలి సిద్ధకోష్ఠ సాధ్యకోష్ఠ సుసిద్ధికోష్ఠ అరికోష్ఠములను యథావిధిగా పరిశీలించుకొని

శ్లో॥ కూర్మ చక్రానుసారేణ గుహాయాం విజనస్థలే
శుద్ధే స్వాభిమతే రమ్యే నిర్బాధే నిరుపద్రవే॥

తా॥ కూర్మ యంత్రానుసారముగా గుహయందు, జనము లేనిచోట, శుద్ధమగుచోట, తన కిష్టమైనట్టియు, రమ్యమై, ఏబాధలు, ఏఉపద్రవ ప్రమాదములు లేనిచోట,

శ్లో॥ స్థిత్వాథ దోషరహితే శుక్లపక్షే శుభే దినే
చంద్రతారాబలోపేతే విధ్యుక్తం స్నానమాచరేత్॥

తా॥ దోషమేమియు లేనిచోటనుండి, శుక్లపక్షమున శుభదినమున, తారాబల చంద్రబలములతో కూడియున్న రోజున విధానము ననుసరించి స్నానము చేయవలెను.

శ్లో॥ భౌమం వారుణ మాగ్నేయం వాయువ్యం దివ్యమేవ చ
కాపిలం మాత్ర మాకాశం నవనీతం చ మానసం
ఏతే దశవిధా స్నానాః తేషు మానస ముత్తమమ్॥

తా॥ భౌమము, వారుణము ఆగ్నేయము, వాయువ్యము, దివ్యము కాపిలము మాత్రము, ఆకాశము. నవనీతము, మానసము - ఈపది విధములైనవియు స్నానములు. వీనియందు మానసస్నానము ముత్తమము

శ్లో॥ తత్తత్కాలోక్తవిధినా తదుక్తస్నాన మాచరేత్
నద్యాది సలిల స్నానం అభ్యంగం తై రలంకృతః॥

తా॥ ఆయాకాలములందు చెప్పబడిన రీతిగా నదీ జలాదులందు, అభ్యంగస్నానమువంటి వాయుస్నానములాచరించి అలంకృతుఁడు కావలెను.

శ్లో॥ మంత్రోదకేన సంప్రోక్ష్య స్థలశుద్ధిం విధాయ చ
మాంగల్యవసనోపేత సుదర్శన మథోపరి॥

తా॥ మంత్రోదకమును చల్లి స్థలశుద్ధి చేసి, అట మంగళవస్త్రముతో కూడిన సుదర్శన మేర్పరచి

శ్లో॥ ధ్యాత్వాథ స్వగురుం క్షేత్ర పాలకం చైవ సంస్మరన్
తాభ్యా మాజ్ఞాపిత స్తత్ర సంప్రార్థ్యైవాథ మేదినీమ్॥

తా॥ పిదప తన గురువును క్షేత్రపాలకుని స్మరించి వారిచే నాజ్ఞాపింపబడి పిమ్మట భూవందన మాచరించి

శ్లో॥ భూతాపసర్పణం కుర్యాత్ తారా శక్త్య నలాక్షరైః
ఏవం కృత్వాతు విధివత్ సమ్య గాసనపూర్వకః॥

తా॥ తారాబీజ, శక్తిబీజ, అగ్నిబీజాక్షరములతో భూతోచ్చాటన మొనర్చవలెను ఇట్లు యోగ్యాసనముతో కూడినవాఁడై యథావిధి నాచరింపవలెను.

శ్లో॥ తత్తదుక్తానుసారేణ ఫలం త్వే వాసనాదయః
అనుక్తాసన మాసీనః ప్రజపే న్మంత్రవి న్మనుమ్॥

తా॥ ఆసనాదులు ఆయా చెప్పబడినరీతుల ఫలములు

తా॥ విద్వేషకర్మకు గుఱ్ఱపు చర్మముపైన, ఉచ్చాటన కర్మకు దున్నపోతు చర్మముపైన, సౌభాగ్యమునకు జింక చర్మముమీద మోక్షముకొరకు పులిచర్మముమీద కూర్చుండి జపించవలెను.

శ్లో॥ జ్ఞానం కుశాసనే సౌమ్యే మోక్షదం వసనాసనే।
నిష్ఫలం చాసనే దారోః యశోహా నిస్తృణాసనే॥

తా॥ సౌమ్యమగు దర్భాసనమున జ్ఞానసిద్ధి, వస్త్రాసనము వలన మోక్షమును లభించును. కొయ్య ఆసనముపైన జపించుటవలన ప్రయోజనములేదు. గడ్డిపై జపించుటవలన కీర్తికి లోటు వాటిల్లును.

శ్లో॥ దుఃఖం క్షిత్యాసనే ప్రోక్తం రోగ స్స్యాత్ ప్రస్తరాసనే
అజచర్మాసనే వశ్యం ఆకర్షం కంబళాసనే॥

తా॥ భూమి నాసనముగ నుంచుకొనిన దుఃఖము ప్రాప్తించునని చెప్పబడినది. రాతిపైనుండి జపించిన రోగము. మేకచర్మము వశీకరణమునందు ఉపకరించును. కంబళి ఆసనముగానున్న ఆకర్షసిద్ధి యేర్పడును.

శ్లో॥ లభంతి సిద్ధయ స్సర్వాః చిత్రకంబళవిష్టరే॥

తా॥ రత్నకంబళిమీదనైనచో సర్వసిద్ధులు లభించును.

శ్లో॥ గజ వానర భల్లూక బిడాల శివకృత్తిషు।
మోక్ష వారణ విద్వేష వ్యాధి విద్రావణాదికాన్॥

తా॥ ఏనుగుచర్మమునందు జపించుటచే మోక్షము, కోతి చర్మమున కవచశక్తి; ఎలుగుబంటి చర్మమున విద్వే

షము, పిల్లిచర్మమున వ్యాధి, నక్కచర్మముపై జపమున భయపడి పారిపోవుటవంటివియు చేకూరును.

శ్లో॥ కుర్వంతి శ్వాన మనుజ ఖర కృత్తిషు మారణమ్।
విద్వేషే మారణే చోక్తం శవకేశకృతాసనే॥

తా॥ కుక్క, మనుష్యుడు; గాడిదలచర్మములపై చేయు జపము మారణశక్తి నిచ్చును. శవముయొక్క జుట్టుతో చేయబడిన ఆసనము విద్వేష, మారణ విధానములందు ప్రశస్తమైయున్నది.

శ్లో॥ వస్త్రం కృష్ణాజినం చైవ కుశాసన మనుత్తమమ్।
బస్తాజినం కంబళం చ వ్యాఘ్రచర్మం శుభావహామ్॥

తా॥ ఆసనముగా వస్త్రము, నల్లజింక చర్మము, దర్భాసనమును మిక్కిలి శ్రేష్ఠములు. మేకపోతు చర్మము, కంబళి, పులిచర్మమును శుభప్రదములైనవి.

శ్లో॥ బ్రాహ్మణోచిత మిత్యాహుః కృష్ణాజిన కుశాసనే।
ఉక్తాసనే సమాసీనః ప్రజపే న్మంత్రవి న్మనుమ్।
వర్జయే దాసనం మంత్రీ దారిద్ర్యం వ్యాధిదుఃఖదమ్॥

తా॥ నల్లజింకచర్మము. దర్భాసనము బ్రాహ్మణోచితములుగా చెప్పుదురు; మంత్రము ననుష్ఠించువాడు దారిద్ర్యమును వ్యాధి దుఃఖములను నిచ్చు నాసములను విడిచిపెట్టవలెను;

శ్లో॥ వీరాసనే స్తంభనే స్యా దుత్తానం మారణే విదుః

మారణ స్తంభ నోచ్చాటా ద్యుగ్రకర్మసు సర్వతః
మాంత్రికైశ్చ ప్రయోగజ్ఞైః కాపాలాసన ముచ్యతే॥

తా॥ స్తంభనమునకై వీరాసనమును, మారణమునకై ఉత్తానాసనమును వేయువలయును. మారణ, స్తంభన, ఉచ్చాటనాదులగు భయంకరకర్మలన్నింటను ప్రయోగములు బాగుగ తెలిసిన మాంత్రికులచే పాకాలాసనము చెప్పబడు చున్నది

శ్లో॥ ఆసనానాం ఫలం జ్ఞాత్వా సమ్యగాసన సంస్థితః
వికలీకృత చిత్తస్థః శ్వసన్ క్షుభిత సంగతః॥

తా॥ ఆసనముయొక్క ఫలమును తెలిసికొని, బాగుగా ఆసనమునందుండి కూడ కల్మషమగు మనస్సుననున్నవాడై నిట్టూర్చుచు కలతపెట్టబడు చున్నవాడై,

శ్లో॥ అశుచి ర్జనసంయుక్తః ప్రలపన్ భక్తివర్జితః
కదాపి న జపే న్మంత్రం జపే ద్యది విఃష్ఫలమ్॥

తా॥ శుచిలేనివాడై బాగుగ జనులతో కూడి, మాటాడుచు భక్తిలేనివాడై ఎప్పుడు మంత్రమును జపించరాదు; అట్లు జపించినను వ్యర్థమే

శ్లో॥ ఏవం విజ్ఞాయ శాస్త్రోక్త విధినా చ్ఛాదతో వ్రత
ఆచ్ఛాదనాంబరం చాంగ లేపనం జపమాలికా॥

తా॥ ఇట్లు వ్రతమాచరించువాడు శాస్త్రముచే చెప్పబడిన రీతిగా తెలిసికొని ఆచరించనగును. కప్పు వస్త్రము, మైపూత, జపమాలిక,

శ్లో॥ తిలకం చాసనం చైవ హవనద్రవ్య మేవ చ
తత్ర త్ఫలాని దీయంతే రక్త పీత సితాఽసితైః॥

తా॥ బొట్టు ఆసనము. హోమమున వేల్చు ద్రవ్యమును ఎఱుపు, పసుపు. తెలుపు, నలుపు రంగులు కల్గియుండుటచే నాయాఫలితము లిచ్చును.

శ్లో॥ రక్తమాకర్షణం ప్రోక్తం శాన్తి మోక్షప్రదం సితమ్

తా॥ ఎఱుపురంగవి ఆకర్షణకు చెప్పబడినవి తెలుపు శాంతిని. మోక్షమును ఇచ్చునది.

శ్లో॥ ప్రాఙ్ముఖోదఙ్ముఖో భూత్వా మోక్షార్థీ జపమాచరేత్
ప్రాఙ్ముఖో వశ్య మిత్యాహుః మారణం యమదిఙ్ముఖే॥

తా॥ మోక్షమును కాంక్షించువాఁడు తూర్పుదిక్కువైపు తిరిగికాని. ఉత్తరదిక్కు తిరిగికాని జప మాచరింపవలెను తూర్పుదిక్కు వశ్యతనిచ్చును. దక్షిణదిక్కు మారణమునకు తగినది.

శ్లో॥ వ్యాఘ్రాసనే సమాసీనః ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా
భస్మస్నానం తతః కృత్వా యోగశాస్త్రానుసారతః॥

తా॥ తూర్పునకుకాని, ఉత్తరమునకుకాని తిరిగి పులిచర్మపు ఆసనముపై కూరుచున్నవాఁడై విభూతి పూసుకొని శాస్త్రవిధానముతో యోగము నారిచంచి

శ్లో॥ భూశుద్ధిం భూతశుద్ధిం చ గురువందన మేవ చ
హనుమన్మనునా కుర్యాత్ దశదిగ్బంధనం క్రమాత్॥

తా॥ భూశుద్ధిని, భూతశుద్ధిని చేసి; గురువునకు నమ

స్కారము నొనర్చి హనుమన్మాలమంత్రముతో దశదిశలను బంధన మొనర్చవలెను.

శ్లో॥ పాపపురుషస్య దహన మాప్లావన మతఃపరమ్
కృత్వైకపిండీకరణ ముక్తిమార్గా ద్విచక్షణః॥

తా॥ పాపపూరుషదహనము పిదప స్నానమాచరించి మంత్రవిచక్షణ కలవాఁడు చెప్పఁడిన రీతిగా పిండీకరణాదిక మొనర్చి

శ్లో॥ ప్రాణప్రతిష్ఠాం కృత్వాథ యోగ న్యాస విధానతః
ఋషి చ్ఛంద కరో మంత్రో మంత్రాద్యక్షర మంగుళిః
హృ త్సర్వాంగ వ్యాపకానీ నవన్యాసాః ప్రకీర్తితాః॥

తా॥ పిమ్మట ప్రాణప్రతిష్ఠ నొనర్చవలెను. ఇఁక నవవిధన్యాసములు చెప్పబడుచున్నవి. 1 యోగన్యాసము. 2 ఋషిన్యాసము 3 ఛందోన్యాసము. 4. కరన్యాసము. 5 మంత్రన్యాసము. 6 మంత్రాక్షరన్యాసము. 7. అంగుళి న్యాసము. 8 హృదయన్యాసము. 9. సర్వాంగన్యాసము అను నీ తొమ్మిది న్యాసములుగా చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ అంతర్న్యాసవ బహిర్న్యాసౌ హనుమన్న్యాసపూర్వకమ్
బంధన్యాసం చ షట్త్రింశత్ కళాన్యాసపురస్సరమ్॥

తా॥ ఇట్లే అంతర్న్యాసము, బహిర్న్యాసము, శ్రీహనుమన్న్యాసము, బంధన్యాసము, షట్త్రింశత్కళా న్యాసము

శ్లో॥ ఉత్పత్తి స్థితి సంహార న్యాసం కృత్వా సమాహితః
సోఽహంభావనయా తిష్ఠేత్ యుక్తాం గోపప్లవ సుధీః॥

తా॥ ఉత్పత్తిన్యాసము, స్థితిన్యాసము, సంహార న్యాసము నను వివిధన్యాసములను చక్కగా ఆచరించిన వాడై, ఎదురుగా అవయవముల నుంచుకొని తానే పరమాత్మయను భావముతో కూరుచుండవలెను ఆత్మకు పరమాత్మతో అభేదమును భావించవలె ననుట

శ్లో॥ ధ్యాననిష్ఠాపరః పూర్వం మంత్రోక్త న్యాసపూర్వకమ్
సమ్యగేవం విధానేన సమ్యఙ్మంత్రం విశోధయేత్॥

తా॥ మంత్రోక్త విధముగా న్యాసాదికముతో పాటు ముందుగా ధ్యాననిష్ఠకలవాడై మంచిదగు నా ఉక్త విధానముతో బాగుగా మంత్రశుద్ధి యొనర్చవలెను.

శ్లో॥ మృత స్సుప్తశ్చ మూకశ్చ నగ్న శ్శూన్యో వృథాక్షరః
భుజంగో వీర్యహీనశ్చ కీలితశ్చే త్యమీ నవ
మంత్రస్య దోషాః కథితాః తేభి న్నాభీష్టసిద్ధిదాః॥

తా॥ మృతము, సుప్తము. మూకము, నగ్నము, శూన్యము, వృథాక్షరము. భుజంగము, వీర్యహీనము, కీలితము అను తొమ్మిదియు మంత్రముయొక్క దోషములు. అవి అభీష్టమును సిద్ధింపనీయవు.

శ్లో॥ శిరోహీనో మృత ప్రోక్తో సుప్తస్యా దాసనం వినా
వినా న్యాసేన మూకశ్చ నగ్నః పల్లవవర్జితః॥

తా॥ శిరోహీనమగు మంత్రము మృతమనఁబడును. ఆసనహీనమగు మంత్రము సుప్తమనబడును. న్యాసములేని మంత్రము మూక మనఁబడును పల్లవహీనమైనది అనగా

నమః, వషట్, వౌషట్, హుం, ఫట్, ఖేఖే; అను నారు
లేని మంత్రము నగ్నమనఁబడును

శ్లో॥ శూన్యశ్చ జపకాలే తు శృణో త్యన్యస్య ఉచ్యతే
ఉపదేశేన రహితో హ్యుచ్యతే స వృధాక్షరః॥

తా॥ జపకాలమున అన్యవాక్కులు వినుట చెప్పుట
లచే శూన్యమనఁబడును. ఉపదేశమునందని మంత్రము
వృధాక్షర మనఁబడును.

శ్లో॥ త్యక్త ఛంద ఋషి ర్మంత్రో భుజఙ్గః పరికీర్తితః
న్యూనాధికాక్షరై ర్యుక్తో వీర్యహీన స్స ఉచ్యతే॥

తా ఛందస్సును ఋషిని విడిచిన మంత్రము భుజంగ
మనఁబడును. తక్కువ అక్షరములతో కాని ఉండఁదగినదాని
కన్న నెక్కు డక్షరములతో నున్న కాని అది వీర్యహీన
మనఁబడును

శ్లో॥ కీలిత శ్చోచ్యతే మంత్రం అంతరా వాక్షరై ర్యుతః
ఇత్యేవం సర్వ మాలోచ్య జ్ఞాత్వా సమ్య క్పునః పునః
సర్వలక్షణ సంయుక్తం గురో ర్మంత్రం సమాచరేత్॥

తా॥ అంతరాయమనగా అక్షరములు కలిగియున్న
మంత్రము కీలితమని చెప్పఁబడుచున్నది. ఇట్లు అన్నియు
నాలోచించి పూర్తిగ నన్నివిషయములు తెలిసికొని అన్ని
లక్షణములతో కూడియున్న గురువు చే నుపదేశింపబడిన
మంత్రము నాచరింపవలెను.

శ్లో॥ నమోంతః ప్రణవాంతశ్చ శాంతిః పుష్టి వివర్ధనమ్
స్వాహాంతస్సిద్ధిదోఽభీష్టం వశ్యాకర్షణ మోహనే॥

తా॥ 'నమః' అనునది; 'ఓం' అనునది చివఱకల్గిన మంత్రము శాంతి పుష్టులను వృద్ధిపొందించును. 'స్వాహా' అంతమందుగలది అభీష్టసిద్ధి నొసగును. వశ్యము, ఆకర్షణము మోహాముల కల్గించును.

శ్లో॥ పుష్ట్యాదిసంధకో వౌషట్ పల్లవేన యుతో మనుః
హుంకార పల్లవోపేతః విద్వేషే మారణేఽపి చ॥

తా॥ 'వౌషట్' అను పల్లవముతో కూడిన మంత్రము పుష్ట్యాదులను చేకూర్చును. 'హుం' కార పల్లవముతో కూడిన మంత్రము విద్వేషణ మారణములందు పనిచేయును.

శ్లో॥ ఫండుచ్చాటే వషడ్వశ్యే ఖే ఖే మారణకర్మణి
స్వాహా వాకర్షణే ద్వేషే హుం నమ శ్శాన్తిరీరితః॥

తా॥ 'ఫట్' అను పల్లవము పిశాచాదుల ఉచ్చాటనమున; 'వషట్' అనునది వశ్యమున; ఖేఖే అనునది మారణ కర్మయందు 'స్వాహా' అనునది ఆకర్షణ ద్వేషములందు. 'హుం'; 'నమః' అనునవి శాన్తియందును చెప్పబడుచున్నవి.

శ్లో॥ స్తంభనే ఠఠ ఇత్యుక్తః మన్యో సమ్మోహనే ఽపిచ
ఇత్యాది పల్లవోపేతో మంత్రో జాపకసిద్ధిదః॥

తా॥ 'ఠఠ'అనునది స్తంభనమున, క్రోధమున, సమ్మోహనమును చెప్పబడినది. ఇట్లుగాకల పల్లవములతో కూడిన మంత్రము జపించువానికి సిద్ధి నొసంగును.

శ్లో॥ 'ఖేఖే'పల్లవ సంయుక్తో మంత్రోఽసౌ మారణే విదుః
భయ విద్రావణే ఘోరే యంత్ర తంత్ర విదారణే

వషడంతో నమః ప్రోక్తః గ్రహబాధా నివారకః॥

తా॥ 'ఖేఖే' అను పల్లవముతో కూడిన మంత్రము మారణమునందు చెప్పుదురు 'వషట్' అంతముగా గల నమః అనునది ఘోరమగు భయమును పోగొట్టుటయందు; యంత్రములను; మంత్రములను చీల్చుటకు చెప్పబడినది. 'వషట్' అంతముగాఁగల నమః అనునది గ్రహబాధలను పోగొట్టునదిగా చెప్పబడినది

శ్లో॥ ఫడం తూచ్చాటనే చైవ- మంత్రాష్షట్పల్లవాన్వితాః
పల్లవోస్త్యాగమే మంత్రే-పల్లవో నాస్తి వైదికే॥

తా॥ ఫట్ అనునది ఉచ్చాటనమునఁ జెప్పబడినది. మంత్రములు షట్పల్లవములతో కూడినవి. పల్లవము ఆగమ మంత్రములందు కలదు. వైదికమంత్రమున లేదు.

శ్లో॥ పల్లవేన వినా మంత్రో-జప్యో వేద సముద్భవః
నాప్యుక్తో బ్రహ్మణా పూర్వం- వేదమంత్రస్య పల్లవః॥

తా॥ వేదముఁనఁ బుట్టినమంత్రము పల్లవము లేకుం డగనే జపించఁదగినది. పూర్వము బ్రహ్మచేత వేదమంత్రము నకు పల్లవము చెప్పబడలేదుకూడ

శ్లో॥ పల్లవ స్సర్వమంత్రాణాం-ఉత్తమాంగం తదంశకమ్
సపల్లవ మనుస్సర్వ కామదః పరికీర్తితః॥

తా॥ అన్ని మంత్రములకు పల్లవమే ఉత్తమాంగము. పల్లవముతోకూడిన మంత్రమే కోర్కెలన్నిటిని తీర్చగల్గు నదిగా చెప్పబడినది.

శ్లో॥ సమ్యగేవం హి విజ్ఞేయం-మంత్రకాలే మనుం జపేత్
గణేశార్కోదయాత్పూర్వం-పూర్వాహ్ణే సౌరవైష్ణవాః

తా॥ మంత్రకాలయినందే మనువును జపించవలెనని కూడ బాగుగా తెలిసికొనదగినది. సూర్యోదయమునకు ముందు గణేశుని మంత్రము; దినపూర్వభాగమున సౌర మంత్రములు; వైష్ణవమంత్రములు జపించవలెను.

శ్లో॥ నిశీథే శాక్తికేయాస్స్యుః-దినాంతే శైవ భైరవాః
సారస్వత్యాః ప్రభాతే స్యుః-సదా హనుమదాదయః॥

తా॥ అర్ధరాత్రి సమయము శాక్తికేయులకు; సాయంకాలము శైవ; భైరవ మంత్రములకు; ఉదయము సరస్వతీ మంత్రములకు; హనుమన్మంత్రాదుల కెల్లప్పుడును మంత్ర జపకాలము.

శ్లో॥ తతోక్తకాలం విజ్ఞాయ-ప్రజపేద్యుక్తమాలయా
వింశత్యష్టోత్తరశతం-తదర్ధం వా తదర్ధకమ్ ॥

తా॥ చెప్పబడినకాలము నెఱింగినపిమ్మట తగిన జపమాలతో నూట ఇరువది ఎనిమిది పర్యాయములు కాని; అందు సగముకాని; అందు సగముకాని జపించవలెను.

శ్లో॥ ఉత్తమం జాపకైరుక్తం-జపకాలోక్తకర్మణి
అంగుష్ఠాగ్రేణ యో మంత్రం-జపేదంగుళిపర్వసు॥

తా॥ జపకాలమునందు చెప్పబడిన కర్మయందు అంగుళి పర్వములందు బొటనవ్రేలి చివరచే లెక్కించుచు చేయుమంత్రము ఉత్తమముగా జాపకులచే చెప్పబడినది.

శ్లో॥ మంత్రాంగ మహాదస్యోక్తం-మోక్షం లోకవశంకరమ్

తా॥ ఆ విధానమునకు మోక్షసిద్ధి; వశీకరణసిద్ధియు నను మంత్రాంగ మహత్తు చెప్పబడినది.

శ్లో॥ అంగుష్ఠానామికా యోగే-ప్రజపే చ్ఛాంతికర్మణి
మధ్యమాంగుష్ఠ యోగేన-జపే దాకర్ష సిద్ధయే॥

తా॥ శాంతికర్మయందు బొటనవ్రేలు; ఉంగరపువేళ్ళ సంబంధముతో జపించవలెను. ఆకర్ష సిద్ధికొరకు మధ్యవ్రేలు; బొటన వేళుల సంబంధపరచి జపించవలెను.

శ్లో॥ అంగుష్ఠ తర్జనీయోగే విద్వేషోచ్చాటనే జపేత్
కనిష్ఠాంగుష్ఠయోగేన జపే న్మారణ కర్మణి॥

తా॥ బొటనవ్రేలు, చూపుడువ్రేళుల సంబంధముతో విద్వేషి, ఉచ్చాటనములయందు జపించవలెను. చిటికెన వ్రేలు, బొటనవ్రేళుల సంబంధముతో మారణకర్మయందు జపించవలెను.

శ్లో॥ శతసాహస్రగుణితం జపే దక్షరమాలయా
మంత్రజ్ఞ స్సమ్యగ్జానీయాః బిందువంతాం వర్ణమాలికామ్॥

తా॥ పంద వేయిరెట్లు ఫలమునిచ్చు అక్షరమాలతో జపించవలెను. మంత్రజ్ఞుడు బిందువంతముగాగల వర్ణమాలికను బాగుగా తెలిసికొనవలెను. అనగా 'అం నమః' 'ఆం నమః' ఇత్యాదిగా ప్రతి అక్షరమును సున్నతో నుచ్చరించుట,

శ్లో॥ అవరోహేచ్ఛకాం భూయో విసర్గాంతం యథాక్రమ॥

తా॥ అవరోహము కోరువారికి మరల విసర్గము

చివఱకు వచ్చునట్లు క్రమము గ్రహింపఁదగును. అనగా ఆరోహమున సబిందుకముఁగా నమః చెప్పి మూలమనుట. అవరోహమున మూలమని సబిందుక నమోంతము చేయుట కర్తవ్యము.

శ్లో॥ అంతర్విద్రుమ భాసమాన భుజగీ సూత్రోక్త వర్ణోజ్వలా
మారోహా దవరోహతశ్చ సమయీం వర్ణాష్టకాష్టోత్తరామ్
హంస బ్రహ్మ విధేయ మేరుశిఖరీం శ్రీమాతృకాక్షావళీమ్
విద్యాం నౌమి విచిత్రమంత్రజననీ బోధైక దీపాంకురామ్ ॥

తా॥ పగడముల మధ్యభాగమున ప్రకాశించు భుజగ రూప సూత్రముచే తెలియఁబడు వర్ణములచే ప్రకాశించునట్టియు, అనులోమముగను, విలోమముగను సమమై 'అ, క, చ, ట, త, ప, య, శ' అను అష్టవర్గల వలన నేర్పడు నూటయెనిమిది వర్ణములు కల్గినట్టియు, హంసబ్రహ్మ విధేయరూపమగు మేరుశిఖరము కల్గినట్టియు, విచిత్రమగు మంత్ర జననీబోధకు ఒకేఒక్క దీపాంకురమైనట్టి శ్రీమాతృకా మాలా విద్యకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ అష్టోత్తరశతం చాష్ట సిద్ధి స్స్యా జ్జపమాలయా
అష్టావింశతి రుచ్చాట సప్తవింశతి శాంతిదః॥

తా॥ జపమాలతోడి చేయు నూటయెనిమిది పర్యాయములు అష్టసిద్ధుల నొసంగును. ఉచ్చాటనమున నిరువదియెనిమిది, శాంతికొఱకై ఇరువదియేడుమార్లును జపించవలెను.

శ్లో॥ ద్వాత్రింశ ద్ధనరాశి స్స్యాత్ మోక్షార్థీ పంచవింశతిః
విద్వేషణే పంచదశ స్తంభనే షోడశోచ్యతే॥

తా॥ ముప్పదిరెండు పర్యాయములు ధనరాశికై జపించనగును. మోక్షము కోరువాడు ఇరువదియైదు పర్యాయములు జపించవలెను విద్వేషణ విషయమై పదునైదు పర్యాయములు, స్తంభనమునకై పదునారు పర్యాయములు జపించనగును.

శ్లో॥ పంచాశ న్మారణే ప్రోక్తో వశ్యే చాష్టౌ ప్రకీర్తితాః
ఆకర్షణే చతుష్షష్ఠిః ఇత్యుక్తా జపమాలికాః॥

తా॥ మారణమునకు ఏబది పర్యాయములు, వశీకరణకు ఎనిమిది, ఆకర్షణకు అరువదినాలుగు పర్యాయములుగా నిట్లు జపమాలావిధానము గణింపఁబడినది.

శ్లో॥ అనామికా ద్వయం పర్వ కనిష్ఠాది క్రమేణ తు
తర్జనీమూల పర్యంతం కరమాలా ప్రకీర్తితా॥

తా॥ ఉంగపు వ్రేలు క్రింది కణుపులు రెండు, చిటికెన వ్రేలు క్రిందినుండి క్రమముగాపోయి చూపుడు వ్రేలు మూలమునందలి కణుపువరకు కరమాల యనఁబడును.

శ్లో॥ తర్జన్యగ్రే తథా మధ్యే యో జపే త్సిద్ధమానసః
చత్వార స్తస్య నశ్యన్తి ఆయుర్విత్తం యశో బలమ్॥

తా॥ చూపుడువ్రేలి చివటినుండికాని లేక మధ్యవ్రేలినుండికాని సిద్ధమానసుడై యెవడు జపించునో వాని యొక్క ఆయువు, ధనము, కీర్తి, బలము అను నాల్గు నశించును.

శ్లో॥ ఆరభ్యానామికాంయా స్తు మధ్యమే పర్వాణి క్రమాత్
తర్జనీమూలపర్యంతం జపే ద్దశసు పర్వసు॥

తా॥ క్రమముగా ఉంగరపువేలు మధ్యకణుపు నుండి మొదలుపెట్టి చూపుడువ్రేలు మూలభాగమువఱకు అనగా పది పర్వములందును జపించవలెను.

శ్లో॥ మధ్యమాంగులి మూలేతు యత్పర్వద్వితయం భవేత్
తద్వై మేరు విజానీయ జపే త్తం నాడిలంఘయేత్॥

తా॥ మధ్యగల వ్రేలిమూలమున నున్న రెండు కణుపులు మేరువుగా తెలిసికొని జపించవలెను. ఆనాడిని లెక్కించక దాటవలెను.

శ్లో॥ అంగులీజప మేకైక ఫలదం శతవృద్ధికృత్
ఆరభ్యానామికాంయా స్తు జపా ద్దశగుణం భవేత్॥

తా॥ అంగుళులతో చేయు జపమొక్కొక్క ఫలముగా శతవృద్ధికరముగ నుండును. అనామిక నుండి యారంభించిన జపమువలన పదిరెట్లు గుణము చేకూరును.

శ్లో॥ పర్వేషు జప మాభీష్ట సిద్ధయే న్యస్యపారతః

తా॥ పర్వములందు జప మభీష్టసిద్ధి నిడునదనియు చెప్పఁబడుచున్నది.

శ్లో॥ రాజ్ఞ శ్శతగుణం ప్రోక్తం జపేత్ స్ఫటికమాలయా
తద్వ ప్రతిష్ఠాసిద్ధ్యర్థం జపే నౌక్తికమాలయా॥

తా॥ స్ఫటికమాలతోడి జపమువలన మహారాజ భోగములకు వందరెట్లు భోగము లభించును. 'స్ఫాటికీ

సర్వేభ్యః కామేభ్యః' అనియు చెప్పబడుచున్నది అట్లే కీర్తి సిద్ధించ ముత్యముల మాలతో జపించవలెను.

శ్లో॥ చతుర్విధార్థ సిద్ధ్యర్థం జపే త్పద్మాక్షమాలయా
పద్మరాగాది మణిభిః మాలయా లోకవశ్యకృత్॥

తా॥ చతుర్విధపురుషార్థములు సిద్ధించుటకై పద్మాక్షమాలతో జపించవలెను. లోకవశీకరణకై పద్మరాగాది మణులచే చేయబడిన మాలతో జపించవలెను.

శ్లో॥ సమస్తఫలదా ప్రోక్తా పుత్రజీవ్యక్షమాలయా
నియమే నైవ మోక్షార్థీ తులసీమాలయా జపేత్॥

తా॥ పుత్రజీవ మాలా జపమువలన సమస్తఫలములు చెప్పబడుచున్నవి. మోక్షమును కోరువాడు నియమముతో తులసీమాలతో జపించవలెను.

శ్లో॥ వారిజై స్సిర నిష్పన్న లాక్షశంఖోక్షమాలయా
నిధాన యక్షిణీసిద్ధిః సద్యో భవతి నిశ్చితమ్॥

తా॥ పద్మబీజములచే నేర్పాటుచేసిన మాలతో జపించుటవలన నిధిప్రాప్తి, యక్షిణీసిద్ధి వెంటనే తప్పక చేకూరును.

శ్లో॥ స్తంభ నాకర్షణార్థాయ హారిద్రామాలయా జపేత్
స్త్రీ రాజ నర వశ్యార్థీ కుందకుట్మలమాలయా॥

తా॥ స్తంభనము, ఆకర్షణముల కొఱకు పసుపు కొమ్ముల మాలచే జపించవలెను, స్త్రీల వశీకరణకు, రాజ, పురుష వశీకరణలకు మొల్లమొగ్గల మాలచే జపించవలెను.

శ్లో॥ హారిద్రావస్త్ర సంపన్నో జపే దష్టోత్తరం శతమ్
సద్యో వశ్యకరం ప్రోక్తం మాధవీమాలయా జపేత్
విధిం పశ్యత సుశ్వేత గుంజాబీజా ప్తమాలయా॥

తా॥ పసుపుగుడ్డలతో కూడి పైరీతి నష్టోత్తరశతము జపించవలెను. మాధవీమాలతో జపించుటచే వెంటనే వశ్య సిద్ధి యేర్పడునని చెప్పబడినది. తెల్లగురిజవిత్తుల మాలతో జపించిన విధిని చూడగల్గును

శ్లో॥ విష భూత నివృత్త్యర్థం నీలవస్త్రైః సంయుతః
విషతిందుకబీజా ప్త మాలయా సాధకో జపేత్॥

తా॥ విషప్రాణుల నివారించుటకై నల్లని వస్త్రముతో కూడి చేదుతుమ్మికి చెట్టు విత్తనములతో నేర్పడిన మాలతో సాధకుండు జపించవలెను.

శ్లో॥ పశ్చాత్యనింబ బీజా ప్త మాలయా సాధకో జపేత్
మోక్షార్థీ లోకవశ్యార్థీ గ్రధితం రక్తతంతునా॥

తా॥ మోక్షమును వశీకరణను కోరు సాధకుండు ఎఱ్ఱటి దారముతో గ్రుచ్చబడిన పశ్చాత్య నింబబీజములతో చేయబడిన మాలతో జపించవలెను,

శ్లో॥ దూరశ్రవణదృష్ట్యర్థీ జపే దక్షరమాలయా
పోతయా రక్తసూత్రేణ పద్మసూత్రేణ వాథవా॥

తా॥ దూరశ్రవణము, దూరదృష్టి శక్తుల నాశించు వాండు అక్షరమాలతో జపించవలెను. లేదా చిన్న ఎఱ్ఱ దారముతో కాని పద్మబీజముల మాలచేఁగాని జపించ నగును.

శ్లో॥ అశ్వాదం తేభదంతైశ్చ సుసౌమ్య జపమాలయా
శత్రుముచ్చాటయేచ్ఛీఘ్రం అథవా మారణం జపేత్॥

తా॥ గుఱ్ఱపు దంతములు, ఏనుఁగు దంతములచే చేయబడిన సౌమ్యమాలతో వెంటనే శత్రువు నుచ్చాటన మొనర్చనగును. లేదా మారణముకై జపించ నగును.

శ్లో॥ ఖర మాహిష శూకరాణాం దశనైః కృత మాలయా
శీఘ్ర ముచ్చాటయేచ్ఛీఘ్రం శత్రుమారణ కర్మణి॥

తా॥ గాడిద, దున్న, శూకరులయొక్క దంతములచే చేయబడిన మాలతో శత్రుమారణ కర్మయందు వెంటనే ఉచ్చాటన మొనర్చవచ్చును.

శ్లో॥ కరాంత్రసూత్ర గ్రథితం నృకరాత్యుగ్ర మాలయా
శ్మశానే జపతస్తస్య సద్య స్స్యాన్మారణం రిపోః॥

తా॥ చేతిభాగమున నున్న ఎముకల భయంకరమగు మాలతో శ్మశానమున జపించినచో వెంటనే శత్రునాశము సిద్ధించును.

శ్లో॥ సాధ్య కేశేన సంస్యూత ప్రదతంతోష్ట్రమాలయా
త్రివార జప మాత్రేణ సద్యో విద్వేషణం భవేత్
అథవా వ్యాధినా గ్రస్త ప్రత్యర్థీ మృత మాప్నుయాత్॥

తా॥ సాధింపదలచిన వాని వెంట్రుకలతో కూర్పబడిన మాలతో ముమ్మారు జపించినంతనే విద్వేషణసిద్ధి యేర్పడును. లేదా శత్రువు రోగపీడితుఁడై మరణించును.

శ్లో॥ మృతిం ప్రాప్నోత్యరి స్సద్యో జపే దంగార మాలయా
యద్యత్కార్యం సమృద్ధి స్స్యాత్ మాంత్రికాః ప్రజపేన్నశి॥

తా॥ బొగ్గులమాలతో జపించినచో వెంటనే శత్రువు చచ్చును. కార్యసమృద్ధి కొఱకై మాంత్రికులు రాత్రి జపించవలెను.

శ్లో॥ జపమాలా విశేషేణ తత్త త్ఫల మవాప్నుయాత్
ఏవం సర్వవిశేషజ్ఞః నిశ్చలానన్యధీ స్సుధీః॥

తా॥ జపమాలయొక్క విశేషమునుబట్టి ఆయా ఫలములు పొందగల్గును. ఇట్లు అన్ని విశేషములు తెలిసి. నిశ్చలము, అనన్యము నగు బుద్ధితో విద్వాంసుడగువాడు

శ్లో॥ సమ్య జ్మాలా గృహీ త్వాథ ద్వష్టలక్షజపం జపేత్
సంకల్పః ప్రత్యహం పౌర శ్చర్యా దశసహస్రకమ్॥

తా॥ మంచిమాలను గ్రహించి పదునారు లక్షల జప మొనర్చవలెను. ప్రతిదినము సంకల్పము ప్రతినిత్య మొనర్చ వలెను. పదివేలు పురశ్చర్య చేయవలెను.

శ్లో॥ కుర్వ న్విధ్యుక్తమార్గేణ నియమేనైవ మాంత్రికః
పురశ్చర్యాది నారభ్య తత్పరం తు పరిత్య జేత్॥

తా॥ మాంత్రికుడగువాడు విద్యుక్త మార్గమున నియమముతో నొనర్చుచు పురశ్చర్య మొదలుపెట్టు నాటి నుండి చెప్పదోవు వానిని విడవలెను.

శ్లో॥ లశునం లవణం తైలం తిక్తం క్షౌద్రం రసాయనమ్
కాళింగః కతకం బిల్వం ఆరనాళ ముదుంబరమ్॥

తా॥ వెల్లుల్లి, ఉప్పు, నూనె, చేదు, తేనె, వాజీకర ణౌషధము, పుచ్చ, చిల్లగింజ, మారేడు, పులియబెట్టిన కడుగునీళ్ళు, మేడి మొదలగునానిని,

శ్లో॥ మాష ముద్గశ్చ సూపాది శ్చణకా కోద్రవాశనః
అసద్భాషణ మన్యోన్యం క్రోధం దాన పరిగ్రహమ్॥

తా॥ మినుము, పెసర పప్పులు, శనగలు, ఆళ్ళ ధాన్యపు భోజనము, చెడు మాటాడుట, పరస్పర క్రోధము, దానమును గ్రహించుట,

శ్లో॥ అసత్యభాషణం గీతం తాంబూలం గంధధారణమ్
కౌటిల్య కాంస్య మభ్యంగం అనివేదిత భోజనమ్॥

తా॥ అబద్ధమాడుట, పాడుట, తాంబూలము వేసికొనుట గంధమును అలఁదుకొనుట, మోసము, పాన పాత్రలు, తలంటిపోసుకొనుట; నివేదన చేయని భోజనము;

శ్లో॥ పరాధీనత్వ మశుచిః దేవదాంతర పూజనమ్
ఇతీద ముక్తం కర్తవ్యం యదీచ్ఛే త్సిద్ధి మాత్మనః॥

తా॥ పరులపై నాధారపడియుండుట; అశుభ్రత; ఇతర దేవతను పూజించుటు; అని ఇట్లు సిద్ధిని కోరువానికై కర్తవ్యము చెప్పబడినది.

శ్లో॥ స్వాభీష్టసిద్ధి మాప్నోతి హ్యుక్త మార్గానువర్తకః
అగవ్యం క్షీర ద ధాజ్యం తక్రం చ పరివర్జయేత్॥

తా॥ ఇట్లు చెప్పబడిన మార్గము ననుసరించువాఁడు తను కోరిన సిద్ధిని పొందును. ఇంకను గోసంబంధముకాని పాలు, పెరుగు; నేయి. మజ్జిగ విడచిపెట్టవలెను. అనగా గోవునే వాడవలెననుట.

శ్లో॥ భిక్షాశీ పాయసాశీ వా ఫలపిష్టాశనోఽపి వా
పంచగవ్యం హవిష్యం వా ప్రియంగోదన మేవవా॥

తా॥ బిచ్చమెత్తుకతినువాడు, పాయసము తినువాడు, ఫలము తినుట, పిండితినుట, ఆవుయొక్క పేడ, పంచితము, పాలు, పెరుగు, నేయి కలిపిన పంచగవ్యమందుగు- అది హోమద్రవ్యము, కొఱ్ఱధాన్యపు అన్నముకాని,

శ్లో॥ అదుష్ట మపి యల్లభ్యం త ద్భోక్తవ్యం వరాననే

తా॥ ఓపార్వతీ! దోషయుక్తముకాకుండ నేది లభించిన దానిని భుజించవలెను.

శ్లో॥ ఉదయా ద్యస్తమానాంతం జపంస్తిష్ఠే దతంద్రితః
వింశత్యష్టోత్తరశతం సహస్రం వా తదర్ధకమ్॥

తా॥ ఉదయము మొదలుకొని అస్తమానమువఱకు జాగరూకుడై జపించుచు నుండవచ్చును నూటఇరువది యెనిమిది పర్యాయములుకాని వేయికాని లేక అయిదు వందలు కాని జపించనగును.

శ్లో॥ జపస్య దశమో భాగః హోమ స్తస్య దశాంశకః
తర్పణా తద్దశాంశం తు బ్రాహ్మణానాంతు భోజనమ్॥

తా॥ జపమున పదియవవంతు హోమము, అందు పదవవంతు తర్పణము, అందు పదియవవంతు బ్రాహ్మణ సమారాధనము జరుగవలెను.

శ్లో॥ దవానల్లశిఖామధ్యే యథా నీహారబిందువత్
తథైవం నిష్ఫలం కర్మ హోమం విప్రార్చనం వినా॥

తా॥ దావాగ్నిమధ్య నున్న మంచుబిందువు వలె

హోమము బ్రాహ్మణ సమారాధనము జరగని పురశ్చర్య కర్మ నిష్ప్రయోజన మగును.

శ్లో॥ సత్యమేవ మయా చోక్తం దేవి! నాత్ర విచారగా

తా॥ ఓపార్వతీ! నేను చెప్పినది యదార్థము. ఇందు సందేహింప బనిలేదు. అని పరమేశ్వరుఁడు పార్వతీదేవికి చెప్పెను.

ఇతి శ్రీపరాశరసంహితాయాం పరాశరమైత్రేయ సంవాదే పంచముఖ హానుమన్మంత్ర పురశ్చరణవివరణం నామ షడ్వింశత్పటలః

## సప్తవింశ త్పటలః

## —: పంపాసరో వర్ణనమ్ :—

శ్రీ మైత్రేయః

శ్లో॥ స్వామి న్నత్ర కృతార్థోఽహం పరాశర జగద్గురో
తవసందర్శనా న్నూనం జగత్కాలత్రయోఽపి వా॥

తా॥ శ్రీ మైత్రేయుఁలవా రిట్లనిరి "స్వామీ పరాశర మహర్షీ! నేనిచ్చట నీదర్శనముచే నిజముగ ధన్యుఁడనైతిని. అట్లే జగత్త్రంతయును కాలత్రయమందును ధన్యమైనది.

శ్లో॥ సాంసారికకథా గ్రీష్మ సంతప్తం బహిరంతరమ్
మా మసించ త్ఛవా న్యస్మాత్ ఆంజనేయ కథామృతైః॥

తా॥ సంసారగాథయనెడి వేసఁగిచే లోపల బయట కూడ తప్తమైయున్న నాపై మీరు ఆంజనేయకథయను అమృతముచల్లి చల్లబఱిచిరి.

శ్లో॥ న కేవల మహం తీర్ణో దుస్తరం భవసాగరమ్
భవత్కృపాప్లవే నేదం త్రితయాం జగతామపి॥

తా॥ ఈ దాట శక్యముకాని సంసార సముద్రమును నేనుమాత్రము దాటలేదు. తమ దయయను తెప్ప ఆధార మున ముల్లోకములు తరించినవి.

శ్లో॥ యస్తు సదా హాతో మూఢః త్యక్త్వా నామ మనూత్తమమ్
సోఽయం భ్రమతి సంసార సాగరే భ్రమసంకులే॥

తా॥ ఎవఁడైతే మూఢుఁడై మంత్రశ్రేష్ఠమగు నీ నామమును వీడుచున్నాఁడో అట్టివాఁడు సుడులనిండి సంక్షోభముగ నున్న సంసార సముద్రమునబడి తిరుగు చున్నాడు

శ్లో॥ కిం తు పంపాసర స్తీరే హనూమా న్మారుతాత్మజః
కథం చిక్రీడ సామాత్యః బాలక్రీడాభి రద్భుతమ్॥

తా॥ ఇంకను పంపానదీ తీరమున వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు అద్భుతమగు బాలక్రీడలు మంత్రులతో ఎట్లు క్రీడించుచున్నాడు?

శ్లో॥ కాని దుష్టాని సత్త్వాని శిక్షితాని మహాత్మనా
కాని సత్త్వాని శిష్టాని రక్షితాని మహాత్మనా॥

తా॥ ఆ మహాత్ముని చే ఏ దుష్ట ప్రాణులు శిక్షింపఁ బడినవి? ఏమంచి ప్రాణులు రక్షింపఁబడినవి?

శ్లో॥ యతశ్చాన్యశ్చ కృత్స్నం మే బ్రూహి పారాశర ప్రభో
అజ్ఞాతం త్రిషు లోకేషు త్రిషు కాలేషు వా త్వయా॥

తా॥ ఓ పరాశర మహాప్రభూ! ఇంకను కల్గిన విషయమంతను నాకు చెప్పవలసినది. నీచే నీ మూడు లోకములందు, మూడు కాలములందు తెలుపుడు చేయబడినది చెప్పవలసినది

శ్లో॥ న కించి ద్విద్యతే బ్రహ్మన్ హనూమత్కృపయా మునే
అహీన దృశ్యతే తృప్తిః ఆంజనేయకథాశ్రుతౌ॥

తా॥ ఓ మహామునీ! హనుమంతుని దయచే ఆంజనేయుని కథ వినుటయందు తృప్తి చాల గొప్పగ నున్నది.

శ్లో॥ హనూమతః ప్రసాదో వా పుణ్యశ్రీర్వా మహోత్తమా
సత్సంగస్య ప్రభావో వా కారణం న్న బుధ్యతే॥

తా॥ అందుకు హనుమంతుని యనుగ్రహమో, లేక నా ఉత్తమ పుణ్యసంపదయో అదికాక మంచివారి కూటమియొక్క ప్రభావమో కాని కారణము తెలియుటలేదు.

శ్లో॥ శిష్యే మయి కృపాం కృత్వా భవత్పాదనతే భృశమ్
ఆఖ్యాహి హనుమద్వార్తాం సర్వలోక శుభావహామ్॥

తా॥ శిష్యుండనైన, మీపాదసేవయే ముఖ్యముగా కల నాయందు దయయుంచి సర్వలోకములకు శుభములు చేకూర్చు హనుమద్విషయమును చెప్పుడు.

శ్లో॥ ఇతి తద్వచనం శ్రుత్వా వ్యాసస్యజనకో మునిః
హృష్టరోమ భవన్సద్యః హనుమద్భక్తశేఖరః॥

తా॥ అను ఆమాటలు విని వ్యాసుని తండ్రియు,

హనుమద్భక్త శ్రేష్ఠుండు అయిన పరాశరమహాముని వెంటనే పరమానంద మందె

శ్లో॥ ఉవాచ వచనం ధీమాన్ మైత్రేయం మునిసత్తమమ్॥

తా॥ బుద్ధిశాలియగు నాతండు ముని శ్రేష్ఠుండగు మైత్రేయునితో నిట్లనెను.

శ్రీ పరాశరః

శ్లో॥ కృతార్థోఽసి మహాభాగ మాం కృతార్థం కరోషి చ
యద్విహాయ తథా మన్యాం మనో వాక్కాయ కర్మభిః
హనుమత్కథయాకాలో నీయతేఽహర్నిశాత్మకః॥

తా॥ శ్రీ పరాశరులవారనుచున్నారు. ఓమైత్రేయా! నీవు కృతార్థుండవైతివి. నన్నుకూడ కృతార్థుని చేసితివి. ఎందుకన సర్వము విడచి మనస్సు, వాక్కు, కర్మలతో నేది తలచంబడుచున్నదో అట్టి హనుమత్కథతో రేబవళ్ళు కాలమంతయు గడచుచున్నది.

శ్లో॥ లోకయాత్రానుసంధాన వ్యగ్రభావమనో మృగః
ఆంజనేయకథాప్రశ్న వాగురాసంయతో మమ॥

తా॥ నాయొక్క లౌకిక విషయ సంబంధమున కలత పెట్టబడు మనస్సను మృగము ఆంజనేయుని కథకు సంబంధించిన ప్రశ్నయను ఉచ్చుతో కట్టబడినది.

శ్లో॥ హనూమతః కథాప్రశ్న పునాతి చతురోజనాన్
వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ అనుమంతార మేవ చ॥

తా॥ హనుమంతుని కథకు సంబంధించిన ప్రశ్న

చెప్పువానిని, అడుగువానిని, వినువారిని, అనుమతించు వానిని ఇట్లు నాల్గువిధముల జనులను పవిత్రులఁ జేయును.

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణాం చతుర్ణాం ప్రతిభూ రియమ్
అతో౽హ మవిలంబేన యథామతి యథా క్రమమ్
హనూమతః కథాం పుణ్యాం వర్ణయామి మహామునే॥

తా॥ ఈ హనుమద్విషయము ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాల్గువిధముల పురుషార్థములకు పూఁట కాఁపువంటిది. అనగా జామీనుదారుని వంటిది. అందుచే ఆలస్యము చేయక నేనెఱిఁగిన రీతిని క్రమముగా ఓ మైత్రేయా ఆ హనుమత్పుణ్య కథను వర్ణించెదను.

శ్లో॥ అస్తి పంపాసరో నామ మహా పుణ్య జలాశయః
హేమాంభోరుహ రాజీభిః వికచాభి ర్నిరంతరమ్॥

తా॥ పంపాసరోవరమను పేరుగల గొప్ప పుణ్యానది కలదు. అది ఎల్లప్పుడు వికసించిన బంగరు పద్మముల సమూహములతో నుండునది.

శ్లో॥ కూలద్వయ సమాకీర్ణం మునిమండల మండితమ్
తీర్థై రమితసంఖ్యాకైః నిష్పన్నై ర్వాలుకాంకితైః
స్త్రీ బాల వృద్ధ యూనాం చ సుఖస్నాన ప్రదం సదా॥

తా॥ రెండు ఒడ్డులను వ్యాపించి యుండునది; మునుల సమూహముతో ప్రకాశించునది; ఉత్పన్నములైన మితిలేని జలముతోను, ఇసుకతిన్నెలతోను స్త్రీలు, పిల్లలు, పెద్దలు, నడివయస్సు వారలకును ఎల్లప్పుడు సుఖ స్నానమున కవకాశ మిచ్చునదై యుండును.

శ్లో॥ హంస సారస చక్రాంగ జలకుక్కుట శోభితమ్
వికస త్పద్మ జృంభేషు భ్రమ ద్భ్రమర సంకులమ్॥

తా॥ హంసలు, బెగురుపక్షులు, చక్రవాకములు, నీటికోళ్లు మున్నగువానితో ప్రకాశించునది, వికశించిన పద్మ సమూహముచే తిరుగాడు తుమ్మెదలచే వ్యాకుల మైనదియు.

శ్లో॥ హేమ రంభావన చ్ఛన్న ప్రాంత దేశం మనోరమమ్
శైవాలమంజరీ లీన మహాఫణి ఫణాద్భుతమ్॥

తా॥ బంగారు అరటి తోటలచే కప్పబడిన ప్రాంత భూములు కల్గి మనోహర మైనది, నాచుయొక్క మొత్తములం దిమిడియున్న గొప్ప సర్పముల పడగలచే అద్భుత మైనదియు,

శ్లో॥ తత్రాసవే వ్యాఘ్ర వ్రాతాః విహాయ కలహంసజః
విరోధినోఽపి పతగాః సఖాయ స్సహజా యథా॥

తా॥ అచ్చట జంతుజాలమంతయు తమకు జన్మసిద్ధమగు కలహము వీడియున్నవి. పక్షులు కూడ విరోధు లయ్యు సహజ మిత్రులవలె నున్నవి.

శ్లో॥ తరవోఽపి సుపుష్పాఢ్యా సర్వర్తు ఫలసంపదః
బిసప్రసూన సంచారః తత్ర హంసారిరంసవః

తా॥ అచ్చట చెట్లును మంచిపుష్పములచే గొప్పగా నుండి అన్ని ఋతువులందు నుండు ఫలములను కల్గినవైనవి. హంసలు తామర తూలులందు, పూవులందును, సంచరించుచు క్రీడింప నిచ్ఛగలవై నవి

శ్లో॥ ఆహ్వాయంతీవ కందర్పం నినదైః కలకలారవైః
సకృత్పరభృతాలాపైః కామబాధా శ్చశాసతే॥

తా॥ తమ కిలకిల ధ్వనులచే మన్మథ నినాదమును ఆహ్వానించుచున్నట్లు ఒక్కమాటుగ చేయు కోకిలల ధ్వనులు కామబాధను వెలువరించుచున్నవి.

శ్లో॥ మత్తషట్పద సంచారాః కందర్ప జయశబ్దవత్
శ్రూయంతే వితతా స్తత్ర మలయానిల శేఖరాః॥

తా॥ మదించిన తుమ్మెదల సంచారము మన్మథ విజయమును వినిపించుచున్నది. మలయవాయువులు అచ్చట మిక్కిలిగ వీచుచుండెను.

శ్లో॥ యూనాం ప్రణయసంరంభాః తత్ర పుణ్యసరోవరే
క్షణా చ్ఛిథిలతాం యాన్తి నీహారా ఇవ భాస్కరే॥

తా॥ యువకుల ప్రణయ వ్యవహారమా పుణ్య సరోవరమందు సూర్యుని వలన మంచువలె క్షణములో అణగిపోవుచున్నది

శ్లో॥ ముగ్ధా యువతయః పుణ్యం పీత్వా తజ్జల ముత్తమమ్
కుతోయ మితి మన్యన్తే స్వర్గా దమృతవాహినీ॥

తా॥ ముగ్ధలగు యువతులు పవిత్రము, శ్రేష్ఠమునైన ఆజలమును త్రాగి దానిని స్వర్గమునందలి అమృతవాహిని యగు గంగయొక్క కాలువా! అనుకొనజొచ్చిరి.

శ్లో॥ రమంతే దేవగంధర్వాః కిన్నరా స్సాప్సరోగణాః
తత్ర కేచి న్మహాత్మానో మంత్రసిద్ధా స్తు వర్ణినః॥

తా॥ అచ్చట అప్సరలతో కూడిన దేవతలు, గంధర్వులు, కిన్నరులును క్రీడించుచుండిరి కొందరు మంత్రసిద్ధులగు మహాత్ములు నుండిరి ఋషులు కొందరు

శ్లో॥ స్వరూపధ్యాన మాస్థాయ బ్రహ్మానందానుభూతయః॥

తా॥ స్వస్వరూపానుసంధానముతో బ్రహ్మానందానుభూతి నందుచుండిరి

శ్లో॥ గృహిణస్తు సదాచారాః అగ్నిహోత్ర పరాయణాః
స్వాధ్యాయనిరతా శ్చాసన్ ఆచరంతోఽతిథి క్రియాః॥

తా॥ గృహస్థులైనచో నట సదాచార సంపన్నులై అగ్నికార్యనిష్ఠులై స్వాధ్యాయ మొనర్చుచు అతిథి సంపూజన మొనర్చుచుండిరి

శ్లో॥ వానప్రస్థా స్తు మునయః చతుష్పావక మధ్యగాః
లలాటాంతర మార్తాండాః తప్యంతే దుశ్చరం తపః॥

తా॥ వానప్రస్థాశ్రములగు మునులు నాల్గు అగ్నుల మధ్యనుండి నొసట సూర్యుడు పడుచుండగా కఠోరమగు తపస్సు నొనర్పసాగిరి.

శ్లో॥ యతయోఽపి మహాత్మానో నిరస్త ద్వైత భావనాః
విహిత ప్రణవాచారాః మన్యంతే స్వపరం సదా॥

తా॥ మహాత్ములగు యతులుకూడ ద్వైతభావనను పోగొట్టుకొనినవారై అద్వైత భావితమగు ప్రణవాచారము లొనర్చుచు నెల్లప్పుడు పరమాత్మను భావింపజొచ్చిరి.

శ్లో॥ ఏవం సర్వసమృద్ధేఽస్మిన్ పంపాసరసి పావనే
హనూమాన్ సపరీవారః విహర్తుం చక్రమే ముదా॥

తా॥ ఇట్లు సర్వసమృద్ధి కల ఆ పవిత్రమగు పంపా సరోవరమున తన పరివారముతో కూడిన హనుమంతుడు సంతసమున విహరింప గోరెను.

శ్లో॥ గంధమాదన శైలాగ్ర స్వర్ణ రంభావనాశ్రయాత్
ఉష్ట్రి మారుహ్య హనుమాన్ హేమాస్తరణభూషితమ్॥

తా॥ గంధమాదనపర్వత శిఖరమందలి బంగారు అరటి తోటలనుండి హనుమంతుఁడు బంగారు కంబళితో అలంకరింపబడిన ఒంటె నెక్కినవాఁడై

శ్లో॥ నవరత్నాంచిత స్వర్ణ కింకిణీజాల శోభితమ్
మంజీర కలనాదేన సమాహూత సరచ్ఛదమ్॥

తా॥ ఇంకను నవరత్నములతో నొప్పు బంగరు చిఱుగజ్జెలతో ప్రకాశించునట్టి, అందెల అవ్యక్త ధ్వనితో ఆహ్వానింపబడెడి జారుచున్న ఆస్తరణము కలది.

శ్లో॥ ప్రలంబి చంచదోష్ఠాగ్రం తీక్ష్ణకంటక ఖాదినమ్
దీర్ఘగ్రీవం మహాకాయం ఊర్ధ్వపృష్ఠ సువాలధిమ్॥

తా॥ వ్రేలాడుచు కదలుచున్న అగ్రభాగము కలది, వాడియైన ముళ్ళను తినునది, పొడవగు మెడ, పెద్ద దేహము, ఎత్తగు పృష్ఠభాగము, మంచి తోక కలదియు;

శ్లో॥ క్వణిత స్వర్ణరత్నాఢ్యం హేమాచల సమున్నతమ్
అరోగ మజరం పూతం ద్వాదశాబ్దం మనోజవమ్॥

తా॥ చక్కని నాద మిచ్చును బంగారము, రత్నములుకల ఆభరణములు కలది, మేరుపర్వతమువలె ఎత్తైనది, రోగము, ముదిమియు లేనిది, పవిత్రమైనది, పండ్రెండేండ్ల వయసుకల్గి మనసుతో సమానమైన వేగము కలదియును;

శ్లో॥ శిరీషపుష్ప మృదుల సర్వావయవ శోభితమ్
గంధమాదనశైలస్య ధునే ంత్యద్భుతోద్భవమ్॥

తా॥ దిరిసెన పూవువలె మెత్తనగు నన్ని యవయవములతో ప్రకాశించునది. గంధమాదన పర్వతముయొక్క నదినుండి నత్యద్భుతముగ పుట్టినది;

శ్లో॥ శేషాహిం ఫణి మాణిక్యం తేజఃపుంజ మివ స్థితమ్
ఆజగామ కపిశ్రేష్ఠః పంపాతీరం మనోరమమ్॥

తా॥ ఆదిశేషుని యొక్క పడగయందలి రత్నమువలె నున్నది. కాంతియొక్క మొత్తమా అన్నటున్న తన వాహనముగా బంటెనెక్కి వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు మనోహరముగు పంపానదీతీరమునకు వచ్చెను

శ్లో॥ ఛత్రంధర్తో సుషేణో వై మైందనీలౌతు చామరౌ
మాగధో మాగధాచారః పురోగ గ్గంధమాదనః॥

తా॥ సుషేణుడు ఛత్రమును ధరించెను. మైందుడు, నీలుడు చామరములు దాల్చిరి మాగధుడు స్తోత్రపాఠము నొనర్చుచుండెను. గంధమాదనుడు ముందు నడచుచుండెను.

శ్లో॥ వివిధా ద్వివిదోవాచీ శ్రావయ త్వేన మంజసా
పవః పాదుకే గృహ్ణాన్ పదాభ్యాసం నిరీక్ష్యతే॥

తా॥ సుగ్రీవుడు వివిధ సుభాషణము లొనర్చగా, పవనుడు పాదుకలను గ్రహించి నడకనుగూర్చి నిరీక్షించు చుండెను

శ్లో॥ హిత మాచరతే వృద్ధో జాంబవాన్ నీతి మాచరన్
వినతో వినయగాత్రోహి భుజాలంబం దదౌ తథా॥

తా॥ పెద్దవాడగు జాంబవంతుడు మంతాంగముసు నీతినిపాటించుచు హితవిచార మొనర్చుచుండెను. వినతుడు వినయశీలియై భుజాలంబము నిచ్చుచుండెను.

శ్లో॥ అన్యే వానరముఖ్యాశ్చ - గవాక్షప్రముఖా అపి
అనుజగ్ముః కపిశ్రేష్ఠం - అతి సంకటగామినః॥

తా॥ ఇతరులగు, వానరప్రముఖులు అగు గవాక్షుడు మున్నగువారును మిక్కిలి కష్టమైనను కపిశ్రేష్ఠుడగు హనుమంతు ననుసరించి నడువజొచ్చిరి.

శ్లో॥ కీర్తితాన్యపదానాని గంధమాదన వందినా
సుఖం సుశ్రావ హనుమాన్-మధువాణీ పునఃపునః॥

తా॥ వంశకీర్తిని పలికెడి గంధమాదనుని యొక్క తీయని మాటను హనుమంతుడు సుఖముగా మరల మరల వినెను,

శ్లో॥ ఏవం కృత సుఖాలాపః-శృణ్వ న్మధ్యేపదం హరిః
అపి గమ్య విలంబేన - క్షణా త్ప్రాప సరోవరమ్॥

తా॥ ఇట్లు చేయబడు సుఖ సంభాషణములు వినుచు అలసించినను క్షణములో హనుమంతుడు పంపాసరోవరమును చేరెను.

శ్లో॥ ఆసాద్య హనుమా న్పంపాం - దద ర్శై కాగ్రమా నస
విస్మయం పరమం లేభే - సరోవర నిరీక్షణాత్ ॥

తా॥ హనుమంతుడు పంపా సరోవరమును చేరి, ఏకాగ్రతతో చూచి ఆ సరోవరమును చూచుటలో మిక్కిలి ఆశ్చర్యము పొందెను

శ్లో॥ సరోదర్శన ఫుల్లాస్యం - హనూమంతం కపీశ్వరమ్
ఉవాచ వచనం ధీమాన్ జాంబవాన్ సువిచక్షణః॥

తా॥ అట్లు పంపాసరోవరమును చూచుటచే వికసించిన ముఖముకల వానరప్రముఖుడగు హనుమంతునితో ఆలోచనాజ్ఞానియగు జాంబవంతు డిట్లనెను.

శ్లో॥ సువర్చలాపతే! పశ్య! - పంపాయాః రమణీయతా
కాదంబనికురుంబాబ్జం - వ్యోమేవ వితతం సరః॥

తా॥ ఓ సువర్చలానాథా! పంపాసరోవరముయొక్క అందము చూడుము. ధూమ్రవర్ణముకల ముక్కు, కాళ్ళు రెక్కలుగల హంసల సమూహముతో కూడి ఆకాశమువలె నున్నది.

శ్లో॥ శ్వేతగుంజా విరాజంతే-తారా ఇవ సునిర్మలాః
శైవాలపటలా భాంతి-శ్యామలా ఇవ నీరదాః॥

తా॥ తెల్లని పూలగుత్తులు స్వచ్ఛముగు నక్షత్రముల వలె ప్రకాశించుచున్నవి. నీటిపాచియు తయు నీలవర్ణముకల మేఘములవలె నున్నది. (ఇచ్చట ఫేన పుంజా అని పాఠాంతరము)

శ్లో॥ సప్తవర్ణచ్ఛదా యస్మిన్-సపుష్పాః ప్రతిబింబితాః
సప్తవర్ష యఇవాభాంతి - స్తోత్రాన్తయః పురా॥

తా॥ పూవులతో కూడిన ఏడాకుల అరటి యాకులు పంపాసరోవరమున ప్రతిబింబించినవై స్తోత్ర పాఠములొనర్చు సప్తర్షులవలె నున్నవి

శ్లో॥ జ్వలత్పావకసంకాశో - రక్తోత్పల సముచ్చయః
అంగారక ఇవాభాతి - శుభస్థానగతో మహాన్॥

తా॥ మండుచున్న అగ్నితో సమానముగా నున్న ఎఱ్ఱకలువల సమూహము శుభమగు రాశియందున్న అనగా బలవంతుడుగ నున్న కుజగ్రహమువలె నున్నది.

శ్లో॥ ఉదేత పుండరీకాళిః - అదభ్ర విశదప్రభా
ప్రభాతసమయో వ్యోమ్ని - గురోరేవ మహాద్యుతిః॥

తా॥ తెల్లగలువల సమూహముతో విస్తారశోభకల్గిన ప్రభాతసమయము ఆకసమున గురుగ్రహముయొక్క గొప్ప కాంతివలె నుండెను.

శ్లో॥ హేమాంబుజవనం పూర్వం-ఉద్బుద్ధహృదయం పురా
ఉదైతి మండలం భానోః - తథాఽరుణపురస్సరమ్॥

తా॥ వికసించిన హృదయముతో బంగరు పద్మముల సమూహము ముందుకల్గియుండి అరుణుడు ముందుకల్గిన ఉదయకాలపు సూర్యమండలమువలె నుండెను.

శ్లో॥ పర్యంత విసర ధ్వాంత - విధ్వంసన విచక్షణః
శుక్రోదయ ఇవాభాతి - కుముదానాం మహోదయః॥

తా॥ తత్ప్రదేశమందలి చీకట్లను పోద్రోలజాలు కలువల వికాసము శుక్రోదయమువలె ప్రకాశింపజొచ్చెను.

శ్లో॥ శనై శ్చరతి పద్మేషు - మధులోభా న్మధువ్రతః
శనైశ్చర ఇ వాశ్చర్యా - చ్ఛుభరాశిగతాస్పదః

తా॥ తేనెయందలి మక్కలి ఇష్టమున మాటి మాటికీ పద్మములందు తిరుగు తుమ్మెద శుభరాశి గతుఁడగు శని గ్రహమువలె నుండెను.

శ్లో॥ ముక్తామణిమయ స్సూక్ష్మః - సర్పమౌళి ప్రతిష్ఠితః
చంద్రపుత్ర ఇవాభాతి - గగనాంగణ రాజితః॥

తా॥ సర్ప శిరముననున్న సూక్ష్మము ముక్తామణి ఆకాశమున నున్న బాలచంద్రునివలె ప్రకాశించెను.

శ్లో॥ ఇదం మృణాళ మాభాతి-లూనపుష్పముఖా ద్విజైః
అదృశ్యమాన పూర్వాంగ-కేతుచ్ఛాయాగ్రహోయథా॥

తా॥ ఈ తామరతీగె హంసలచే లేదా బ్రాహ్మణులచే పుష్పము కోయబడినదై తల కన్పడకుండ నుండెడి ఛాయా గ్రహమగు కేతువువలె ప్రకాశించుచున్నది

శ్లో॥ గ్రాసమానః ఫణీశం ఖం శుభ్రమూషక సంభ్రమాత్
రాహుగ్రస్త యథా చంద్ర - మాభాతి వివృతాననః॥

తా॥ తెల్లఎలుకయను భ్రాంతితో కప్ప చిప్పను పట్ట బోవుచున్నదై పాము చంద్రుని పట్టుటకు నోరు తెఱచిన రాహువువలె నుండెను.

శ్లో॥ చక్రశ్చాంద్రిభ మేనేమే - శంఖదర్శనవిహ్వలః
ఫణితద్గ్రహ వేళాయాం - భజంతీ ప్రీతిము త్తమామ్॥

తా। చక్రవాకము చంద్రుని యావరణముక తిరుగు
నదై రాహువు చంద్రగ్రహము చేసిన రీతి నుండెను

శ్లో॥ విష్టబినాళ హేమాబ్జం సమారోహతి హంసకః
భర్తృనాయక పార్థస్య వైజయంత్యాం భవన్యథా॥

తా॥ బాగుగా నిలచియున్న బంగరు పద్మమును ఎక్కిన హంస అర్జునుని టెక్కెమున భర్తృనాయకుడగు హనుమంతునివలె నుండెను.

శ్లో॥ నీలోత్పలగణో భాతి రక్తోత్పలగణాస్పదః
ఆరూఢ గరుడారూఢ శ్రియఃపతి రివ ప్రభుః॥

తా॥ ఎఱ్ఱకలువల గుణమే స్థానముగ గల్గిన నల్ల కలువల గుణము గరుత్మంతు నధిరోహించిన విష్ణువువలె ప్రకాశించినది.

శ్లో॥ నళినీనయనాకారైః నళిన్యై ర్లీనకాంతిభిః
సువర్చలే చ కల్యాణి భవంతం ప్రేక్షతే ముహుః॥

తా॥ కాంతులను లోనణించుకొనిన కన్నులవలె నున్న తామరపూవులచేత ఈ సరస్సు ఓ సువర్చలా! నిన్ను మాటిమాటికి చూచుచున్నది

శ్లో॥ పంపేయం వీచిబాహుభ్యాం కస్యైవ పితరస్వకం
చిరాత్సమాగతం బంధుం భవంత ముపగూహతి॥

తా॥ ఓ హనుమంతా! ఈ పంపానది పితృసమానుడ వైనట్టియు చాలకాలమునకు వచ్చిన బంధువగు నిన్ను అలలను చేతులతో కౌగలించుకొనుచున్నది.

శ్లో॥ పూర్వమేవ మయా మత్యర్థం దర్శనీయగణాన్వితా
అధునా తు విశేషేణ భవ దాగమనా త్ప్రభో॥

తా॥ పూర్వమే ఇది మిక్కిలి చూడదగిన గుణములు కలది. ఇప్పుడు విశేషంగా నీ రాకవలన ఓ దేవా! మరింత దర్శనీయమైనది.

శ్లో॥ నిరంధ్రవిటపచ్ఛాయాః తరవో బహుపల్లవాః
యుగప న్మధురాస్వాదైః ఫలై పుష్పైశ్చ సంవృతా॥

తా॥ ఇచ్చటి వృక్షములు దట్టముగను నీడకల్గి యున్నవి. మిక్కిలి చిగుళ్ళతో నిండినవి మిక్కిలి తీయనైన తినదగిన పండ్లతోను, గొప్ప పుష్పములతోను ఎప్పుడు కూడి యుండునవి

శ్లో॥ ఉపధాయై తథా గుహ్యా తరూనీ తో వృత్తో ముధుః
సంగృహ్య ఫలపుష్పాణి శాఖాగ్రై రవరోహతి॥

తా॥ పరీతముగా అట్లు వసంతుడు ఫలపుష్పాదులను వృక్షములనుసించి కొమ్మ చివరలనుండి దిగుచున్నాడు.

శ్లో॥ విరోధినోఽపి సంభూయ కంద ర్పార్థికృతా ఇవ
తరవ స్తన్వతే రమ్యాం పంపాభువవనం తథా॥

తా॥ విరోధి వృక్షములు పైతము కూడినవై మన్మధుని యాచకు నొనర్చునట్లుగా నచ్చట వృక్షములు శోభ కల్గించుచున్నవి అట్లే పంపానదీ ప్రదేశ జన్యమైన వనము కూడ రమ్యత చేకూర్చుచున్నది.

శ్లో॥ అంతరాయ బహుత్వేన క్లిశ్యమాన స్థలాంతరే
గణోఽపి యోగినా మత్ర మంత్రసిద్ధిం తు విందతి॥

తా॥ అడ్డంకు లేకయుగ నుండుటచే పేటాకచో కష్టము ననుభవించు యోగులుకూడ నిచట చక్కగా మంత్రసిద్ధి నొందఁ జాలిరి.

శ్లో॥ పీనాపీనభరా గావో జుహ్వ్యం తే క్షీరసంపదః
శాఖయ స్తు శిఖాగ్రేణ భవంతం ప్రణతా ఇవ॥

తా॥ మిక్కిలి బలిసిన పొదుగులు గల అవులు బాగుగా పాలసమృద్ధిని కల్గించుచున్నవి. వరి బరువగు కంకులతో వంగి నీకు నమస్కరించుచున్నట్లున్నది.

శ్లో॥ చిరం త్యజంతి వంధ్యత్వం తరవః పశవో౽పి వా
ప్రసూనైః ప్రభవై ర్వాపి భవదాగమ వైభవాత్॥

తా॥ ఓ హనుమంతా! నీరాకవలని భాగ్యముచే చెట్లు పశువులుకూడ పూలతోడ, బిడ్డలతోడ కూడినవై తమ గొడ్డాలితనమును పోగొట్టుకొన్నవగుచున్నవి.

శ్లో॥ ఇతి నివేదిత ముత్తమసంపదం
సపది జాంబవతో హృది భావయన్
అనుమమోద గుణగ్రహశేఖరః
త ముపష్టంజితవాన్ కపిశేఖరః॥

తా॥ ఇట్లు తెలియజేయబడిన సంపదలుకల పంపా సరోవర వైభవమును గుణగ్రహణ పారీణుఁడగు జాంబవంతుఁడు భావించుచుండగా వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడాతని గ్రహించెను.

శ్లో॥ తదను జాంబవతీపితరం వచః
పవనసూనురవోచిత మంత్రిణమ్

కతి దినాని వసామ సఖే! వయమ్
సరసి సర్వసమృద్ధి మనోహరే॥

తా॥ అప్పుడు వాయు కుమారుడగు హనుమంతుడు మంత్రియగు జాంబవంతునితో ఓ మిత్రుడా! సర్వసమృద్ధిగా నున్న ఈ మనోహరమైన సరస్సు కడ మనమెన్ని రోజు లుందము? అని యడిగెను.

శ్లో॥ అను వదంతి పరిశ్రమ మాహితమ్
కపికులాని ఫలాంబునిషేవణైః
పరిహృతా న్యభయం తు మదాజ్ఞయా
వన సఖే విహరంతు నిజేచ్ఛయా॥

తా॥ ఓ జాంబవంతా! మన కపికులమంతయు ఇచ్చటి పండ్ల చేత నీటిచేత తమ బడలికను పోగొట్టుకొనుగాక! నాయాజ్ఞచే ఇతర భయములను వీడి స్వేచ్ఛగా సంచరించును గాక! ఈ విషయమును తెల్పుము.

శ్లో॥ యథా న వార్త్యేత మునీంద్రమండలమ్
చిరం కృతావాస మిహాశ్రమోత్తమే
తథా చరేయుః పృథుసత్త్వవిక్రమాః
నివృత్య శాఖామృగయూథపాః సఖే॥

తా॥ ఓ మిత్రుడా! మిక్కిలి పరాక్రమవంతులగు మన వానర వీరులందరు మునులకే ఆటంకమును కల్గించక ఈ ఉత్తమమగు ఆశ్రమమందు చాలకాలము నివసింతురు గాక!

శ్లో॥ ఇతి నిదేశ మముష్య నిశమ్య వై
కరభ డింభతలా దవతార్య సః
భువ మగా త్పవసాంగద లంబితో
ద్వివిదదర్శిత గమ్యపథః పురః॥

తా॥ ఇట్లు హనుమంతుఁడు ఆజ్ఞను తెలిపి ఒంటె మీఁదనుండి దిగి పనసుఁడు, అంగదుఁడు ప్రక్క నిలువగా ద్వివిదుఁడు ముందునుండి త్రోవ చూపుచుండ పంపాసరోవర జలమున ప్రవేశించెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే
పంపాసరోవర్ణనం నామ సప్తవింశతిపటలః

## అష్టావింశ త్పటలః

## శ్రీ నారద హనుమత్సంవాదః

శ్రీ మైత్రేయః

శ్లో॥ బ్రహ్మన్! పంపాం సమాసాద్య -
కపిరాఘానుయాయినః
భర్తృరాజ్ఞావచ శ్శ్రుత్వా కిము కుర్వంతి త ద్వద॥

తా॥ శ్రీ మైత్రేయులవా రడుగుచున్నారు. ఓ మహానుభావా! హనుమంతుని అనుయాయులందరు పంపానదిని చేరి

నాయకుడగు హనుమంతుని మాట విని ఏమి చేయుచున్నారో ఆ విషయమంతయు తెలుపవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ మైత్రేయ! శృణు వక్ష్యామి క్రీడాంతాని వనౌకసామ్
సర్వభూతాంతరావాసో హనుమాన్ ప్రీతిమాప యైః

తా॥ పరాశరులవారు చెప్పుచున్నారు : ఓ మైత్రేయా సర్వప్రాణులందు నున్న హనుమంతుడు ఎవరిచే సంతసమందినాడో అట్టి వానరులయొక్క ఆటల పర్యవసానాదులు చెప్పెదను వినుము.

శ్లో॥ గవాక్ష శ్శరభో నీలో గవయో గంధమాదనః
నలో గజః ప్రహస్తశ్చ - దర్దురో వేగవా నపి॥

తా॥ గవాక్షుడు, శరభుడు, నీలుడు, గవయుడు, గంధమాదనుడు, నలుడు గజుడు, ప్రహస్తుడు, దర్దురుడు, వేగవంతుడున్ను

శ్లో॥ ఏతే దశ మహావీరాః నీత్వా కోటీర్వనౌకసామ్
చేరుః పంపాపురోదేశం సమృద్ధ ఫలపాదపమ్॥

తా॥ ఈ పదిమంది హనుమద్దశ వీరులును కోటిమంది వానరులను గైకొని సమృద్ధిగా ఫలములుకల చెట్లతో కూడిన పంపా సరస్సుయొక్క ముందుభాగమున నుందురు.

శ్లో॥ ఋషభ స్సుముఖశ్చైవ పృథు ర్దధిముఖస్తథా
జ్యోతిర్ముఖోఽపి సంపాతిః రుంద్రగ్రీవస్తు కేసరీ॥

తా॥ ఋషభుడు, సుముఖుడు, పృథువు, దధిముఖుడు, జ్యోతిర్ముఖుడు, సంపాతి, రుంద్రగ్రీవుడు, కేసరియు.

శ్లో॥ అష్టావేతే మహాసత్త్వాః నీత్వా లక్షాని పంచ చ
పంపాయా దక్షిణే తీరే విచేరు ర్మధుసంభృతమ్॥

తా॥ ఆను నెనిమిదిమంది బలవంతులగు అష్టమహాబలులును ఐదులక్షల వానరసేనను గొని వసంతశోభకల పంపా సరోవర దక్షిణ తీరమున నుండిరి.

శ్లో॥ మరీచిః కేసరీ రంభః తరుణో గోముఖో మహాన్
ఏతే పంచ హరిశ్రేష్ఠాః సహస్రాణి చతుర్దశ
గృహీత్వా వానరశ్రేష్ఠాన్ విచేరుః పశ్చిమే తటే॥

తా॥ మరీచి కేసరి, రంభుడు, తరుణుడు, గోముఖుడు ఆను నీయైదుగురు వానర శ్రేష్ఠులును పదునాల్గువేల కపివీరులను గొని పంపా సరోవరము యొక్క పడమటి తీరమున నుండురు.

శ్లో॥ సువేషో హరిలోమశ్చ విద్యుద్దంష్ట్రో జితశ్రమః
అన్య శ్శతవలి శ్చైవ చత్వారోఽమితవిక్రమాః
నీత్వా నవసహస్రాణి చేరు రుత్తరత స్తటే॥

తా॥ సువేషుడు, హరిలోముడు, విద్యుద్దంష్ట్రుడు, జితశ్రముడు శతవలి అను నల్గురు మిక్కిలి పరాక్రమము కలవారును తొమ్మిదివేల వానరవీరులను గొని పంపాసరోవరపు ఉత్తరతీరమున నుండురు.

శ్లో॥ జాంబవత్ప్రముఖా శ్చాన్యే పరివార్యాంజనాసుతమ్
చేరు స్తత్ర తదభ్యాసే ఫలపుష్పవనాంతరే॥

తా॥ జాంబవతుడు మున్నగు నితరవీరులు హనుమంతునితో కలసి ఆ పంపా సరోవరమునకు సమీపముననే

యున్న ఫలపుష్పములు బాగుగా కల వన మధ్య భాగమున నుండిరి.

శ్లో॥ పంపాం ఫలఫలానమ్ర పాదపోద్యాన శోభినీమ్
శుద్ధసత్త్వ వనాకీర్ణం దృష్ట్వా మన్యత మారుతిః॥

తా॥ హనుమంతుడు గొప్ప పండ్ల వలన వంగిన చెట్లతోడి యుద్యానవనముచే ప్రకాశించునట్టి, మంచినీరు, ప్రాణికోటి కల్గియున్నట్టి పంపా సరస్సును మిక్కిలిగా కొనియాడెను

శ్లో॥ కేతుం జేతుం పుష్పాణి దూరాలత్వా చ చంపకే
ప్రభో స్సమీపం సంసృత్య సంఘర్షా ద్ధనుస్త్రిస్త్రిధః॥

తా॥ పుష్పముల పూజలో జయించుటకై చంపకములను గైకొని హనుమంతుని సమీపమునకు చేరి పరస్పరము తగవున నిలబడజొచ్చిరి

శ్లో॥ అశ్వత్థా న్యేవ పుష్పాణి గృహీత్వా తదనంతరే
ప్రతిజ్ఞాం విదధీచక్రుః అహం యూనాం యువానితి॥

తా॥ ఇతరులు చంపక పుష్పములనే గైకొని తామే సమర్థుల మనుచు వచ్చిరి.

శ్లో॥ సముద్ధూయ పరేతాని కరస్థాని హతోత్తరైః
ఉద్ధతాః గృహీత్వాసు తైరానర్చుః కపిప్రభుమ్॥

తా॥ నాశనమైన వాని నెగురగొట్టి ఉత్తమమైన వానిని గైకొని వానితో హనుమంతు నర్చించిరి.

శ్లో॥ దృష్ట్వా కపివర శ్శ్రీమాన్ క్రియాణాం వ్యావృతిం తథా
వసంద పరమోదారః సర్వభూతదయాపరః॥

తా॥ ఇట్లు ఆ విధానము చూచి మిక్కిలి ఉదారుడు సర్వప్రాణులందు దయగల్గియుండువాడు వానర శ్రేష్ఠుడు నగు హనుమంతుడు ఆనందించెను.

శ్లో॥ కేచిత్ పక్వాని జంబూని మధురాణి పృథూ న్యపి
తస్మై నివేదయాంచక్రుః మనోవాక్కాయ కర్మభిః॥

తా॥ కొందరు మనోవాక్కాయ కర్మల సాక్షిగా శ్రీ హనుమంతునకు పండినట్టియు, మధురమైన, పెద్దవియగు నేరేడుపండ్లను సమర్పించిరి.

శ్లో॥ హనుమా నపి విశ్వాత్మా తదిదం సూర్యవర్చసమ్
స్వగోచరా చ్చ భక్తానా మివ భక్తి మమన్యత॥

తా॥ విశ్వాత్ముడగు హనుమంతుడు సూర్యతేజస్సు కల పంపాజలమును భక్తుల భక్తివలె భావించెను.

శ్లో॥ అన్యే సమర్చయామాసుః అరుణైర్బదరీఫలైః
సంక్షిప్త నికటధ్వాంత పద్మరాగై రివ ప్రభుమ్॥

తా॥ ఇతరులు సమీపమందలి చీకటులు వెడలగొట్టజాలు పద్మరాగములవంటి ఎఱ్ఱని రేగుపండ్లతో హనుమంతు నర్చించిరి.

శ్లో॥ ఫలాని భుక్తశిష్టాని స్వాయ మర్పితవా ప్రభుః
ప్రసాద మివ భక్తేభ్యో యథోచిత మరిందమః॥

తా॥ తాను తినగా మిగిలిన ఫలములను తగినరీతిగా భక్తులందరకు ప్రసాదము వలె శత్రుసంహారకుడగు హనుమంతుడు స్వయముగా నిచ్చెను.

శ్లో॥ అన్యే సమర్పయామాసుః కదళీఫలమంజరీః
సువర్ణ కేతకీ పుష్ప మంజరీ రివ భూయసీః॥

తా॥ కొందఱు అరటిపండ్ల గుత్తులను, బంగరు మొగలిపూవుల గుత్తులను వలె సమర్పించిరి.

శ్లో॥ మధూని మధురాస్వాద సంభృతాని బహూన్యపి
అన్యే నివేదయాంచక్రుః గృహీత్వా తత్కృపారసమ్॥

తా॥ మఱికొందరు అతని దయారసమును గ్రహించుచు తీయనగు పెక్కు ఫలాదుల నొసంగిరి.

శ్లో॥ అమృతాస్వాద పూర్ణాని ద్రాక్షా చూత ఫలాని చ
ఖర్జూర పనసా న్యస్య సమానేయు ర్వలీముఖాః॥

తా॥ వానరులా హనుమంతునకు అమృతము వంటి ద్రాక్ష, మామిడి, ఖర్జూర, పనసపండ్లు తెచ్చిపెట్టిరి.

శ్లో॥ మధూని ఫలపుష్పాణి పల్లవాని మృదూన్యపి
భక్తేభ్యోఽపి దదౌ శ్రీమాన్ ఫలానీవ స్వకర్మణామ్॥

తా॥ ఆ హనుమంతుడు కూడ భక్తులకు వారి వారి అర్చన యనెడు కర్మలకు ఫలమా యనునట్లు మధురములగు ఫలపుష్పములను, మెత్తని చిగురుటాకులను ఇచ్చెను.

శ్లో॥ స్వేక్షణాయైవ చూతేన దర్శితాం ఫలమంజరీమ్
ఆత్మాదరేణ జగ్రాహ స్వహస్తే నైవ మారుతిః॥

తా॥ తనయందు దృష్టిపడుటకే చూపబడిన మామిడి పూగొమ్మను హనుమంతుడు మిక్కిలి ఆదరముతో చేతులార స్వీకరించెను

శ్లో॥ తత స్సన్నిహితా స్సర్వే జాంబవత్ప్రముఖా అపి
పరివవ్రు ర్మహాత్మానం మంజరీ దర్శనేచ్ఛయా॥

తా॥ వెంటనే జాంబవంతుడు మొదలుగాగల వారందరు ఆమంజరిని చూచు వేడ్కతో హనుమంతుని చుట్టు చేరిరి

శ్లో॥ జాంబవంత మువాచేదం హనుమాన్ భక్తవత్సలః
రమణీయతయా తస్యా ః విస్మయావిష్టమానసః॥

తా॥ భక్తవత్సలుండగు హనుమంతుండు దాని యందము వలని ఆశ్చర్య మావరించిన మనసు కలవాండై జాంబవంతునితో నిట్లు పల్కెను.

శ్లో॥ అహోరూప మిదం పశ్య సౌరభం వా మనోహరమ్
మాధుర్య మధికం చాస్యాః సుఖస్పర్శం సుశ్రుతి॥

తా॥ ఆశ్చర్యకరమగు దీని రూపమును, ఎడతెగని కమ్మని వాసనను, మాధుర్యమును సుఖస్పర్శను, గొప్ప వినికిడి చూడుము

శ్లో॥ పంచేంద్రియాణి యుగప న్మంజరీసన్నిధానతః
ఏకత్ర విషయాదానాత్ భజంతే ప్రీతి ముత్తమామ్॥

తా॥ ఒక్కమారుగా పంచేంద్రియములు కూడ ఆ మంజరి యందు ఒక్కచో లగ్నమై మిక్కిలి ప్రీతి నందు చున్నవి.

శ్లో॥ రమణీయతయా చక్షూ మృదుత్వేన త్వగింద్రియమ్
రసనాం మధురత్వేన సుగంధే నైవ నాసికామ్॥

తా॥ ఆ మంజరి మనోజ్ఞ రూపముతో కండ్లను,

మెత్తదనము చే చర్మమును. నాలుకను మాధుర్యము చేత, ముక్కును సౌగన్ధ్యము చేత.

శ్లో॥ శ్రోత్రం స్వాత భాక్ళ్ళప్త భృంగ ఝుంకారసన్నిభైః
ఇమాం పుష్పాం మహారమ్యాం కో వా స ప్రీతి
మాప్నుయాత్॥

తా॥ పరిమళమువలన చేరిన తుమ్మెదల ఝుంకార ధ్వనులతో చెవులకు తృప్తి పరచుచున్నది. ఇట్టి మిక్కిలి రమ్యమగు పూగుత్తిని చూచి ఎవ్వడు ప్రీతి నందడు?

శ్లో॥ సకృద్దర్శనమాత్రేణ యః దస్మాత్ప్రీణయత్యసౌ
అనయా సహ కారోऽయం జన్మసాఫల్యమశ్నుతే
స్వాకీయ మంజరీ దాన తోషితా వయ మీదృశాః॥

తా॥ ఒక్కమారు చూచుట చేతనే మనలను సంతోష పరచినది కావున ఈ మామిడియొక్క జన్మము సఫలము కాగలదు. ఈ మన మందరము దానియొక్క మంజరీ దానముచే సంతస మందినవారము

నారదాగమనము :

శ్లో॥ ఇతి వదతి సవిస్మయం కపీంద్రే
నిజపరివారపురస్సరే పురస్తాత్
భువనహిత నివిష్ట సౌమ్యభావః
సమవతతార స నారదోऽంతరిక్షాత్॥

తా॥ తన పరివారము ఎదుట నీరీతిగా ఆశ్చర్యముతో చెప్పుచుండ లోకక్షేమము కొఱకై కూర్చుకొన్న సౌమ్య భావము కల నారదుండు ఆకాశమునుండి వారియెదుట దిగెను.

శ్లో॥ సితమణివలయాం ముముక్షుధార్యామ్
శ్రవణతలే స హి దక్షిణే దధానః
పవనవశచల ద్గుణాభియోగామ్
నిజమహతీం అనుసందధాన చేతా॥

తా॥ మోక్షము కోరువారు ధరించఁదగు తెల్లని మణివలయమును కుడి చెవియందు ధరించినవాఁడై వాయువశమున చలించు సంగీతపు ఆరోహావరోహణాది క్రమముల మెట్లుకల తన మహతి యను వీణను సవరించుకొనుచు వచ్చెను

శ్లో॥ సూర్యబింబ మథః కిన్ను జ్యోతిషాం మండలం కిము
అహో వా ప్రజ్వలజ్జ్వాలం తేజో వహ్నె ర్మహాత్మనః॥

తా॥ క్రిందకు ప్రసరించు జ్వాలకల ఆ మహాత్ముని తేజస్సునెడు అగ్ని సూర్యబింబమా అనునట్లు జ్యోతిర్మండలమా అనునట్లు

శ్లో॥ ఉద్యత్తీవ్రాంశు బింబక వా నిర్గచ్ఛ త్ప్రాగ్వహాయసః
ఇతి సంశయ మాపన్నః కపిబృందే తదున్ముఖే
కేసరీనందనాభ్యాసే క్షణా దావిరభూ న్మునిః॥

తా॥ తూర్పు ఆకసమునుండీ వెలువడు ఉదయించు సూర్యుని బింబమా! అని సంశయము నంది వానర సమూహము అభిముఖులైయుండగా ఆ నారద మహాముని క్షణములో హనుమంతుని సమీపమున ప్రత్యక్షమాయెను.

శ్లో॥ అవతీర్ణం మునిం దృష్ట్వా సర్వే విస్మయమాగతాః
ప్రత్యాసన్నం తతస్తూర్ణ్య మనసః ధ్యాయ నారదమ్॥

తా॥ అట్లు వచ్చిన నారదమునిని చూచి అందఱు ఆశ్చర్యమునొందిరి. పిమ్మట ఆవచ్చిన పూజ్యుఁడగు నారదుని గూర్చి.

శ్లో॥ హనుమాన్ సహసోత్థాయ సంత్యక్త్వా స్వప్రయోజనమ్
సమాశ్చర్కే కపిశ్రేష్ఠః నారదాయ మహాత్మనే॥

తా॥ హనుమంతుఁడు స్వవిషయముల వీడి వెంటనే లేచి నిలఁబడెను. మహాత్ముఁడగు నారదునకు ఆ కపిశ్రేష్ఠుడు నమస్కరించెను.

శ్లో॥ సామాత్య స్సాంతరంగ శ్చ ప్రదక్షిణపురస్సరమ్
ఉపవేశ్య మునిం శ్రీమాన్ పుష్పపల్లవవంస్తరే॥

తా॥ అట్లు మంత్రులతోను మిగిలిన సమస్తకపులగు కపివరులందఱితోడను ప్రదక్షిణ మొనర్చి నమస్కరించిన వాఁడై నారదమహామునిని ఆ హనుమంతుఁడు పూవులు, చిగురుటాకులు కప్పిన మెత్తని ఆసనమున కూర్చుండబెట్టి

శ్లో॥ ఉపచారై ర్బహువిధైః ప్రీణయామాస మారుతిః
యథావిధి యథాన్యాయం శిష్టాచారం తు పాలయన్॥

తా॥ విధిననుసరించి న్యాయము తప్పక శిష్టాచారమును పాలించుచు హనుమంతుఁడు పలురీతుల సేవలచే నారదుని తృప్తిపఱచెను.

శ్లో॥ మునిం సమర్చయామాసుః బ్రహ్మాణ మివ వాసవః
తతోఽబ్రవీ న్మునిశ్రేష్ఠం ఉపవిష్టం సువిష్టరే॥

తా॥ హనుమంతుఁడు నారదమహామునిని బ్రహ్మను

దేశేం గాదు అర్చించినట్లర్చించెను. పిదప మంచి యాసన మున కూర్చొన్న నారదుని

శ్లో॥ కృతాంజలిపుటో భూత్వా మారుతిర్వాదతాం వరః॥

తా॥ వాజ్నిపుణుండగు హనుమంతుండు అంజలి ఘటించి యిట్లనెను.

శ్లో॥ బ్రహ్మన్ సుదిన మద్యాసీ ద్దర్శనా ద్భవతో మునే!
స ఏవ పురుష ప్రాజ్యో యస్యస్యాత్తవదర్శనమ్
కస్య వా శ్రేయసే నస్యాత్ అమోఘం దర్శనం తవ॥

తా॥ ఓ మహామునీ! తమ దర్శనముచే నేడు సుదినము. నీదర్శన మైనవాండే పురుషులలో నుత్తముండు. తమ అమోఘము నగు దర్శనము ఎవరికి శ్రేయస్సు నీయదు?

శ్లో॥ శుభోదర్కంతు జంతూనాం పూర్వపుణ్యోత్థ టార్జితమ్
అధునా వర్ధతి శ్రేయో యథాత్మానందభాగభూత్॥

తా॥ పూర్వపుణ్యము వలన సంపాదించిన శుభఫలం పత్తి ప్రాణుల కిప్పుడు ఆత్మానందసంధాయకము గు శ్రేయస్సును సంపాదించును.

శ్లో॥ తపః ప్రభావ సిద్ధ్యర్థం నిస్తరం గాన్తరంగిణామ్
భవాదృశాం మహాయత్తః కశ్చిదర్థో న విద్యతే॥

తా॥ తపః ప్రభావము సిద్ధించుటకై మనస్సును వశ మొనర్చుకొను మీవంటివారికి మాబోంట్లవలన పొందదగిన దొకటియు నుండదు.

శ్లో॥ అతః ప్రయోజనప్రశ్నా నిష్కారాలంబస్త్వదాగతిః

తథాపి జగతాం మన్యే యోగక్షేమానుసంధయే
వృత్తి ర్భవాదృశాం నూనం పర్యాప్తో హి సతాం గతిః॥

తా॥ కావున తమరాకకు ప్రయోజనమును గూర్చి అడుగవలసిన పనిలేదు, కాని నిజముగా తమవంటి వారి పర్యటనము జగత్తు యొక్క శ్రేయస్సు కొఱకే యని తలంతును. సత్పురుషుల గమనము ఇతరుల మేలుకొఱకే కదా!

శ్లో॥ సర్వేషాం కుశలం కచ్చి చ్ఛక్రాదీనాం సుపర్వణామ్
రక్షోభిః కుటిలప్రజ్ఞైః తపోభి ర్లబ్ధ పౌరుషైః
అత్యుత్కటబలైః కచ్చి త్స్వారాజ్యం న విహన్యతి॥

తా॥ నారదమహాముని! దేవేంద్రాది దేవతలందరకు అంతట క్షేమమే కదా! మోసపు తెలివి రాక్షసులచేత, తపస్సుచే నేర్పడిన బలము కలవారిచే, మిక్కిలి బలవంతులగు వారిచే ఇంద్రపదవికి దెబ్బలేదు కదా!

శ్లో॥ పృథివీ శాసతే కచ్చి ద్భూపా నీతిపురస్సరాః
అధర్మసంక్రమః కచ్చి న్నాదత్తే హి పదం క్వచిత్॥

తా॥ రాజులు నీతిమంతులై భూమిని పాలించుచున్నారు కదా! అధర్మ మనున దెచ్చటను స్థానము చేసికొనుట లేదుకదా!

శ్లో॥ దత్తాని విధిన త్కాలే హవీం షాద్యాయ యజ్వభిః
దేవమాతృకదేశేషు కచ్చి ద్వర్షతి వాసవః॥

తా॥ విధి విధానము ననుసరించి సకాలముగా యాగకర్తలచే సందింపబడు హవిర్భాగములను గ్రహించి

దేవేంద్రుఁడు వర్షాధార భూమి యందు వర్షము కురిపించు చుండెను కదా!

శ్లో॥ సద్య శ్చాప్రతిబంధేన ప్రవహంత్యపి సాగరమ్
ఋషయోఽపి మహాత్మానః రక్షోభి ర్నిరుపద్రవాః॥

తా॥ సముద్రము ప్రతిబంధము లేకుండా ప్రవహించు చుండెను కదా! మహాత్ములగు ఋషులు రాక్షసులచే ఏ ఇక్కట్లు లేక యున్నారు కదా!

శ్లో॥ అథ వా స్య ద్విశేషేణ వక్తవ్య మపి కించన
ఆదిశ్యతా మిదానీం నః త్వ దధీనా వయం మునే!॥

తా॥ ఇంకను విశేషముగ చెప్పవలసిన దేమియు లేదుకదా! ఓ మహామునీ! మేము మీ యధీనులమై యున్నాము మమ్ముప్పు డాదేశింతురు గాక!

శ్లో॥ ప్రత్యగ్దృష్టి ప్రభావేన బ్రహ్మన్ తవ మనీషిణః
బ్రహ్మాండ మఖిలం సాక్షాత్ పాణా వామలకం యథా॥

తా॥ బ్రాహ్మణోత్తమా! పండితులగు మీకు దివ్య దృష్టి ప్రభావము వలన బ్రహ్మాండ మంతయు సాక్షాత్తుగ చేతిలో నుసిరికాయ వంటిది. సుబోధముగ తెలియ దగినది.

శ్లో॥ ఇత్యుక్తవంతే మీశానం జగతా మంజనాసుతమ్
తుష్టా వోపనిష ద్వాక్యైః నారదో మునిసత్తమః॥

తా॥ ఇట్లు పల్కు జగత్ప్రభువగు ఆంజనేయుని మునిశ్రేష్ఠుఁ డగు నారదుఁడు ఉపనిష ద్వాక్యములతో తృప్తిపఱచెను.

నారదస్తుతి :

శ్లో॥ ఆంజనేయ నమస్తుభ్యం సంసారార్ణవతారక!
ప్రసీద జగతాంనాథ దేవదేవ నమోఽస్తుతే॥

తా॥ ఆంజనేయా! సంసారసముద్రమును దాటించువాఁడా! నీకు నమస్కారము. ఓ జగత్ప్రభూ! అనుగ్రహింపుము. దేవదేవా! నీకు నమస్కారము.

శ్లో॥ త్వాం మామనంత శ్రుతయః పురుషం ప్రకృతేఃపరమ్
మహదాది వికారేభ్యో వివిక్త మపి మారుతిమ్॥

తా॥ నిన్ను వేదము లీరీతిగా పిలుచుచు స్తుతించుచున్నవి. ప్రకృతికంటె భిన్నమగు పురుష తత్వమును మహదహంకారాది వికారముల కంటె వేఱైన వానిని వాయుకుమారుని,

శ్లో॥ అకర్తార మభోక్తారం అసంగం పరమేశ్వరమ్
సత్యసంధం మహాసత్త్వం భక్తాధీనం దయానిధిమ్

తా॥ కర్త కాని వానిని, భోక్తయు కానివానిని, సంబంధము లేమియు లేనివానిని, పరమేశ్వరుని, సత్యసంధుని, గొప్ప బలవంతుని, భక్తుల యందుండు వానిని, దయాపూర్ణుని,

శ్లో॥ జ్ఞప్తిమాత్ర ముదాసీనం అద్వయానందరూపిణమ్
భోక్తార మపి యజ్ఞానాం ఫలదాతార మద్వయమ్॥

తా॥ జ్ఞానమాత్రమైన వానిని. తగులుపాటు లేనివానిని, ఆనందైకరూపుని, యజ్ఞభాగము ననుభవించు వానిని, యజ్ఞఫలము నొసగువానిని, ఏకైకరూపుని,

శ్లో॥ త్రాతారం సర్వలోకానాం సంహర్తార మపిప్రభో!

తా॥ సర్వలోకములకు రక్షయగువానిని, అన్నిటిని యుగాంతమున నాశనమొనర్చువానిని గూర్చియు ఓ దేవ దేవా! వేదములు స్తుతించుచున్నవి

శ్లో॥ నమస్తే విశ్వరూపాయ జ్యోతిషాంపతయే నమః
అబాధిత స్వరూపాయ పూర్ణాయ పరమాత్మనే॥

తా॥ స్వామీ! విశ్వరూపుడవగు నీకు నమస్కారము. జ్యోతిర్గణాధిపతియగు నీకు నమస్కారం. అబాధితస్వరూపునకు, పూర్ణరూపునకు, పరమాత్మయగు వానికి నమస్కారము.

శ్లో॥ సూత్రాత్మనే నమస్తుభ్యం సూక్ష్మరూపాయ విష్ణవే
శంకరా యాది దేవాయ యోగినాం పతయే నమః

తా॥ సూత్ర స్వరూపునకు, సూక్ష్మరూపునకు విజయశీలునకు, శుభకరునకు, ఆది దేవునకు, యోగివర్యునకు నమస్కారము.

శ్లో॥ జ్యోతిరూపాయ రూపాయ విరూపాయ సురూపిణే
భువోర్భారావతారాయ దివ్యమంగళ రూపిణే॥

తా॥ జ్యోతిరూపునకు, రూపునకు, రూపము లేని వానికి; మంచి రూపము కలవానికి; లోకభారము దీర్చు వానికి దివ్యమంగళరూపునకు నమస్కారము.

శ్లో॥ సువర్చలాసమేతాయ పార్వతీనందనాయచ
నమో వేదాన్తవేద్యాయ శరణ్యాయ నమోనమః॥

తా॥ సువర్చలతో కలిసియున్నవానికి; పార్వతీనందను

నకు; ఉపనిషత్తుఃచే తెలియదగువానికి లోకశరణ్యునకు నమస్కారము.

శ్లో॥ అహోచిత్ర మహోభాగ్యాం పంపాతట నివాసినామ్
తృణానాం తరుగుల్మానాం మునీనాం మృగపక్షిణామ్॥

తా॥ ఆహా! ఎంత ఆశ్చర్యము, పంపాసరోవర తీరమున నుండు గడ్డికి; చెట్లకు; పొదలకు; ఋషులకు; మృగములకు; పక్షులకును ఎంతటి అదృష్టము!

శ్లో॥ ధ్వజ వజ్ర సరోజాంక భవ త్పాదాభిస్పర్శనాత్
చిరాయు ధన్యతాం లేభే తృణాని స్థావరా ణ్యపి॥

తా। స్వామి దివ్యరీత్యా శ్రేష్ఠములగు ధ్వజచిహ్నము; వజ్రాయుధ చిహ్నము; పద్మచిహ్నము. నీ పాదములందున్నవి. అట్టి నీ పాదములు తాకుటచే గడ్డి: రాలురప్పలు కూడ చిరకాలమునకు ధన్యత నందినవి.

శ్లో॥ యత్తే పాదతలస్పర్శ ప్రాయశ్చిత్త కృతార్థతా
సంప్రార్థితాపి బహుధా బ్రహ్మాద్యై రపి దుర్లభా॥

తా॥ నీ పాద తల స్పర్శచే జరుగు ప్రాయశ్చిత్తము వలన కృతార్థత ఎంతగా ప్రార్థించినను బ్రహ్మాదులచే నయినా దుర్లభమే.

శ్లో॥ తరు గుల్మ లతా శ్చాః ఫుల్ల పుష్ప నివేదనైః
మునయో దర్శనాద్యోగ విధినాపి సుదుర్లభాత్
పదస్పృష్ట తృణాగ్రాసా ప్రేలా లాలసా అపి॥

తా॥ చెట్లు; పొదలు; తీగెలు వికసించిన పూలతో నున్నవి. మునులుకూడ నీ దర్శనము వలన దుర్లభమే

మైనను యోగవిధితో నుండగల్గుచున్నారు. అల్పమాత్రము లైనను నీ పాదస్పర్శచే తృణ గ్రాసములు సైతము ప్రబలము లగుచున్నవి.

శ్లో॥ సహ వాసతయా చాత్ర మృగా భేజుః కృతార్థతామ్
పక్షిణః కలహంసాద్యాః శ్రావ్యైః కలకలారవైః
మనోవినోదకరణాత్ కృతవంతః కృతార్థతామ్॥

తా॥ కలిసియున్న కారణమున నిచ్చటి జంతువు లన్నియు కృతార్థత నందుచున్నవి కలహంస మున్నగు పక్షులు శ్రావ్యములగు కలకలారావములతో నీ మనస్సునకు వినోదమును కల్గించుచు ధన్యములగుచున్నవి.

శ్లో॥ వంధ్యాః ప్రసూతాః పశవో మృగాద్యాః
ప్రసన్ననీరా మరుభూమయశ్చ
వృక్షాశ్చ సమ్యక్ఫలపుష్పరామాః
పంపాం ప్రవిష్టే పవమాననందనే॥

తా॥ మహాదేవుడగు హనుమంతుడు పంపాతీరము నందు ప్రవేశించగా బిడ్డలగనని పశు మృగాదులన్నియు సంతతి నందినవి. ఊషర క్షేత్రములన్నియు ప్రసన్నమగు నీటితో కూడినవి. వృక్షములన్నియు చక్కని పండ్లతోను పూలతోను ప్రకాశించినవి

శ్లో॥ అహో పంపా మహాపుణ్యా ముద్రణాని పదాబ్జయోః
తత్ర స్పర్శాని నీరేషు సైకతేషు విశేషతః॥

తా॥ పంపాసరోవర మెంతటి పుణ్యవంతము! అందు

ఓ హనుమంతా నీపాదముద్ర లున్నవి, అవి అనీటియందు, విశేషముగా ఇసుక తిన్నెలందు స్ఫురించినవి.

శ్లో॥ ఇతి స్తవే నాభిముఖం స మారుతిం శివాత్మకం
పావకనందనం ప్రభుం
జగాద వాక్యం జగతాం సుఖావహం దురాత్మభూ భార
లఘూకృతిం మునిః॥

తా॥ అని నారద మహాముని స్తోత్రముచే నభిముఖుం డైనట్టి వాయుసుతుండైన, శివాత్మకుండైన, అగ్నినందనుం డైన, సమర్థుండైన హనుమంతునితో లోకమునకు సుఖము చేకూర్చునట్టి, దుర్మార్గుల వలన నేర్పడిన భూ భారము తొలగింపజాలు వాక్యమును పల్కెను

శ్లో॥ ఆవేహి సర్వత్ర సుఖం జనానాం
కుతో విపత్తి శ్శరణే త్వయి ప్రభో!
కథం భవే ద్వావకకం త మిూదృశాం
జేదీప్యమానే దివి సూర్యమండితే॥

తా॥ ఓ మహానుభావా! అంతట జనులకు సుఖమేర్పడి నట్లెరుగుము. నిన్ను శరణువేడుచుండ నిక ఆపదఎట్లుండును? ఆకసమున జేదీప్యమానముగ సూర్యుడు వెల్గుచుండగా చీకటి కప్పుట లెట్లుజరుగును?

శ్లో॥ అనంతరూపాణి బిభర్షి లీలయా
వినా పరప్రేరణయా హనూమాన్!
సతాం హి రక్షో విమయే మనీషిణామ్
భవాని యోగః పునరుక్త ఏవ॥

తా॥ ఓ హనుమంతా! నీ వితరుల ప్రేరణ లేకుండ చాల సులభముగనే అనంతరూపముల నందుచున్నావు. పండితుల, పుణ్యాత్ముల రక్షణకై వెనుకటివలెనే యెప్పుడు నుండుగాక!

శ్లో॥ తథాపి వాచాలతయా నివేద్యతే
మయాస్య కించి జ్జగతీపతే తవ
అనన్యసాధ్యం యదుదోహనం పరైః
అశక్యసంశ్రావ్య మసంశ్రుతం పురా॥

తా॥ నీవు సర్వజ్ఞుఁడవైనప్పటికి నా వాగుడుతనము చేత ఓ జగత్ప్రభూ! ఇతరులకు సాధ్యముకాని వెనుకటిగాథ చెప్పబడుచున్నది.

శ్లో॥ ఆసీ దసిర్నామదనో స్సుతో బలీ
తపోభి రారాధిత పార్వతీపతిః
తస్యాం యమాస్తే సుతఔరసః ఖరః
త్రిశూలరోమాయిత దన్తివిక్రమః॥

తా॥ పూర్వము తపస్సుచే శంకరు నారాధించిన అసి అను పేరుగల రాక్షసుఁడు కలఁడు. అతనికి త్రిశూలరోము డను పుత్రుఁడు దుష్టుఁడు కలఁడు. అతఁడు ఏనుగులబలమును కూడ లెక్కచేయని పరాక్రమము కలవాఁడు.

శ్లో॥ సమా స్సహస్రం స చచార దుస్సహమ్
తపో గిరీశం ప్రతి గౌతమీతటే
తతశ్చ భూతే వ్వరదయా ముపాదదా
న్వయం బలో త్సేః త్ర్యణీకృతేతరః॥

తా॥ అతఁడు గోదావరీ తీరమున శంకరుని గూర్చి వేయి నెలలు కఠోరముగ తపమొనర్చెను. తన బలాధిక్యతచే నితరులను గడ్డిపోచతో సమానముగ చూచుచు ప్రాణుల విషయమున దయలేక యుండెను.

శ్లో॥ ఏష రాక్షసశార్దూలః పంపాయా మవిదూరతః
విషమాద్రౌ కృతావాసో భేదతేఽహర్నిశం మునీన్॥

తా॥ ఈ రాక్షసశ్రేష్ఠుఁడు పంపాసరోవర సమీపముననే విషమాద్రియందు నివాస మేర్పరచుకొని రాత్రిం బవళ్లు మునులను బాధ పెట్టుచుండెను.

శ్లో॥ అజయ్యో దేవగంధర్వైః వాసవై రసురై రపి
అన్యై రపి సుదుర్ధర్షః సంతాపయతి దేవతాః॥

తా॥ అతఁడు దేవతలకు, గంధర్వులకు, వాసవాదులకు, రాక్షసులకును జయింప శక్యముకానివాఁడు. ఇతరులనైతము వానిని జయింపఁజాలరు. అతఁడు దేవతలను బాధింపఁజొచ్చెను.

శ్లో॥ బలా ద్గృహ్ణాతి రంభాద్యా దేవతాస్త్రీ ర్బలోద్ధతమ్
అవజానాతి దేవర్షీన్ కశ్యపాదీన్ మహౌజసః॥

తా॥ బలగర్వముచే రంభ మొదలగు దేవతాస్త్రీలను బలాత్కరించుచుండెను దేవర్షులగు కశ్యపాది మహాత్ములను లెక్కచేయక యుండెను.

శ్లో॥ దిక్పాలా ద్రావితాస్తేన త్యాజిత స్స్వాధికారిణః
నిరీక్షే తన్ముఖాబ్జానాం స్వస్త్రీణాం బిభ్యతి స్వయమ్॥

తా॥ అష్టదిక్పాలకులా రాక్షసునిచే మోసగించ

బడి తమ యధికారములను త్యజించినవారై తమ భార్యల ముఖము చూచుటకు నైన తము భయపడ జొచ్చిరి.

శ్లో॥ బహునాత్ర కిముక్తేన సర్వతో నిర్భయో ప్యహమ్
తస్మాద్బిభేమి దుశ్శీలాత్ తపోవిచ్ఛిత్తి కాతరః॥

తా॥ ఎక్కువగా చెప్పుట ఎందుకు! ఎచ్చటను భయమందని నేనుకూడ ఆ దుష్టుని విషయమున తపోభంగమగు నేమో యని భయమందితిని.

శ్లో॥ తదత్ర దీయతాం దృష్టిః హనూమన్! కరుణానిధే!
రక్షణే జగతాం సద్యః త్రాతా నాస్తి త్వయా వినా॥

తా॥ కావున ఓదయానిధీ! హనుమంతా! తమదృష్టి నీవిషయమున నుంచుదురుగాక! లోకరక్షణయందు తమకంటె వేరు రక్షకులు లేరు.

శ్లో॥ జహి త్రిశోలరోమాణం లోకవిద్వేషిణం ఖరమ్
తదర్థో హ్యవతార స్తే కించి జ్జానా మ్యహం ప్రభో!

తా॥ లోకద్రోహియు త్రిశూలరోముండను ఖరుని చంపుము ఓ మహానుభావా! అందుకొఱకే నీవు అవతారమెత్తినట్లు నేను తెలిసికొనుచున్నాను.

శ్లో॥ పురా బదరికారణ్యే నరనారాయణాకృతిః
భవా నభూవ భూతాత్మా స్వరూపధ్యానతత్పరః॥

తా॥ పూర్వము సర్వప్రాణ్యాత్మస్వరూపుండ వగు నీవు బదరికారణ్యమున నరనారాయణాకారముతో స్వస్వరూపధ్యానానుసంధాన మొనర్చుచు నుంటివి.

శ్లో॥ తదా బ్రహ్మాదయో దేవా రాక్షసేన సముద్రుతాః
అనన్యశరణా స్సర్వే భవంతం శరణం యయుః॥

తా॥ అప్పుడు రాక్షసునిచే వెనుదీయబడిన గతి కల వారై బ్రహ్మాది దేవతలందఱు ఇతరము శరణము లేక నిన్ను శరణు వేడుకొనిరి.

శ్లో॥ త్వా మూచు స్తే మహాత్మానం నరనారాయణాకృతిమ్
బాధంతే రాక్షసా హ్యస్మాన్ నిర్దయో ఘోరరూపిణః॥

తా॥ వారు మహాత్ముడవు, నరనారాయణాకృతిగల వాడవు గు నీతో నిట్లనిరి, స్వామీ ! దయాహీనులు, వికృతాకారులు అగు రాక్షసులు మమ్ము బాధించు చున్నారు.

శ్లో॥ అజేయః క్రూరకర్మాణః సుప్రసన్నః కథంచన
అస్మానుపద్రుహాన్ స్వామిన్ త్వమేవ త్రాతు మర్హసి।

తా॥ క్రూరకర్ములకు జయింప శక్యము కాని వాడవు. అనుగ్రహరూపుడవు అగు నీవే ఓస్వామీ! ఎట్లో మమ్ము రక్షించుట కర్హుడవై యున్నావు.

శ్లో॥ ఇతి సంప్రార్థితో దేవైః అబ్రవీ త్త్వాన్ వానపి
శృణుధ్వం దేవతా స్సర్వాన్ వక్ష్యామి హిత ముత్తమమ్

తా॥ అని దేవతలచే ప్రార్థింపబడినవాడవై వారితో నీవు కూడ : ట్లంటివి. ఓ దేవతలారా! సమస్తము చెప్పె దను మీకు మేలను చెప్పెదను. వినుడుగాక!

శ్లో॥ జాతోఽహ మీశ్వరాం గౌర్యాం హనూమా న్నామ నామతః
అనివార్య బల శ్రీమాన్ వధిష్యే సర్వరాక్షసాన్॥

తా॥ నేను ఈశ్వరసంబంధమగు గౌరియందు హనుమాన్ అను పేరుతో జన్మించితిని. ఎదురులేని బలపరాక్రమములు కల నేను రాక్షసు లందఱును చంపగలను.

శ్లో॥ ఇతః పరం భయం త్యాజ్య సుఖేన స్థాతు మర్హథ
ఇతి సంలాలితో దేవాః నరనారాయణాత్మనా॥

తా॥ ఇకముందు భయమును వీడి సుఖముగా నుండుడు. అని నరనారాయణ రూపునిచే ఓదార్చబడిన వారై

శ్లో॥ యథా గతం తథా జగ్ముః ధ్యాయం తస్త్వాం మనోఽంబుజే
ఇతి ప్రతి నుతం విద్వాన్ పూర్వ మేవ దివౌకసాం
హే యస్వ మహాభాగ సత్యసంధ నమోఽస్తు తే॥

తా॥ నిన్ను మనస్సున ధ్యానించుకొనుచు ఎచ్చటివారచ్చటకు వెడలిరి. ఓ మహానుభావా! ఇట్లు పూర్వమే కొనియాడబడితివి. స్వామీ అనుగ్రహింపుము సత్యసంధుఁడా! నీకు నమస్కారము.

శ్లో॥ ఇతి హిత ముపదిశ్య విష్టపానాం
రవితనయాపతి మేత్య లోకనాథం
గతిమతి మకృతాన్యచైవ
ముని రపి పంకజజన్మనః కుమారః॥

తా॥ అని లోకవాసులకు హితము నుపదేశించి లోకనాధుడగు సువర్చలాపతిని చేరి బ్రహ్మదేవుని కుమారుడగు నారదమహాముని స్తుతించెను.

శ్లో॥ సంపశ్యతాం దివి తథా వసుధామరేంద్రః
నిర్యాపి తోత్తమ పరాక్రమ సంక్రమాణామ్
ఉత్ఫుల్ల వక్త్ర వినివేదిత కార్యసిద్ధిః
ఆరాధ్య వాయుతనయం త్రిదివం జగామ॥

తా॥ నారదమహాముని అట్టి ఉత్తమ పరాక్రమవిధానము చే సంతుష్టిపడుటవలన వికసించిన ముఖముచే తెలియదగు కార్యసిద్ధి కలవాడై హనుమంతుని సేవించి స్వర్గమునకు వెడలెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే శ్రీ నారద హనుమత్సంవాదో నామ అష్టావింశత్పటలః

## ఏకోనత్రింశత్పటలః

## దేహ శ్వాస న ము

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర నమస్తుభ్యం జగదానంద హేతవే
సేతవే సర్వధర్మాణాం సింధవే కరుణాంబునామ్॥

తా॥ మైత్రేయు లనుచున్నారు జగత్తునకు ఆనంద

కారకుఁడ వైనట్టి, సమస్త ధర్మములకు వారధివైనట్టి కరుణ అను జలమునకు సముద్రమువైనట్టి ఓ పరాశర మహామునీ! నీకు నమస్కారము.

శ్లో॥ పౌరందరీం పురీం ప్రాప్య నారదో మునిసత్తమః
అశ్రుతానంతరం కిం వా బ్రూహి మహ్యం దయానిధే॥

తా॥ మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు దేవేంద్ర నగరమున కేగి పిదప ఏమిచేసెనో ఓ దయానిధీ! నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ రక్షఃపీడిత దేవానాం రక్షణాయ మహామునిః
జవా దుపగతో రమ్యాం సుధర్మాం ధర్మవత్సలః॥

తా॥ రాక్షస బాధితులకు రక్షణకొరకై ధర్మమునం దెంతయో ఇష్టముకల నారద మహాముని వేగముగా రమ్యమగు సుధర్మ యనబడు దేవ సభకు చేరెను

శ్లో॥ కస్త్రాతా నోఽద్య భీతానాం ఉద్ధరే దాపదంబుధేః
అభికుర్యా త్పరివ్యస్మాన్ వ్యథాస్వః కః పుమాన్ వా॥

తా॥ ఇప్పుడు భయమంది యున్న మనల రక్షించువాఁడెవరు? ఆపదలను సముద్రమునుండి మనల నుద్ధరించున దెవ్వరు? మనలను రక్షించు పురుషుఁడెవ్వరు?

శ్లో॥ పురా సంశ్రుత్య భగవాన్ రక్షోవింశతిదివౌకసః
అస్మద్దౌర్భాగ్యసంపత్త్యా సవిస్మారః శ్రియఃపతిః॥

తా॥ పూర్వము దేవతలకు రక్షగా నుండునని మన దురదృష్టమువలన భగవంతుఁడగు లక్ష్మీపతి మనల మరచినాఁడు

శ్లో॥ అన్యథా కథ మస్మాకం దురంతాస్స్యు ర్విపత్తయః
ఇతి సంచిన్త్య మానానాం దేవానాం దుఃఖచేతసామ్॥

తా॥ ఇక మనకష్టములు తొలగుటెట్లు అని యాలోచించి దుఃఖమందియున్న దేవతలను

శ్లో॥ కథా కథయతాం ధీమాన్ కనై రివ దివౌకసామ్
త్రిశూలరోమ్ణః వీర్యాణి లోకదుఃఖకరాణి చ
స్మారం స్మారం అథాన్యోన్యం ఝుడితి త్రిస్యతాం సతామ్
పశ్యతిస్మ సదా శక్రం ప్రహస న్నివ నారదః॥

తా॥ దేవతల కథను చెప్పినట్టి, త్రిశూలరోముని లోకదుఃఖకరములగు చేష్టలు స్మరించుచు సిగ్గిడువారిని వారితోపాటు నవ్వుచు ఇంద్రుని చూచెను.

శ్లో॥ ఇంద్రోఽపి సహసోత్థాయ నారదాగమ విస్మితః
చకార విధివత్పూజాం ఆసనార్పణ పూర్వకమ్॥

తా॥ ఇంద్రుఁడు వెంటనే లేచి నారదుని రాకకు ఆశ్చర్యమంది ఆసనమునిడి యథావిధి పూజించెను.

శ్లో॥ ఇంద్రః కృతాంజలి ర్భూత్వా శ్వేతవర్ణ ముఖాంబుజః
నమ్రగ్రీవ స్థ్సలద్వాచా నారద స్యాగ్రతో మునేః॥

తా॥ ఇంద్రుఁడు అంజలి ఘటించి తెల్లటిపద్మమును

బోలు ముఖముకల్గి మెడవంచి, తొట్రుపడు మాటతో నారదమహాముని ఎదుట

శ్లో॥ తస్థౌ బాష్పైః ప్రయుక్తస్సన్ దైత్యపుత్ర పరాభవాత్॥

తా॥ రాక్షససూనుని పరాభవముచే కన్నీటితో కూడినవాడై నిలచెను.

శ్లో॥ అజానన్నివ యోగీంద్రో వై కృతం తు శచీపతేః
ప్రభుతాం త్రిదివేశానా మిద మాహ బృహస్పతిమ్॥

తా॥ కాని యోగిశ్రేష్ఠుఁడగు నారదుడు ఇంద్రుని కష్టస్థితిని తెలియనివానివలె దేవతల గురువగు బృహస్పతిని దేవతల పరిపాలనను గూర్చి యడిగెను.

శ్లో॥ బృహస్పతే! సురాచార్య! కథ మాస్తే సురేశ్వరః
పరాజిత ఇవాభాతి కేన వాపకృతం స్వయమ్॥

తా॥ ఓ దేవగురువగు బృహస్పతీ! దేవేంద్రు డెట్లున్నాడు? ఎవరివలననో ఓడింపబడినట్లుగా కన్పట్టుచున్నాఁడు.

శ్లో॥ కిన్నిమిత్త మిదం సర్వం పృచ్ఛతో బ్రూహి మే యథా
ఇతి వాదిని దేవర్షౌ బభాషే గీష్పతి ర్వచః॥

తా॥ ఎందువలన నిట్లయ్యెనో అంతయు నాకు చెప్ప వలసినది యని నారదుఁడడుగగా బృహస్పతి ఇట్లు చెప్పఁ దొడంగెను.

శ్లో॥ త్వయా ప్రత్యర్థ్యగృహీతా బ్రహ్మన్ త్రివిధం తు శుభాశుభమ్
సాక్షా త్సంకృశ్యతే నూనం జగతాం హితకామ్యయా॥

తా॥ ఓ బ్రహ్మర్షీ! లోకశ్రేయము కోరునట్టి దివ్యదృష్టి కల నీకు భూత భవిష్యద్వర్తమానముల శుభాశుభము లన్నియు నిజముగా కళ్ళకు కన్పట్టును.

శ్లో॥ అద్యాపి వికృతం ఘోరం జ్ఞాత మేవ త్వయా మునే
తథాపి సూచ్యతే కించిత్ జ్ఞానతో మునిసత్తమ॥

తా॥ ఓ మహాముని! నేడుకూడ ఈ వికృత ఘోరస్థితి తమకు తెలిసినదే. అయినను మునిశ్రేష్ఠా! నాకున్న కొద్ది జ్ఞానముతో తెల్పుచున్నాను.

శ్లో॥ అస్తి త్రిశూలరోమాఖ్యః రాక్షసో దృఢవిక్రమః
శంభోర్లబ్ధవరో భూత్వా దుర్ధర్షో దేవదానవైః॥

తా॥ త్రిశూలరోముండను పేరుగల గొప్ప పరాక్రమ శాలియగు రాక్షసుఁడు కలఁడు. ఆతఁడు శివుని వరము నంది దేవదానవులకు జయింప శక్యముకాకుండెను

శ్లో॥ స బాధతేఽఖిలాన్ లోకాన్-ఇంద్ర మేనం విశేషతః
అత స్త్రివిష్టపాధీశః-లజ్జయావన తాననః
త్వయా సంభాషితుం నాలం-స్తోతుం చ భవతో గుణాన్॥

తా॥ వాఁడు సమస్త లోకములను, ముఖ్యముగా ఈ ఇంద్రుని బాధించుచున్నాఁడు. అందుననే దేవేంద్రుఁడు సిగ్గుచే తల వంచినవాఁడై నీతో మాటాడుటకు నీగుణములను పొగడుటకును సమర్థుఁడు కాకున్నాడు.

శ్లో॥ ఇతరే వరుణాద్యాస్తు-కాందిశీకా యథాయథం
న గృహ్ణాతి పవి ర్దేవా-అసిపుత్రభయా న్మునే!॥

తా॥ ఇతరులకు వశుఁడు మున్నగు దేవతలును ఇచ్చవచ్చినరీతి కాందిశీకులుగానై ఈ అసి అను రాక్షసుని యొక్క పుత్రుని భయముతో హవిర్భాగమునుకూడ స్వీకరింపక ఉన్నారు

శ్లో॥ నిత్యకర్మాణి నష్టాని-తథా నైమిత్తికాన్యపి
శ్రౌతస్మార్తాన్యపి తథా-దూషితాని దురాత్మనా॥

తా॥ నిత్యకర్మలు, నైమిత్తిక కర్మలును నశించి పోయినవి. వేదవిహితకర్మలు, స్మృతివిహిత కర్మలును ఆదుర్మార్గునిచే తిరస్కరింపబడినవి.

శ్లో॥ తన్మహోపద్రవప్రాప్త్యా-కేన శామ్యేన బుధ్యతే
భవదాగతి మే వాత్ర-కాంక్షతే విబుధా అమీ॥

తా॥ అట్టి యుపద్రవము లేప్పడ సహాన మెట్లు ! ఈ దేవతలందఱు తమరాకనే కోరుచున్నారు.

శ్లో॥ కరుణార్ద్రమనస్కానాం-పరార్థం హి సతాం గతిః
భవదాగమనా దేవా-ఽబుధసంజ్ఞా పురస్సరాః
ప్రాణంతి గ్రీష్మసంతప్తా-శీతవాతాంబుభి ర్యథా॥

తా॥ కరుణచే నిండిన మనస్సుకల సత్పురుషుల లక్ష్యము ఇతరుల మేలేకదా! వీరందరు మీ రాకవలననే గ్రీష్మర్తువుచే తపింపబడి చల్లని వాయువు, తుప్పరలచే కలచునట్లు పేరుకు నిలచియున్నారు.

శ్లో॥ భవదాగమ విస్రంభ-వశతః పునరాగతాః
ఏషాం స్థైర్యాయ సంయోగః-భగవన్నుపదిశ్యతామ్॥

తా॥ తమరాకవలననే మరల వచ్చినారు. ఓమహాను
భావా! వీరి స్థైర్యము కొఱకు ఉపదేశింతురుగాక!

శ్లో॥ భవాదృశా హి సర్వత్ర-స్పష్ట ఏవ మనీషిణః
నివర్తయన్తి దుఃఖాని-యోజయన్తి సుఖాన్యపి॥

తా॥ అంతట తమవంటి బుద్ధిమంతులే దుఃఖముల
పోగొట్టగల్గుట, సుఖములను చేకూర్చగల్గుట స్పష్టమేకదా!

శ్లో॥ త్రిశూలరోమ దుష్టాత్మా-ఏనోపాయేన వధ్యతే
తమాచక్ష్వ మునిశ్రేష్ఠ-దుర్లభం జీవనం తతః॥

తా॥ ఓముని శ్రేష్ఠా! దురాత్ముండగు త్రిశూలరోముండు
ఏ ఉపాయముతో చచ్చునో తెలుపవలసినది. కాకున్న
వానితో జీవనము ఇహ దుర్లభముగనున్నది

శ్లో॥ ఆహూయ ప్రతిజానీహి-సర్వాన్దేవాన్ భయాన్వితాన్
ఆపన్న రక్షణాయైవ-సంభృతో పలయన్త్వతి॥

తా॥ భయాందోళితులగు దేవతలందఱను పిలిచి
ఆపద లందినవారి రక్షకై తెలియజేయుఁడు.

శ్లో॥ ఇత్యాకర్ణ్య గురోర్వాక్యం-నారదో మునిసత్తమః
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యాం-నాలం ద్రష్టుంశచీపతిమ్॥

తా॥ ఇట్లు బృహస్పతి వాక్యములను వినినవాఁడై

మునిశ్రేష్ఠుండగు నారదుండు బాష్ప జలములతో నిండిన కండ్లతో దేవేంద్రుని చూడ సమర్థుండు కాలేదు.

శ్లో॥ తత స్తు ధైర్యమాస్థాయ-నారదో విజితేంద్రియః
బాష్పం జలావసేకేన-మార్జయామాస పాణినా॥

తా॥ పిమ్మట జితేంద్రియుడగు నారదుండు ధైర్యము తెచ్చుకొని కన్నీటిని చేతితో తుడుచుకొనెను.

శ్లో॥ తతో నారాయణం దేవం ధ్యాత్వా హరిపరాయణః
దేవా నభయ దానేన-జీవయామాస నారదః॥

తా॥ పిమ్మట హరి భక్తనందే నిమగ్నుండై యుండు నారదుండు దేవుండగు నారాయణుని ధ్యానమొనర్చి అభయమిచ్చుటద్వారా దేవతలను తృప్తిపరచెను.

శ్లో॥ పురా బృహస్పతే! సాక్షాత్ - లక్ష్మీశం శరణం గతాః
తత్ర తేన ప్రతిజ్ఞాతం-హనిష్యే సర్వరాక్షసామ్॥

తా॥ ఓబృహస్పతీ! పూర్వము దేవతలందరు సాక్షాత్ శ్రీమహావిష్ణువును శరణువేడిరి. అట నతండు రాక్షసుల నందఱను సంహరింతునని ప్రతిజ్ఞ చేసెను.

శ్లో॥ ఆంజనే యావతారేణ సంభవామి భువస్థలే
తదా భవంత స్సుఖినః-సర్వతో నిరుపద్రవాః॥

తా॥ ఆంజనేయావతారముతో భూలోకమున పుట్టుదును. అప్పుడు మీరు ఏప్రమాదములు లేక సుఖముగా నుందురు

శ్లో॥ ఇత్యాదిశ్య హరిశ్శ్రీమాన్ - దేవో నారాయణ స్తథా
ఆంజనేయావతారేణ-జాతః సంరక్షితుం జగత్॥

తా॥ ఇట్లాదేశించి లక్ష్మీపతియగు దేవదేవుఁడు నారాయణుఁడట్లే ఆంజనేయావతారముతో జగమును రక్షించుటకు పుట్టెను.

శ్లో॥ స ఇదానీం కపిశ్రేష్ఠః-పంపాయాః కాననే శుభే
బాలక్రీడాప్రదేశే తు-నిగృహ్ణాతి దురాత్మకమ్

తా॥ ఆకపిశ్రేష్ఠుఁడు ఇప్పుడు పంపాసరోవర సమీపమందలి శుభప్రదమగు వనమున బాలక్రీడా ప్రదేశముననే ఆ దురాత్ము సంహరింపగలఁడు

శ్లో॥ ఇమమేవ దురాత్మానం-అసిపుత్రం దురాసదం
సంహారయితుకామేన-హనూమంతం గతో స్మ్యహమ్॥

తా॥ ఈదురాత్ముఁడు, అసిపుత్రుఁడు అసాధ్యుఁడగు వానిని చంపించు కోర్కెతో హనుమంతుని చేరబోతిని.

శ్లో॥ రక్షోవధం సముద్దిశ్య బహుధా ప్రార్థితా మయా
మా మబ్రవీత్కపిశ్రేష్ఠో-భక్తపాలనతత్పరః॥

తా॥ రాక్షసుని సంహరించుటకై నేనెంతగనో ప్రార్థించితిని. భక్తులను రక్షించుటయే లక్ష్యముగా కల ఆ వానరశ్రేష్ఠుడు నాతో నిట్లనెను.

శ్లో॥ కిమర్థం ప్రార్థ్యతే బ్రహ్మన్-అసిపుత్రవధ స్త్వయా
మమావతార స్సర్వోఽపి-దుష్టానాం నిగ్రహాయ హి॥

తా॥ ఓ బ్రహ్మర్షీ! అసిపుత్రుఁడగు త్రిశూలరోముని వధను ప్రత్యేకించి ఎందుకు ప్రార్థించుచున్నావు! నా అవతార మంతయు దుష్టులను నాశన మొనర్చుట కొఱకే కదా!

శ్లో॥ శిష్టానాం రక్షణార్థాయ విద్ధి త్వమసి నారద!
విశేషే ణావతారోఽయం-హనుమా న్లోకవిశ్రుతః॥

తా॥ ఓనారదా! విశేషించి హనుమాన్ అని లోకముచే తెలియబడు ఈయవతారము శిష్టుల రక్షించుటకని నీవును యెరుంగుము.

శ్లో॥ హంతుం త్రిశూలరోమాణం - సర్వలోకభయావహమ్
దేవతానాం హితార్థాయ-మద్భక్తానాం విశేషతః॥

తా॥ లోకము లన్నింటికి భయముకల్గించు త్రిశూల రోముని చంపుటకు, దేవతల మేలుకొరకు, ప్రత్యేకించి నాభక్తుల శ్రేయముకొఱకున్న ఈ నా అవతారము

శ్లో॥ అంజనాయాః ఫలం దాతుం-తపసాం గర్భసంభవాత్
ఇత్యేవ మవతారస్య-ముఖ్య మేతత్ప్రయోజనమ్॥

తా॥ అంజనాదేవి యొక్క తపస్సునకు ఫలమీయ ఆమె గర్భమున పుట్టుట ఇట్లు నా అవతారమునకు ముఖ్య ప్రయోజన మిదియే.

శ్లో॥ తదత్ర ప్రార్థనా బ్రహ్మన్ పిష్టపేషణసన్నిభా
అచిరాదేవ తం హన్యే న భేత్తవ్యం కదాచన॥

తా॥ అందుచే ఓ బ్రహ్మర్షీ ఇప్పుడు నన్ను మరల ప్రార్థించుట పిండిని ఇంకా నూరుటవంటిది. అనగా వ్యర్థము.

చాలా తక్కువ కాలములోనే ఆ రాక్షసుని చంపుదుము. ఎప్పటికి భయము వద్దు.

శ్లో॥ త్వమ ప్యజీవయః బ్రిహ్మన్ హితవాక్య సుధారసైః
దుష్టదానవ దావాగ్ని సంతప్తాం త్రిదివౌకసః

తా॥ ఓ బ్రహ్మర్షీ నీవుకూడ దుర్మార్గుడగు రాక్షసుఁడను దావాగ్నిచే తపించిపోవు స్వర్గవాసులను మేలుగూర్చు మాటలను అమృతముతో తేరుకొన జేయుము

శ్లో॥ ఇత్యాదిష్టోఽహమే వాద్య ఆంజనేయేన ధీమతా
ఆగతోఽస్మి మహాభాగ! దివి దేవసభాం ప్రతి॥

తా॥ అని నేను బుద్ధిశాలియగు హనుమంతునిచే ఆదేశింపబడినవాఁడనై ఓ మహానుభావా! స్వర్గమందలి దేవసభకై వచ్చితిని.

శ్లో॥ అతో వై త్యజ్యతాం త్రాసో రక్షసో వరగర్వితాత్
ఆంజనేయే సతి ప్రాజ్ఞే క్వ భయం క్వ పరాభవః॥

తా॥ కావున వరగర్వమున నున్న రాక్షసుని గూర్చి భయమును విడుదురుగాక! సర్వజ్ఞుడగు ఆంజనేయుఁడుండగా భయమేల! పరాభవ మెక్కడ?

శ్లో॥ ఇదానీ మేవ దుర్బుద్ధే రసిపుత్రస్య రక్షసః
శృణుధ్వ వీర మత్యర్థం యూయం స గురవ స్సురాః॥

తా॥ ఇప్పుడే దుర్బుద్ధికల అసిపుత్రుఁడగు రాక్షసుని యొక్క వీర మెంతో మీరు గురువులతో సహా వినుఁడు.

శ్లో॥ ఇత్యుక్తం నారద శ్రీమాన్ తేషాం ప్రత్యయ కారణాత్
జహార సంశయం తేషాం హస్త విన్యస్త మస్తకే॥

తా॥ ఇట్లు చెప్పబడిన విషయమును వారియందరి నమ్మకముచే చెప్పగా చేతులందు తలనుంచుకొనినవారు సంశయమును వీడిరి

శ్లో॥ ఇతి వాదిని యోగీంద్రే ప్రీతోఽభూ త్పాకశాసనః
ఉద్గ్రీవ త్ఫుల్లవదనః త్యక్త గద్గదవిస్వరః॥

తా॥ ఇట్లు నారద యోగీంద్రుఁడు చెప్పగా దేవేంద్రుఁడు సంతసము నందినవాఁడై మెడపైనెత్తబడిన వికసించిన మోముకలవాఁడై కంఠమందు గద్గద స్వరమును వీడెను.

శ్లో॥ తుష్టావ పరమస్తోత్రైః నారదం మునిసత్తమమ్
నారదస్య తు తద్వాక్యం శ్రుత్వా దేవాశ్చ సూనృతమ్
జహర్షు ర్విస్మితాశ్చైవ తుష్టువు శ్చ మునీశ్వరమ్॥

తా॥ అంత నారద మహామునిని ఉత్తమ స్తోత్రములతో తృప్తిపరచెను. నారదుడు చెప్పిన పై మంచివాక్యములు దేవతలు కూడ విని ఆశ్చర్యానందము లంది నారద మహామునిని సంతోషపరిచిరి,

శ్లో॥ ఆశ్వాస్యచైవ తు సురా న్వ్యథితాంగనోఽపి
విజ్ఞాప్య వాయుతనయస్య మహాప్రసాదమ్
అపృచ్ఛ దైవతగురుం ప్రథమానుశిష్టం
లోకేశ విష్టప మగా ద్భువనావనోత్కః॥

తా॥ అట్లు దేవతలందరి నూరడించి శ్రీహనుమంతుని యనుగ్రహమును గూర్చి వివరించి చెప్పి దేవతాగురువగు బృహస్పతిని పలుకరించి లోకశ్రేయః కాంక్షి యగు నారదుఁడు వైకుంఠమున కేగెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే దేవాశ్వాసనం నామ ఏకోనత్రింశత్పటలః

## త్రింశత్పటలః

## త్రిశూలవధ ప్రతీక్షణం

శ్రీ మైత్రేయః

శ్లో॥ ప్రయాతే బ్రహ్మతనయే నారదే మునిసత్తమ!
పంపాతీరే కపీంద్రేణ కిం కృతం వద సువ్రత!

తా॥ శ్రీమైత్రేయు లడుగుచున్నారు. ఓ మునిశ్రేష్ఠా! పరాశరా! సువ్రతుఁడా! బ్రహ్మతనయుడగు నారదుఁడు వెడలిన పిదప పంపాతీరమందు హనుమంతుఁ డేమి చేసెనో చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ తత స్తు సపరీవారో హనూమా న్భూతభావనః
పంపాయాః కాననే రమ్యే క్రీడమానో ముదం యయౌ॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు: ఓ మైత్రేయా! పిదప భూత భావనుఁడగు హనుమంతుఁడు పరివారముతో

కూడిన వాఁడై రమ్యమగు పంపా సరోవరపు వనమున నాడుకొనుచు సంతస మందెను.

శ్లో॥ విచిత్ర ఫలపుష్పాణి విచిత్రాణి సరాంసి చ
ఉత్ఫుల్ల పద్మకోశాని పశ్యన్ రమ్యే మహాకపిః॥

తా॥ వానర శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు ఆ రమ్య వనమున విచిత్రములగు ఫలపుష్పములను, విచిత్రములగు సరస్సులను. వికసించిన పద్మములను చూచుచు క్రీడించెను

శ్లో॥ ఇత స్తత స్సహేలాని వల్గితాని పృథక్ పృథక్
చచార సుచిరాకారః సనీలో వాయునందనః॥

తా॥ రమ్యమగు ఆకారము కల్గినట్టి, నీలునితో కూడి యున్న వాయుసుతుఁడగు హనుమంతుఁడు విలాసముగాను, ఆశ్వగతులతోను వేరు వేరుగ నటునిటు సంచరించెను

శ్లో॥ మృగయాయాః విహారేణ క్లాంత దేహాః పిపాసకాః
పంపాసరోజలక్రీడా మమన్యత కపీశ్వరః॥

తా॥ వేటకై విహరించుటవలన వాడిన దేహము కలవారై దాహమునందిరి. హనుమంతుఁడు అప్పుడు పంపా సరోవరమున జలక్రీడ లాడ నెంచెను.

శ్లో॥ కేచి త్పిపాస మత్యర్థం ఉత్ప్లుత్యా ద్యర్థ యోజనమ్
పేతుః పంపాసరోమధ్యే భృగుసర్తుం మార్తయః॥

తా॥ కొందఱు మిక్కిలి దాహ మందియు అర్ధయోజన

మొగిలి పెద్దవగు సుడులతో చుట్టబడుచు పంపాసరోవర మధ్యమున పడిరి.

శ్లో॥ కేచి దుచ్చతరం సాంద్ర మారు హ్యాతిజవాన్వితాః
వివృత్య వదనాగ్రాణి పేతు ర్జలజిఘృక్షయా॥

తా॥ కొందఱు మిక్కిలి వేగముగా చాల ఎత్తగు చెట్లు నెక్కి నోటి చివరి భాగములను తెరచి నీటినిగ్రహించుచు కోర్కెతో దుమికిరి.

శ్లో॥ అంతర్జలం నిమజ్జ్యాన్యే పిబంతశ్చ యథాసుఖమ్
అంతర్ధత్యా మగమ్యాతి మున్మమజ్జ జలోదరాః॥

తా॥ ఇంకొ కొందఱు నీటిలోపలకు మునిగి ఇచ్చ వచ్చినన్ని సుఖముగ త్రాగి నీటితో కూడిన పొట్టలు కల్గి మునుగుచుండిరి.

శ్లో॥ క్షిప్త్వా జలాని వాలాగ్రైః కేషు చిత్కపియూథపాః
నిమజ్జ్యాంతర్జలేనైవ దుద్రువు ర్భయవిహ్వలాః॥

తా॥ కొందఱు కపిశ్రేష్ఠులు తోకచివరలచే నీటిని నెట్టి నీటియందు మునిగి భయమున నొక్కమారు పరుగిడ జొచ్చిరి

శ్లో॥ కేచి త్క్షిప్త్వా జలే నాన్యైః స్థిరీకృత్వా మనస్వకాన్
పునశ్చిచిక్షిపుస్తైస్తైః కపయః సమరంహసః॥

తా॥ కొందఱు ఇతరుల సాయముతో జాగరూకులయినవారిని కూడ పట్టి నీటినితోయగా ఆవానరులను అదే వేగమున తిరిగి త్రోసిరి.

శ్లో॥ గండూషయన్తి కే ప్యన్యైః జలైర్జలజవాసితైః
ఆపదే పంక ముద్ధృత్య అగాధతలగామినః
అన్యాన్ప్రలేపయామాసుః యథా చందనకర్దమైః॥

తా॥ కొందరు పద్మములందలి మధుర జలముతో పుక్కిళ్ళు బట్టించుచుండిరి, లోతునందలి బురదనెత్తి కొందరు చందనపు పూత పూసినట్లు ఇతరులకు పూసిరి.

శ్లో॥ అన్యోన్యాభిముఖం గత్వా జలస్యాంతస్య కేచన
ఆఘూతయంతి పాదేషు మదోన్మత్తగజా యథా॥

తా॥ కొందఱు నీటిలోపలి భాగమున కేగి పరస్పరము ఎదురుగా నున్నవారై మదించిన ఏనుగులవలె కాళ్ళతో తన్నుకొనజొచ్చిరి

శ్లో॥ కక్షే కృత్వాతు పీనాశ్చ ఉదతోఽపి మహాస్వనః
అంతర్జలే చరంతోఽన్యే దష్టాః కక్షేషు తత్యజుః॥

తా॥ కొందఱు బలిసినవారు కొందరిని కక్షభాగమున నిముడ్చుకొని జలమగ్నులయ్యు ధ్వనించుచుండ ఆనీటిలో కక్షభాగమున నితరులచే కొరకబడి తాము పట్టిన వారిని వీడెను

శ్లో॥ హఠా దారూఢవంతోఽన్యే స్కంధేషు పృథులోమసు
బాధా సంప్రాప్త కోపాచ్చ తేఽపి తైర్మజ్జితా జలే॥

తా॥ కొందఱు హఠాత్తుగా ఇతరుల భుజములపై ఎక్కినవారై బాధచే కోపమందినవారిచే ముంచబడు చుండిరి.

శ్లో॥ ఇతి క్రీడావినోదేన కించిత్కాలం నినాయ చ
జలక్రీడా సుఖాస్వాద-నివృత్త మృగయాశ్రమాః
ఉత్తస్థుః కపయ స్సర్వే - పంపాయాః పశ్చిమం తటమ్॥

తా॥ ఇట్లు క్రీడావినోదముతో కొంతకాలము గడపి జల క్రీడా సుఖముచే వేటవలని శ్రమను పోగొట్టుకొన్నవారై వానరులందరు పంపానది యొక్క పశ్చిమతీరమునకు చేరిరి.

శ్లో॥ సువర్చలాపతి శ్శ్రీమాన్ పంపాయా అపి దూరతః
సుశ్రావ సామగానాని-మునీనాం సత్రయాగతః ॥

తా॥ అంతట సువర్చలానాథుఁడగు శ్రీ హనుమంతుఁడు ఆ పంపా సరోవరమునకు దూరమున సత్రయాగము నుండి మునులయొక్క సామ గానములను వినెను.

శ్లో॥ యజ్ఞభుగ్యజ్ఞఫలదః-హనుమా న్సామగాయినః
ఆమంత్రితో మంత్రవిధి-సంప్రాప్తో యజ్ఞవాటికామ్॥

తా॥ యజ్ఞమందిడు పదార్థములను సేవించునట్టియు సామగాన మొనర్చువారికి యజ్ఞఫలము నిచ్చునట్టియు హనుమంతుడు మంత్రవిధియందు పిలువబడినవాడై యజ్ఞవాటికను చేరెను.

శ్లో॥ ఆదిదేశ స్వకాన్ భృత్యాన్-సర్వభూతదయాపరః
సంవాదోఽత్ర న కర్తవ్యం-ఆశ్రమే మునిసేవితే॥

తా॥ అట్లు చేరి సర్వ ప్రాణులందు దయగల హనుమంతుఁడు మునులచే సేవింపబడు ఆశ్రమమందు సంవాద మొనర్చరాదని తనసేనకు ఆజ్ఞ ఇచ్చెను.

శ్లో॥ ఇత్యాదిష్టాః కపీంద్రేణ-కపివర్యాః పరస్పరమ్
వృక్షశాఖాన్ సమాలంబ్య-తస్థు శ్చిత్రార్పితా ఇవ॥

తా॥ ఇట్లు వానర శ్రేష్ఠుఁడగు హనుమంతునిచే నాదేశింపబడినవారై పరస్పరము కపివీరులందరు చెట్టుకొమ్మలెక్కి బొమ్మలందున్నటుల కదలక నిల్చిరి.

శ్లో॥ సర్వభూతాంతరస్థోఽపి-నిజభక్త పరాయణః
హనుమా నపి శాఖాగ్రే-నమలీయత సర్వదృక్॥

తా॥ అందరి యాత్మలయం దుండువాఁడైనను తన భక్తులయందు ఇష్టుడగుటవలన హనుమంతుఁడు తన దృక్కులను శాఖాగ్రమందలి వారియందే యుంచెను.

శ్లో॥ అథాంతరే మహాకాయః-క్రూర కర్మాసిపుత్రకః
త్రిశూలరోమః నిర్యాతో-దైవా ద్గహనగహ్వరాత్॥

తా॥ పిమ్మట ఇంతలోనే పెద్దశరీరము కల్గిన, దుష్టచేష్టలుకల అసిపుత్రుఁడగు త్రిశూలరోముఁడు దైవికముగా అడవిలోని పొదరిండ్లనుండి బయటకువచ్చెను

శ్లో॥ శ్రుత్వా తు సామగానాని-రాక్షసో లోకకర్శనః
పరుషం భీషణాకారో-భీషయ న్వ్యసదన్ మునీన్॥

తా॥ రాక్షసుడు, లోకమును బాధించువాఁడు, భయంకరమగు ఆకారము కలవాఁడు అగు త్రిశూలరోముడు సామగానములను విని మునులను భయపెట్టుచు బిగ్గరగా అరచెను.

శ్లో॥ తేన నాదేన సంత్రస్తా- ప్రస్త యజ్ఞాంగ సాధనాః
ఋభూవు శ్శోకనిర్విణ్ణాః-అసమాప్త క్రతూద్యమాః॥

తా॥ ఆ భయంకర నాదము చే భయపడినవారై మునులు యజ్ఞమునందలి పనిముట్లు నన్నిటిని వీడి యజ్ఞ యత్నమును అసంపూర్తి చేసినవారై దుఃఖముతో కలత చెందినవారైరి.

శ్లో॥ సమాగతో యథాపూర్వం.విఘ్నకర్తాసిపుత్రకః
క్వ గంతవ్య మిదానీం నః - విహాయ క్రతు ముత్తమమ్॥

తా॥ వెనుకటివలెనే విఘ్న కారకుండైన అసిపుత్రుండగు త్రిశూంరోముండు వచ్చినాడు. ఇప్పుడీ ఉత్తమ యజ్ఞమును వీడి ఎచ్చటకు వెళ్ళవలయును!

శ్లో॥ అసమాప్తౌ క్రతౌ నూనం-సద్యః కర్తా వినశ్యతి
అథవా స్థీయతే హ్యత్ర-రక్షో నూనం వధిష్యతి ॥

తా॥ అసమాప్తిగా యజ్ఞమును వీడినచో వెంటనే యజ్ఞకర్త తప్పక నశించును. అట్లుకాక ఉన్నచో నిచ్చట ఈ రాక్షసుడు తప్పక చంపును

శ్లో॥ కస్త్రాతా నోఽద్య భీతానాం -శరణ్య శ్శరణార్థినామ్
ఇతి వ్యాకులచిత్తేషు బ్రాహ్మణేషు క్రతూత్తమే॥

తా॥ ఇప్పుడు భయమంది యున్న మనల రక్షించువాం డెవ్వండు? శరణు వేడు మనలను రక్షించువాం డెవ్వండు ? అని ఆయజ్ఞ విషయమున బ్రాహ్మణులు కలతపొందిన మనస్సుతో నుండగా

శ్లో॥ సద్యః పపాత స్రుగ్భాండం- దైత్యః పరమకోపనః
హా హేతి ప్రోచు రుద్వేగాత్-కశ్యపాద్యా మహర్షయః॥

తా॥ వెంటనే మిక్కిలి కోపగించిన రాక్షసుఁడు హోమపాత్రను పడవైచెను. అంతట కశ్యపాది మహర్షులందరు చాల బాధతో హాహాకారము లొనర్చిరి.

శ్లో॥ అథాసురో మునీ నాహ- కోప సంరక్త లోచనః
కి మేత త్క్రియతే కర్మ-భవద్భి ర్భీతివర్జితైః॥

తా॥ పిమ్మట కోపముచే నెఱ్ఱపడిన కండ్లతో ఆ రాక్షసుఁడు మునులను చూచి ఇట్లనెను: భయములేక మీరేమి ఈపని నొనర్చుచున్నారు?

శ్లో॥ ఉపేక్ష్య మాం క ముద్దిశ్య-క్రియతే మందబుద్ధిభిః
మద్వినా వరదో ఽన్యశ్చ కో వాఽఽస్తే జగతాం త్రయే॥

తా॥ ఓ మందబుద్ధులారా! నన్నువిడి మీరు చే నెవరికై ఈ యజ్ఞము చేయబడుచున్నది? నేను కాక ముల్లోకములందు వరమిచ్చువాఁ డింకెవఁడున్నాఁడు?

శ్లో॥ హూయతే కి మిదం వహ్నా-ఇంద్రాయే త్యనలాయ చ
వాయవే వరుణాయేతి-స్వాహేతి చ ముహుర్ముహుః॥

తా॥ మాటిమాటికి ఈ అగ్నియందు ఇంద్రునకు, అగ్నికిని, వాయువునకును, వరుణునకని 'స్వాహా' శబ్దముతో వేల్చబడుచున్న దేమి?

శ్లో॥ ఏతే త్రిశూలరోమాణం జగదీశం న బుధ్యతే
ఖిలీకృతా హి బహవః క్రతవో మద్విధా కృతాః॥

తా॥ లోకనాయకుండగు ఈ త్రిశూలరోముని నన్ను తెలిసికొనక నేనులేకుండ చేయు అనేక యజ్ఞములు నాశనమగుచున్నవి

శ్లో॥ జానంత్యేవ భవంతోఽపి హ్యనుభూత మిదం పురా
త్రిశూలరోమ నామాఽయం సద్యోత్కృష్టేన వర్తతే॥

తా॥ మీరుకూడ ఈవిషయము తెలియుదురు. ఇది మీరు వెనుక అనుభవించియే యున్నారు. త్రిశూలరోముండనబడు వీఁడెప్పుడు అతిశయించియే యుండును.

శ్లో॥ బ్రహ్మాదయ స్సురేంద్రాశ్చ మత్తో భీతాః పలాయితాః
ఉపద్రుతా మయా దైత్యాః ఇతరేషాం తు కాగతిః

తా॥ బ్రహ్మాదులు, దేవేంద్రులే నా వలన భయపడి పరుగిడిరి. నాచే రాక్షసులే బాధింపబడిరి ఇక ఇతరుల గతి చెప్పనదేమి ?

శ్లో॥ అద్యప్రభృతి వో కార్య మకార్యం ధృవ మీదృశమ్
ఇతి దష్టావరోష్ఠేన దంతా న్కటకటాప్య చ
తర్జితా మునయ స్సర్వే తేన హుంకారపూర్వకమ్॥

తా॥ ఈనాటినుండి ఇటువంటి మీపని చేయఁదగదు. అని పెదవి కొరుకొచు, పండ్లను పటపటలాడించుచు అతఁడు హుంకరించి మునుల నందఱను తర్జించెను.

శ్లో॥ ఇద మాజ్య మిదం పిష్టం కపాలేషు చ సంస్కృతం
పురోడాశం పశూనాం చ మహ్య మేవ ప్రదీయతామ్॥

తా॥ ఈ నేతిని, ఈ పిండి పదార్థమును యజ్ఞపాత్ర యందు సంస్కరించిన పశువులయొక్క వపతో కూడిన పురోడాశమును నాకే ఈయవలసినది.

శ్లో॥ శ్రుణుధ్వం మునయ స్సర్వే మమ వాక్యం హితావహమ్
మయి తుష్టే జగన్నాథే యూయం సులభజీవనాః॥

తా॥ ఓ మునులారా! మీరందఱు హితముతో కూడిన నామాట వినుడు. లోకమునకు ప్రభువునైన నేను తృప్తి పడినచో మీరందఱు ధన్యులగుదురు.

శ్లో॥ ఇత్యుక్త్వా రాక్షసశ్రేష్ఠః శృణ్వతాం తు తపస్వినామ్
హవిర్గ్రహీతకామో౽భూత్ పిశునః పిశితాశనః॥

తా॥ అని దుష్టుఁడు మాంస భోజనుఁడగు రాక్షసశ్రేష్ఠుడు మునులు తనమాట వినుచుండగా హవిస్సును స్వీకరింప నెంచెను.

శ్లో॥ హవిర్బుభుక్షా మవగమ్య రక్షసః
సర్వాంతరస్థో భగవా న్కపీశ్వరః
ఇయేష విఘ్నం పరిహర్తు మాసురమ్
పదేనవార్గం మునియాగకర్మణః

తా॥ సర్వాంతర్యామి యగు భగవంతుఁడు హనుమంతుఁడు ఆ రాక్షసుఁడు హవిస్సును తినఁగోరుచున్నాఁడని

యెఱిఁగి మునుల యాగమునకు విఘ్నముగా నున్న ఆ రాక్షసుని నాశనముచేయఁ దలచెను.

ఇతి శ్రీపరాశర సంహితాయాం త్రిశూలవధ ప్రతీక్షణం నామ త్రింశత్పటలః

## ఏకత్రింశ త్పటలః

## త్రి శూ ల రో మ వ ధ

శ్రీ మైత్రేయః

శ్లో॥ విఘ్నశాంతి మభిప్రీత్యా-మారుతి ర్లోకరక్షణః
అకరోత్కిం వద స్వామిన్ యద్యస్తి మయి తేదయా॥

తా॥ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ మహానుభావా! పరాశరమహర్షి! నాయందు మీకు దయయున్న యెడల లోకరక్షకుఁడగు హనుమంతుఁడు మునియాగము యెడ విఘ్నశాంతియందలి ప్రీతితో నేమిచేసెనో తెలుపవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ ప్రసారయతి హస్తాగ్రం-హవిర్భాగేచ్ఛయాసురః
నిపతన్మూర్ధ్ని వృక్షాగ్రాత్-కపీంద్రో తస్య రక్షసః॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. హవిస్సును గ్రహించుటకు చేయిజాపుచుండగా వానరశ్రేష్ఠుఁడగు హను

మంతుఁడు చెట్టుపైనుండి ఆ రాక్షసుని యొక్క శిరస్సుపై
బడెను.

శ్లో॥ పతనా ద్వజ్రసంకాశాత్ - కుక్షిస్థజగతః కపేః
దృష్ట్వా స్వరసనాం దైత్యః-పపాత ధరణీతలే॥

తా॥ జగమంతియు కుక్షియందుకల హనుమంతుని దూకుడుకిదుపుపాటువలెకాగా ఆరాక్షసుడు నాల్కవెళ్ళఱచి నేలపై బడెను.

శ్లో॥ పాతయిత్వా దురాత్మానం-ముత్పపాత పునః కపిః
దైత్యో నివృత్తమూర్ఛస్సన్ - దిశోదశ విలోకయన్॥

తా॥ ఆరక్కసుని పడవైచి హనుమంతుఁడు మరల ఎగిరెను. ఆదురాత్ముఁడు మూర్ఛతొలగగా పదిదిక్కులు చూచుచు

శ్లో॥ తం దద ర్శాంతరిక్షస్థం-గతిలాఘవసంయుతమ్
ఉత్పపా తాథ దైత్యోఽపి-తం దేశం యత్ర మారుతిః॥

తా॥ చాలసులభముగ నెగురగల్గి ఆకసమందున్న ఆహనుమంతుని చూచినవాఁడై ఆమారుతియున్న ప్రదేశమునకు ఆరాక్షసుఁడుకూడ ఎగిరెను.

శ్లో॥ త ముత్పతంతం హనుమాన్ సమీక్ష్యవై
జఘాన వాలేన కఠోరవక్షసి
త్రిశూలరోమాఽపి గృహీతవాలధిః
నిపాతయామాస సువర్చలాపతిమ్॥

తా॥ అట్లు ఎగురువానిని హనుమంతుఁడుచూచివాని వక్షస్థలమున తోకతో కొట్టెను త్రిశూలరోముఁడుసైతము

ఆలోకనుపట్టి సువర్చలానాధుండగు హనుమంతుని పడ వైచెను.

శ్లో॥ అస్పృష్ట్వైవ భువం సద్యః పునర్లుత్ప్లుత్య మారుతిః
జగృహే కంఠ రాంతస్య రాహు శ్చంద్రమసం యథా॥

తా॥ వెంటనే హనుమంతుండు భూమినైన తాకకనే మరల ఎగిరి రాహువు చంద్రునిపట్టినరీతిగా అత్రిశూల రోముని కంఠమును పట్టుకొనెను.

శ్లో॥ నివృత్తనయన స్తేన నాసాభ్యాం త్యక్తశోణితమ్
ఆత్మానం తు స నస్మార దృఢ కంఠ గ్రహేణ సః॥

తా॥ అట్లు కంఠమును గట్టిగ పట్టుకొనుటచే చూపు దెబ్బతినినవాడయ్యెను. తన ముక్కులవెంట ప్రసరించు రక్తమునుకూడ గ్రహింపలేక పోయెను.

శ్లో॥ తత్ప్రాణసంకటాన్ దృష్ట్వా సర్వభూతదయాపరః
స్కంధం తస్యారురో హాశ గళనాళం విసృజ్య సః॥

తా॥ అతని ప్రాణాపాయస్థితిని చూచినవాడై హనుమంతుడు సర్వ ప్రాణులయందు దయకలవాడగుటవలన అతని కంఠనాళము వీడి త్రిశూలరోముని భుజముపై నెక్కెను.

శ్లో॥ విక్రమం కపిరాజస్య దృష్ట్వా మునిగణా స్తదా
విస్మయం పరమం జగ్ముః దృష్టవంతః పరస్పరమ్॥

తా॥ అప్పుడా వానరశ్రేష్ఠుడగు హనుమంతుని పరాక్రమమును చూచిన ముని సమూహము ఒకరిముఖము నొకరు చూచుకొనుచు మిక్కిలి ఆశ్చర్యమునందిరి.

శ్లో॥ ఇతరే కపయ స్తూష్ణీ మాసన్ హనుమదాజ్ఞయా
న చేలు ర్న చ సంపేతుః న బిభ్యు ర్న చ బభ్రమః॥

తా॥ మిగిలిన వానరులందరు హనుమంతుని యాజ్ఞ వలన మిన్నకుండి ఆసంక్షోభమున కదలక, భయపడక తిరుగక యుండిరి.

శ్లో॥ నిజస్కంధ సమారూఢం నిపపా తేహయా కపిమ్
కంపయామాస దుష్టాత్మా నిజదేహం స రాక్షసః॥

తా॥ తనభుజముపై నెక్కిన హనుమంతుని పడవేయ నెంచి ఆ దురాత్ముడగు రాక్షసుడు తనదేహమును మిక్కిలిగ కదలించెను.

శ్లో॥ తథా ప్యపతమానేఽస్మి న్నధోముఖ మథాపతత్
పతమానం తు తం దృష్ట్వా కపిరాజో మహామతిః
అపసార్య శనైః పశ్చాత్ జానుఘాతై రఘాతయత్॥

తా॥ అయినను హనుమంతుడు పడకుండుటచే తల వంచి పడనెంచగా గొప్ప తెలివైనవాడగుటవలన ఆ జ నేయుడా రీతిని చూచి నెమ్మదిగా తప్పుకొని వెనుకభాగమున మోకాటితో నొక్కపోటు పొడిచెను.

శ్లో॥ తతః క్రుద్ధో మహాకాయః గృహీత్వా వాలధౌ కపిమ్
భ్రామయామాస సంరంభ త్పనాళ మివ పంకజమ్॥

తా॥ పిమ్మట మిక్కిలి కోపించినవాడై ఆ పెద్ద శరీరముకల రాక్షసుడు హనుమంతుని తోకపట్టుకొని కాడ పట్టుకొని పద్మమును త్రిప్పినట్లు త్రిప్పెను.

శ్లో॥ తతో మునిగణా స్సర్వే భీత భీతయి వాభవన్
ఇంద్రాద్యా అపి దేవా శ్చ సంశయా పన్న మానసాః,
అంతరిక్షే స్థితాః ప్రోచుః భూయాన్మారుతయే శుభమ్॥

తా॥ అంత మును లందరు మిక్కిలిభయము నంది రి ఇంద్రాది దేవతలందరు ఆకసమునుండి హనుమద్విజయ విషయమున సందేహముకల్గినవారై వాయునందనునకు మంగళము కుగాక, యని శుభమును కాంక్షించుచు పల్కిరి.

శ్లో॥ హనుమా న్విజయస్వేతి కురు దుష్టవధం ప్రభో।
దేవేభ్యః కుశలం భూయాత్ బ్రాహ్మణేభ్యః శుభం తథా॥

తా॥ ఓహనుమంతా! విజయమునందుము మహాను భావా! దుర్మార్గులను వధించుము దేవతలకు క్షేమము కుగాక! అట్లే బ్రాహ్మణులకును మంగళము కుగాక!

శ్లో॥ ఇత్యేవం వివిధా స్తేషాం కపి శ్శృత్వా జయాశిషః
అద్యైవం జగతాం ప్రీత్యై వధిష్యే రాక్షసం రిపుమ్॥

తా॥ ఇట్లనేక రీతులకువారల జయాశీస్సులువిని హనుమంతుడు నేడు జగత్తుయొక్క ఆనందముకొరకై శత్రువగు ఈరాక్షసుని తప్పక వధింతును

శ్లో॥ ఇతిమత్వా మహాశూరో పవనే హిమవా నివ
ప్రవృద్ధే తు కపి శ్రేష్ఠే దుర్ధమం తస్య వాలధిమ్
దదంశ తీవ్రవదనః త్రిశూలాకృతిరో మవాన్॥

తా॥ అని తలచి గొప్ప బలవంతుడగు హనుమంతుడు ఋషుపవనము లేర్పడినప్పుడు హిమవంతుడు పెరుగునట్లు

పెరుగగా పొందశక్యముకాని యాతని తోకను పట్టుకొని తీక్ష్ణమగు దంతములుకల ఆ త్రిశూలరోముడు కొరికెను. వెంటు కలే త్రిశూలమువంటివైన, యిక దంతములరీతి ఎంతటి తీవ్రమో తెలియుటకై 'త్రిశూలాకృతిరోమవాన్' అని సార్థకముగా ప్రయోగింపబడినది.

శ్లో॥ కపీంద్రో రక్షసా దష్టః పదాఘాత మఘాతయత్
తతస్తు రాక్షసః క్రుద్ధో ముష్టినా సమతాడయత్॥

తా॥ ఆంజనేయుడు ఆ రాక్షసునిచే కొఱుకబడి కాలితో నొక్కతన్ను తన్నెను. అంత రాక్షసుడు మిక్కిలి కోపించి పిడికిటితో హనుమంతుని కొట్టెను

శ్లో॥ దుర్దర్శ మపి లోకానాం మనః పీడాకరం మహత్
మల్లయుద్ధం తయో స్తత్ర కృష్ణచాణూరయో రివ॥

తా॥ అప్పుడు లోకము చూడలేనటువంటిదియు, జనుల మనస్సులకు బాధను కల్గించునదియునగు గొప్ప మల్లయుద్ధము కృష్ణచాణూరులకు జరిగినట్లు వారిద్వరకు జరిగినది

శ్లో॥ అయోఘనసమాకారైః ముష్టిభిశ్చ పరస్పరమ్
ప్రజహ్రతు రురోదేశే మస్తకే చ విశేషతః॥

తా॥ ఒకరినొకరు ఇనుపసుత్తెతో సమానమైన పిడికిళ్లతో వక్షస్థలమునందును, ముఖ్యముగా తలపైనను క్రమముగా కొట్టుకొనిరి.

శ్లో॥ అన్యోన్య ముష్టిఘాతేన శిథిలీభూత శక్తికౌ
పరస్పరం ప్రశంసంతౌ ముష్టియుద్ధ మతన్వతామ్॥

తా॥ ఒకరినొకరు పిడికిటి దెబ్బలతో ఎముకలు విరుగ గొట్టుకొనుచు గట్టిదెబ్బల నొకరినొకరు మెచ్చుచు గొప్ప ముష్టియుద్ధము సాగించిరి.

శ్లో॥ హనూమా నతిస క్రుద్ధో యథా మతి యథా బలమ్
తాడయామాస తం మూర్ధ్ని విదీర్ణ బ్రహ్మరంధ్రకమ్॥

తా॥ హనుమంతుడు మిక్కిలి కోపముంది తానెంచిన రీతిగా బలముకొలది బ్రహ్మరంధ్రమును చీల్చునట్లుగా ఆ రాక్షసుని నెత్తిపై మోదెను.

శ్లో॥ దృఢసంతాడితో మూర్ధ్ని కరుణాం గిర మబ్రవీత్
హా తాప హే మమ భ్రాతః హా మాతర్హాః చ రాక్షసాః
కపినా మారితో నూన మితి చింతాపరో௨భవత్ ॥

తా॥ ఆ రాక్షసుడు నెత్తిపై గట్టిగా కొట్టబడి దీనముగా నిట్లు పలికెను: ఓ తండ్రీ! ఓనాసోదరా! అయ్యో తల్లీ! ఓ రాక్షసులారా! నేనొక కోతిచే కొట్టబడితిని అని విచారముసందెను.

శ్లో॥ నాయం శాఖామృగో కశ్చి న్న దేవో న చ దానవః
అన్యథా కథ మేకస్య ప్రసరే న్మయి విక్రమః॥

తా॥ ఇది కోతిగాదు: ఏ దేవుడునుకాడు. రాక్షసుడను కాడు. లేకున్న ఒక్కనిపరాక్రమము నాపై ఎట్లు ప్రసరించగలదు?

శ్లో॥ దేవా శ్చ దానవా శ్చైవ పన్నగా అపి నిర్జితాః
తిరశ్చాం ఫలజీవానాం కా కథా వనవాసినామ్।

తా॥ దేవతలు, రాక్షసులు, నాగులు సైతము నాచే జయింపబడిరి. అద్భుతమైన ఫలములు తిని బ్రతుకు వనవాసులను గూర్చి వేఱు చెప్పనదేమి?

శ్లో॥ కిం తు లోకహితార్థాయ కపిరూపో జగత్పతిః
లోకవిద్వేషణో నూనం మమ ప్రాణహరో హ్యయమ్॥

తా॥ కాన నీతడు లోకమునకు మేలుచేయుటకై కపిరూపము ధరించిన జగన్నాథుడే. లోకకంటకుడనైన నాయొక్క ప్రాణములు తీయువాడితడే.

శ్లో॥ ఇతి నిశ్చిత్య మనసా పలాయన మథాకరోత్
విషమాద్రిం తతః ప్రాప రాక్షసో భయవిహ్వలః॥

తా॥ అని మనసార నిశ్చయించుకొని యారాక్షసుడు వెంటనే పారిపోయెను, అట్లువెడలి భయకంపితుడగు నాతడు చొరశక్యముకాని యొక పర్వతమును చేరెను.

శ్లో॥ ఆంజనేయ మయం సర్వం తస్యాభూ జ్జగతాం త్రయమ్॥

తా॥ ఆతనికి ముల్లోకములందు నమస్తము హనుమంతుడే నిండియున్నట్లనిపించెను.

శ్లో॥ తతో దైత్యో భయావేశా దనన్యశరణ స్తథా
బహుమాయో మహాకాయః కృత్వా సూక్ష్మవపు స్తథా
పర్వతే భయ మాంశక్య స్ఫాటికం భృగు మావిశత్॥

తా॥ పిమ్మట ఆ త్రిశిరాంరోముడు భయపూర్ణుడై శరణుజొచ్చుట కెవ్వరులేనివాడై అప్పుడు మాయామయుడగుటవలన పెద్ద దేహమునంతను చిన్నదిగా చేసి ఎచ్చట

నున్నను భయమునేతలచి యొక స్ఫటికశిలాతలమున ప్రవే
శించెను.

శ్లో|| మార్గమాణోఽపి పుత్రం తం-
హనూమాన్ లోకకంటకమ్
ప్రత్యగ్దృశా సమాబుద్ధ్యా స్ఫాటికం సమబుధ్యత||

తా|| హనుమంతుడు లోకమునకు కష్టముకల్గించు ఆ రాక్షసుని వెదకుచును దివ్యదృష్టి కలవాడగుటవలన స్ఫటికతలమున నాతడుండుట నెఱిగెను.

శ్లో|| హనూమాన్ గాననిపుణః గానవిద్యావిశారదః
తతో గుండక్రియాగానైః అగాయత మహాస్వనః||

తా|| పాడుటయందు నేర్పరియు, గానవిద్యావిశారదుడు నగు హనుమంతుడు గొప్పరాగముతో గుండక్రియాగాన మొనర్చెను. గుండక్రియయనున దొక గానవిశేష వాచకము

శ్లో|| తేన గానేన పాషాణో జలభావం జగామ సః
తత స్సుస్రావ సలిలం శీతలం సర్వతోముఖమ్
సమంతా దివ నీహారో హిమవత్పర్వతోత్తమామ్

తా. ఆ గానముచే స్ఫటికశిల నీరుగారెను. ఆ స్ఫటిక జలము హిమవత్పర్వతమునుండి చుట్టు మంచుకారునట్లుగా ప్రవహించెను.

శ్రీ మైత్రేయః

శ్లో|| పురా గుండక్రియా కేన పాషాణద్రవిణీకృతా
శ్రోతుకామాయ మహ్యం త్వం బ్రూహి పారాశరప్రభో.

తా. మైత్రేయులవారడుగుచున్నారు ఓ పరాశర మహర్షీ! పూర్వము గుండక్రియావిధానమున పాషాణము నెవరు ద్రవింపజేసిరి? ఆ విషయమును వినగోరుచుంటిని కావున నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ తుంబురుర్నారద శ్చేతి ద్వావేతౌ గాయకోత్తమౌ
సంగీతవిద్యావిషయే వివాదం చక్రతుః పురా

తా. శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు తుంబురుండు, నారదుండు అను ఇద్దరును గాయక శ్రేష్ఠులు. పూర్వము వారిర్వురు సంగీత విద్యావిషయమున వివాదముపొందిరి

శ్లో॥ అన్యోన్యవిజయాకాంక్షౌ హనూమంత ముపాగతౌ
ఊచతు స్తౌ హనూమంతం నౌపరీక్షస్వ గాయక

తా. ఎవరికివారు విజయము నందగలమనుకొనుచు హనుమంతుని చేరి ఓ మహాగాయకా! మమ్ము పరీక్షింపుము అనిరి.

శ్లో॥ సర్వవిద్యాప్రవీణ స్త్వం గానే వ్యత్యంతనైపుణః
తారతమ్య పరిజ్ఞాతా విజ్ఞాన బ్రహ్మసంపది॥

తా॥ గానమునందు మిక్కిలి నేర్పుకలవాడా! నీవు సర్వవిద్యాప్రవీణుడవు, విజ్ఞానసంపదయందు మామధ్య తారతమ్యము నెఱింగించవలయును.

శ్లో॥ ఏవం తదుక్తో హనుమా న్ప్రవీద్గాయకౌ ఉభౌ
వీణేయుం బృహతీ రమ్యా కళావ త్యపి నారదీ॥

తా॥ అని ఇట్లు చెప్పబడినవాఁడై హనుమంతుఁడు ఆ గాయకు లిర్వురితో నిట్లనెను: ఇది రమ్యమగువీణ బృహతి యని పేరు కలది, ఇది దేవలోక వీణ కళావతి యని పేరు కలది. నారదుని వీణపేరు మహతి. తుంబురుని వీణపేరు కళావతి. సరస్వతి వీణపేరు కచ్ఛపి

శ్లో॥ నిధీయతాం తు పాషాణే కఠినే పురత స్థ్సితే
ఇత్యుక్త్వా క్షిప్తవంతౌ తౌ వీణే ద్వే తత్ర గాయకౌ॥

తా॥ నాయెదుటనున్న కఠినమగు పాషాణమున వాని నుంచుఁడుగాక యనగా ఆగాయకు లారెండు వీణల నచ్చట నుంచిరి.

శ్లో॥ తతో గుండక్రియాం చక్రే హనూమా న్మారుతాత్మజాం
విచిత్రతాన సంపన్నాం సర్వభూతమనోహరామ్॥

తా॥ పిమ్మట వాయునందనుఁడగు హనుమంతుఁడు విచిత్రమగు తానముతో కూడియున్నట్టియు, ప్రాణులకెల్లం టికి మనోహరమై యుండునట్టి గుండక్రియారాగానము నొనర్చెను.

శ్లో॥ తదా జలమయో జాతః పాషాణః కఠినోఽపి సన్
నిమగ్నే తే ఉభే వీణే పాషాణజలబుద్బుదే॥

తా॥ అప్పుడు ఎంతో కఠినమైనదైనను ఆ పాషాణము ద్రవించగా నారద తుంబురుల వీణలు రెండును ఆ పాషాణ జలమున మునిగినవి.

శ్లో॥ విరరామ తదా గానం హనూమా న్మారుతిః కృతమ్
తత్క్షణాదేవ పాషాణః పునః కఠినతాం యయౌ॥

తా॥ అప్పుడు వారిని పరీక్షింపనెంచినవాఁడై హనుమంతుఁడు గానము నారంభించెను. వెంటనే ఆపాషాణము మరల గట్టిపడి వెనుకటి రీతిగా నయ్యెను.

శ్లో॥ పునః ప్రోవాచ హనుమాన్ తుంబురుం నారదం తథా
ద్రవీభూతం విధాయైవం పాషాణం గానసౌష్ఠవైః
గృహీతవ్యే ఉభే వీణే భవద్భ్యాం గాయకోత్తమౌ॥

తా॥ మరల హనుమంతుఁడు తుంబురునారదులతో నిట్లనెను: ఓగాయకోత్తములారా! నేనొనర్చినరీతిగనే గానమాధుర్యముచే ఈపాషాణమును ద్రవింపజేసి మీయుభయులు వీణలను స్వీకరింపుడు.

శ్లో॥ తారతమ్యం తదా వక్ష్యే సంగీతవిషయే హి వామ్

తా॥ అప్పుడు సంగీత విషయమున మీలో నెవరు గొప్పవారో ఎవరు తక్కువవారో తేటఁ జెప్పెదను.

శ్లో॥ ఏవం సంబోధితౌ తేన పృథక్ తుంబురనారదౌ
ద్రవీకర్తుం హి పాషాణం అగాయత పృథక్ పృథక్॥

తా॥ ఇట్లు హనుమంతునిచే చెప్పఁబడినవారై తుంబురు నారదులు ఆ పాషాణమును ద్రవింపజేయుటకై వేరువేరుగా గానమొనర్చిరి

శ్లో॥ యథాశక్తి యథాశాస్త్రం గీతవంతౌ స్వరైర్ముహుః
కదాచిదుచ్చైశ్చ్యావ్యేతౌ ఽస్యా జాతుకీచైరసంవృతౌ॥

తా॥ శక్తికొలది శాస్త్రవిధిననుసరించి సుస్వరములతో మరల మరల పాడుచు వారిద్దరు ఒకానొకప్పుడు

పై కిపల్కుచు విస్తరించిన నోరుకలవారగుచు, ఒకచో క్రిందికిపల్కుచు సంవృతము కాని రీతినుంచియుపాడిరి.

శ్లో॥ సమాహార ప్రకారేణ జగత ద్గానలోలుపౌ
తథాపి కఠినాకారః పాషాణో న ద్రవీకృతః॥

తా॥ ఒకచోకూర్చినట్లుగా జగత్తునంతను గానతన్మయుల చేయుగలవారు అంతగా గానమొనర్చినను కఠినముగానున్న ఆస్ఫటికము కరుగలేదు

శ్లో॥ తతో నివార్య హనుమాన్ తుంబురుం నారదం తథా
స్వయం గుండక్రియాగానైః అగాయత మనోహరమ్॥

తా॥ పిమ్మట ఆనారదతుంబురులగానము నాపి హనుమంతుడు స్వయముగా మనోహరమగురీతిని గుండక్రియాగాన మొనర్చెను

శ్లో॥ తతః కఠినపాషాణో జలబుద్బుద సన్నిభః
తస్మా దుద్ధృత్య వీణే ద్వే బృహతీం చ కళావతీమ్
తదా స ప్రదదౌ తాభ్యాం యువాం చోభౌ సమా వితి॥

తా॥ పిమ్మట ఆకఠినశిల నీటిబుడగవలె కాగా దానినుండి బృహతి, కళావతి వీణల రెండిటినితీసి గానవిద్యయందిరువురు సమానులే యని హనుమంతుడు వారికా వీణలనిచ్చెను.

శ్లో॥ పరస్పర సమత్వేన వికస న్ముఖపంకజౌ
హనూమంతం ప్రణమ్యాథ జగ్మతు స్తౌ యథాగతమ్॥

తా॥ ఒకరికొకరు సమానులు అగుటవలన ముఖములు

ఆనందముచే వికసించగా వారిద్దరు హనుమంతునకు నమస్క-
రించి ఇచ్చవచ్చిన రీతిని వెడలిరి.

శ్లో॥ ద్రవీభూతే తు పాషాణం తదంతస్థోఽసి నందనః
తస్మాదుత్థాయ వేగేన పశ్యతిస్మ కపీశ్వరమ్॥

తా॥ స్ఫటికశిల ద్రవించగా దానియందున్న అసి పుత్రుఁడగు త్రిశూలరోముఁడు వేగముగ దానినుండి పైకి లేచి హనుమంతుని చూచెను.

శ్లో॥ ఉద్ధృత్య దక్షిణం బాహుం చచాలాభిముఖం కపేః
ఏకతాళో మహావాత ప్రేరితః పర్వతో యథా॥

తా॥ అతఁడు కుడిచేతిని పైకియెత్తి హనుమంతున కెదురుగా కదల్చుచు వాయువుచే కదలెడి తాటిచెట్టుతోఁడి పర్వతము వలె నుండెను

శ్లో॥ తతో పతంతం వాలేన మధ్యే బధ్వా కపీశ్వరః
భ్రామయ స్వబహుధా క్రూరం తాడయామాస పర్వతే॥

తా॥ పిమ్మట మీఁదకువచ్చు ఆ రాక్షసుని మధ్యభాగమున తోకతో బంధించి అనేకరీతుల క్రూరముఁగ త్రిప్పుచు పర్వతమునకు కొట్టెను.

శ్లో॥ స తాడితో మహాక్రూరో వదనోద్గీర్ణశోణితః
మమార సహసా దైత్యం సుఖేనైవ సుఖోచితః॥

తా॥ ఆ క్రూరుఁడగు రాక్షసుఁడు కొట్టబడినవాఁడై ముఖమునుండి ప్రవహించు రక్తము కలిగినవాఁ డయ్యెను. సుఖోచితుఁడగు హనుమంతుఁడా రాక్షసుని సుఖముగానే చంపెను.

శ్లో॥ తతో దేవా స్సగంధర్వాః-సిద్ధాశ్చ పరమర్షయః
తుష్టువు శ్చ మహాశూరం సర్వలోకోపకారకమ్॥

తా॥ పిమ్మట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, ఋషులును లోకములన్నిటికి మేలొనరించిన గొప్పపరాక్రమవంతుడగు హనుమంతుని స్తుతించిరి.

శ్లో॥ అంజనాగర్భ సంభూతం సర్వేఽపి బహుమేనిరే
దేవశత్రౌ మృతే తస్మిన్ పుష్పవర్షం పపాత ఖాత్॥

తా॥ అంజనాసుతుడగు హనుమంతునెల్లరు కొనియాడిరి దేవతల శత్రువగు త్రిశూలరోముడు చనిపోవుటతో హనుమంతునిపై ఆకాశమునుండి పుష్పవర్షము పడినది.

శ్లో॥ దేవదుందుభి ర్మోనేదుః ననృతు శ్చాప్సరోగణాః
అసురః క్రూరకర్మాఽపి నీచజన్మాఽపి మూఢధీః॥

తా॥ దేవదుందుభులు మ్రోగింపబడినవి. అప్సరసలు నాట్యమాడిరి త్రిశూలరోమరాక్షసుడు క్రూరవృత్తికలవాడు, నీచజన్మకలవాడు, మూర్ఖబుద్ధి కలవాడునైనను

శ్లో॥ సాక్షాత్కార త్కపీంద్రస్య తద్బాల స్పర్శనా దపి
ముక్తిం జగామ దేహాన్తే యోగినా మపి దుర్లభామ్॥

తా॥ ఆతడు వానరశ్రేష్ఠుడగు హనుమంతుని సాక్షాత్కారమందుటవలన, ఆ హనుమంతునితోకను తాకుటవలనను యోగులకుకూడ లభింపని మోక్షమును దేహమును చాలించినవెంటనే పొందగలిగెను.

శ్లో॥ హత్వా త్రిశూలరోమాణం హనూమా న్వాయునందనః
యత్రాన తే మునివ్రాతాః తం దేశ మగమ త్పునః॥

తా॥ వాయుకుమారుడగు హనుమంతుడు త్రిశూల రోమరాక్షసుని సంహారించి మునిసమూహ మెచ్చుటనుండెనో ఆప్రదేశమునకు మరల వచ్చెను.

శ్లో॥ త మాగతం హరిం దృష్ట్వా మునయ స్సత్రయాజినః
అస్తువ న్పరమస్తోత్రైః స్తుత్యం స్తోత్రవిశారదాః॥

తా॥ ఆరీతిగా విచ్చేసిన హనుమంతుని సత్రయాగ మొనర్చెడు మునులు చూచి స్తోత్ర మొనర్చుటయందు దిట్ట లగుటవలన పొగడదగు స్వామిని గొప్పగొప్ప స్తోత్రములతో స్తుతించిరి.

సత్రయాగముని స్తుతి :-

శ్లో॥ భగవన్ దేవదేవేశ పురాణపురుషోత్తమ
ఆపన్నాఖిలలోకానాం త్వమేవ పరమా గతిః॥

తా॥ ఓభగవానుడా! దేవదేవా! పురాణపురుషు లందరిలో శ్రేష్ఠుడా! ఆపదలనందిన సమస్తలోకవాసులకు నీవే నిజముగ శరణ్యుడవు.

శ్లో॥ నజానీమో వయం నూనం త్రాతారం త్వాం జగత్పతే
అద్యప్రభృతి లోకాశ్చ సుఖినస్స్యు ర్న సంశయః॥

తా॥ ఓజగన్నాథా! రక్షకుడవగు నిన్ను మేము నిజముగా తెలిసికొనలేదు. నేటినుండి నిన్నందేహముగా లోకములన్నియు సుఖముగా నుండగలవు. ప్రజలందరు సుఖముగనుందురు.

శ్లో॥ అద్యప్రభృతి యాగాశ్చ ప్రవర్తంతే న సంశయః
ఇంద్రోఽపి హిత్వా సంత్రాసం రంస్యతే ప్రియయా సహ

తా॥ నేటినుండి యాగములన్నియు సంశయములేక నిర్వహింపబడగలవు. ఇంద్రుడుకూడ భయమునువీడి తన ప్రియురాలితో సుఖముగా క్రీడించగలడు.

శ్లో॥ యథా స్వమష్టదిక్పాలాః ప్రాప్స్యంతి స్వపదాని వై
తవ సందర్శనాన్నోఽద్య క్రతు స్సాంగో మహానభూత్॥

తా॥ అష్టదిక్పాలకు లేరీతిగా తమస్థానసంపదల నందుచున్నారో అట్లు నీదర్శనము వలన నేడు మాయజ్ఞము అంగసహితముగ ధన్యమైనది.

శ్లో॥ త్వమేవ యజ్ఞఫలదః భోక్తా చ ప్రభురవ్యయః
యజ్ఞానాంచ కృతం కించి త్ప్రమాదా దపి కామతః
తత్సర్వం ప్రీతయే భూయాత్ భవతో జగతాంపతే॥

తా॥ నీవే యజ్ఞఫలమునిచ్చువాడవు. యజ్ఞభోక్తవు, నాశరహితుడవగు సర్వసమర్థుడవును. ఓజగన్నాయకా! పొరపాటున కాని, కావలయునని కాని యజ్ఞమునందేకొలది యైన దోషమొనర్చినచో దానినంతను నీవు ప్రేమతో ననుగ్రహింపుము.

శ్లో॥ నమో నమః కారణకారణాయ
నిష్కారణా యాద్భుతవైభవాయ
భక్తప్రియా యామితవిక్రమాయ
వేదాంతవేద్యాయ నమో నమస్తే॥

తా॥ కారణములన్నిటికి కారణమైన నీకు నమస్కారము.

కారణారహితుడవు, అద్భుతమగు సంపదకలవాడవు భక్తియందు ప్రీతికలవాడవు, గొప్పపరాక్రమము కలవాడవు, ఉపనిషదాదులచే తెలియదగువాడవునైన నీకు మరలమరల నమస్కారము

శ్లో॥ ఇతిస్తుత్వా కపిశ్రేష్ఠం కశ్యపాద్యా మహర్షయః
సమాపితమఖాస్సర్వే ప్రాప్తవంతః పరాం ముదమ్॥

తా॥ అని వానరప్రముఖుడగు హనుమంతుని స్తుతించి కశ్యపాది మహర్షులు యజ్ఞమును పూర్తిగావించినవారై అందరు పరమానందమునందిరి.

శ్లో॥ స కింపురుషఖండస్య దర్శనం చకమే తతః
దిదృక్షు ర్నాగకన్యాం స్వాం ఉత్పలాక్షీం కపీశ్వరః॥

తా॥ కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు తనభక్తురాలు ఉత్పలాక్షి యనుపేరుగల నాగకన్యను చూడనెంచినవాడై అటుపిమ్మట కింపురుష ప్రదేశమును చూడనేగెను

శ్లో॥ ఇతి మునిమఖవిఘ్నం ధ్వంసయిత్వా హనూమాన్
ఋషివరనుతవృత్తో వేదవేదాంతరూపః
అసిసుతవధతుష్టై రాత్మవర్గై స్సమేతః
ఘనకుసుమపరీతే కాననే సంవివేశ॥

తా॥ ఇట్లు హనుమంతుడు మునులయజ్ఞమునకు విఘ్నముగ నున్న రాక్షసుని నాశమొనర్చి. మునిశ్రేష్ఠులచే కొనియాడబడిన వృత్తాంతముకల్గి. వేదములు, ఉపనిషత్తులచే తెలియదగు రూపముకలవాడై, అసిపుత్రుడగు త్రిశూల

రోమును సంహారముచే సంతసించు తనవారితోకలసి పండ్లు, పూవులతో బాగుగనిండియున్న వనమున సుఖముగనుండెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశరమైత్రేయసంవాదే త్రిశూలరోమ వధో నామ ఏకత్రింశత్పటలః

## ద్వాత్రింశత్పటలః

## నాగకన్యావృత్తాంత కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర మహాభాగ హనూమచ్చరితం శుభమ్
అన్యద్వాస్య పాపఘ్నం శ్రోతు మిచ్ఛామి సువత॥

తా॥ శ్రీమైత్రేయులవారడుగుచున్నారు. వ్రతనిష్ఠుండవగు ఓ పరాశరామహామునీ! పాపములు పోద్రోలునట్టియు శుభప్రదమైన హనుమంతుని చరితమును వేఱొకదానిని వినగోరుచున్నాను, కాన చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ మైత్రేయ మునిశార్దూల హనూమన్పవనాత్మజః
కింపురుషఖండేన శ్రీమాన్ కృతవాన్ కార్య మద్భుతమ్

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. మునిశ్రేష్ఠుండవగు ఓ మైత్రేయా! వాయుపుత్రుండును శోభాకరుండునగు హనుమంతుండు కింపురుషఖండమున అద్భుతమగు కార్యమొనర్చెను.

శ్రీ మైత్రేయః

శ్లో॥ కిం కార్యం కృతవాన్ తత్ర పరాశర తపోధన
విస్తరేణ తదాచక్ష్వ కృపా మయి తవాస్తి చేత్॥

తా॥ మైత్రేయులవారు మరల అడుగుచున్నారు. తపస్సే ధనముగాగల వాఁడవగు ఓ పరాశరమహాముని! అచ్చట హనుమంతుఁడేమి యొనర్చెను! తమకు నాయందు దయయున్నచో సవిస్తరముగ ఆవిషయమును చెప్పుఁడు.

శ్రీ పరాశరః

శ్లో॥ కశ్చిత్తత్రాస్తి పుంస్కాత్మా జ్ఞానీ పరమపావనః
సుశీల స్సత్యసంకల్పః సర్వభూతదయాపరః॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! ఆకింపురుషఖండమున జ్ఞానవంతుఁడు, పరమపవిత్రుఁడు, సత్శీలముకలవాఁడు, మంచిసంకల్పము కలవాఁడు ప్రాణులన్నిటియందు దయకలవాఁడునగు ఒకానొక పుణ్యాత్ముఁడుండెను.

శ్లో॥ తపస్వీ సర్వధర్మజ్ఞః యశస్వీ గుణవాన్ కృతీ
హనూమచ్చరణాంభోజ భక్తియుక్త స్సదాశుచిః॥

తా॥ ఆతఁడు మంచితపస్సుకలవాఁడు, సర్వధర్మములు తెలిసినవాఁడు, గొప్పగుణములుకలవాఁడు ధన్యుఁడు, హనుమత్పాదపద్మములందు భక్తికల్గి యుండువాఁడు, ఎప్పుడు పరిశుభ్రముగ నుండువాఁడును.

శ్లో॥ ఆర్ష్టిషేణానుజో ధీరో జితక్రోధో జితేంద్రియః
సుషేణో నామ గంధర్వో కుటుంబీ వేదపారగః॥

తా॥ఆతఁడు ఆర్ష్టిషేణునిసోదరుఁడు, మంచిధైర్యము కలవాఁడు, కోపమును జయించినవాఁడు పక్కటుంబీకుఁడు వేదమునంతను నేర్చినవాఁడు, ఆతఁడు సుషేణుఁడను పేరు గల గంధర్వుఁడు.

శ్లో॥ పరోపకారనిరత స్సర్వజనై రభిసన్నుతః
స వీతరాగో గంధర్వః పుష్పైః పత్రైః ఫలై శ్శుభైః॥

తా॥ ఆతఁడు పరోపకారమునే ఎప్పుడు నొనర్చువాఁడు, సర్వజనులచే నుతింపబడువాఁడును, ఆరాగముక్తుఁడగు గంధర్వుఁడు శుభప్రదములగు పుష్పములతోను, ఆకులతోను, ఫలములతోను,

శ్లో॥ పంచామృతై ర్దివ్యతోయై శ్చందనై ర్మణిభూషణైః

తా॥ పంచామృతములగు పాలు, పెరుగు, వెన్న, తేనె జలము మున్నగువానితోను, అర్చనార్హమగు నీటితోను, మంచిగంధములతోను, మణిభూషణములతోను,

శ్లో॥ సత్కర్మభి శ్చామిత దివ్య సంస్తవైః
తపోభి రాశ్చర్యకరై స్సుదుష్కరైః
త్రిధా ప్రపూజనై ర్దానై ర్మహద్భిః
హోమనై ర్మహద్భి ర్ధ్యానై రసంతైః॥

తా॥ సత్కర్మలతోను, పెక్కు దివతస్తోత్రములతోను, ఆశ్చర్యకరములు, కష్టసాధ్యములునగు తపశ్చర్యలతోను, ముప్విధముల పూజలతోను. గొప్పదానములతోను, గొప్పహోమములతోను; అనంతములగు ధ్యానములతోను,

శ్లో॥ నైవేద్యై ష్షడ్రసోపేతైః భక్ష్య భోజ్య సమన్వితైః
తథా కర్పూరతాంబూలైః హనుమన్తం భజన్ సదా॥

తా॥ ఉప్పు, పులుపు, తీపి కారము, చేదు, ఒగరు, అను ఆరు రుచులతో కూడి పెక్కు పిండివంటలు తినదగినవానితో కూడిన నైవేద్యములతోను, కర్పూర తాంబూలములతోను ఎల్లప్పుడు హనుమంతుని సేవించుచు నుండెను.

శ్లో॥ తస్మిన్కాలే మహాపుణ్యా నాగకన్యా పతివ్రతా
దేవతారాధనపరా సుశీలా మంజుభాషిణీ॥

తా॥ ఆకాలమున మిక్కిలి పుణ్యాత్మురాలు, నాగ కన్య, పతివ్రత, దేవతారాధన తత్పర, మంచి శీలముగలది, చక్కగ మాటాడునది,

శ్లో॥ సత్కర్మనిరతా తన్వీ సర్వభూతహితే రతా
సర్వలక్షణ సంపన్నా సర్వాభరణ భూషితా॥

తా॥ మంచిపనులయందే నిమగ్నమై యుండునట్టిది, చక్కని అవయవములుకలది, సర్వప్రాణులమేలు నందిష్టము కలది, మంచిసాముద్రికాది లక్షణములుకలది, సమస్తము లగు ఆభరణములతో నలంకరింపబడినది,

శ్లో॥ సుముఖీ పూర్ణసర్వాంగీ సుకేశీ తను మధ్యమా
కాచి న్నామ్నా చోత్పలాక్షీ నాగలోకేఽస్తి భావినీ॥

తా॥ ప్రసన్నమగు ముఖముకలది, నిండగు అవయవ సంపత్తికలది, మంచి కేశసంపదకలది, సన్నని నడుముకలది ఉత్పలాక్షి యను పేరుగల ఒకకాంత నాగలోకమునకలదు.

శ్లో॥ సా భీతా రక్తరోమాఖ్య రక్షసా క్రూరకర్మణా
గంధర్వనాయకం దేవీ సుషేణం శరణం గతా॥

తా॥ ఆనాగకన్య రక్తరోముఁడను పేరుగల క్రూరాత్ముఁడగు రాక్షసునివలన భయపడినదై గంధర్వనాయకుఁడగు సుషేణుని శరణు వేడెను.

శ్లో॥ ఉవాచ వచనం శ్లాఘ్యం సర్వలోక సుఖావహమ్
త్రికాలవేద సర్వజ్ఞ సుషేణ సుగుణాకర॥

తా॥ సర్వలోక ప్రజలకు సుఖమునిడునట్టి, కొనియాడఁదగిన సుషేణునితో ఆమె ఇట్లనెను. భూతభవిష్యద్వర్తమాన విషయములన్నింటిని ఎఱిఁగినవాఁడా! సర్వము తెలిసినవాఁడా! మంచిగుణములు కలవాఁడా! ఓసుషేణా!

శ్లో॥ కృతార్థోఽస్మి మహాయోగిన్ త్వత్పాదాంభోజ దర్శనాత్
శ్రుణు గంధర్వ! మద్వాక్యం అభయప్రద! సువ్రత!

తా॥ ఓమహాయోగీ! నీ పాదపద్మములను సందర్శించుటచే కృతార్థురాలనైతిని. ఓఅభయదాతా! మంచివ్రతము కలవాఁడా! గంధర్వరాజా! నా మాటను వినుము.

శ్లో॥ యక్ష కిన్నర గంధర్వ సిద్ధవిద్యాధరైః స్సురైః
రాక్షసైరపి దుర్ధర్ష సిరంకుశ పరాక్రమః॥

తా॥ యక్షులకు, కిన్నరులకు, గంధర్వులకు, సిద్ధులకు, విద్యాధరులకు, దేవతలకు, రాక్షసులకును జయింపశక్యము కానివాఁడు తిరుగులేని పరాక్రమముకలవాఁడునగు

శ్లో॥ రక్తరోమాఖ్యో దనుజో కామరూపోఽతిదారుణః
నాగలోకం సమాగత్య నాగాన్ సంపీడ్య తేజసా॥

తా॥ రక్తరోముఁడను పేరుకల, కోరినరూపము ధరింపఁగల భయంకరుఁడగు రాక్షసుఁడు నాగలోకమునకు వచ్చి తనబలముచే సర్పములను పీడించువాఁడై

శ్లో॥ అనంతబల సంపన్నః పంచబాణవశం గతః
గృహీతకామో మాం దృష్ట్వా బలాత్కారేణ పాపధీః॥

తా॥ అంతులేని బలము కల్గినవాఁడై, మన్మథునికి వశుఁడై నన్ను చూచి పాపబుద్ధికల యాతఁడు బాలాత్కారముగా పరిగ్రహింపనెంచెను.

శ్లో॥ జ్ఞాత్వాఽహం భీతిసంయుక్తా రక్తరోమ్ణో మనస్తథా
శరణ్యానన్యశరణా త్వామస్మి శరణం గతా॥

తా॥ ఆరీతిగా రక్తరోముని మనస్సును తెలిసికొని భయమందినదాననై ఆర్తురాలనై ఇతరులెవ్వరు దిక్కు లేని దాననై నిన్ను శరణు జొచ్చితిని.

శ్లో॥ రాక్షసస్య వధోపాయో యథా భువనరక్షణమ్
నిర్భయత్వం మమ యథా తదా చక్ష్వ మహామతే॥

తా॥ ఓపుణ్యాత్మా! లోకములకు మేలు కలుగునట్లు నాకు భయముపోవునట్లును రాక్షసునివధించు నుపాయ మేది కలదో దానిని నాకు చెప్పవలసినది

సుషేణః

శ్లో॥ శ్రుణుష్వోత్పలాక్షి మద్వాక్యం సర్వభీతి నివారణమ్
సర్వశ్రేయస్కరం తేఽద్య మనసః ప్రీతికారణమ్

సుషేణుఁడు చెప్పుచున్నాఁడు—

తా॥ ఓ ఉత్పలాక్షీ! సమస్తభయములను పోఁగొట్టునట్టియు, అందఱకు క్షేమము నొసంగునట్టియు; నేఁడు నీమనస్సునకు ఆనందదాయకమగు మాట చెప్పెదను వినుము

శ్లో॥ పార్వతీగర్భ సంభూతః కేసరీ ప్రియనందనః
ధీమా నుదారో నిశ్శంకో సర్వభూతదయాపరః॥

తా॥ పార్వతీనందనుఁడు; కేసరియొక్క ప్రియసుతుఁడు బుద్ధిమంతుఁడు, గొప్పవాఁడు, జంకులేనివాఁడు సమస్త ప్రాణికోటియందు దయగలవాఁడు.

శ్లో॥ సర్వలోకాధిప శ్శ్రీమాన్ కామరూపో జితేంద్రియః
దైతేయగణ దర్పఘ్నః మనోవేగో మహాబలః॥

తా॥ సమస్తలోకములకు అధిపతి, శోభాసంపత్తి కలవాఁడు; కోరినరూపమును దాల్పఁగలిగినవాఁడు ఇంద్రియనిగ్రహము కలవాఁడు, రాక్షసులగర్వము నణచువాఁడు, మనోవేగము కలవాఁడు, గొప్పబలసంపద కలవాఁడు,

శ్లో॥ వేదవేద్యో యజ్ఞభోక్తా పరందైవం పరంతపః
దుష్టనిగ్రహ రక్తశ్చ శిష్టరక్షాపరో హరిః॥

తా॥ వేదముచే తెలియఁదగువాఁడు, యజ్ఞహవిస్సును భుజించువాఁడు, పరదైవతమైనవాఁడు, శత్రువుల నాశమొనర్చువాఁడు, దుష్టులను నాశమొనర్చుటయందిష్టము కలవాఁడు, మంచివారిని రక్షించుటయందు నిమగ్నుఁడై యుండువాఁడునగు వానరశ్రేష్ఠుడు.

శ్లో॥ వజ్రదేహో మహాకాయో హ్యాపన్నజన రక్షకః
హనుమా నితి విఖ్యాతో సర్వదేవ శిఖామణిః॥

తా॥ వజ్రముతో లేదా వజ్రాయుధముతో సమాన మైన దేహముకలవాఁడు 'వజ్రం వజ్రేణాభిద్యతే' అని వజ్రము చాల గట్టిదిగా తెలియుచున్నది. పెద్దశరీరముగలవాఁడు, శరణువేడిన వారిని రక్షించువాఁడు, సర్వదేవతలకు తలమాని కము వంటివాఁడు హనుమంతుఁడని కీర్తింపబడువాడునూ, నై సుషేణస్తుతియందు శ్రీ పార్వతీగర్భ సంభూతాయ నమః అని మొదలుగా సర్వదేవ శిఖామణయేనమః అనువఱకు నిరువదియైదు నామములను గుర్తింపవచ్చును.

శ్లో॥ తన్మూలమంత్రం శుక్లాఖ్యం ప్రవదామ్యుత్పలాక్షి! తే
తస్మాత్త్వేష్టకామార్థ సిద్ధి శ్శీఘ్రం భవిష్యతి॥

తా॥ ఆస్వామియొక్క మూలమంత్రమును శుక్లనామ కమును ఓ ఉత్పలాక్షి! నీకు తెల్పెదను. దానివలన నీకు వెంటనే కోరినకోరిక తీరును.

శ్లో॥ తన్మంత్ర జపసామర్థ్యాత్ సుఖవానస్మ్యహం చిరాత్
మద్వాంఛితాని సర్వాణి సఫలాని భవంత్విహ॥

తా॥ ఆమంత్రమును జపించుటవలని సామర్థ్యముచే ఎప్పుడు నేను సుఖముగనున్నాను దానిచే నాకోరికలన్నియు సఫలములగుచున్నవి.

శ్లో॥ సాక్షాత్కారో హనూమంతః భవేన్మమ ముహుర్ముహుః

తా॥ నాకు పలుమార్లు హనుమంతుని సాక్షాత్కా రము కగును.

శ్లో॥ ఇత్యుక్త్వా నాగకన్యాయై సుషేణ శ్శ్రీహనూమతః
ఉత్పలాక్ష్యై మూలమంత్రం దదౌ గంధర్వసత్తమః॥

తా॥ అని పల్కి గంధర్వశ్రేష్ఠుడగు సుషేణుడు నాగకన్యయగు ఉత్పలాక్షికి శ్రీ హనుమంతుని మూలమంత్రమును ప్రసాదించెను.

శ్లో॥ ఆదాయ హనుమన్మంత్రం సుషేణా న్నాగకన్యకా
నిత్యం జపపరా తస్య సమీపేన బభూవహ ॥

తా॥ సుషేణునినుండి నాగకన్య హనుమన్మంత్రమును గ్రహించి నిత్యము జపించుచు సుషేణుని సమీపమున కాకయుండెను

నాగకన్యకాగద్య-

గ. శ్రీమన్నిరంతర కరుణామృతసారవర్షిణం పింగళాక్షం అమోఘం మహేంద్రాయుధ క్షతాంచిత హనూహనుం అరుణాధర బింబ భూషిత ముఖచంద్రమండలం ఆతప్త కార్తస్వర భాస్వర కాంతిచ్ఛటాకాంతి కలిత చూడా విరాజితం అప్రతిమ దివ్య మాణిక్యకుండల మండిత గండభాగం అసమాన మానసీయ రమాకాంత కరకమల కీలిత పాంచజన్యబంధు కంబు ధరం ఐరావత నాసాదండ సముత్త దీర్ఘభుజార్గళం అనన్యసాధారణ సంకల్ప సంభవాస్థాన పీఠపరిణాహి బాహ్యాంతరం అమూల్య పీతాంబరాలంకృత కటిప్రదేశం అనవరత వినతజన మనోరథ సాధక పాదయుగళం ఉష్ట్రవాహనం అమరగంగానదీ పరివేష్టిత హాటకాచలావ దీర్ఘలాంగూల గంగ దుత్తుంగ మంగళాంగకం అంజనానంద వర్ధనం అమరోర్ధ్వపుండ్రం తదుపరి కర్పూర సమ్మిశ్రిత శుభ్రవిభూతి ధారణం యజ్ఞోపవీత

తులసీ పద్మాక్ష రుద్రాక్షమాలాభిరామం శ్రీరామచంద్ర చరణారవింద సంస్థిత హృదయారవిందం అఖిలకల్యాణ గుణవంతం శ్రీ హనూమంత ముపాస్మహే॥

తా॥ సంపద్యుక్తుడై ఎల్లప్పుడు దయయును సత్ప్రీతి మును కురిపించువానిని, పింగళవర్ణముకల కండ్లుగలవాని గొప్పదగు వజ్రాయుధపు దెబ్బచే ఒప్పెడి దవుడకలవానిని, ఎర్రని క్రిందిపెదవితో ప్రకాశించెడి చంద్రమండలమువంటి ముఖముకలవానిని బాగుగా, పుటము పెట్టిన బంగారము యొక్క కాంతితోను భాస్వర కాంతి సమూహములతోడను సమానమైన కాంతిగల జుట్టుతో కూడినవానిని, సాటిలేని దివ్యములగు మాణిక్యములు పొదిగిన కుండలములతో ప్రకాశించు చెక్కిలి ప్రదేశము కలవానిని. ఎనలేని గౌరవముందిన లక్ష్మిదేవియొక్క భర్తయగు విష్ణువుయొక్క చేతియందుండు పాంచజన్యము అను శంఖమునకు బంధువనదగిన శంఖమువంటి మెడకలవానిని ఇంద్రుని పట్టపుటేనుగగు ఐరావతముయొక్క దండమువంటి తుండమునవలె మించిన పొడుగగు భుజములతో కూడిన వానిని సామాన్యులకు సాధ్యముగాని సంకల్పమువలన నేర్పడిన ఆస్థానపీఠమువలె విశాలమైన ఎదురొమ్ముకలవానిని, వెలలేని పట్టుబట్టలచే అలంకరింపబడిన కటిప్రదేశము కలవానిని, ఎల్లప్పుడు నమ్రులై నమస్కరించు జనుల కోర్కెలను తీర్చెడి పాదద్వయము కలవానిని. ఒంటె వాహనము కలవానిని; ఆకాశగంగచే చుట్టబడిన మేరుపర్వతమువలె పొడవైన తోకతో చుట్టబడి ఒప్పెడి గొప్ప శుభప్రదమగు దేహముకలవానిని;

అంజనా దేవికి ఆనందము కల్గించువానిని; స్వచ్ఛమగు నిలువుబొట్టు కలవానిని; దానిపై కర్పూరముతో కూడిన శుభ్రమగు విభూతిని ధరించినవానిని; జందెముతో తులసీ మాల పద్మాక్షమాల రుద్రాక్షమాలతో ప్రకాశించు వానిని; శ్రీరామచంద్రుని యొక్క పాదపద్మములందు లగ్నమైన హృదయపద్మముకలవానిని; సమస్తములకు శుభ ప్రదములౌ గుణములతో కూడియున్న వానిని హనుమంతుని ఉపాసించుచున్నాము.

(కాలనియమము లేక ఈగద్యను భక్తులు పఠించ వచ్చును, తత్ఫలము నిచ్చును)

శ్లో॥ తస్మిన్కాలే మహాబాహో వరదో భీమవిక్రమః
పరివారయుతో ధీరో సామాత్యో భక్తవత్సలః॥

తా॥ అంత నాసమయముననే ఉన్నతములగు భుజములు కల్గునట్టియు; వరప్రదుడైనట్టియు; శత్రుభీతావహమగు పరాక్రమము గల్గినట్టియు ధైర్యశాలి భక్తులయందు వాత్సల్యముగల హనుమంతుడు మంత్రులతోడను; పరివార జనులతోడను కూడినవాడై;

శ్లో॥ సర్వాలంకార సంయుక్తం ఉష్ట్ర మారుహ్య వేగవాన్
త్రిమూర్త్యాత్మా మహావీరః హనుమాన్ ససువర్చలః॥

తా॥ మంచివేగముకలవాడును; బ్రహ్మ విష్ణు శివాత్మకుడు గొప్ప పరాక్రమవంతుడునగు హనుమంతుడు దేవేరియగు సువర్చలతో కలసి ఒంటెనెక్కినవాడై;

శ్లో॥ భక్తసంరక్షణ ధియా భగవా న్వాయునందనః
సమ్ముఖే నాగకన్యాయాః ప్రాదురాసీ న్మహాకపిః

తా॥ భగవంతుడగు వాయుసుతుడగు కపిశ్రేష్ఠుడు భక్తులను రక్షించు ఆలోచన కలవాడగుటవలన నాగకన్య యెదుట ప్రత్యక్షమయ్యెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పంచముఖ హనుమన్మంత్ర వివరణే పరాశర మైత్రేయ సంవాదే నాగకన్యాయై హనుమత్ప్రాదుర్భావం నామ ద్వాత్రింశ త్పటలః

## త్రయస్త్రింశ త్పటలః

## ర క్త రో మ వ ధ

శ్రీ మైత్రేయః

శ్లో॥ అథాగ త్యాంజనాసూనుః నాగకన్యాం కి ముక్తవాన్
ప్రతిజ్ఞాతం చ కిమితి తదాచక్ష్వ కృపానిధే॥

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు ఓ దయామయుడా! పరాశరమహాముని! పిమ్మట ఆంజనేయుడువచ్చి నాగకన్యతో నేమి చెప్పెను? ఆ హనుమంతునిచే నేమి ప్రతిజ్ఞ చేయబడినది ఈ విషయములను తెలుపవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ తత్సర్వం కథయిష్యామి శ్రుణు సావ్యమనా మునే!

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు ఓ మహాముని! ఆ వృత్తాంతమంతయు చెప్పుచున్నాను. మెల్లోకటాలోచించక వినవలసినది.

శ్లో॥ నాగకన్యా సముత్థాయ సాష్టాంగం ప్రణిపత్య సా
తుష్టావ శ్రీ హనూమంతం వచోభి ర్వేదగోచరైః॥

తా॥ ఆ నాగకన్య తేని సాష్టాంగనమస్కారముల నొనర్చినదై వేదోక్తములగు వాక్యములతో శ్రీ హను మంతు స్తోత్ర మొనర్చెను.

నాగకన్యకాస్తుతి

శ్లో॥ ఆంజనేయ ప్రభో! దేవ! దేవ వానరప త్తమ!
వేదవేద్య మహాయోగిన్ పురాణపురుషోత్తమ॥

తా॥ ఓ దేవా! ఆంజనేయప్రభూ! దేవతానాయకా! వానరశ్రేష్ఠ! వేదములచే తెలియఁదగువాఁడా! మహాయోగీ! పురాణపురుషులలో శ్రేష్ఠుఁడా!

శ్లో॥ జగద్రూప జగన్నాథ జగదానందకారణ!
పంచానన! పరంజ్యోతి జ్ఞానానందమయ ప్రభో!

తా॥ జగత్స్వరూపా! జగన్నాయకా! జగత్తునకు ఆనందకారణమైనవాఁడా! పంచముఖహనుమన్! పరంజ్యోతి! జ్ఞానమయుఁడా ఆనందమయుఁడా! సర్వసమర్థుఁడా!

శ్లో॥ సర్వభూతాంతరంగస్థ సర్వబ్రహ్మాండ నాయక!
పరాపరజ్ఞ! చిద్రూప! కపివీర! నమోఽస్తు తే॥

తా॥ సమస్త ప్రాణికోటియొక్క హృదయములందుండువాఁడా! బ్రహ్మాండమంతటికి నాయకుఁడా! సర్వజ్ఞా! జ్ఞానరూపా! కపివీరుఁడా! నీకు నమస్కారము. (ఆంజనేయ ప్రభవేనమః మొదలు కపివీరాయనమః వఱకు 18 నామము లగును)

శ్లో॥ ఏవం శ్రుత్వా నాగకన్యాకృతం స్తోత్రం హరీశ్వరః
ప్రీతో ఽబ్రవీ మత్పలాక్షీం దీనాం నమ్రముఖాంబుజామ్॥

తా॥ ఇట్లు నాగకన్యచే చేయబడినస్తోత్రము హనుమంతుఁడు విని సంతృప్తి చెందినవాఁడై దీనురాలు, ముఖపద్మమును వంచియున్నదియైన ఆబాలాక్షినిచూచి ఇట్లు పల్కెను.

శ్రీ హనుమాన్

శ్లో॥ కస్మాద్భీతిః? కథం దైన్యం? దేశత్యాగం కథం? తవ
కి మభీష్టం? తత్కరోమి సత్యం వద వరాననే!

తా॥ శ్రీహనుమంతులవారనుచున్నారు. ఓ సుందరముఖీ! నీకు భయమెవరివలన కల్గినది? ఇంతటి దీనస్థితి ఏల? నీదేశము నెందుకు వీడవలసివచ్చినది? నిజముగ నీ కోర్కె ఏదియో తెల్పుము. నెరవేర్చెదను.

నాగకన్యకా

శ్లో॥ స్వామి న్నార్తజనాధార! రక్తరోమో మహాఽసురః
నాగలోకం సమాసాద్య తత్రత్యా నఖిలాన్ జనాన్॥

తా॥ స్వామీ! దీనజనులకాధారమైనవాఁడా! రక్తరోముఁడను గొప్పరాక్షసుఁడు నాగలోకము చేరి అచ్చటి సమస్త జనులను,

శ్లో॥ స్త్రీ బాల వృద్ధాన్ సంపీడ్య గర్వోత్కర్ష సమన్వితః
మహా దైశ్వర్య సంపన్నాం నాగలోక నివాసిభిః
సదా సంసేవితాం పూజ్యాం సిద్ధ చారణ పన్నగైః॥

తా॥ స్త్రీలను, బాల వృద్ధులను సైతము పీడించి గర్విష్ఠుఁడై గొప్ప ఐశ్వర్యసంపదకల్గినట్టి, నాగలోకనివా

సులచే ఎల్లప్పుడు సేవింపబడునట్టి, సిద్ధ, చారణ, నాగ జాతులచే పూజింపబడునట్టి,

శ్లో॥ నాగలోకాధిపాం దుష్టో మాం దృష్ట్వా మదనాతురః
నీచవృత్త్యా దురాచారః పాపబుద్ధిం తదాప సః॥

తా॥ నాగలోకమునకు నాయకురాలనైన నన్ను ఆ దుష్టుడు చూచి కామవాంఛ కలవాడై నీచవర్తనతో దుష్టచేష్టలుకలవాడై అప్పుడువాడు పాపబుద్ధిని పొందెను.

శ్లో॥ అతః పలాయమానా ఽహం సుషేణం శరణం గతా
ఆశ్వాస్య సోఽపి మాం దీనాం త్వన్మంత్ర ముపదేష్టవాన్

తా॥ అందుచే పరుగిడినదాననై నేను సుషేణుని శరణుజొచ్చితిని. అతడు దీనురాలగు నన్ను ఓదార్చి నీ మంత్రము నుపదేశించెను.

శ్లో॥ తన్మంత్ర జపసామర్థ్యాత్ మత్పూర్వసుకృతా జపి
త్వ త్పాదయుగళం దృష్టం బ్రహ్మాదీనాం సుదుర్లభమ్।

తా॥ నీమంత్రమును జపించిన సామర్థ్యమువలన నా పూర్వజన్మ సుకృతమువలనను బ్రహ్మాదులకుకూడ లభించని నీపాదద్వయ సందర్శనము లభించినది.

శ్లో॥ మమ రాజ్యసుఖావాప్తిః నాగవిష్టపవాసినామ్
యథా సుఖంచ భవతి తథా వద దయానిధే!
ఇత్యుక్త్వా శ్రీహనూమతః పాదయో ర్నిపపాదహ॥

తా॥ ఓదయామయుడా! నాకు, మా నాగలోక వాసులకును రాజ్యసుఖము యోగ్యముగా లభించునట్లు

పలికి అనుగ్రహించెను. అని పలికి నాగకన్యయగు ఉత్ప లాక్షి శ్రీహనుమంతుని పాదములపై పడెను.

శ్రీహనుమాన్

శ్లో॥ ఉత్తిష్ఠ నాగకన్యే! త్వం భయం త్యజ మహాసురాత్
కుర్యామభీష్టసిద్ధిం త్వాం దేవ్యాగచ్ఛ మయా సహ॥

తా॥ శ్రీహనుమంతులవారనుచున్నారు. ఓనాగకన్యా! లెమ్ము: ఆ రాక్షసునివలన భయము వీడుము: నీ కోర్కెను తీర్చగలను. ఓ దేవీ! నాతోపాటు రమ్ము.

శ్లో॥ స హోత్పలాక్ష్యా హనుమాన్ ప్రాప్య తన్నాగవిష్టపమ్
రుధిరస్రావ రోమాణ రక్తవర్ణ విలోచనమ్॥

తా॥ హనుమంతుడు ఉత్పలాక్షితోగూడి ఆ నాగలోకమును చేరి ఎఱ్ఱని కండ్లుగల రక్తరోముని

శ్లో॥ శైలనాయక సంకాశ శరీరం ఘోరరూపిణమ్
దంష్ట్రాకరాళ వదనం సర్వాయుధ కరద్వయమ్॥

తా॥ పర్వతముతో సమానమైన శరీరముకలవానిని, భయంకరమైన ముఖముకలవానిని; సమస్తములగు ఆయుధములు రెండుచేతులయందు కలవానిని;

శ్లో॥ దుష్కర్మశీలం బ్రహ్మాండ వ్యాపీ గాఢ భనిస్వనమ్
చండప్రతాపినం యక్ష గంధర్వామర రక్షసామ్॥

తా॥ దుష్కర్మల నాచరించు గుణము కలవానిని; బ్రహ్మాండమంతట వ్యాపించునట్లు గాఢకంఠము కలవానిని తీక్ష్ణమగు ప్రతాపముకలవానిని; గంధర్వులకు; దేవతలకు, రాక్షసులకును

శ్లో॥ దుర్ధర్షం నీతిరహితం జ్ఞానహీనం మహాసురమ్
తం దృష్ట్వా రక్తరోమాణం ఆశ్చర్యకరమానసః॥

తా॥ తిరస్కరింప శక్యము కానివానిని; నీతిలేని వానిని; జ్ఞానహీనుఁడగు గొప్పరాక్షసుఁడైన రక్తరోమ రాక్షసుని చూచి మనసునందెంతయో ఆశ్చర్యమంది

శ్లో॥ సమీపస్థా ముత్పలాక్షీం అబ్రవీ త్ప్లవగోత్తమః

తా॥ వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు సమీపమున నున్న ఉత్పలాక్షితో నిట్లనెను

శ్లో॥ నానాశైలేషు లోకేషు నానారణ్యేషు మానినీ!
సంకటేషు మహాయుద్ధే వ్యాఘుకష్ట పరాయణమ్।

తా॥ ఓ కాంతా! వివిధ పర్వతములందు; లోకము లందు; అనేక అరణ్యములందును వివిధ బాధలందును; యుద్ధములందును పాపపూర్ణుడైనవానిని;

శ్లో॥ భీమాకారం భీమశౌర్యం వికృతం లోకకంటకమ్
గర్వోన్నత్త మహాకాయం మహోగ్రం రాక్షసాధమమ్॥

తా॥ భయంకరమైన ఆకారము కలవానిని; భీకర పరాక్రమము కలవానిని; వికారరూపుని; లోకమునకు కష్ట మిడువానిని; గర్వముచే అధిగమించు పెద్ద దేహము కల వానిని; భయంకరుని; నీచరాక్షసుని

శ్లో॥ ఏవం విధం యాతుధానం న పశ్యామి కదాచన

తా॥ ఇటువంటి దుష్టరక్కసుని ఎప్పుడునూ చూడ లేదు.

శ్లో॥ సర్వేషామి త్యసాధ్యం తం మత్వా దైత్యం కపీశ్వరః
హంతుకామో యయౌ తస్య సమీపం దుష్టరక్షసః

తా॥ ఈరీతిగా ఎవరికి సాధ్యుడు కాడని ఆ రాక్షసుని తలచినవాడై హనుమంతుడు వానిని చంపనెంచి దుర్మార్గుడగు ఆ రాక్షసుని సమీపమునకు వెడలెను

శ్లో॥ ఆగచ్ఛంతం హనూమంతం గతభీ శ్చండవిక్రమః
రక్తరోమా మహావీరః ప్రోవాచ కఠినోక్తిభిః।

తా॥ అటు వచ్చెడి హనుమంతునితో భయములేనివాడు; తీక్ష్ణ పరాక్రమము కలవాడు, మహావీరుడు అగు రక్తరోముడు కఠినవాక్యములతో ఇట్లనెను,

శ్లో॥ అహో వానరదుర్బుద్ధే కథ మాగమ్యతే త్వయా
బ్రహ్మాదీనా మసాధ్యం మాం న జానాసి హరీశ కిం?

తా॥ ఓ దుష్టబుద్ధికల వానరుడా! నీవెందుకు వచ్చుచున్నావు? ఆంజనేయా! బ్రహ్మాదులకు కూడ జయింప సాధ్యుడనుకాని నన్ను తెలిసికొనుట లేదా?

శ్లో॥ ఇ త్యేవం రక్తరోమాఖ్య యాతుధానస్య భాషితమ్
శ్రుత్వా కోపం హనుమాన్ స్థితో రుద్ర ఇ వానరః॥

తా॥ అను ఆ కఠినములగు రక్తరోమనామక రాక్షసుని వాక్యములు విని హనుమంతుడు అపరరుద్రునివలె నుండెను.

శ్లో॥ నానావిధం చిత్రయుద్ధం కపితో రక్షసావహా
కృత్వా వాలేన సంబద్ధ్వా జవే నాభిజఘానహా॥

తా॥ అట్లు కోపగించినవాడై ఆ రాక్షసునితో వివిధ

ములగు విచిత్రయుద్ధము లొనర్చి వానిని తోకతో చుట్టి వేగముగా కొట్టెను

శ్లో॥ హనుమత్తాడితో రక్తరోమాఖ్యో దనుజో రుదన్
భూకంపం జనయన్ భూమౌ పపాతేవ కులాచలః॥

తా॥ హనుమంతునిచే కొట్టబడిన రక్తరోముడనురాక్షసుడు భూమి కంపించునట్లు బిగ్గరగా ఏడ్చుచు భూమిపై కులపర్వతమువలె పడెను,

శ్లో॥ గతాసుం రక్తరోమాణం కృత్వా విజయవా నభూత్
తస్మిన్నా కాలే పుష్పవృష్టిం ముముచు స్సురత్తమాః॥

తా॥ హనుమంతుడు రక్తరోముని ప్రాణములు తీసి విజయశీలుడయ్యెను, ఆసమయమున దేవతాశ్రేష్ఠులు పుష్పవర్షము కురిపించిరి.

శ్లో॥ యక్ష పన్నగ గంధర్వాః నారదాద్యా స్సురర్షయః
తుష్టువు శ్శ్రీహనూమంతం జయశ్రీమంత మవ్యయమ్॥

తా॥ యక్ష నాగ గంధర్వులు, నారదాది దేవర్షులు జయలక్ష్మిని స్వీకరించిన శాశ్వతుడగు శ్రీ హనుమంతుని కొనియాడిరి,

శ్లో॥ నాగకన్యే! శ్రేష్ఠతమా మద్భక్తానా మపి ధ్రువమ్
ఇత్యుక్త్వా హనుమాన్ తస్మై సర్వాభీష్టవరాన్ దదౌ॥

తా॥ అంత హనుమంతుడు నాగకన్యతో ఓ నాగకన్యా! నిజముగా నీవు నా భక్తులలో ఉత్తమురాలవై తివి అని ఆమెకిష్టమగు వరముల నన్నిటిని ఇచ్చెను.

శ్లో॥ అగణితమహిమా హి కన్యకాం తామ్
మునివర! పన్నగవిష్టపేఽభిషిచ్య
వనచరకులశేఖరో హనూమాన్
ప్రముద మవాప శుభా మవాప్య పంపామ్॥

తా॥ ఓ మైత్రేయమహామునీ! చెప్పనలవికాని మహిమ కలవాడు, వానరులలో శ్రేష్ఠుడు అగు హనుమంతుడు ఆ నాగకన్యను నాగలోకమున చేర్చి శుభప్రదమగు పంపానదిని చేరినవాడై మిక్కిలి సంతసమున నుండెను.

శ్లో॥ తత్ర పంపాసరస్తీరే కంచిత్కాలం విహృత్య సః
త్యక్తుం పరిచితాం పంపాం నాలం స్వాంతవినోదినీమ్॥

తా॥ ఆతడా పంపాసరోవరము ఒడ్డున కొంతకాలము విహరించి తన మనస్సున కానందము కల్గించునదై పరిచితమై యున్న పంపానదిని వీడుటకు శక్తుడు కాలేను,

శ్లో॥ స్వర్ణరంభా వనద్భాస పరితోపత్యకం బలాత్
ఇయేష సపరీవారః స గంతుం గంధమాదనమ్॥

తా॥ ఆతడు బంగరు అరటివనములతో ప్రకాశించు చుట్టునున్న నీరుకల గంధమాదన పర్వతమునకు పరివారముతో కూడి వెళ్ళుటకు ఆలోచించెను.

శ్లో॥ తతః కపికులాగ్రణీః శిఖరీశేఖర కాదళమ్
స్ఫురత్ఫల సుపాళికా సవవరభ్రధారామృతమ్
నదత్పికకులావళి శ్రుతిముఖ స్ఫుట రావిణం
జగామ కరభార్జునం సమధిరుహ్య వాహోత్తమాన్॥

తా॥ పిమ్మట సేనాసమేతుడై వానరవీరుడగు హనుమంతుడు ఫలరసము లమృతవర్షముగ కురియునట్టి, చక్కగ పాడెడి కోకిలలు కల గంధమాదన పర్వతమునకు వాహోత్తమమగు ఒంటెనెక్కి వెడలెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే రక్తర్గో శుభవధోనామ త్రయస్త్రింశత్పటలః

## చతుస్త్రింశత్పటలః

## సుముఖచరిత్ర కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర నమస్తేఽస్తు భగవన్ కరుణాకర !

సప్తాక్షరీప్రభావం మే కథయ త్వం హనూమతః॥

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు భగవ ద్రూపుడవు. దయానిలయుడవు అయిన ఓ పరాశర మహా మునీ! నీకు నమస్కారము నీవు నాకు శ్రీ హనుమంతుని సప్తాక్షరీమంత్ర ప్రభావమును చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ మూర్తిత్రయాత్మకం యస్య ప్రణవం ప్రథమాక్షరః

మోక్షాయ కల్పతే భూయః ముముక్షూణాం మహాత్మనామ్

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఏ హనుమన్మంత్రమునకు ప్రథమాక్షరముగా త్రిమూర్త్యాత్మకమైన

ప్రణవము 'ఓం' అనునది కలదో అది మోక్షకాంక్షులగు మహాత్ములకు మోక్షము నీయగలది.

శ్లో॥ సర్వసంపత్ప్రదం నౄణాం ద్వితీయాక్షర మిష్యతే
లక్ష్మీకళాత్మకం వర్ణం శ్రీకార మితి విశ్రుతమ్॥

తా॥ నరులకు సమస్తసంపదలు ఇయ్యగల్గినదిగా రెండవ అక్షరముగా లక్ష్మీకళాత్మకమగు 'శ్రీ' అను వర్ణము తెలియబడుచున్నది.

శ్లో॥ విరాట్స్వరూప సంకాశం హత్యాకోటి శతాని చ
తృతీయ మక్షరం హన్తి హకార మితి గీయతే॥

తా॥ ఆదిదేవుని రూపముతో సమానమై వందల కోట్ల హత్యల పాపమును పోద్రోయజాలినదిగా మూడవ అక్షరము 'హ' కారముగా నుతింపబడుచున్నది.

శ్లో॥ తమో నుదతి బాల్యాంత సూర్యమండల వర్చసమ్
చతుర్థ మక్షరం సద్యః సకారం ఇతి కీర్త్యతే॥

తా॥ ఉదయానంతర సూర్యకాంతిని కల్గి చీకటిని వెంటనే తొలగింపజాలిన నాలుగవ అక్షరము 'స' కారముగా కొనియాడబడుచున్నది.

శ్లో॥ చంద్రమండల విద్యోతం పంచమ క్షర ముత్తమమ్
హ్లాదయ త్యకిలాన్ లోకాన్ మకార ఇతి గద్యతే॥

తా॥ చంద్రమండలమువలె ప్రకాశించునదై సమస్త లోకములను సంతోషపరచుచు ఐదవ అక్షరముగా ఉత్తమమైన 'మ' కారము చెప్పబడుచున్నది

శ్లో॥ షష్ఠవర్ణం మహాపుణ్యం త్రేతాగ్ని సమధిష్ఠితమ్
చినోతి సకలాన్ ధర్మాన్ త్రేకార ఇతి చోచ్యతే॥

తా॥ త్రేతాగ్నులయందు వసించుచు సమస్త ధర్మములను ప్రోవుచేయు ఆరవవర్ణము పుణ్యప్రదమగు 'త్రే' కారముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ సప్తమాక్షర మత్యర్థం బ్రహ్మానందాత్మకం పునః
ఆనందయ త్యమర్త్యాన్ వై నకార ఇతి గణ్యతే॥

తా॥ బ్రహ్మానంద సంధాయకమై దేవతలను సైతమానందింపజేయు ఏడవ అక్షరము 'న' కారముగా పరిగణింపబడుచున్నది.

శ్లో॥ కాలశక్తిమయం వర్ణం అష్టమం కష్టనాశనమ్
మారయ త్యఖిలాన్ శత్రూన్ మకార ఇతి లక్ష్యతే॥

తా॥ యమశక్తితో సమానమై కష్టములను పారద్రోలి సర్వశత్రువులను చంపెడి ఎనిమిదవ అక్షరము 'మ' కారముగా తెలియబడుచున్నది. మంత్రము "ఓం శ్రీం హనుమతేనమః" అని తెలియవలయును.

శ్లో॥ సోఽయం సప్తాక్షరమంత్రః ప్రభావో గదితో మయా
న ప్రపంచయ మైత్రేయ! సర్వమంత్రోత్తమోత్తమమ్॥

తా॥ సప్తాక్షరీ మహామంత్రము యొక్క ప్రభావము నాచే చెప్పబడినది. ఓ మైత్రేయా! అన్ని మంత్రముల కంటె గొప్పదైన దానిని వెల్లడిచేయవద్దు.

ధ్యానమ్

శ్లో॥ ఉద్యద్భాను మయూఖ మండల నిభశ్శ్రీకుండలాలంకృతో
యః పద్మాంతర కర్ణికా సమతనుః పీతాంబరాలంకృతః
తస్మై దివ్యవిభూతయే హనుమతే
వేదాంతవేద్యాయతే
చంద్రాదిత్య హుతాశ చక్షుష ఇదం భూయోఽపి
భూయోనమః॥

తా॥ ఉదయించు సూర్యుని కిరణసమూహముతో సమానమైనవాడు, శోభాయమానములగు కుండలములు కలవాడు, పద్మముసందుండు బొడ్డువంటి దేహముకలవాడు, పచ్చనిబట్ట కట్టుకొన్నవాడు, దివ్యతేజస్సంపన్నుడు, ఉపనిషత్తులచే తెలియదగువాడు, చంద్ర సూర్యాగ్నులు నేత్రములుగా గలవాడవు అగు నీకిదే మరల మరల నమస్కారము.

శ్లో॥ లక్ష మేకం పురశ్చర్యా దశాంశం తర్పణం భవేత్
తద్దశాంశం హోమకర్మ తద్దశాంశం తు భోజనమ్॥

తా॥ ఈ సప్తాక్షరీ మహామంత్ర పురశ్చర్యకు ఒక లక్ష జపించవలెను. అందు పదవవంతు హోమము, అందు పదవవంతు భోజన సమారాధనము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏవం కృత్వా మునిశ్రేష్ఠ వాంఛాసిద్ధి ర్లభే ద్ధ్రువమ్
చతుర్ణా మపి వర్ణానాం మంత్రో జప్యో న సంశయః॥

తా॥ ఇట్లొనర్చినచో ఓ మైత్రేయ మహామునీ! తప్పక ఇష్టమగు కోర్కెనందగలరు. నిస్సందేహముగా ఈ మంత్రమును చాతుర్వర్ణ్యము జపించవచ్చును.

శ్లో॥ శ్రుణు మైత్రేయ వక్ష్యామి ఇతిహాసం పురాతనమ్
యస్య శ్రవణమాత్రేణ నరోఽభీష్టం సమశ్నుతే॥

తా॥ మైత్రేయా! దీనికి సంబంధించిన ప్రాచీన చరిత్రము చెప్పుచున్నాను. దీనిని వినినమాత్రమున మానవుని కోర్కె తీరును. కాన వినవలసినది

శ్లో॥ శ్రీభద్రం నామ నగరం సర్వలోకేషు విశ్రుతమ్
సుముఖో నామ తత్రాస ద్విజో ధర్మపరాయణః।

తా॥ సర్వలోకమునందు కీర్తినందిన శ్రీభద్రమను పేరుకల నగరము కలదు అందు ధర్మపరాయణుడగు బ్రాహ్మణుడు సుముఖుడను పేరుకలవాడు కలడు

శ్లో॥ హనూమచ్చరణ ధ్యాన విమలీకృత మానసః
సప్తాక్షరీ జపపరః సదా బ్రాహ్మణపూజకః॥

తా॥ ఆతడు హనుమంతుని పాదధ్యానముతో కూడిన మనస్సు కలవాడు, సప్తాక్షరీ జపమొనర్చువాడు ఎల్లప్పుడు బ్రాహ్మణపూజ నొనర్చువాడు.

శ్లో॥ హనూమత్ప్రీతయే నిత్యం విప్రాణా మన్నదాయకః
తస్యైవ ద్విజవర్యస్య కుర్వతో నియమం సదా॥

తా॥ హనుమంతుని ప్రీతికొరకై బ్రాహ్మణుల కన్నదాన మొనర్చువాడై ఆ బ్రాహ్మణుని నియమముల నెల్లప్పుడు చేయుచుండువాడై,

శ్లో॥ సమీపగ్రామ నిలయో గోపాలో బహుగోధనః
ధేనుమాలీతి విఖ్యాతో నిత్య మాజ్యం ప్రయచ్ఛతి।

తా॥ సమీపమందలి గ్రామమున నివసించు మిక్కిలి

గోవులుకల గొల్లవాడు ధేనుమాలి యను పేరుకలవాడు ప్రతిదినము నేయి తెచ్చి ఇచ్చుచుండెడివాడు.

శ్లో॥ క్రయవిక్రయ సంబంధం తయో రేవ ప్రకుర్వతః
వ్యతీతాయ మహాన్ కాలః హనుమత్కరుణావశాత్॥

తా॥ కొంతకాలమునకు వారిద్దరు కలసి హనుమంతుని దయవలన గొప్పదగు జీవితకాలము గడుపుటకు,

శ్లో॥ ఏకదా గోపకః సర్పిః స్కంధే నాజ్యం సినీషితః
మార్గమధ్యే గిరినదీ ప్రావర్తత దినద్వయమ్।

తా. ఒకప్పుడు ఆ గోపాలుడు బుజముపై నేతినిడి వెంటతీసికొని రాజొచ్చెను. త్రోవలో రెండురోజులపాటు నదీప్రవాహ మధికముగానుండెను.

శ్లో॥ ధేనుమాలీ నదీకూలే తస్థౌ తత్ర మశక్నువన్
దినద్వయం చ మైత్రేయ విప్రశాప భయాకులః॥

తా. ఓ మైత్రేయా! నదిని దాటుటకు వీలు లేక బ్రాహ్మణశాపమునకు భయపడుచు రెండురోజులు నది యొద్దుననే ధేనుమాలి నిలిచెను.

శ్లో॥ సుముఖోఽపి తదా తత్ర విప్రా నాహూయ సర్వశః
ఆజ్యం గృహీత్వా నాయాతి ధేనుమాలీ మహాద్విజాః॥

తా॥ ఆ సమయమున అచ్చట సుముఖుడుకూడ బ్రాహ్మణులనందరి నాహ్వానించియున్నవాడై వారలతో ఓ బ్రాహ్మణోత్తములారా! ధేనుమాలి నేతిని తీసికొని రాలేదు

శ్లో॥ తత్రాంతరాయ కిం జాతః ఘృతా యాన కర్మణి
ఆద్య ప్రతీక్షయా తస్థౌ హనూమంత మితీరయన్॥

తా॥ అచ్చట నేతిని తెచ్చుటలో ఏమి అడ్డువచ్చెనో అనుకొనుచు నేతికై ఎదురుచూచుచుండెను.

శ్లో॥ భక్త వాత్సల్య నిరతో హనుమాన్ కరుణానిధిః
భక్తసంకల్ప విహతిం న సేహే లోకనాయకః॥

తా॥ భక్తులయం దెల్లప్పుడు వాత్సల్యము కలిగి యుండు కరుణామయుడు లోకనాయకుడగు హనుమంతుడు భక్తుల సంకల్పమునకు అడ్డు ఏర్పడుటను సహింపలేదు

శ్లో॥ తథా గోపాలవేషేణ స్కంధే నాజ్యం సముద్వహన్
దినద్వయాం చ విప్రాయ దదౌ వానరనాయకః॥

తా॥ గోపాలునివలెనే వేషముధరించి; మూపున నేతిని మోయుచు కపినాయకుడగు హనుమంతుడు రెండు రోజులు బ్రాహ్మణునకు నేతిని సమకూర్చెను

శ్లో॥ ఏవం దినద్వయేఽతీతే ధేనుమాలీ సమాకులః
సమారుహ్యోడుపం కంచి ద్విప్రస్య నికటం గతః॥

తా॥ ఇట్లు రెండురోజులు గడువగా ధేనుమాలి మిక్కిలి కలతనంది ఎద్దియో తెప్పనొక్కదాని నెక్కి బ్రాహ్మణుడగు సుముఖుని కడకు వచ్చెను.

శ్లో॥ దినద్వయస్య పర్యాప్త మాజ్యం బహు సముద్వహన్
ఆగత్య విప్రముఖ్యస్య పపాత చరణాబ్జయోః॥

తా॥ రెండురోజులకు సమకూడెడి నేతినంతను

మోయుచు వచ్చి ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని పాదపద్మములపై పడెను.

శ్లో॥ ఆజ్యం గృహీత్వా నాయాతి గోపాల ఇతి భూసుర॥
మా కృథా మయి కోపం త్వం మార్గ కృత్యం వదామి తే॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఈ గోపాలుడు నేతిని తీసికొనివచ్చుటలేదని నాపై నీవు కోపముందకుము. మార్గమందు జరిగిన రీతిని విన్నవించెదను.

శ్లో॥ మయ్యాయాతే గిరినదీ మార్గమధ్యే ద్విజోత్తమ!
కూలంకషోదకా జాతా సమర్థో నాఽస్మి తారితమ్॥

తా॥ బ్రాహ్మణశ్రేష్ఠా! నేను వచ్చుచుండగా మార్గమధ్యమున నది ఒడ్డుల నొరిసికొను నీరుకలదైన కారణమున దాటలేకపోతిని.

శ్లో॥ తస్మాద్దినద్వయం తత్ర స్థిత్వా భీతమనాకులః
గతోఽస్మి తే విప్రవర్య! అను హ్యోతుప మంతికమ్॥

తా॥ అందుచే రెండురోజులు భయపడుచునే అచ్చటి నుండి ఓ బ్రాహ్మణోత్తమా! ఒక తెప్పనెక్కి ఇప్పటికి మీ సమీపమునకు చేరితిని.

శ్లో॥ మయి సంస్థాప్య కారుణ్యం మాం చ క్షంతుం త్వ మర్హసి॥

తా॥ కాన నాయందు దయయుంచి నన్ను క్షమించవలయును.

శ్లో॥ సుముఖోఽపిత దాక్షాచ్చ్యం శ్రుత్వా గోపాలభాషితమ్
మేనే హ్యాజ్య ప్రదాతారం మానూమంత కృపానిధిమ్॥

తా॥ సుముఖుడు ఆశ్చర్యకరమైన గోపాలుని వాక్యములు విని నేతినిచ్చినవానిని దయామయుడగు ఆంజనేయునిగా తలచెను.

శ్లో॥ ఏవం మత్వా తదా విప్రః తుష్టావ జపతాంవరః

తా॥ ఇట్లు గ్రహించి అప్పుడు జపితలలో శ్రేష్ఠుడగు ఆ సుముఖుడు ఇట్లు స్తుతించెను.

శ్లో॥ నమస్తే దేవదేవేశ! నమస్తే రాక్షసాంతక!
నమస్తే వానరాధీశ నమస్తే వాయునందన!

తా॥ ఓ దేవదేవా! నీకు నమస్కారము రాక్షసాంతకా! నీకు నమస్కారము కపిశ్రేష్ఠా నీకు నమస్కారము; వాయుకుమారా! నీకు నమస్కారము.

శ్లో॥ నమ స్త్రిమూర్తి వపుషే వేదవేద్యాయ తే నమః
నమస్తే లోకనాథాయ సీతాశోకాపహారిణే!

తా॥ బ్రహ్మ విష్ణు శివాత్మకా! నీకు నమస్కారము వేదముచేతనే తెలియదగినవాడా నమస్కారము. లోకేశ్వరా! నీకు నమస్కారము, జానకీదుఃఖము పోగొట్టినవాడా నీకు నమస్కారము.

శ్లో॥ స్వామిన్ త్వయాకృతం హృద్య! యదాజ్యవహనం మమ
జాతం మా మపరాధాయ క్షంతు మర్హ దయానిధే!

తా॥ స్వామీ! మనోజ్ఞరూపుడా! నీవే నేయి మోయబడుట యనునది నాకపరాధ కారణమగును. దయాపూర్ణుడా! ఆ దోషమునకు నన్ను క్షమింపుము.

శ్లో॥ త్వయాయథా నియుక్తోఽహం తథాకుర్వే వచాన్వహమ్
సాధు వా యది వాసాధు మమ దోషో న విద్యతే॥

తా. దేవా! నీచే నేనెట్లు నియుక్తుండనైతినో అట్లను దినము సంచరించుచుంటిని. యోగ్యమైన, అయోగ్యమైనను నాదోషములేదు.

శ్లో॥ ఇతి స్తువంతం విప్రేంద్రం దృష్ట్వా వాయుతనూభవః
తప్తకాంచన సంకాశం ముక్తాహార విభూషితమ్

తా. ఇట్లు స్తుతించు బ్రాహ్మణోత్తముని వాయుసుతుడగు హనుమంతుడు చూచి పుటము పెట్టిన బంగారముతో సమానముగా నున్నట్టియు, ముత్యాలహారముతో అలంకరింపబడినట్టియు,

శ్లో॥ దివ్య పీతాంబర ధరం మణికుండల మండితమ్
దర్శయామాస చాత్మానం ఇదం ప్రోవాచ తంద్విజమ్

తా. దివ్యములగు పట్టుపీతాంబరములు ధరించినట్టియు మణులు పొదిగిన కుండలములతో ప్రకాశించునట్టి తన రూపమును హనుమంతుడు చూపి ఆ బ్రాహ్మణునితో ఈ రీతిగా ననెను.

శ్లో॥ భవ ప్రతిజ్ఞాం విప్రేంద్ర! సత్యాం కర్తుం మయా కృతమ్
భక్తప్రేష్ణాజ్యవహనం గోపవేష భవత్తథా॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నీ ప్రతిజ్ఞను సత్యమొనర్చుటకే నే నట్లొనర్చితిని, భక్తులయందలి ప్రేమ

వలననే నేతిని పోయుట, గోపవేషము దాల్చుట నొనర్చితిని.

శ్లో॥ విప్రైత దేవ మే కృత్యం న చాన్య ద్విద్యతే మమ
యద్ధితాభీష్టకరణం భృత్యాఽనిష్ట నివారణమ్॥

తా॥ ఓ విప్రుడా! నాకు హితులైనవారి కోర్కెలు తీర్చుట, నా సేవకుల కష్టములు తీర్చుట యిదియే నా పని; నాకు వేరొకపని లేదు.

శ్లో॥ తవ సంతతయా భక్త్యా తుష్టోఽస్మి ద్విజసత్తమ!
యద్యదిష్టతమం లోకే తవ సర్వం భవిష్యతి॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నీ నిరంతరభక్తిచే నేను సంతుష్టుడనైతిని. లోకమునందే దేని ఇష్టమో అది యంతయు నెరవేరగలదు

శ్లో॥ లోకేఽస్మిన్ నిఖిలాన్ భోగాన్ భుక్త్వా దివ్యాన్ మహాఫలాన్
కళత్రపుత్ర పౌత్రైశ్చ సహితో ధేనుమాలినా
దివ్యదేహ సమాయుక్తో హ్యంతే మోక్షమవాప్స్యసి॥

తా॥ ఇహలోకమునందలి భోగము లనుభవించి దివ్యములగు మహాఫలములు పొంది భార్యాపుత్రపౌత్రులతోను, ధేనుమాలితోను కూడి దివ్యదేహము నొందినవాడవై చివరకు మోక్షము నందగలవు.

శ్లో॥ ఏవం దత్వా వరం విప్రం చాభాష్యాంజనినందనః।
అదృశ్యత్వం గతో యోగీ తదా విప్రస్య పశ్యతః॥

తా॥ అట్లు ఆ బ్రాహ్మణభక్తునకు వశుడై వరము

లిడి ఆ వాయుసుతుడు; యోగియగు హనుమంతుడు వానితో మాటాడి అదృశ్యుడయ్యెను.

శ్లో॥ తదారభ్య పునర్విప్రో నియమాసక్తమానసః
ఇదా నిత్యం హనూమన్తం జపన్సప్తాక్షరీమనుః॥

తా॥ అది మొదలుగ మరల నియమయుక్తుడై బ్రాహ్మణుడు నిత్యము హనుమంతుని జపించుచు సప్తాక్షరీ మంత్రము ననుగ్రహించుచుండెను.

శ్లో॥ ఏవం ప్రభావో మన్త్రోయం హనూమత్ప్రతిపాదకః
కథితం త్వద్ధ మాశ్చర్యం మయా తుభ్యం శుభావహమ్॥

తా॥ మైత్రేయా! ఇట్టి ప్రభావముకల హనుమత్ప్రతిపాదకము, చాలగొప్పది, శుభప్రదమైనది యగు ఆశ్చర్యకరమంత్రము నాచే నీకు చెప్పబడినది

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
శ్రీ పంచముఖ హనుమన్మంత్రవివరణే
సుముఖచరిత్రకథనం నామ చతుస్త్రింశత్పటలః

## పంచత్రింశత్పటలః

## మైందనచరిత్ర కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ ఆంజనేయ చతుస్త్రింశత్యక్షరీ మునిసత్తమ!
అష్టాదశాక్షరీ చేతి మహాత్మ్య ముభయో ర్వద!

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ పరా

శర మునీంద్రా! శ్రీ మదాంజనేయుని యొక్క చతుర్వింశత్యక్షరీ మంత్రము అనగా ఇరువదినాల్గక్షరముల మంత్రము, అష్టాదశాక్షరీమంత్రము అనగా పదునెనిమిది అక్షరముల మంత్రము వాని రెంటి మహాత్మ్యము నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి శ్రుణు మైత్రేయ తత్త్వతః
ఆదౌ ప్రణవ ముచ్చార్య నమో భగవతే తతః

తా॥ శ్రీ పరాశరులవారులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! హనుమంత్రోద్ధారము చెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము; మొదట ప్రణవము 'ఓం' అని పల్కి పిదప 'నమోభగవతే' అని.

శ్లో॥ ఆంజనేయాయ చ మహా బలాయేతి తతః పరమ్
స్వాహాపదం సముచ్చార్య మను రష్టాదశాత్మకః॥

తా॥ 'ఆంజనేయాయ' అని 'మహాబలాయ' అనియు పిమ్మటనని ఆపై 'స్వాహా' అనిననో అష్టాదశాక్షరీ మహామంత్ర మగును.

ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ హ్వాహా అను పదునెనిమిది అక్షరముల మూలము

శ్లో॥ మంత్ర మేషః క్రమేణైవం జ్ఞేయ స్సూరి రుపాసకైః
శ్రీయుక్త హనుమచ్ఛబ్దః పూర్వమంత్రేయ దీరితః॥

తా॥ ఈ మంత్రము ఉపాసకులచే క్రమముగా నిట్లు తెలిసికొనదగినది. పూర్వమంత్రమగు సప్తాక్షరీ మహా

మంత్రమునందుఁ దలె 'శ్రీ'తో కూడిన హనుమచ్ఛబ్దమును గ్రహింపవలెను.

శ్లో॥ తద్భైవ స శ్చతుర్వింశ త్యక్షరీ మంత్ర ఉచ్యతే

తా॥ ఇట్లది ఇరువదినాల్గక్షరములు చతుర్వింశత్యక్షరీ మంత్రముగా చెప్పబడుచున్నది. దీని యక్షర గణనము ప్రణవముతో నయిన చెల్లుచున్నది.

శ్లో॥ అస్మిన్ మంత్రద్వయో పూజ్యో హ్యగస్త్యో భగవాన్ ఋషిః

గాయత్రీ పరమా ఛందః హనుమాన్ దేవతా భవేత్

తా॥ ఈ రెండు మంత్రములు పూజ్యములు. వీనికి అగస్త్యుడు ఋషి. గాయత్రీ ఛందము, హనుమాన్ దేవత అగును.

శ్లో॥ ప్రణవం బీజ మిత్యుక్తం స్వాహా శక్తి రుధీరితమ్

ఆంజనేయాయ చ తతో కీలకం సముదాహృతమ్ ॥

తా. ప్రణవము బీజముగా అనగా 'ఓం బీజం' అని చెప్పబడినది. 'స్వాహాశక్తి' 'ఆంజనేయాయేతకీలకం' అని చెప్పబడినది.

ధ్యానం

శ్లో॥ చింతితార్థప్రదం దేవం శాన్తాకారం మహాప్రభుమ్

సతతం చింతయే చ్చిత్తే హనుమన్త మనూపమమ్

తా. కోరినకోర్కె లిచ్చునట్టి, శాంతస్వరూపుడైనట్టి, జగన్నాయకుడైనట్టి సాటిలేని దేవుని హనుమంతుని ఎల్లప్పుడు మనసున తలంచునుగాక!

శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి

తా॥ మనస్సుతో సమానమైన వేగముకలవానిని. వాయువుతో సమానమైన వేగముకలవానిని. ఇంద్రియ నిగ్రహము కలవానిని, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన వానిని వాయుదేవుని పుత్రుని, కపిసమూహములో ముఖ్యుడైన వానిని శ్రీ రాముని సేవకుడైన హనుమంతుని శిరసా నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఇతి ధ్యాత్వా జపేన్మంత్రం అయుతః నియతః పుమాన్
సర్వాన్ కామా నవాప్నోతి సర్వత్ర విజయీ భవేత్॥

తా॥ అని ధ్యానమొనర్చి నియమనిష్ఠుడై జనుడు పదివేలు జపించినచో సమస్తములైన కోర్కెలనందగలడు, అంతట విజయమందగలడు,

శ్లో॥ అత్రేతిహాసం వక్ష్యామి శృణు చిత్రం మునీశ్వర!
మైందో నామ ద్విజవరో జ్ఞానీ పరమపావనః॥

తా॥ ఈ విషయమున ఒక ఇతిహాసమును విచిత్రమైనదానిని చెప్పుచుంటిని. ఓ మైత్రేయా! వినుము మైందుడను పేరుకల బ్రాహ్మణశ్రేష్ఠుడు కలడు, అతడు గొప్ప జ్ఞానముకలవాడు పరమపవిత్రుడున్నూ.

శ్లో॥ వేదశాస్త్రార్థ తత్వజ్ఞః సుందరీనగరే స్థితః
ఉక్త మంత్రస్వయ జపాసక్తిమాన్ ధర్మతత్పరః॥

తా॥ వేదశాస్త్రముల తత్వము లెరిగిన యాతడు సుందరీగరిమున నుండెను. ఆతడు పైన చెప్పిన మంత్రములు రెంటిని జపించుటయం దాసక్తి కలవాడు; ధర్మతత్పరుడును న్ను.

శ్లో॥ తతో మైందద్విజః కాశీం యాతుకామ స్తపోధనః
గంగా నదీం సమాసాద్య నావ మారుహ్యా దుస్తరామ్॥

తా॥ తపోధనుడగు ఆ మైందుడు కాశీకి పోదలచిన వాడై దాటశక్యముగాని గంగానదిని చేరి నావనెక్కగా,

శ్లో॥ గంగామధ్యే చ శిథిలా నౌ రాశీ జ్జలపూరితా
నావం దృష్ట్వా జలో పేతాం మైందో భీతిసమాకులః॥

తా॥ గంగా నదీమధ్యమున నావ దెబ్బతిని నీటితో నిండినది. అట్లు నీటితో నిండిన నావను చూచి మైందుడు భయముచే వ్యాకులపడినవాడై,

శ్లో॥ వస్త్రేణాచ్ఛాద్య వదనం భక్తియుక్తో హనూమతః
మంత్ర మేవం జపత్ తస్థౌ శుద్ధాత్మా నన్యమానసః॥

తా॥ వస్త్రములో ముఖమును కప్పుకొని హనుమద్భక్తితో కూడినవాడై పరిశుద్ధాత్ముడై ఇతరమును దేనిని మనసునందుంచక హనుమంతుని మంత్రమును జపించుచుండెను.

శ్లో॥ తత్కాలే హనుమాన్ శీఘ్రం భక్తవాత్సల్య బుద్ధిమా
నావం ధృత్వా శిరస్యేతాం మహావానర రూపధృత్

తా॥ ఆ సమయమున భక్తులయందలి వాత్సల్య

బుద్ధితో వెంటనే హనుమంతుడు గొప్ప వానరరూపము ధరించి నావను శిరమున దాల్చినవాడై,

శ్లో॥ గంగాతీరం సినా యాశు పశ్యతాం తీరవాసినామ్
కపివేషధరో దేవః తత్రైవాంతరధీయత॥

తా॥ శీఘ్రముగా గంగాతీరమును జేర్చి గంగానది యొద్దుననున్న వారు చూచుచుండగా వానరరూపుడగు హనుమంతుడచ్చటనే అదృశ్యుడయ్యెను.

శ్లో॥ మహాప్లవంగ మానీతాం నావం దృష్ట్వా మునీశ్వర!
ఆశ్చర్యం పరమం ప్రాపుః తత్రత్యాస్తీరవాసినః॥

తా॥ ఓ మైత్రేయా! ఆ పెద్దకోతితో తీసుకొరాబడిన నావను చూచి ఆ యొద్దుననున్నవారు మిక్కిలి ఆశ్చర్యమందిరి.

శ్లో॥ మైందోఽవరుహ్యాం తాం నావంతీరస్థా నఖిలాన్ జనాన్
దృష్ట్వాశ్చర్యగతో భక్తో ప్రోవాచ శ్రీహనూమతః॥

తా॥ హనుమద్భక్తుడగు హనుమంతుడు ఆ నావనుదిగి తీరమునందున్న జనులందరను చూచి ఆశ్చర్యముతో నిట్లు పలికెను.

శ్లో॥ జనాః కిమర్థ మాశ్చర్యం మహత్తర మకారణమ్
యుష్మాభిర్గత మేతస్మై శక్తా యూయం వివక్షితుమ్॥

తా॥ ఓ జనులారా! ఎందులకు కారణములేని ఇంతటి ఆశ్చర్యము నందుచున్నారు? కారణము చెప్పవలసినది.

జనాః

శ్లో॥ కేసచి త్కపినా నీతా తీరం నౌ శిరసా ద్విజ!
తస్మా త్ప్రాప్తం తదస్మాభి రపూర్వం మహదద్భుతమ్॥

తా॥ జనులు చెప్పుచున్నారు. ఓ బ్రాహ్మణుడా! ఒక కోతిచే తలపై నిడుకొని నావ ఒడ్డుకు తేబడినది, ఆ కారణముచే మాకు మున్నెన్నడెరుగనంతటి యాశ్చర్యము కల్గినది.

మైందః

శ్లో॥ యతో దృష్టో మహావీరః యుష్మాభి ర్హనుమాన్ జనః
తతో యూయం భాగ్యవంతః కృతార్థా పుణ్యశాలినః

తా॥ మైందుడనుచున్నాడు ఓ జనులారా! మహావీరుడగు హనుమంతుడు మీకు కనపడినకారణమున మీరు నిజముగ అదృష్టవంతులు, ధన్యులు, పుణ్యవంతులును.

శ్లో॥ మయాకృతం హనూమంతః శ్రీరామాంఘ్రి పపూజనమ్
స్వప్నే ప్యదృష్టో హనుమాన్ పాపోఽహం మందభాగ్యవాన్

తా. నాచేత హనుమత్స్వామి. రామపాదసేవయు చేయబడినది. కాని కలలోకూడ హనుమంతుడు కనపడలేదు: నేను పాపుడను. దురదృష్టవంతుడను

శ్లో॥ నాస్తి చే త్స్వామిన స్సర్వ కామదం దర్శనం మమ
కరో మ్యద్యైవ గంగాయాః ప్రవేశం లోకగర్హితమ్.

తా. సమస్తము కోర్కెలను తీర్చెడి హనుమంతుని దర్శనము నాకు కల్గకున్నచో ఇప్పుడే లోకగర్హితమగురీతి గంగనదిలో పడెదను.

శ్లో॥ తదా శ్రీ హనుమాన్ ధీరో భక్తవాత్సల్య బుద్ధినా
పీతాంబరధర శ్రీమాన్ స్మితవక్త్రో శ్చతుర్భుజః
మైందస్య పురత శ్శీఘ్రం ప్రాదురాసీ త్కృపాంబుధిః.

తా. అప్పుడు భక్తునియందు వాత్సల్యబుద్ధితో ధీరుడు, పట్టుపీతాంబరమును ధరించినవాడు, సర్వసంపదలు కలవాడు, నవ్వుచున్న మోమువాడు, నాల్గుచేతులు కల వాడు. దయాసముద్రుడు అగు హనుమంతుడు వెంటనే మైందుడి ఎదుట ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ సమాగతం హనూమంతం దృష్ట్వా మైందో మహాతపాః
సాష్టాంగం ప్రణిప త్యాథ పూజాం కర్తుం మనో దధే॥

తా॥ విచ్చేసినటువంటి హనుమంతుని మహా తప శ్శాలియగు మైందుడు చూచి సాష్టాంగనమస్కార మొనర్చి పిమ్మట పూజనొనర్చ మొదలిడెను

శ్లో॥ ఉష్ట్రారూఢ! సువర్చలాసహచర స్సుగ్రీవమిత్రాంజనా
సూనో వాయుకుమార! కేసరితనూ జాక్షాది దైత్యాంతక
సీతాశోకహ రాగ్నినందన! సుమిత్రాసంభవ ప్రాణద!
శ్రీభీమాగ్రజ శంభుపుత్ర! హనుమ న్పాంచాస్య తుభ్యంనమః॥

తా॥ ఒంటెనెక్కినవాడా! సువర్చలతో కలసియుండు వాడా! సుగ్రీవ మిత్రుడా! అంజనాదేవి కుమారుడా! వాయు పుత్రుడా! కేసరినందనుడా! అక్ష రాక్షసాదులను సంహ రించినవాడా! సీతాదేవి దుఃఖమును పోగొట్టినవాడా! అగ్ని కుమారుడా! లక్ష్మణునకు ప్రాణదానమొసగినవాడా! భీముని సోదరుడా! శివుని కుమారుడా! హనుమంతుడా! ఐదుముఖ ములు కలవాడా! నీకు నమస్కారము.

శ్లో॥ అర్ఘ్యాచమన పాద్యైశ్చ గంధ ధూప ప్రదీపకైః
నానావిధఫలైః పుష్పైః పూజయామాస వాయుజమ్॥

తా॥ అని మైందుడు అర్ఘ్యము, ఆచమనము, పాద్యము, గంధము, ధూపము, దీపములతోను, వివిధములగు పండ్లతోను, పూలతోను వాయుపుత్రుడగు హనుమంతుని పూజించెను.

శ్లో॥ పూజాం మైందకృతాం స్వామీ తుష్టః స్వీకృత్య మారుతిః
మైందాయ చ వరాన్ దత్వా త మువాచ కపీశ్వరః॥

తా॥ మైందునిచే చేయబడిన పూజను గ్రహించి హనుమత్స్వామి సంతృప్తి చెందినవాడై మైందునకు వరములిచ్చి ఆ వానరవీరు డాతనితో నిట్లనెను.

శ్లో॥ భక్తసంరక్షణార్థాయ త్వత్సమీపే వసామ్యహమ్
ఇహ భుంక్త్వాఖిలాన్ భోగాన్ అంతే ప్రాప్స్యసి మత్పదమ్
ఇత్యుక్త్వా హనుమాన్ స్వప్నం తత్రైవాంతరధీయత ॥

తా॥ ఓ మైందా! భక్తసంరక్షణముకొరకై నేను నీకడ నివసించుచున్నాను, ఇహలోకమున సమస్త భోగములనుభవించి చివరకు నా స్థానము చేరెదవు. అని హనుమంతుడు బ్రాహ్మణునితో పల్కి ఆచ్చటనే అంతర్ధానము చెందెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
శ్రీ పంచముఖ హనుమన్మంత్రవివరణే
మైందచరిత్ర కథనం నామ పంచత్రింశత్పటలః

## షట్త్రింశ త్పటలః

## మదనక్షోభానివారకమంత్ర కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ మంత్రాంతరం ప్రవక్ష్యామి మైత్రేయ శ్రుణు మారుతేః
మనో ర్బ్రహ్మ ఋషిశ్చైవ గాయత్రీ ఛంద ఉచ్యతే॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయ మహామునీ! శ్రీ హనుమంతుని యొక్క వేరొక మంత్రమును చెప్పుచున్నాను వినవలసినది. ఈ మంత్రము నకు బ్రహ్మయే ఋషి. గాయత్రీ ఛందముగా చెప్పబడు చున్నది.

శ్లో॥ హనుమాన్ దేవతా ప్రాం చ బీజం హ్రీం శక్తిరుచ్యతే
క్రోం కీలకం మహాబాగ వినియోగపదం భవేత్।

తా॥ హనుమాన్ దేవత. ప్రాం బీజము, హ్రీం శక్తి, క్రోం కీలకముగా చెప్పి ఓ మహామునీ! పిదప వినియోగము నుంచవలెను.

శ్లో॥ ప్రా మిత్యంగుళిన్యాసః హృదయాది స్తథైవ చ
కుర్యా ద్దిగ్బంధనం తత్ర లోకత్రయేణ బుద్ధిమాన్॥

తా॥ "ప్రాం" అను మొదలుగా అంగుళిన్యాసమొనర్ప వలెను. అట్లే హృదయాదిన్యాసము నొనర్చవలెను, అప్పుడు బుద్ధిమంతుడగు జపించువాడు 'లోకత్రయేణ దిగ్బంధః' అని దిగ్బంధన మొనర్చవలెను.

ధ్యానమ్:-

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననమ్
కాంచనాద్రి కమనీయవిగ్రహం
పారిజాతతరుమూల వాసినం
భావయామి పవమాననందనం॥

తా॥ మిక్కిలి ఎఱ్ఱనైన ముఖము కల్గినట్టియు, మేరు పర్వతమువలె మనోహరమైన ఆకారము కలిగినట్టియు, పారిజాతవృక్షము మొదట నివసించియుండునట్టియు, వాయు కుమారుడైన ఆంజనేయుని తలంచుచున్నాను. పై శ్లోక మును ధ్యానముగ చెప్పవలెను.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య నమో భగవతే పదం
అనంతరం హనుమతే మమశబ్ద స్తతఃపరమ్॥

తా॥ మొట్టమొదట 'ఓం' అని ప్రణవ ముచ్చరించి పిదప 'నమో భగవతే' అని ఆ పిమ్మట 'మమ' అని.

శ్లో॥ మదనక్షోభ ముచ్చార్య సంహారేతి ద్విరుచ్చరేత్
ఆత్మతత్త్వం తత శ్చైవ ప్రకాశయ ద్విరుచ్యతే॥

తా॥ 'మదనక్షోభం' అని యుచ్చరించి 'సంహార సంహార' అని రెండుమార్లుచ్చరింపవలెను. పిదప 'ఆత్మతత్త్వం' అని 'ప్రకాశ ప్రకాశయ' అని రెండుమార్లుచ్చరింపవలెను.

శ్లో॥ వారాహబీజ ముచ్చార్య ఫట్ స్వాహా తతఃపరమ్
ఏకచత్వారింశద్వర్ణ మంత్రో విద్యాప్రదోహ్యయం॥

తా॥ పిమ్మట 'హుం' అను వారాహబీజ ముచ్చరించి ఆపై 'ఫట్ స్వాహా' అనవలెను ఇది నలుబదియొక్క

వర్ణముల మహామంత్రముగా చెప్పబడుచున్నది. ఈ మంత్రము విద్యాప్రదమైనట్టిది.

శ్లో॥ పునర్మంత్రాంతరం వక్ష్యే పిశాచాది నివృత్తయే
కస్మిన్ కక్షౌ వరవర అంజనావరపుత్ర చ
ఆవేశావేశయ పదం ఓం హ్రీం హనుమత స్తథా॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ ! పిశాచాదికమును నివారించుటకై వేరొక మంత్రమును చెప్పుచున్నాను. పై మంత్రముయొక్క విధానమునందే 'ఓం హ్రీం హనుమతే' అని యనిన పిదప 'వరవర' అని, 'ఆవేశయ ఆవేశయ' అని.

శ్లో॥ ఫట్ స్వాహేతి మంత్రోయం త్రింశద్వర్ణ సమన్వితః
ఋష్యాది ధ్యాన న్యాసాదీ పూర్వమంత్రవదీరితః॥

తా॥ 'ఫట్ స్వాహా' అనవలెను. ఈమంత్రము త్రింశ ద్వర్ణాత్మకముగా చెప్పబడుచున్నది. ఋష్యాదులు, ధ్యాన న్యాసాదు లన్నియు వెనుకటి మంత్రమునకు వలెనే చెప్ప బడినవి.

శ్లో॥ మంత్రాంతరం పున ర్వక్ష్యే మునే ! లోకోపకారకమ్
వశిష్ఠఋషి రస్యైవ అనుష్టుప్ ఛంద ఉచ్యతే॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! మరల లోకోపకారక మైన వేరొక మంత్రమును చెప్పుచున్నాను. దీనికి వసిష్ఠుఁడు ఋషి. అనుష్టుప్ ఛందస్సుగా చెప్పబడుచున్నది.

శ్లో॥ హనూమాన్ దేవతా ప్రోక్తో హ్రీం బీజం తదనంతరమ్
క్లీం శక్తిః కీలకం గ్లోం చ మమేతి చ పదం తథా॥

తా॥ హనుమాన్ దేవతగా చెప్పబడుచున్నాడు. పిదప 'హ్రీం బీజం' 'క్లీం శక్తిః' 'హ్రౌం కీలకం' చెప్పి పిమ్మట 'మమ' అనుపదమునుంచి

శ్లో॥ హనూమత్ప్రసాదసిద్ధ్యర్థే వినియోగ స్తథోచ్చరేత్
ఓం నమో భగవతే చ అంగుష్ఠాభ్యాం వినన్యసేత్॥

తా॥ 'హనూమత్ప్రసాద సిద్ధ్యర్థే వినియోగః' అని యుచ్చరింపవలెను. 'ఓం నమోభగవతే అంగుష్ఠాభ్యాం నమః' అని అంగుష్ఠాంగుళిన్యాస మొనర్పవలెను.

శ్లో॥ మమ మదనక్షోభం తర్జని
సంహార సంహార చేతి మధ్యమా
ఆత్మతత్త్వపదం చే త్యనామికా
ప్రకాశయ పదద్వంద్వం కనిష్ఠికా
ఓంఫట్ స్వాహేతి తథా కరతలే విన్యసేత్
ఏవం హృదయాదిన్యాసః

తా॥ 'మమ మదనక్షోభం తర్జనీభ్యాం నమః; సంహార సంహార మధ్యమాభ్యాం నమః; ఆత్మతత్త్వం అనామికాభ్యాం నమః; ప్రకాశయ ప్రకాశయ కనిష్ఠికాభ్యాంనమః; ఓం ఫట్ స్వాహా కరతల కరపృష్ఠాభ్యాం నమః అని విన్యాస మొనర్చి అటులనే హృదయాదిన్యాసము నొనర్చవలెను.

ధ్యానమ్ :-

శ్లో॥ వామే జానుని వామహస్త మపరం జ్ఞానాఖ్య
ముద్రాన్వితమ్
హృద్దేశే కలయ న్నుతో మునిగణై రధ్యాత్మదత్తేక్షణః

ఆసీనః కదళీవనే మణిమయే బాలార్కకోటి ప్రభః
ధ్యాయన్ బ్రహ్మపరం కరోతు మనస శ్శుద్ధిం
హనూమన్మమ॥

తా॥ ఎడమ మోకాలుపై ఎడమచేతిని ఉంచి, కుడి చేతిని జ్ఞానముద్రతో హృదయప్రదేశమున చేర్చుచు మునిగణముచే పొగడబడుచు అధ్యాత్మతత్త్వనిష్ఠయందుండు చూపులుకల్గి అరటితోటలో మణిశిలాతలమున కూర్చుండి ఉదయించుచున్న సూర్యుని అతిశయించు కాంతిగల్గి పరబ్రహ్మధ్యానమునందు నున్న హనుమంతుడు నాయొక్క మనస్సును శుద్ధము, ప్రశాంతము నొనర్చుగాక.

శ్లో॥ అదౌ ప్రణవ ముచ్చార్య తతో హనుమతే పదం
మమేతి పద ముచ్చార్య మదనక్షోభ మేవ చ॥

తా॥ మొదట 'ఓం' అని ప్రణవము నుచ్చరించి పిదప 'హనుమతే' పదము, ఆపైన 'మమ' అను పదమును నుచ్చరించి 'మదనక్షోభం' అని

శ్లో॥ సంహరేతి ద్విరుచ్చార్య హారాహం బీజ ముచ్చరేత్
ఫట్ స్వాహేతి మంత్రోయం సప్తత్రింశతి వర్ణకః॥

తా॥ 'సంహర సంహర' అని రెండుమార్లుచ్చరించి 'హుం' అను హారాహబీజ ముచ్చరించి 'ఫట్ స్వాహా' అనపలెను. ఇది ముప్పదియేడక్షరముల మంత్రము. మంత్రమునందు పూర్వోక్తములగు ననుశ్శబ్దము, ఆత్మతత్త్వప్రకాశవాది శబ్దములన్ను స్వీకరింపబడుచున్నట్లు విజ్ఞులవలన

తెలియుచున్నది. అట్టి విధానముల చేకాని అక్షరసంఖ్యా నియమము నైతము పొసగదు.

వ. శిక్షాలీక శ్రవణ నేత్ర కపోల నాసాః
పాదసంధి కటి నాభి పార్శ్వ హృత్సుకరాం
స్తనయుగ్మ ముఖ మూర్ధ్ని చ క్రమేణ
మంత్రాక్షరాన్ న్యసేత్ శుద్ధమతి స్స్వదేహే

తా॥ శిరస్సు, నాసలు, చెవులు, కండ్లు, చెక్కిళ్ళు, ముక్కు, భుజములు, పాదములు, సంధిస్థానములు, కటి, బొడ్డు ప్రక్కలు, హృదయము, చేతులు, స్తనములు, ముఖము వీనియందు క్రమముగా పరిశుద్ధ మానస్కుడగు మంత్రవేత్త తనదేహమున మంత్రాక్షరములను న్యాస మొనర్చుకొనవలెను.

శ్లో॥ కదలీఫలై శ్చ పనస ఫలై శ్చ మధుమిశ్రితైః
హనూమద్దేవతా ప్రీత్యై హోమం కుర్యా ద్విచక్షణః॥

తా॥ తేనెతో మిశ్రితమైన అరటిపండ్లతోను, పనస పండ్లతోను విజ్ఞుడగువాడు హనూమద్దేవతా ప్రీత్యర్థము హోమమొనర్చవలెను.

శ్లో॥ లక్ష మేకం పురశ్చర్యా దశాంశం తర్పణాదిభవేత్
దశాంశం హవనం కుర్యాత్ దశాంశం భోజనం తతః॥

తా॥ ఈ మంత్రమునకు ఒక లక్ష పురశ్చర్య అవసరము. అందు పదవవంతు తర్పణలు, అందు పదవ వంతు హోమము హవనమునకు పదవవంతు అన్నసమారాధనము జరుపనగును.

శ్లో॥ అథ పూజావిధానార్థం యంత్రలక్షణ ముచ్యతే
నవశక్తియుతే పీఠే శైవే వా వైష్ణవే తథా॥

తా॥ పిమ్మట పూజావిధానముకొరకై యంత్రలక్షణము చెప్పబడుచున్నది. నవశక్తిసహితమగు శైవపీఠమునకాని, వైష్ణవపీఠమునకాని

శ్లో॥ సామాన్యపీఠే చావాహ్య పూజయేత్సముదాహృతం॥

తా॥ సామాన్య పీఠమునందైనను చెప్పబడునట్టి యంత్రమున కావాహన మొనర్చవలెను

శ్లో॥ ఆదౌ వర్తుల మాలిఖ్య పద్మ మష్టదళం తథా
పునర్వృత్తుల మాలిఖ్య భూపురద్వయ లేఖనం॥

శ్లో॥ చతుర్ద్వారం సమాలిఖ్య చక్రలక్షణ ముచ్యతే
కర్ణికాయాం లిఖేత్తారం సాధ్యగర్భంచ తద్బహి॥
అష్టపత్రే కేసరోద్యత్ స్వరద్వంద్వే మనోః క్రమాత్॥

శ్లో॥ ఆద్యే సప్త ద్వితీయేచ చతురార్ణో తృతీయకే
సప్తతుర్యే పంచమే చ త్రీణిలి ణ్యాత్షరాణ్యపి॥

శ్లో॥ షట్సప్తాష్టమ పత్రేషు చతురశ్చతురాక్షరాన్

శ్లో॥ వృత్తోల్లస త్కాదివర్ణం భూపురాశ్రిస్థ తారకం
చతురావరణాం శైవచక్ర స్యాస్య విలేఖయేత్॥

శ్లో॥ ప్రాణప్రతిష్ఠాం కుర్వీత కార్యసిద్ధి ర్భవే ద్ధ్రువం
హనూమతో యంత్ర మేత ద్వాంఛితార్థప్రదం పరమ్॥

తా॥ పై విధానమున యంత్రమును లిఖించి ప్రాణ

ప్రతిష్ఠ నొనర్చవలెను. దీనిచే తప్పక కార్యసిద్ధిజరుగును. కోరిన కోర్కెలు తప్పక తీర్చునట్టి దీ హనుమంతుని యంత్రము.

శ్లో॥ ఇద మేవ విలిఖ్య సాధుయంత్రం
నవనీ తే ప్రతిజప్య మంత్రమేనం
పరిభక్షయతా మనంగపీడా
ప్రశమం గచ్ఛతి శుద్ధమేతి చేతః॥

తా॥ ఈ గొప్పదగు యంత్రమును లిఖించి ఈ మంత్రమును వెన్నయందు జపించి దానిని తినువారికి మన్మథపీడ తొలగిపోవును. మనస్సు ప్రశాంతినొంది శుద్ధమగును.

శ్లో॥ ఆదాయ దోష్ణా సలిలం ప్రసన్నం
ప్రజప్య మంత్రం ప్రపిబేత్త్రివారం
రాగాది దోషప్రతిమాయ బుద్ధే
ర్జ్ఞానోదయాయ ప్రశమాయ వృత్తేః॥

తా॥ స్వచ్ఛమగు జలమును దోసిలితో తీసికొని మంత్రమునుజపించి మూడుమార్లు త్రాగినచో రాగ ద్వేషాదు లన్నియు తొలగి బుద్ధికి జ్ఞానోదయమై నిత్యవర్తనములందును బాధలు తొలగి శాంతియేర్పడును

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశర మైత్రేయ సంవాదే మదనక్షోభానివారక మంత్ర కథనం నామ షట్త్రింశత్పటలః

## సప్తత్రింశ త్పటలః

## మాలామంత్ర ప్రభావ కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశరాన్యం హనుమ న్మాలామంత్రం మహాద్భుతం
వదస్వ శ్రోతు మిచ్ఛామి సర్వాభీష్టార్థసిద్ధయే॥

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ పరాశర మహాముని, మహాద్భుతమైన వేరొక హనుమాన్మాలా మంత్రమును వినగోరుచున్నాను కాన కోరిన కోర్కెలెల్ల ఈడేరుటకొఱకు దానిని చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ అగస్త్య సంహితాయాం తు సుతీక్ష్ణాయ పురా మునే!
ఉదీరిత మగస్త్యేన తద్వదామి శృణుష్వ తత్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు, ఓ మైత్రేయ మహామునీ! పూర్వమిది అగస్త్య సంహితలో సుతీక్ష్ణనకు అగస్త్యునిచే చెప్పబడినది. ఆ కారణమున దానిని చెప్పు చున్నాను వినుము.

సుతీక్ష్ణః

శ్లో॥ సర్వజ్ఞ! సర్వదేవార్థ తత్త్వజ్ఞాన సునిశ్చల!
సర్వాశ్చ సంశితాశ్చాహం బహుధాపి కృపాంబుధే!

త్వయా కారుణ్యనిధినా పూర్వమజ్ఞస్తథాజడః॥

సుతీక్ష్ణుడు చెప్పుచున్నాడు

తా॥ ఓ సర్వజ్ఞుడవైన అగస్త్యమహామునీ! సమస్త దేవతల తత్త్వము నెరుగుటచే నిశ్చలబుద్ధికలవాడా! దయామయుడా! నేను కరుణామయుడవగు నీచే అనేక విధముల బోధింపబడితిని నీచే తెలియబడుటకు పూర్వము నేనజ్ఞానిని. చేతనరహితుడనుకూడ

శ్లో॥ త్వత్ప్రసాదేన సంజాతజ్ఞానోఽస్మి గతకల్మషః॥

తా॥ నీ యనుగ్రహముచే పాపములను పోగొట్టుకొని జ్ఞానవంతుడనైతిని.

శ్లో॥ రామాత్మని పరేబ్రహ్మణ్యాసక్తం మానసం మమ

లక్ష్మణేపి యథారామే కించిద్భేదేఽపినైవహి

తా॥ రాముడను పరబ్రహ్మయందు నా మనస్సు లగ్నమైనది. రామునివలె లక్ష్మణునియందును ఏమాత్రము భేదములేక ఆసక్తమైయున్నది.

శ్లో॥ హనూమన్మంత్ర ఇత్యుక్తః త్వయావై మునిపుంగవ

తస్యానుష్ఠాన మఖిలం జ్ఞాతుమిచ్ఛాస్తి మే ప్రభో!

మయిప్రపన్నః సకల మాచక్ష్వాసు దయానిధే!

తా॥ ఓ మునిశ్రేష్ఠా! నీచే హనుమన్మంత్రమని చెప్పబడినది. దాని యనుష్ఠాన విధానమంతను తెలియవలెనను కోరిక యున్నది. ఓ దయామయుడవైనవాడా! సర్వసమర్థుడా! నాయం దనుగ్రహముచూపి ఆ విషయమంతను వెంటనే తెలుపవలసినది.

అగస్త్యః

శ్లో॥ స్మారిత స్సమ్యగేవాహం త్వయా శ్రద్ధావతా మునే!
ఆంజనేయమను శ్లోకే భుక్తి ముక్త్యేక సాధనమ్
ప్రకాశితం శంకరేణ లోకానాం హిత మిచ్ఛతా॥

తా॥ అగస్త్యుడు చెప్పుచున్నాడు: ఓ సుతీక్ష్ణా! శ్రద్ధ కల నీచే నేను గొప్పగ స్మరింపబడితిని. ఆంజనేయ మంత్రము లోకమునకు భుక్తినీ, ముక్తినికూడ ఈయగల్గిన ఏకైక సాధనము. లోకములకు మేలుచేయగోరు శంకరునిచే ఆ మంత్రము తెలియజేయబడినది.

శ్లో॥ భూతప్రేత పిశాచాది శాకినీ బ్రహ్మరాక్షసాః
దృష్ట్వైవ ప్రపలాయంతే మంత్రానుష్ఠాన తత్పరమ్॥

తా॥ ఈ ఆంజనేయ మంత్రము ననుష్ఠించుటలో నిమగ్నుడైన వానిని చూచినంతనే భూత, ప్రేత, పిశాచాదులు, శాకినీ బ్రహ్మరాక్షసులును పారిపోవును.

శ్లో॥ ఋషి రీశ్వర ఏ వాస్య అనుష్టు ప్ఛంద ఇష్యతే
హనుమాన్ దేవతా ప్రోక్తో హ్రాం బీజం శక్తి హ్రీం తథా॥

తా॥ ఈ మంత్రమునకు ఈశ్వరుడే ఋషి. అనుష్టుప్ ఛందము. హనుమంతుడు దేవత. హ్రాం బీజము. హ్రీం శక్తియు చెప్పబడినవి.

శ్లో॥ కీలకం హ్రాత్రయం ప్రోక్తం పదకం తు హసౌ పునః
హనూమ త్ప్రీణనం చైవ ఫలమాద్య ముదీరితమ్॥

తా॥ హాత్రియము లకముగా చెప్పబడుచున్నది. 'హాంహాంహాం కీలకం అని యొక మతము. హ్రాం కీలక మనియు తెలియుచున్నది. హనుమంతుని ప్రీతియేఫలముగా చెప్పబడుచున్నది అనగా హనుమత్ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః అని యనవలెనట.

శ్లో॥ సర్వేప్సితానాం దాతృత్వమస్యైవా స్తినచాన్యతః
ప్రభావే నాస్య బహవః సిద్ధి మాపుస్తపోధన!

తా॥ కోరికలన్నియు నెరవేరుట ఈ మంత్రమునకే కలదు. వేరొకచో లేదు. ఓ తపోధనా! దీనిప్రభావముచే అనేకులు కార్యసిద్ధిని పొందిరి.

శ్లో॥ మంత్రోద్ధారం ప్రవక్ష్యామి శృణుష్వానన్యమానసః
మాయామాదౌ ప్రవిన్యస్య ఓం నమో హనుమత్పదమ్॥

తా॥ మంత్రోద్ధారము చెప్పుచున్నాను. అనన్య మనస్కుడవై వినుము. న్యాసములొనర్చి 'ఓం నమో హనుమతే' అనుపదముసుంచి

శ్లో॥ తత్ప్రకట సంయుక్త పరాక్రమపదం తథా
తదాక్రాంత పదోపేత దిఙ్మండల ముదీరయేత్॥

తా॥ 'ప్రకటసంయుక్తపరాక్రమ' అని పిదప ఆక్రాంత పదముతో కూడిన 'దిఙ్మండల'మును చెప్పవలెను. అనగా "ప్రకట సంయుక్త పరాక్రమాక్రాంత దిఙ్మండలాయ" అనవలెనట.

శ్లో॥ యశోవితాన ధవళీ కృత జగత్త్రితయాయచ
వజ్రదేహేతి రుద్రేతి అవతారపదం తథా॥

తా. 'యశోవితాన ధవళీకృత జగత్త్రితయాయ' అనవలెను 'వజ్రదేహాయ' అని 'రుద్రావతారాయ అని యనవలెను

శ్లో॥ సంబుధ్యంతం తథా లంకా పురీ దేహన మీరయేత్
ఉదధే ర్బంధనం చాపి దశశీర్ష పదం తథా
కృతాంతక పదం చోక్త్వా సీతా సమాశ్వాసన పదమ్॥

తా. ఇక సంబోధనాంతముగా పిదప పదములు చెప్ప వలెను. లంకాపురీ దహన శబ్దమును సంబుధ్యంతముగా చెప్పవలెననుట అనగా 'లంకాపురీ దాహక' ! అని చెప్ప వలెను. 'ఉదధిబంధక', 'దశశీర్ష కృతాంతక!' అని పదము వాడి ఆ పిదప 'సీతాసమాశ్వాసక'! అనుపదము నుంచవలెను.

శ్లో॥ అంజనాగర్భ సంభూత రామలక్ష్మణ పదం తథా
ఆనందకరం పశ్చాత్ కపిసైన్యపదం తథా॥

తా. 'అంజనాగర్భ సంభూత!' అని 'రామలక్ష్మణా నందకర !' అని ఆ పిదప 'కపిసైన్య' పదమునుంచి

శ్లో॥ 'ప్రాకార' పద ముచ్చార్య సుగ్రీవపద ముచ్చరేత్
సంధానపద ముచ్చార్య పర్వతోత్పాటనం పదమ్॥

తా. 'ప్రాకార' పద ముచ్చరించి అనగా 'కపిసైన్య ప్రాకార!' అనవలెననుట. 'సుగ్రీవ' పద ముచ్చరించి సంధాన పద మని అనగా 'సుగ్రీవసంధాత!' అనుట, 'పర్వ తోత్పాటక' అని యనవలెను.

శ్లో॥ బాలబ్రహ్మచారి న్నితి గంభీరశబ్ద పదం తథా
సర్వగ్రహ నాశనేతి సర్వజ్వ రోచ్చాటనం తథా॥

తా. 'బాలబ్రహ్మచారిన్' అని 'గంభీరశబ్ద'పదముపై సర్వగ్రహానాశన అని, 'సర్వజ్వరోచ్చాటన' అని,

శ్లో॥ ఢాకినీ విధ్వంసిని పదం తత స్తార ముదీరయేత్
మాయా హ్రత్రయ ముచ్చార్య హసా దేహి వదే త్తతః॥

తా. 'ఢాకినీ విధ్వంసన అని 'హ్రాం' 'హ్రీం' 'హ్రూం' అని చెప్పవలెను.

శ్లో॥ సర్వవిషపదం ప్రోక్త్వా హరహరేతి పదం తథా
పరబల క్షోభయ ద్వంద్వం మమేతిపద ముచ్చరేత్
సర్వకార్యాణిపదం చోక్త్వా సాధయేతి ద్విరుచ్యతే॥

తా. 'సర్వవిషం హర హర' అని పిదప 'పరబలం క్షోభయక్షోభయ' అని 'మమ' అనుపదము నుచ్చరించి 'సర్వ కార్యాణి' అని సాధయ సాధయ' అని రెండుమార్లనవలెను.

శ్లో॥ హుం ఫట్ స్వా హేతి మంత్రోఽయం మాలాఖ్య :
సర్వకామధుక్
భగవతే చాంజనేయాయ అంగుష్ఠాభ్యాం నమ స్తతః॥

తా. 'హుం ఫట్ స్వాహా' అని ఈ మంత్రముకోర్కెలన్నియు తీర్చగల మాలామంత్రము. 'ఓం నమో భగవతే చాంజనేయాయ అంగుష్ఠాభ్యాం నమః' అని మొదలుగా కరన్యాసాదిక మొనర్పవలెను.

వ. రుద్రమూర్తయే ఇత్యేవం తర్జని
వాయుసుతాయేతి మధ్యమా
అగ్నిగర్భా యానామికా

రామదూతాయ కనిష్ఠికా
బ్రహ్మాస్త్రనివారణాయ
అస్త్రమన్త్ర ముదీరితమ్॥

తా. 'ఓం రుద్రమూర్తయే నమః తర్జనీభ్యాం నమః'
'ఓం వాయుసుతాయ నమః మధ్యమాభ్యాం నమః'
'ఓం అగ్నిగర్భాయ నమః అనామికాభ్యాం నమః'
'ఓం రామదూతాయనమః కనిష్ఠికాభ్యాం నమః'
'ఓం బ్రహ్మాస్త్ర నివారణాయనమః కరతలకరపృష్ఠాభ్యాం నమః' అని న్యాస మొనర్చవలెను.

శ్లో॥ ప్రణవాది నమశ్శబ్దం షడంగాని సముచ్చరేత్
ఏవం షడంగం చ ముఖే కృత్వా ధ్యాయే దనన్యధీః॥

తా. 'ఓం' అను ప్రణవమును ముందుంచి 'నమః' శబ్దముతో షడంగముల నుచ్చరించి అంగన్యాస మొనర్చి ఏకాగ్రతతో ధ్యాన మొనర్చవలెను.

ధ్యానమ్ :-

శ్లో॥ స్ఫటికాభం స్వర్ణకాంతిం ద్విభుజాభ్యాం కృతాంజలిం
కుండలద్వయ సంశోభి ముఖాంభోజ మహం భజే॥

తా. స్ఫటికముతో సమానమైనట్టి, బంగారమువంటి కాంతికల్గినట్టి, రెండు చేతులతో అంజలిఘటించియున్నట్టి కుండలద్వయముతో ప్రకాశించునట్టి ముఖపద్మమును నేను సేవించుచున్నాను.

శ్లో॥ అయుతం తు పురశ్చర్యా రామస్యాగ్రే శివస్య వా
పూజాం తు వైష్ణవే పీఠే శైవే వా విదధీత వై॥

తా. ఈ మంత్రమునకు పురశ్చర్య పదివేలు. వైష్ణవ పీఠమున, శైవపీఠమున కాని రాముని యెదుట కాని శివుని యెదుట కాని హనుమంతుని పూజ విధింపబడినది.

శ్లో॥ దశాంశం తర్పణం హోమం భోజనం చ ప్రకీర్తితం
సంస్కారేణ వినా వీర్యం మంత్రస్యాస్య న జాయతే॥

తా. మంత్రజపమునకు దశాంశము తర్పణము, తద్దశాంశము హోమము, తద్దశాంశము అన్న శాంతియు చెప్పబడినది, ఈ మంత్రమునకు మంత్ర సంస్కారములగు 'జనన, జీవన తాడనాదు'లగు పదియును లేకుండ శక్తిరాదు.

శ్లో॥ ఆవృత్తిభిర్వినా నిత్యం నిష్ఫలం విజితేంద్రియ!
క్షుద్రరోగ నివృత్త్యర్థం అష్టోత్తరశతం మునే॥

తా. ప్రతిదినము ఆవృత్తి లేక మంత్రము నిష్ఫలమగును. క్షుద్రరోగ నివారణకొఱకు ఓ మహామునీ! నూట యెనిమిదిసార్లు జపించవలెను.

శ్లో॥ జప్త్వా త్రిదిన మేకాంతే తేభ్యో ముచ్యేత తత్క్షణాత్
క్షుద్రభూత ప్రశాంత్యర్థం శత మష్టోత్తరం పునః
దినత్రయ మతో జప్త్వా భూతానాం ముచ్యతే భయాత్॥

తా. మూడురోజులు ఏకాంతముగ అట్లుజపించిన ఆ క్షుద్రరోగములనుండి తత్క్షణము ముక్తుడగును, క్షుద్రభూతముల ప్రశాంతికొరకు మరల నూటయెనిమిది పర్యాయములు చెప్పబడినది. కావున అట్లు మూడురోజులు జపించిన సర్వ భూతముల భయమునుండి బయటపడును.

శ్లో॥ భూతప్రేత పిశాచాది శాంతయేఽష్టోత్తరం శతం
జప్త్వైవ తద్భయా న్మర్త్యో భవత్యేవ న సంశయః॥

తా. భూత ప్రేత పిశాచాదిశాంతికై నూటయెనిమిది పర్యాయములు జపించవలెను. అట్లు జపించిన నిస్సందేహముగా భూతాదికము యొక్క భయము తొలగును.

శ్లో॥ మహారోగాది శాంత్యర్థం అష్టోత్తరసహస్రకం
తప్త్వా లిసాం ప్రవిముచ్యేత నియతో నియతాశనమ్॥

తా॥ మహారోగములు పోవుటకు వేయి యెనిమిది సార్లు జపించవలెను. నియమముతో జపించి నియమితాహారముతో నున్న ఆ మహారోగములనుండి రక్షింపబడును.

శ్లో॥ జయాదికాంక్షిణాం రాజ్ఞాయస్మా దన్యో న విద్యతే
ధ్యాయే ద్దుష్టస్య హంతారం అయుతం నియతాశనః॥

తా. జయకాంక్షియగు రాజు శత్రునాశకమై దుష్టులను సంహరించుటకు ఈమంత్రమును పదివేలసార్లు నియమితాహారుడై జపించవలెను.

శ్లో॥ జప న్నయుతమాం శ్చైవ జయే ద్దుర్జయ మస్య కిం
సంధానార్థం తు సుగ్రీవ సంధాతారం స్మరన్ హృది
అయుతేనైవ బలినా సంధి మాప్నో త్యసంశయః॥

తా. పదివేలసార్లు జపించుటచే జయింప నలవికాని వానినికూడ జయించునను టలో సందేహము లేదు రాజులు శత్రురాజులతో సంధికోరినచో రామునకు సుగ్రీవునితో స్నేహమేర్పరచిన హనుమంతుని హృదయమున తలచుచు

పదివేలసార్లు జపించుటచేత ఎంతటి బలవంతునితో నయిన నిస్సందేహముగా సధిరి కుదుర్చుకొనగల్గును.

శ్లో॥ లంకాయాం దాహకం ధ్యాయన్ జపన్నయుత మంజసా
శత్రురాష్ట్రం దహేద్దేవ దుస్సాధ్య మపి చానఘ!
జయార్థే శత్రుసంఘాన మస్మాదన్యో న విద్యతే॥

తా. ఓ పాపరహితా! లంకాపట్టణమును కాల్చిన హనుమంతుని ధ్యానించుచు పదివేలు జపించుటచే దేవతలకును సాధ్యముకాని శత్రురాజ్యమును వెంటనే దహింపవచ్చును విజయాకాంక్ష కలవానికి శత్రుసంహారమున ఈ మంత్రమునకు మించిన మంత్రములేదు.

శ్లో॥ యస్తు గేహే హనూమంతం సర్వదేవాంశ్చ పూజయేత్
తద్గృహే తస్య మంత్రేణ తస్య లక్ష్మీ రచంచలా॥

తా. ఎవడైతే ఇంటిలో హనుమంతుని, దేవతలందరను పూజించునో ఆ హనుమంతుని మంత్రమువలన లక్ష్మి స్థిరముగ నుండును.

శ్లో॥ దీర్ఘ మాయుర్లభే దేవం సర్వతో విజయీ భవేత్
మార్యాది భూతసంక్షోభం తద్దేశే నైవ జాయతే

తా॥ అట్టివానికి దీర్ఘాయువు లభించును అట్లే అంతట విజయమునే పొందును ఈ మంత్రమును జపించువాని దేశమున మారి మున్నగు భూతముల కలతకూడ యుండదు

శ్లో॥ శత్రవ స్సర్వదా మిత్ర భావేనై వాసతే పరం
శైవానాం వైష్ణవానాం చ షట్కర్మాద్యుక్త
చేతసామ్

నాన్య త్సాధన మస్త్యేవ మంత్రా దస్మా ద్ధనూమతః

తా. శత్రువులెల్లప్పుడు మిక్కిలి మిత్ర భావముతోనే యుందురు. శైవులకు, వైష్ణవులకు, షట్కర్మలగు యజన యాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహములు చెప్ప బడినవార లందరకు ఈ హనుమన్మంత్రముకన్న ఇతర సాధనము లేదు.

శ్లో॥ చోర వ్యాఘ్రాది భూతానాం అయ మేవ పరాయణం
పరాపహృత రాజ్యానాం ధర్షితానాం పరైః పునః
సన్నాహభాజాం యుద్ధేషు యోద్ధానాం పరసైనికైః

తా. దొంగలు, పులులు మున్నగువాని యెడ, భయ పడినవారికి, శత్రువులచే అపహరింపబడిన రాజ్యముకలవారికి, శత్రువులచే బెదరింపబడువారికిని ఈ మంత్రమే శరణ్యము. యుద్ధసంరంభమున నున్నవారికి, శత్రుసేనలతో యుద్ధ మొనర్చువారికిని ఈ మంత్రమే రక్ష

శ్లో॥ యాత్రాకాలే హనూమంతం స్మృత్వా యస్తు స్వకా ద్గృహాత్
నిర్గచ్ఛతి స వై సద్యః స్వేష్టా ర్థ మధిగచ్ఛతి
స్వాపకాలే పఠే న్నిత్యం చోర భూతాని వారయేత్

తా. యాత్రాకాలమున హనుమంతుని స్మరించుచు ఎవడైతే తన ఇంటినుండి బయటకు బయలుదేరునో వాడు వెంటనే తన ఇష్టమును పొందును. నిద్రించు సమయమున నిత్యము పఠించిన దొంగలు, భూతాదికము నివారింపబడును.

శ్లో॥ కుండినం నామ నగరం శ్రీభద్రం కుశతర్పణం
పంపాతీరం చంద్రకోణం కాంభోజం గంధమాదనమ్

తా. కుండినమను పేరుగల నగరము, శ్రీభద్రము, కుశతర్పణము పంపాతీరము, చంద్రకోణము, కాంభోజము, గంధమాదనము.

శ్లో॥ బ్రహ్మావర్తపురం చైవ బార్హస్పత్యపురం తథా
మాహిష్మతీపురం చైవ నైమిశారణ్యమేవ చ

తా. బ్రహ్మావర్తపురము మరియు బార్హస్పత్యపురము మాహిష్మతీపురము, నైమిశారణ్యము,

శ్లో॥ సుందరీనగరం చైవ రమ్యం శ్రీ హనుమత్పురం
ఏతాని హనుమద్భక్త పుణ్యస్థానాని నిత్యశః
యస్స్మరేత్ప్రాతరుత్థాయ భుక్తిం ముక్తిం చ విందతి

తా. సుందరీనగరము మరియు రమ్యమగు శ్రీహనుమత్పురము అను నివి హనుమద్భక్తులకు పుణ్యస్థానములు. వీనిని ప్రతిదినము ఉదయమున లేచిన వెంటనే ఎవడు స్మరించునో వానికి ఇహమున భుక్తియు, పరమున ముక్తియు సిద్ధించును. పై నగరములు ఆయా గాథలచే ప్రసిద్ధములు. హనుమంతునకు హనుమద్భక్తులకు ముఖ్యములు. క్రమముగా కుండిన నగరము ధ్వజదత్తచరితము నందలిది. ఇది తొమ్మిదవ పటలమున గలదు శ్రీభద్రనగరము సుముఖచరిత్రము నందలిది. ఇది పదునాల్గవ పటలమునగలదు. కుశతర్పణ నగరము హరిశర్మ చరిత్రమునందలిది. అది ఇరువదిమూడవ

పటలమున కలదు. పంపాతీరము శ్రీనారదుల చరిత్రనందలిది. ఇరువది యొకిమిదవ పటలమున గలదు. చంద్రకోణనగరము విజయచరిత్రమునందలిది. పదునైదవ పటలమున గలదు. కాంభోజనగరము యువనాశ్వచరిత్రమునందలిది. ఇది ముప్పది యెనిమిదవ పటలమునగలదు. గంధమాదన పర్వతము జాంబవదాదులగూర్చి చెప్పుటలో కలదు. ఇరువదియవ పటలమున గలదు. బ్రహ్మావర్తపురము కశ్యపచరిత్రమునందు గలదు. ఇది ఇరువదిరెండవ పటలమున నున్నది. బార్హస్పత్యపురము కపిలచరిత్రమునందలిది అది ఇరువదియవ పటలమున గలదు. మాహిష్మతీపురము సోమదత్తచరిత్రమునందలిది. ఇది నాల్గవపటలమునందుగలదు. నైమిశారణ్యము ధ్వజదత్త చరిత్రమునందలిది. అది ఎనిమిదవ పటలమునందు గలదు సుందరీనగరము మైంద చరిత్రమునందలిది. అది ముప్పది యైదవ పటలమునగలదు. శ్రీ హనుమత్పురము హనుమద్భక్త బ్రాహ్మణుల చరిత్రమునందలిది. నలుబదిమూడవ పటలమునందు ఇది కలదు ఇట్టి హనుమత్క్షేత్రములను ప్రతి నిత్యము స్మరించుట, ఆయా పీఠములకు సంబంధించిన గాథ తెలిసికొనుటయు గొప్ప పుణ్యప్రదములుగా తెలియుచున్నవి. ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీపంచముఖ హనుమద్విషయకే పరాశరమైత్రేయసంవాదే శ్రీహనుమన్మాలా మంత్రప్రభావ కథనం నామ సప్తత్రింశత్పటలః

# అష్టాత్రింశత్పటలః
## యవనాశ్వచరిత్ర కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర మహాయోగిన్ మారుతేః పరమద్భుతం
వద మన్త్రప్రభావం మే శ్రోతు మిచ్ఛామి తత్త్వతః

తా॥ శ్రీ మైత్రేయులవారడుగుచున్నారు. ఓ పరాశర మహాయోగీ! పరమాద్భుతమగు హనుమంతుని మంత్ర ప్రభావమును వినుటయందిష్టుడనై యున్నాను. కావున నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః

శ్లో॥ పురా వాల్మీకినా ప్రోక్తం హనూమన్మంత్ర ముత్తమం
సంక్షేపతః ప్రవక్ష్యామి శృణు నాన్యమనా మునే!

తా॥ శ్రీ పరాశర మహాముని చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! పూర్వము వాల్మీకిచే చెప్పబడిన ఉత్తమమగు హనుమన్మంత్రమును చెప్పుచున్నాను. అన్యమనస్కుడవు కాక వినవలసినది.

శ్లో॥ పురా కాంభోజనగరే యవనాశ్వ ఇతి శ్రుతః
బ్రాహ్మణో జటిలో నిత్యం శివపూజాపరాయణః

తా॥ పూర్వము కాంభోజనగరమున యవనాశ్వుడను జటాధారియు, శివపూజాదురంధరుడు నగు బ్రాహ్మణుడు కలడు.

శ్లో॥ ఉపవాసమిషేణైవ మోహయామాస లౌకికాన్
శక్తిక్షేత్రం సమాగమ్య భోవాస బహువత్సరమ్

తా॥ ఆతడు జనులను ఉపవాస మను నెపమున నమ్మించుచుండెను శక్తిక్షేత్రమునకు వచ్చి అట చాల సంవత్సరములుండెను.

శ్లో॥ అర్పితం కుసుమం చాపి పంచగవ్య ఫలాని చ
కేనాపి నైవభోజ్యాని అంధకూపే వ్యనిక్షిపత్

తా. సమర్పింపబడిన పూలు, పంచగవ్య ద్రవ్యములు పండ్లు ఎవరికిని తినుటకు లగక వానిని పాడునూతిలో పడవైచెను.

శ్లో॥ షణ్మాసం తత్ఫలాశీ చ క్షీ రాజ్య మధుసేవకః
అపస్మారీ సమభవ త్తస్మిన్ జన్మని త ద్విజః

తా. ఆరునెల లట్లు ఫలములను తిని, పాలు, నేయి, తేనెలు త్రాగి ఆ జన్మముననే ఆ బ్రాహ్మణుడు మూర్ఛల వ్యాధినందెను.

శ్లో॥ కేనార్పితం తు యద్వస్తు తద్దివ్యం వస్తు భక్షయేత్
యస్సంత్యజే త్ప్రసాదం తి మపస్మారీ సజాయతే

తా. దైవమున కర్పింపబడిన వస్తువు దివ్యవస్తువు కాన భక్షింపవలెను అట్లు కాక ఆ ప్రసాదము నెవడైతే విడచిపెట్టునో వాడు అపస్మార వ్యాధిగ్రస్తుడగును.

శ్లో॥ ఏవం గతే బహుదినే బ్రాహ్మణో గాధినందనం
ప్రణమ్య స్వస్య వృత్తాన్తం స్వదేహస్థితి మేవ చ
విజ్ఞాపయామాస తదా యవనాశ్వో ద్విజోత్తమః

తా॥ ఇట్లు చాలరోజులు గడవగా యువనాశ్వుడను ఆ బ్రాహ్మణుడు గాధిసుతుడగు విశ్వామిత్రునకు నమస్కరించి తన వృత్తాంతమును, తన శరీర స్థితిని తెలియజేసెను.

శ్లో॥ శ్రుత్వా ద్విజస్య వృత్తాన్త మశేషం చ తపోనిధిః
దయార్ద్ర మానసో భూత్వా విశ్వామిత్రో మహామునిః
ధ్యాత్వా చోపదిదేశాస్మై సుందరీ ప్రథమం మనుమ్

తా. తపోనిధియగు విశ్వామిత్రుడు ఆ బ్రాహ్మణుని వృత్తాంతమును పూర్తిగ విని దయాపూర్ణహృదయుడై సుందరీ ప్రథమ మంత్రమును ధ్యానమొనర్చి ఆ యువనాశ్వున కుపదేశించెను.

శ్లో॥ శ్రీ సుందరీ ప్రథమ మంత్రస్య వాల్మీకిఋషి రుచ్యతే
ఆంజనేయో దేవతా చ మారుతాత్మజ బీజకమ్

తా. శ్రీ సుందరీ ప్రథమమంత్రమునకు వాల్మీకి ఋషిగా చెప్పబడుచున్నాడు. ఆంజనేయ దేవతాకము. మారుతాత్మజబీజము (వ్రాత ప్రతులన్నింట నొకేరీతి నుండుటచే మంత్రాదికవిషయమున ఛందోభంగమును సరించకపోవటమైనది.)

శ్లో॥ శక్తి శ్చాప్యం జనాసూను ర్వాయుపుత్రేతి కీలకం
మమ సకల శబ్దంచ పురుషార్థం చ ఉచ్చరేత్
విని యోగపదం చైవ క్రమేణ మను రుచ్యతే

తా. 'అంజనాసూనుశ్శక్తిః, 'వాయుపుత్రః కీలకం' అని చెప్పి 'మమ సకల' అని 'పురుషార్థము' నుచ్చరించి

వినియోగము చెప్పవలెను. అనగా 'మమ సకలపురుషార్థసిద్ధ్యర్థే జపే వినియోగః' అని వినియోగము చెప్పవలెననుట ఇట్లు క్రమమున మంత్రము చెప్పఁబడుచున్నది.

ధ్యానమ్—

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరు మూల వాసినం
భావయామి పవమాన నందనమ్

తా. మిక్కిలి ఎరుపైన ముఖము కలిగినట్టియు మేరుపర్వతమువలె మనోహరమైన ఆకారము కల్గినట్టియు, పారిజాతవృక్షము మొదట నివసించియుండునట్టియు వాయుకుమారుడైన ఆంజనేయుని తలంచుచున్నాను.

శ్లో॥ ఇతి ధ్యాత్వా జపేదార్తో మారుతే ర్మనుమాదరాత్

తా. అని ధ్యానమొనర్చి హనుమంతుడే శరణ్యమని భావించి దీనుడై ఆదరముతో హనుమన్మంత్రమును జపించవలెను.

శ్లో॥ హనూమా నంజనా సూను ర్వాయుపుత్రో మహాబలః
కపీన్ద్రః పింగళాక్ష శ్చ లంకాద్వీప భయంకరః

తా. (1) హనుమంతుడు, (2) అంజనా సూనుడు, (3) వాయుపుత్రుడు (4) మహాబలుడు (5) కపీన్ద్రుడు, (6) పింగళాక్షుడు (7) లంకాద్వీప భయంకరుడు.

శ్లో॥ ప్రభంజనసుతో వీరః సీతాశోక వినాశకః
అక్షహంతా రామసఖః రామకార్య ధురంధరః

తా. (8) ప్రభంజనసుతుడు, (9) వీరుడు (10) సీతా శోక వినాశకుడు (11) అక్షహంత, (12) రామసఖుడు, (13) రామకార్య ధురంధరుడు.

శ్లో॥ మహౌషధిగిరేర్హారీ వానరప్రాణదాయకః
హరీశతారక శ్చైవ మైనాకగిరి భంజనః

తా. (14 మహౌషధిగిరిహారి (సంజీవనిపర్వతము తెచ్చినవాడు). (15) వానర ప్రాణదాయకుడు, (16) వారీశతారకుడు (సముద్రము దాటినవాడు) (17) మైనాకగిరి భంజనుడు.

శ్లో॥ నిరంజనో జితక్రోధః కదలీవన సంవృతః
ఊర్ధ్వరేతా మహాసత్త్వః సర్వమంత్ర ప్రవర్తకః

తా. 18 నిరంజనుడు (దోషములేనివాడు) 19 జితక్రోధుడు 20 కదలీవన సంవృతుడు 21 ఊర్ధ్వరేతసుడు (ఇంద్రియములను జయించినవాడు) 22 మహాసత్త్వుడు (గొప్పబలము కలవాడు) 23 సర్వ మంత్ర ప్రవర్తకుడు.

శ్లో॥ మహాలింగ ప్రతిష్ఠాతా భాష్యకృ జ్జగతాం వరః
శివధ్యాన పరో నిత్యం శివపూజా పరాయణః

తా. 24 మహాలింగ ప్రతిష్ఠాత 25 భాష్యకారుడు 26 జగద్వరుడు 27 శివధ్యాన పర నిత్య శివపూజా పరాయణుడు

శ్లో॥ సప్తవింశతి సంఖ్యాకా న్యేతాని (1) హనూమతః
ఫర నామాని సో విప్రో నియమేనా ప్యతంద్రితః
తేన శాంతి స్సముభవ దపస్మారస్య ధీమతః

తా. ఆ బ్రాహ్మణుడు ఈ యిరువదియేడు హనుమంతుని నామములను తొట్రుపాటులేక నియమముతో పఠించుచుండ ఆ నామముల ప్రభావమున బుద్ధిశాలియగు యవనాశ్వుని అపస్మారవ్యాధి తగ్గిపోయెను.

శ్లో॥ బహుకాలం హనూమంతం ధ్యానం కుర్వన్ ప్రపూజయన్
యవనాశ్వో మహావిప్రః శ్లాఘ్యే కాంభోజపట్టణే

తా. బ్రాహ్మణశ్రేష్ఠుడగు యవనాశ్వుడు ప్రశస్తమగు ఆ కాంభోజ పట్టణమునందు చాలకాలము హనుమంతుని ధ్యానించుచు, పూజించుచు గడిపి,

శ్లో॥ పుత్ర మిత్ర కళత్రాద్యైః పరిచారైశ్చ బంధుభిః
ఇహ భుక్త్వాఖిలాన్భోగాన్ పూజ్యాన్పుణ్య ఫలార్జితాన్
ఆంజనేయ ప్రభావేన విష్ణులోకమవాప సః

తా. పుత్రులు, మిత్రులు, భార్య మున్నగువారితోను; పరిచారక బృందముతోను; బంధువులతోను కూడి పూజ్యములు, పుణ్యముచే సముపార్జింపబడినవి యగు సమస్తములగు ఐహిక భోగములను అనుభవించి ఆంజనేయ ప్రభావముతో విష్ణులోకము నందెను

శ్లో॥ కథాం మన్యాం ప్రవక్ష్యామి ప్రతాపం శ్రీ హనూమతః
శృణు మైత్రేయ విప్రేంద్ర సమ్యగ్భక్తి సమన్వితః

తా. బ్రాహ్మణ శ్రేష్ఠుడా! మైత్రేయా! శ్రీ హనుమంతుని ప్రతాపమునకు సంబంధించిన వేఱొక కథను చెప్పుచున్నాను మిక్కిలి భక్తికలవాడవై వినవలసినది.

శ్లో॥ రామే విరళదంతత్వం లక్ష్మణే పాదకింకిణీ
సీతాయా శ్ఛిన్నరోమాణి తస్మాత్క్లేశసహిష్ణుతా

తా. రాముడు, లక్ష్మణుడు, సీతయు ఎప్పుడు ధర్మము నవీడలేదు. అయినను వారే మిక్కిలి కష్టము లనుభవించిరి అందుకు కారణమైన సాముద్రిక లక్షణ మిందు చెప్పబడుచున్నది. రామునకు దంతములు ఎడముగ నుండుట లక్ష్మణుని నడకలో కింకిణులు మ్రోగుట, సీతా దేవి వెంట్రుకలు నిలువున చీలియుండుటచే వారు కష్టములు సహించవలసి వచ్చుటకు కారణములు. యీ శ్లోకము కొన్ని పాఠములందు లేక పోవుటచే ప్రక్షిప్త మని యనుమానింపదగియున్నది. సందర్భోచితముగ కూడ కానరాదు.

శ్లో॥ తతో రావణనీతాయాః సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి

తా జాంబవంతుడు మున్నగు వారి స్తోత్రముచే దేహముపెంచి శత్రునాశకుడగు హనుమంతుడు రావణునిచే గొంపోబడిన సీతయొక్క జాడ నెఱుగుటకు ఆకాశ మార్గమున పోవ గోరెను ఇది సుందరకాండములో ప్రథమ శ్లోకమగుట విశేషము.

శ్లో॥ సముద్రమధ్యే హ్యుత్పన్నాః అంతరాయాః పృథక్ పృథక్
తాని సర్వాణి నష్టాని దాన మశ్రోత్రియే యథా

తా. సముద్ర మధ్యమున వేలువేలుగా ఏర్పడిన ఇబ్బందు లన్నియు అశ్రోత్రియున కిచ్చిన దాన మేరీతిగా వ్యర్థ మగునో అట్లు తొలగిపోయినవి.

ఈశ్వరః

శ్లో॥ శ్రీరామ సేవినాం నౄణాం న కదాచి త్క్షయః ప్రియే
శ్రీరామస్మరణా దేవ తరంతి భవసాగరం

తా. యీశ్వరుడు పార్వతితో యిట్లు చెప్పెను: ఓ ప్రియురాలా! శ్రీరాముని సేవించు నరుల కెన్నటికిని నాశము జరుగదు. వారు శ్రీరామ స్మరణము వలననే సంసార సముద్రమును దాటగల్గుదురు.

శ్లో॥ రామాంకితధరో వార్థిం తీర్త్వా న్విక్రమేణ హి
ప్రదోషే ప్రవిశ ల్లంకాం హనూమా న్వానరేశ్వరః

తా. రామముద్రను స్వీకరించి పయనించు హనుమంతుడు పరాక్రమముతో క్రమముగా సముద్రముదాటి ప్రదోష సమయమునకు లంకను ప్రవేశించెను

శ్లో॥ లంకాప్రవేశ సమయే లంకానామ నిశాచరీ
పద్మాసనా ల్లబ్ధవరా తాడయామాస వానరమ్

తా. లంకలో ప్రవేశించు సమయమున బ్రహ్మవర మందిన లంకా యను రాక్షసి వానరుడగు హనుమంతుని కొట్టెను

శ్లో॥ నారీతి మన్యమానేన తాడితా వామబాహునా
విహ్వలా వికృతాకారా పపాత సమరక్షితౌ

తా. ఆడుది కావున లంకిణిని ఎడమచేతితో కొట్టగా ఆ దెబ్బను కది అవయవములు పట్టుతప్పగా వికృతమైన ఆకారముతో ఆ యుద్ధప్రదేశమున పడెను.

శ్లో॥ విహ్వాలాం భగినీం జ్ఞాత్వా బ్రహ్మలోకా న్నిశాచరీ
విషూచీ లోకసంహర్త్రీ కర్కశా ఘోరరూపిణీ

తా. లోకమును నాశనమొనర్చు విషూచి అను కఠోరము ఘోరము అయిన రూపము కల రాక్షసి తన సోదరి వివశయైనదని యెఱిగి బ్రహ్మలోకమునుండి

శ్లో॥ అగత్య హనుమ న్నికట ముహాచేదం మహాస్వనా
బ్రహ్మజ్ఞావర్తినీం హ్యేషా లంకాయాం కామరూపిణీ

తా. హనుమంతుని కడకు వచ్చి గొప్ప ధ్వనితో నిట్లనెను 'యీమె బ్రహ్మయొక్క ఆజ్ఞచే కోరిన రూపము కలదై లంకయందుండునట్టిది.

శ్లో॥ హతా త్వయా కథం వీర లంకినీ భగినీ మమ
యద్బ్రహ్మవర లబ్ధాహ మతి విక్రమ శాలినీ
తస్మాదహం హనిష్యామి క్షణేన త్వాం సమీరజ

తా. ఓ వీరుడా! బ్రహ్మవరము పొందినట్టి గొప్ప పరాక్రమము కలిగినట్టి నా సోదరియైన లంకిణి నీచేత ఎట్లు చంపబడినది? ఆ కారణముచే వాయుపుత్రా! నిన్ను నేనొక్క క్షణములో చంపెదను చూడుము.

శ్లో॥ వక్రదండం గృహీత్వా సా హనూమంతం సమాయయౌ
హనుమంతం తు దండేన కర్కశా తాడయ త్స్వయమ్

తా. అని విషూచి ఒక వంకర దండమును తీసికొని హనుమంతునికడకువచ్చి కర్కశయగు ఆ రాక్షసి స్వయముగా హనుమంతుని కొట్టజొచ్చెను.

శ్లో॥ తాం జ్ఞాత్వా లోకసంహర్త్రీం తద్ధస్తాద్వక్రదండకం
గృహీత్వా తాడయామాస సా పపాత మమారచ

తా. లోక సంహర్త్రియగు దానిని తెలిసికొని దాని చేతినుండి వక్రదండము తీసికొని దానినే కొట్ట మొదలిడగా నది నేలపై బడి చచ్చెను.

శ్లో॥ తస్మిన్ క్షణే సమాయాతో బ్రహ్మా లోక పితామహః
ఉవాచ రామదూతం తం క్రోధవిస్ఫురితోష్ఠకమ్

తా. అదే సమయమున లోకపితామహుడగు బ్రహ్మ వచ్చి కోపముతో వణకు పెదవికల రామదూతయగు హనుమంతునితో నిట్లనెను.

శ్లో॥ జ్ఞానీ త్వం దోషరాహిత్యా ఆకల్ప పరివర్తనం
దత్వా మదంతికే బద్ధ్వా స్థాపితా లోకఘాతుకీ

తా. ఓ హనుమంతా! నీవు జ్ఞానివి. ఈ లోకఘాతుకియగు విషూచి దోషరాహిత్యము, కల్పాంతమువరకు తిరుగనిచ్చి నాకడ బంధించి ఉంచబడినది.

శ్లో॥ మా మనాదృత్య సా దుష్టా విషూచీ లోకఘాతుః

తా. నన్ను మోసగించి 'దుష్టురాలగు నీ మెలోకమును నాశనమొనర్చుచున్నది

శ్లో॥ ఇదం లోకహితా యైవ జపతాం పవనాత్మజ!
ఆసయా పీడ్యమానానాం మర్త్యానాం మర్తుమిచ్ఛతామ్

తా. ఈ సంఘటనము లోకహితముకొఱకే. ఓ వాయుపుత్రా! దీనిచే పీడింపబడువారు, చావనెంచువారు నగు మనజులు నీ మంత్రమును జపించినచో

శ్లో॥ త్వన్నామస్మరణేనైవ త్వన్మంత్ర పఠనాదపి
త్వత్పాదపూజనా చ్చాపి బ్రాహ్మణానాం చ
పూజనాత్

తా. నీ నామము స్మరించుటవలనను, నీ మంత్రమును పఠించుటవలనను, నీపాదముల నర్చించుటవలనను బ్రాహ్మణ పూజవలనను.

శ్లో॥ శాంతి ర్నిత్యం భవ త్యేవ జపా దస్మా చ్చ మారుతే

తా. ఈ జపమువలన ఓ వాయునందనా! నిత్యము శాంతి చేకూరును.

శ్లో॥ శ్రీరామముద్రాదానం చ యే శృణ్వం త్యాదరేణతు
నిర్జిత్య శత్రూ న్ సంగ్రామే స్థిరం రాజ్యం వ్రజంతి తే

తా. శ్రీరామ ముద్రాదానకథ నెవ్వరాదరమున విందురో వారు యుద్ధమున శత్రువులను జయించి స్థిరమగు రాజ్యమును పొందుదురు.

శ్లో॥ భవే ల్లోకహితో ధర్మః విషూచీ వధ కారణాత్

తా. విషూచీవధ కారణమున లోకమునకు మేలగును.

శ్లో॥ సప్తవింశతి నామాని లోకే తవ పఠంతి యే
విషూచీ వ్యాధయ స్తేషాం న భవంతి కదాచన

తా. నీయొక్క ఇరువదియేడు నామములు నెవరు చదువుదురో వారి కెప్పటికిని విషూచీవ్యాధిరాదు. విషూచి యనగా కలరా.

శ్లో॥ రామాంకితధరో భూత్వా ప్రణయి త్వాథ జానకిం
సంతుష్టమానసం రామం కృత్వా కపికులోత్తమ!

తా. రామముద్రను స్వీకరించి సీతామాతను సంతృప్త నొనర్చి రామునికూడ సంతోషింపజేసి ఓ వానర శ్రేష్ఠుడా!

శ్లో॥ శ్రీరామాత్ పరమం శ్రేయో లబ్ధ్వా కీర్తిం చ సుస్థిరాం
నానా లోకాధిపో భూత్వా దేవదేవో భవిష్యసి

తా. శ్రీరామునివలన పరమశ్రేయమును శాశ్వతమగు కీర్తినిపొంది నానాలోకముల కధిపుడవై దేవదేవుడవు కాగలవు.

శ్లో॥ ఇత్యుక్త్వా తం సమాధాయ యయౌ లోకపితామహః
చచార మారుతి ర్లంకాం రాక్షసానాం కులే కులే

తా. అని పలికి హనుమంతుని సమాధానపరచి లోకపితామహుడగు బ్రహ్మ వెడలెను. హనుమంతుడు రాక్షసులచే వంకులముగ నున్న లంకలోనికి ప్రవేశించెను.

శ్లో॥ దదర్శ రాక్షసాం స్తత వేదఘోష సమన్వితాం
అగ్నిహోత్రాంశ్చ వేదాంశ్చ రాక్షసానాం కులేకులే

తా. అచ్చట ఆ రాక్షస సమూహమున వేదఘోషలతో కూడిన రాక్షసులను, అగ్నిహోత్రము ను వేదములను చూచెను.

శ్లో॥ దయా సత్యం చ శౌచం చ రాక్షసానాం నవిద్యతే
భక్షంతి మదవస్తూని యే జనాః తామసాత్మనా

తా. దయ, సత్యము, శౌచము రాక్షసులకు లేవు. వారు తామసబుద్ధితో మదవస్తువులను తినుచుండిరి.

శ్లో॥ తేషాం దయా చ సత్యం చ శౌచం నాస్తి న సంశయః

తా. వారికి నిస్సందేహముగా దయా సత్యశౌచములు లేవు.

శ్లో॥ పురాంధకాసురో గౌర్యా దుష్టాచారో యథాహతః
తథా హతో దశగ్రీవః సీతయా చ భవిష్యతి

తా. పూర్వము దుష్టాచారవర్తనుడగు అంధకాసురుడేరీతిగా గౌరీదేవిచే సంహరింపబడెనో అట్లు రావణుడుకూడ సీతచే రాబోవుకాలమున సంహరింపబడగలడు.

శ్లో॥ పార్వత్యై శంకరేణైవం వృత్తాంత స్సముదీరితః

తా. ఇట్లు పార్వతికి శంకరునిచే ఈవృత్తాంతమంతయు చెప్పబడినది.

ఈశ్వరః—

శ్లో॥ బ్రాహ్మణానాం సురాపేయ గౌడ్యాద్యాః పాపకారణాః
సురాశలాన్యస్య భక్ష్యాణి శ్రుతి స్తు న సురాం పిబేత్

తా. ఈశ్వరుడు చెప్పుచున్నాడు. బ్రాహ్మణులకు కల్లుత్రాగుట, బెల్లపుసారాయివంటివియు పాపకారణములు. ఇతర భక్ష్యములును కొన్ని మద్యముతో కూడినట్టివి. వేదము మాత్రము మద్యము త్రాగరాదని చెప్పుచున్నది.

శ్లో॥ ఆర్ద్రికం సగుడం మద్యః సైంధవం బాడబం తథా
నారికేళాంబు కాంస్యే చ తథా సమ్మిశ్రితో గుడః

తా. బెల్లముతో కూడిన అల్లము మద్యముతో సమానమే. అట్లే రాతిఉప్పుతో కూడిన అల్లముకూడ. కంచుపాత్రియందలి కొబ్బరినీళ్ళు, వానితో కూడిన బెల్లముకూడ మద్యసమములే.

శ్లో॥ సర్షపం చైవ తక్రే స్యాత్ తామ్రగవ్యం సురాసమం
తామ్రే గుడరసం చైవ సురాయా తులితం బుధైః

తా. మజ్జిగతోకూడిన ఆవాలు రాగిపాత్రయందలి ఆవుపాలు మున్నగు గవ్యద్రవ్యములును మద్యముతో సమానములు. రాగిపాత్రయందు బెల్లపు పానకముకూడ పండితులచే మద్యసమముగా చెప్పబడుచున్నది.

శ్లో॥ న శబ్ద భక్షణం చాపి తర్జన్యాం దంతశోధనం
శూద్ర ప్రేషిత భుక్తం చ పుష్పిణీ ముఖసేవనమ్

తా. నిశ్శబ్దముగా భోజనము చేయుట, చూపుడు వ్రేలితో పండ్లు తోముకొనుట, శూద్రునిచే నంపబడిన భోజనము ముట్టుత మోమును ముద్దిడుట మద్యపానముతో సమానములు.

శ్లో॥ అకాలేఽభ్యంజనం చాపి శిష్టతైలస్య భక్షణం
పలాండు పలాండుం చ పీయూషం వ్యంజనం తథా

తా. కాలముకాని కాలమున నలుగుపెట్టిచేయు తలంటిస్నానము, దైవనిమిత్తముంచిన పవిత్రతైలమును వాడుట, నీరుల్లి, క్యాబేజి, జున్నుపాలు, పెసరపుంగము మున్నగునవియు మద్య సమములే.

శ్లో॥ కందం చ రక్తకందం చ రక్తశిగ్రుం తథైవ చ
ఉపోదకం కుంభ శాకం స్త్రీభిర్భుక్తావశిష్టకమ్

తా. బంగాళదుంప, బీట్ రూట్, ఎఱ్ఱముల్లంగి, దుంప బచ్చలి, అంతర తామర, ఆడువారు భోజనముచేయగా మిగిలిన పదార్థముకూడ మద్యముతో సమానము.

శ్లో॥ న దోషా మాతృకల్పాసు పరలోకస్య పీడకాః
శుక్ర శాపా త్పురా దేవి! సురా పానం న దూష్యతి

తా. తల్లివంటివారు భోజనము చేసినపిదపైనచో ఆ దోషము లేదు. స్త్రీలైనను వారియెడ ఈదోషము వర్తించదు. ఓ పార్వతీ! శుక్రశాపమునకు పూర్వము సురాపానము దోషము కాదు.

శ్లో॥ అత్రేతిహాసం వక్ష్యామి శృణు శైలసుతే! ప్రియే!
పురా రాథం తరే కల్పే వర్తమానే కలౌ యుగే
కల్పాంతర వధార్థాయ గతే మయి శుచిస్మితే

తా. ఓ పార్వతీ! ఈవిషయమున ఒక ఇతిహాసమున్నది. చెప్పుచున్నాను వినవలసినది. ఈ కలియుగమువందలి రాథంతరమనుకల్పమున పూర్వము నేను కల్పాంతర మందలి రాక్షస సంహార నిమిత్తము వుండగా—

శ్లో॥ అంధకో నామ దైత్యేంద్రో బ్రహ్మదత్త వరో బలీ
బ్రహ్మాణం వజ్రిణం జిత్వా చక్రపాణి మనంతరమ్
గోవర్ధనం గిరివరం ప్రాప్తవాన్ జయకాంక్షయా

తా. బ్రహ్మచే ఈయబడిన వరములుకల్గి బలవంతుడైన అంధకుడను పేరుగల రాక్షసుడు బ్రహ్మను దేవేంద్రుని పిదప విష్ణుమూర్తిని ఓడించి జయించుకోర్కెతో గోవర్ధన పర్వతమును చేరెను.

శ్లో॥ శైలాధివాస మజని జాయమానేఽన్యముల్బణం

తా. ఇతరులందరు కష్టములందగా ఆతడా పర్వతమును పొందెను.

(ఇచ్చట మూలము కొంత లుప్తమైయుండునని తోచుచున్నది.)

శ్లో॥ త్రిశూల క్షతగాత్రేభ్యో హ్యంధకస్య శివేన వై
తత్ర తత్రోఽపి బహవో హ్యంధకాకార వర్చసః

తా॥ శివునియొక్క త్రిశూలముచే దెబ్బతిన్న అంధకుని దేహమునుండి అక్కడక్కడ ఎన్నియో అంధక దేహములు

శ్లో॥ సముత్పన్నాస్తు తైః పూర్ణం త్రైలోక్యం స చరాచరమ్
పరాఙ్ముఖగతో నందీ శివస్యాంతఃపురం గతః

తా॥ పుట్టినవి. వానిచే చరాచరముగనున్న ముల్లోకములు నిండినవి. నందీశ్వరుడు వెనుకంజవైచి శివుని అంతఃపురమును చేరెను.

శ్లో॥ త్వద్గృహే శేముషీం కృత్వా త్వాం ధ్యాయన్ త్రిపురేశ్వరి
త్వదీక్షణార్థ నిర్దిష్ట విష్ణుమాయాం విశారదామ్

తా॥ ఓ త్రిపురేశ్వరీ! నీ నిలయమందు బుద్ధినుంచి నిన్నే ధ్యానించుచు నీ రక్షణ కార్యక్రమమున నుండు విష్ణుమాయను

శ్లో॥ అభ్యర్ణ మాగతాం జ్ఞాత్వా అసృజత్ సాహి కామినీ
దేవ్యా విసృష్టా దేవేశి! త్వద్రూపిణ్యో వరాననే

తా॥ సమీపమునకు వచ్చినదానిని గుర్తించి దేవి ఆకారములను సృష్టించెను. అట్లు సృష్టింపబడినవారు నీరూపము కలవారుగ నుండిరి.

శ్లో॥ తా స్త్స్వకాం పరిజగ్రాహ మృడానీ శంకయా కిల
విని ర్గతే విరూపాస్తే విష్ణు మాయావశా దభూత్
పున రన్యం చ సాప్యేవ పున రన్యం చ సా ప్యభూత్

తా. వారిని పార్వతిగా శంకించి అంధకరూపులలో ఒక్కొక్క రొక్కొక రూపమును పట్టుకొనిరి. విష్ణుమాయ యొక్క శక్తివలన వారు కురూపులైరి. ఇట్లొక్కొక రొక్కొకరికి చొప్పుననైరి. (మధ్య మధ్య శ్లోకములు లుప్తమైనట్లు తెలియుచున్నవి. కాని లభించినవి కావు.)

శ్లో॥ ఏవం కాలే బహుగతే దేవి! క్రోధవశంగతాః

తా. ఓ పార్వతీ! ఇట్లు చాలకాలము గడువగా ఆశక్తి స్వరూపిణులు క్రోధమందినవారై

శ్లో॥ నవద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాం కరీషిణీం
క్షీయామపరిఖాం దివ్యాం దివ్య సంస్కార సంస్కృతాం
సృష్ట్వాధిష్ఠాయ నగరీం సృష్టా దేవ్యా మహాబలాః

తా. తొమ్మిది ద్వారములు కల్గినట్టి, తిరస్కరింపలేనట్టి సంపత్పూర్ణమైనట్టి, అమృతపు నగ్తకల్గి దివ్యమైన సంస్కారముకల నగరమును నిర్మించుకొనియుండి దేవిచే నిర్మింపబడినవారగు

శ్లో॥ నిత్యా చ నిత్యక్లిన్నా చ చాముండా వహ్నివాసినీ
మదద్రవా చ యోగిన్యో వశిన్యా ద్యా శ్శుచి స్మితాః
తాంత్సర్వా న్భక్షయామాసు ర్దైత్యా నంధకవత్ స్థితాన్

తా. నిత్య, నిత్యక్లిన్న చాముండ, వహ్నివాసిని, మదద్రవ, శళిని మున్నగు యోగినులు అంధకునివలెనున్న ఆ రాక్షసు లెందఱను భక్షించిరి.

శ్లో॥ నిత్యక్లిన్నాపి సహసా జఠరే రాక్షసర్షభం
కల్పం బభార కల్పాంతే జీర్ణోభూద్రాక్షసర్షభః

తా. నిత్యక్లిన్నయను యోగిని వెంటనే ఆ రాక్షసుని తన జఠరయందు కల్ప పర్యంతకాలము భరించెను. కల్పాంతమున ఆ రాక్షసుడు జీర్ణమయ్యెను.

శ్లో॥ తస్యా ద్దివ్యాం రమాదేవ్యాః పతిబింబ సముత్థితా
నీలాసితా వేదవతీ సా జాతా జనకాత్మజా

తా. అట్టి దివ్యయు లక్ష్మి ప్రతిబింబమునుండి పుట్టిన వేదవతియే జనకుని కుమార్తెయైనది.

శ్లో॥ లోక సంకర్షణార్థాయ సాధు తిష్ఠతి శోభనే!
సీతాదర్శన మాకర్ణ్య వీతశోకో భవిష్యతి

తా. ఓ పార్వతి! లోకరక్షణార్థమే ఆమెయున్నది. సీతా దర్శనము విన్నవాడుకూడ దుఃఖములనుండి విముక్తుడగును

శ్లో॥ లక్ష్మీస్తస్య గృహే నిత్యం అనపాయీ భవిష్యతి
పుత్ర వృద్ధిం జ్ఞానవృద్ధిం ధాన్యవృద్ధిం తథైవ చ
గృహారామ కళత్రాణాం వృద్ధి ర్నిత్యం భవిష్యతి

తా. లక్ష్మి అట్టివానియింట ఎల్లప్పుడు కదలకయుండును. వానియింట పుత్ర జ్ఞాన ధాన్యవృద్ధులు, ఇల్లు, ఆవరణము, భార్య వీనియాభివృద్ధియు జరుగును.

శ్లో॥ ప్రస్థానం రోచయామాస రావణస్య వధాయవై
శ్రుత్వా యః పరమప్రీత్యా హనూమద్విజయాంకితమ్
ఆంజనేయ ప్రసాదేన విష్ణులోకం స గచ్ఛతి

తా. పిదప రావణ వధకొఱకై ఇష్టముకల్గించి హనుమంతుడు రాముని బయలుదేరదీసెను. ఇట్టి హనుమద్విజయాంకిత గాథను పరమప్రీతితో విన్నవాడు ఆంజనేయుని అనుగ్రహమువలన విష్ణులోకము పొందును.

శ్లో॥ ఇతి మారుత వాక్యేన ప్రీతో రఘుపతి ర్భృశం

తా అను పైరీతిని హనుమద్వాక్యమునకు రాముడు మిక్కిలి ప్రీతి నందినవాడై

శ్రీరామః—

శ్లో॥ ఏకైక స్యోపకారాయ ప్రాణాన్ దాస్యామి హే కపే
ప్రత్యహం క్రియమాణేన శేషస్య ఋణితో వయమ్

తా నీయొక్క ఒక్కొక ఉపకారమునకే ప్రాణమును సమర్పింతును. ప్రతిదినము చేయు మిగిలిన సేవంతకు ఋణపడియే ఉందును.

శ్లో॥ అంగేష్వేవ జరాయాంతు యత్త్వయోపకృతం కపే
యన్నిశీధే చ హనుమాన్ భ్రాతా మే జీవిత స్త్వయా

తా ఈ అవయవములందు వార్ధక్యము తొలగిపోవుగాక! ఎందుకన నీచే యెంతయో ఉపకారము చేయబడినది. ఓ హనుమంతా అర్ధరాత్రి సమయమున నా సోదరుడు నీచే బ్రతికింపబడినాడు.

శ్లో॥ ఉపకారేణ సుగ్రీవో రాజ్యం కాంక్షన్ విభీషణః
నిష్కారణ స్తుహనుమన్ త్వమేవాతః ప్రమోదకః

తా॥ సుగ్రీవ విభీషణులు ఉపకారమునకు ప్రతిగా రాజ్యముకోరిరి హనుమంతా! నిష్కారణముగ సహాయమొనర్చిన నీవే నాకు ప్రమోదము కల్గించినవాడవు.

శ్లో॥ సర్వస్వభూతం గృహ్ణీష్వ పరిష్వంగో మయా కృతం
వరం దదామి పింగాక్ష సర్వకార్యవశో భవ

తా॥ సర్వస్వమునకు సమానమైన నా ఆలింగనమును గైకొనుము. ఓ పింగళనేత్రుడా! నీకు వరమిచ్చుచున్నాను. సర్వసమర్థుడవగుము.

శ్లో॥ త్వన్మంత్ర జాపినాం నిత్యం త్వన్నామ స్మృతికారిణాం
త్వద్రూప పూజకానాం చ సర్వకార్యపరో భవ

తా॥ నీ మంత్రమును నిత్యము జపించువారికి, నీ నామము స్మరించువారికి, నీ రూపమును పూజించువారికి సర్వకార్యములు నెరవేర్చుము.

శ్లో॥ మత్కథాపేక్షితా యావత్ యావత్పర్వత సంస్థితిః
యావచ్చంద్రశ్చ సూర్యశ్చ తావత్త్వం సుఖితో భవ

తా॥ ఎంతవరకు లోకమున నాకథ అపేక్షింపబడుచుండునో, ఎంతవరకు పర్వతములు, సూర్యుడు చంద్రుడు నుందురో అంతవరకు నీవు సుఖివై యుండుము.

శ్లో॥ పశ్చాచ్చతుర్ముఖో భూత్వా సృష్ట్వా లోకాన్ యథావిధి

తా. పిదప బ్రహ్మనై యథావిధిగా లోకములను సృజించి-

శ్లో॥ మల్లోకవాసిభి స్సాకం మత్స్వరూప ముపైష్యసి
ఇతి దత్వా వరం రామో అనుజగ్రాహ మారుతిమ్

తా. మల్లోకవాసులతో కూడి నా సారూప్యమును పొందగలవు అని రాముడు వరమిడి హనుమంతుని అనుగ్రహించెను

ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీ పంచముఖ హనుమ ద్వాపరణే యౌవనాశ్వచరిత్రకథనం నామ అష్టాత్రింశఃపటలః

## ఏకోనచత్వారింశత్పటలః

## హనుమ ద్విగ్రహ ప్రతిష్ఠా కథనం

శ్రీ మైత్రేయః

శ్లో॥ హనూమద్విగ్రహ ప్రాణ ప్రతిష్ఠాపన లక్షణం
తత్ప్రకారం సమాచక్ష్వ పరాశర మహామునే

తా. శ్రీ మైత్రేయులవా రడుగుచున్నారు. ఓ పరాశర మహామునీ! నాకు హనుమద్విగ్రహ ప్రాణ ప్రతిష్ఠాపన లక్షణమును చెప్పవలసినది.

శ్రీ పరాశరః—

శ్లో॥ రజతేన సువర్ణేన తామ్రేణ శిలయాపి వా
యుక్తాంచి ద్రజితం స్వర్ణ మిశ్రితేనాஉథ వా మునే!

తా. శ్రీ పరాశరులవారనుచున్నారు. ఓ మైత్రేయ మహాముని! వెండితో కాని, బంగారముతో కాని రాగితో కాని, లేదా శిలతో కాని, అటుకాకున్న కొంత వెండి, బంగారము మిశ్రమముచేసికాని విగ్రహము చేయవలెను

శ్లో॥ తామ్రేణ విగ్రహం దివ్యం ధ్యానమార్గేణ కారయేత్

తా ధ్యానపూర్ణుడై రాగితో దివ్యమగు విగ్రహమును చేయించవలెను.

శ్లో॥ శ్రావణే కార్తికే మాఘే మార్గశీర్షేఽథ ఫాల్గుణే
వైశాఖే జ్యేష్ఠమాసే చ శుభలగ్నే శుభేదినే

తా. శ్రావణమాసమునగాని, కార్తీకమునగాని. మాఘమాసమునగాని, మార్గశీర్షమునగాని, ఫాల్గుణమాసమునగాని, వైశాఖమునగాని, జ్యేష్ఠమాసమునగాని, శుభలగ్నమునందు, శుభదినమునందు.

శ్లో॥ శాంతేన శిల్పకారేణ విగ్రహం కారయే త్సుధీః
సంతుష్టమానసం కృత్వా శిల్పకారం గుణోత్తమం
యత్కించిత్ప్రదమూల్యం చ దత్వా విగ్రహమాదరాత్

తా. శాంతుడగు శిల్పకారునిచే బుద్ధిశాలియగువాడు విగ్రహము చేయించవలెను. గుణోత్తరుడగు ఆ శిల్పకారుని సంతుష్టునిచేసి కొంతగా ధనవస్త్రాదుల నిచ్చి ఆదరముతో విగ్రహమును గ్రహించవలెను.

శ్లో॥ హనూమద్విగ్రహం దేవ మాదాయ చ శుభేదినే
శ్రావణే కార్తికే మాఘే మార్గశీర్షేఽథ ఫాల్గుణే

తా శుభదినమునందు విగ్రహస్వరూపుడగు హనుమ

దైవతమును తీసికొనివచ్చి శ్రావణమాసమునగాని, కార్తీక
మున, మాఘమున, మార్గశీర్షమున లేదా ఫాల్గుణమాస
మునగాని

శ్లో॥ జ్యేష్ఠే వైశాఖమాసే చ పుష్యమాసే విశేషతః
గుర్విందు భృగువారేషు మందవారే విశేషతః

తా॥ జ్యేష్ఠమాసమునకాని, వైశాఖమాసమునకాని
విశేషించి పుష్యమాసమునగాని, గురు, సోమ, శుక్రవారము
లందుకాని ప్రత్యేకించి శనివారమునగాని

శ్లో॥ ఆర్ద్రాదిపంచకే చైవ రోహిణ్యాం మృగశీర్షకే
ఉత్తరా హస్త చిత్తాసు పూర్వాభాద్రాఖ్య ఋక్షకే

తా. ఆర్ద్రాది పంచ నక్షత్రములందును, రోహిణి
యందును, మృగశిర నక్షత్రమునందును, ఉత్తర, హస్త,
చిత్త, పూర్వాభాద్ర నక్షత్రములందును,

శ్లో॥ శ్రావణేచ ధనిష్ఠాయాం పుష్యే శతభిషే తథా
ఏతేష్వఖిలదేవానాం ప్రతిష్ఠా ఫలదా స్మృతా

తా. శ్రావణమాసమున ధనిష్ఠానక్షత్రమునందును,
పుష్యమాసమున శతభిషానక్షత్రమందును పైచెప్పిన సమయ
ములందు సమస్తదేవతల ప్రతిష్ఠయు ఫలప్రదమైనట్లుగా చెప్ప
బడుచున్నది.

శ్లో॥ నిర్వర్త్య కర్తా పూర్వేద్యు ర్నిత్య కర్మ యథావిధి
హనుమ ద్విగ్రహ ప్రాణ ప్రతిష్ఠాం సిద్ధకర్మణి

తా. ప్రాణప్రతిష్ఠ చేయువాడు యథావిధిగ క్రిందటి
రోజు నిత్యకర్మల నాచరించి నిర్ణీతకర్మయందు హనుమ
ద్విగ్రహ ప్రాణప్రతిష్ఠను

శ్లో॥ కరిష్యే మీతిసంకల్ప్య కృత్వా పుణ్యాహవాచనమ్
శుచౌ దేశే మహారమ్యే మంటపం చతురశ్రకమ్

తా॥ చేయుచున్నాను అని సంకల్పించి పుణ్యాహ వాచన మొనర్చి రమ్యము, శుభము అగు ప్రదేశమున చతురశ్రముగా మంటపమును

శ్లో॥ కృత్వా సంస్థాపయే త్తత్ర కదళీ పాదపాన్ముఖాన్
పల్లవైః కోమలైః పుష్పైః నానామణిగణై స్తథా
అలంకారయుతాం స్తత్ర తోరణాదీం శ్చకారయేత్

తా॥ చేసి అచ్చట మంచి అరటిచెట్లను, మెత్తని చిగురుటాకులతో, పూవులతో, వివిధములగు మణులతో చక్కగా అలంకరింపబడిన తోరణములను అమర్చవలెను.

శ్లో॥ విచిత్రరంగవల్లీం చ లేఖయే త్సు విరాజితమ్
త్రివారం మంటపే వాస్తోష్పత ఇత్యుచ్చరే త్తతః

తా॥ చిత్ర విచిత్రములుగా ముగ్గులు తీర్చవలెను. పిమ్మట మూడుమార్లు "వాస్తోష్పతే శం చతుష్పదే" అను మంత్రము నుచ్చరించవలెను.

శ్లో॥ స్థాపయేత్ స్థూలకలశం మంటపే తండులోపరి
అథాష్టదిక్షు దిక్పాల కలశాం స్థాపయే త్సుధీః

తా॥ మంటపమున బియ్యముపై స్థూలకలశస్థాపనము చేయవలెను పిమ్మట ఎనిమిది దిక్కులందు బుద్ధిశాలియగు వాడు కలశస్థాపనము చేయవలెను.

శ్లో॥ ఆదౌ బ్రహ్మకలశం చ స్థాపయే త్పూర్వభాగతః

సర్వేషాం కలశానాం చ కంఠేషు మునిసత్తమ
తంతునా పంచధాఽఽవృత్త్యా కారయే ద్బంధనం తతః

తా. మొదట పూర్వభాగమున బ్రహ్మకలశమును స్థాపించవలెను. ఓ మైత్రేయ మహాముని! అన్నికలశములకు కంఠప్రదేశమున ఐదు అవృత్తులుగా దారముతో బంధన మొనర్పవలెను.

శ్లో॥ జంబూప్లక్ష వటాశ్వత్థ రసాల ద్రుమ పల్లవాః
ఇత్యేతే మునిశార్దూల వక్ష్యంతే పంచపల్లవాః

తా నేరేడు, జువ్వి, మఱ్ఱి, రావి, మామిడిచెట్ల చిగుళ్ళు ఓ మైత్రేయా! పంచపల్లవములుగా చెప్పబడు చున్నవి.

శ్లో॥ ప్రధానకలశ స్యాంతః నిక్షిపే త్పంచ పల్లవాన్
నదీజలం సమాపూర్య ఫలపుష్పాణి నిక్షిపేత్

తా. పై చెప్పిన పంచపల్లవములను ప్రధానకలశము నం దుంచవలెను. నదీజలముతో దానిని నింపి ఫలపుష్పాదుల నుంచవలెను.

శ్లో॥ పఠే చ్చ బ్రహ్మజిజ్ఞానం బ్రహ్మణః కలశస్య చ
ఆరాధనం ప్రకుర్వీత ఆచార్య కలశస్య చ
ఆరాధనం పూర్వవ చ్చ మూలమంత్రేణ యత్నతః

తా. బ్రహ్మజిజ్ఞానం అను మంత్రము నుచ్చరించి బ్రహ్మకలశమునకు, ఆచార్యకలశమునకును ఆరాధన

మొనర్చవలెను. ఆరాధనము ప్రయత్నపూర్వకముగ వెనుకటి వలె మూలమంత్రముతో నొనర్చుట

శ్లో॥ ప్రణవాది చతుర్థ్యంతై ర్నమోంతై స్స్వ స్వనామభిః
ఇంద్రాది సర్వదిక్పాల కలశా నపి పూజయేత్

తా. ఓంకారముతో నారంభించి చతుర్థీ విభక్త్యంతముగా వారివారి నామములు చెప్పుచు నమశ్శబ్ద మంతముగా చెప్పుచు ఇంద్రాది దిక్పాలకుల కలశములను పూజింపవలెను. 'ఓం ఇంద్రాయ నమః' ఇత్యాదిగా చెప్పవలెననుట

శ్లో॥ ఏతే ష్వష్టకలశేషు నమోంతై స్స్వస్వనామభిః
ప్రణవాది చతుర్థ్యంతైః పూజయేచ్చ యథాక్రమమ్

తా. ఈ ఎనిమిది కలశములందును ఆ యా దిక్పాలకుల నామములు ప్రణవాది చతుర్థ్యంత నమోఽంతము లుగా చెప్పుచు క్రమము ననుసరించి పూజింపవలెను.

శ్లో॥ జాంబవ ద్వినతాద్యైశ్చ కుర్యా దావరణం తతః
జాంబవా న్వినతో నీలః పనసో గంధమాదనః

తా. పిమ్మట జాంబవంతుడు, వినతుడు మున్నగు వారికికూడ ఆవరణ పూజ చేయవలయును. జాంబవంతుడు వినతుడు, నీలుడు, పనసుడు, గంధమాదనుడు.

శ్లో॥ సుషేణ మైంద ద్వివిదాన్ కలశేషు ప్రపూజయేత్
యథాశక్తి హిరణ్యం చ సర్వకలశేషు నిక్షిపేత్

తా. సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు అను వారికి కలశము లేర్పరచి పూజించవలెను. అన్ని కలశములందు శక్తి ననుసరించి ధనమునుకూడ ఉంచవలెను

శ్లో॥ గంధపుష్పై రలంకృత్య వస్త్రాలంకరణం తతః
బ్రహ్మ విష్ణు మహాదేవ దుర్గా గణపతీం స్తథా
సూర్యాది సర్వదేవాంశ్చ నమస్కృత్య యథాక్రమమ్

తా. గంధ పుష్పాదుల నలంకరించి పిదప వస్త్రాలంకరణము చేసి, బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, దుర్గ, గణపతి, సూర్యాది దేవతలకు క్రమముగా నమస్కరించి

శ్లో॥ ఆప్యాయ స్వేతి మంత్రేణ క్షీర మానీయ తాం తతః
శుక్రమ స్వేతి మంత్రేణ ఘృత మానీయ తాం మునే!

తా. "ఆప్యాయస్వ..." అను మంత్రముతో పాలను తీసికొనిరావలెను. "శుక్రమసి..." అను మంత్రముతో నేతిని తీసికొనిరావలెను

శ్లో॥ దధిక్రావ్ణో ఇతి మంత్రేణ దధి మానీయతా మథ
మధువా తేతి మంత్రేణ మధు మానీయతాం మునే

తా. "దధిక్రావ్ణో" అను మంత్రముతో పెరుగు తీసికొనిరావలయును, ఓ మైత్రేయమునీ! పిదప "మధువాతా." అను మంత్రముతో తేనెను తీసికొనిరావలెను.

శ్లో॥ శర్కరేతి చ మంత్రేణ గుడ మానీయతాం తతః
అయం గౌరితి మంత్రేణ గంధద్వారేతి మంత్రతః
ఏతన్మంత్ర ద్వయం చోక్త్వా గోమయం సంగ్రహే త్తతః

తా. పిదప "శర్కరా..." అను మంత్రముతో బెల్లమునుతీసికొనిరావలెను. "అయంగౌ" అను మంత్రమును 'గంధద్వారా..." అను మంత్రముతోను ఈ రెండు మంత్రములు చెప్పుచు గోమయమును తేవలెను.

శ్లో॥ గాయత్ర్యా చ గోమూత్ర మానీతం మంగళప్రదం
హిరణ్యవర్ణ మంత్రేణ జలమానీయతాం తతః

తా. గాయత్రిని జపించుచు మంగళప్రదమగు గోమూత్రమును తేవలెను. "హిరణ్యవర్ణాం..." అను మంత్రముతో జలమును తీసికొనిరావలెను.

శ్లో॥ జలేన పంచగవ్యేన మేళనం కారయే త్సుధీః
ప్రధానకలశే రమ్యే సర్వమేత త్ప్రపూరయేత్

తా. విజ్ఞుడగు కర్త నీటితో పంచగవ్యమును కలుప వలెను. ఈ ద్రవ్యమంతను రమ్యమగు ప్రధాన కలశము నందు నింపవలెను.

శ్లో॥ గోమూత్రం గోమయం చైవ గోక్షీరం గోఘృతం తథా
గోదధ్యేతాని పంచాని గవ్యానీతి విచక్ష్యతే

తా ఆవుమూత్రము ఆవుపేడ, ఆవుపాలు, ఆవు నేయి, ఆవుపెరుగు అను అయిదు పంచగవ్యము లనబడు చున్నవి.

శ్లో॥ గోక్షీరం గోఘృతం చైవ మధు గోదధి శర్కరాః
పంచామృతాని చైతాని కథ్యంతే మునిపుంగవ!

తా. ఆవుపాలు. ఆవునేయి తేనె ఆవు పెరుగు. పంచదార అనునవైదును ఓ మునిశ్రేష్ఠా! పంచామృత ములుగా చెప్పబడుచున్నవి.

శ్లో॥ కర్మణ్యస్మిన్ ప్రతిష్ఠాఖ్యే ద్వ్యాచార్యో భవేతి చ
ద్విజోత్తమం నియుఙ్క్తేకం కర్తా స్వయమేవ వా

తా. స్వయముగ తాను కర్తయగుచునే ఈ ప్రతిష్ఠా

కర్త్రయందొక బ్రాహ్మణుని 'త్వమాచార్యోభవ' అని ఆచార్యునిగా నియోగించి

శ్లో॥ ఆపోవేతి చ మంత్రేణ ప్రధాన కలశోదకం
కరే నిక్షిప్య విధివత్ అభిమంత్ర్య మునీశ్వర!

తా. ఓ మైత్రేయమునీ! ప్రధానకలశమందలి యుదకము చేతియందుంచుకొని "ఆపోవా ఇదగ్ం..." అను మంత్రముతో అభిమంత్రించి

శ్లో॥ పరివేష్ట్య నవం వస్త్రం మాల్యాః పుష్పాణి చందనం
తులసీం చ కుశాగ్రాణి ఫలాని వివిధాని చ

తా. కలశమును నూతనవస్త్రముతో చుట్టి, గరిక, పుష్పములు, చందనము, తులసి, దర్భ చివరభాగములు, వివిధ ఫలములు,

శ్లో॥ యథాశక్తి హిరణ్యం చ ఘటమధ్యే వినిక్షిపేత్
బంధనం కారయే ద్ధీమాన్ ఔదుంబర సమిత్త్రయమ్

తా. శక్తికొలది ధనమును ఆ కలశమునం దుంచవలెను. ఔదుంబర సమిత్త్రయమును అనగా మామిడి, మేడి, రావి ముక్కలను బంధించవలెను.

శ్లో॥ దర్భరజ్వా త్రిధావృత్య పృష్ఠభాగే హనూమతః
స్థాపయే త్పీఠమధ్యే చ హనూమ ద్విగ్రహం తతః

తా. దర్భత్రాటితో వానిని బంధించి హనుమంతుని వెనుకభాగమున నుంచుచు హనుమద్విగ్రహమును పీఠ మధ్యభాగమున నుంచవలెను.

శ్లో॥ కస్తూరి చందనాద్యైశ్చ తిలకం ధారయే త్సుధీః
పరివేష్ట్య నవం వస్త్రం మూలమంత్రేణ యత్నతః

తా. మూలమంత్రముతో చక్కగా నూతన వస్త్రమును చుట్టి స్వామికి కస్తూరి చందనాదులతో ధీశాలియగు కర్త తిలక మేర్పరచవలెను.

శ్లో॥ స్నానం పంచామృతైర్దివ్యైః కారయే న్మూలమంత్రతః
అబ్లింగమంత్రైః కుర్వీత స్నానం శుద్ధోదకై స్తథా

తా. మూలమంత్రముతో దివ్యములగు పంచామృతములతో స్నానము చేయించవలెను. పిదప అబ్లింగమంత్రములతో శుద్ధోదక స్నానము చేయించవలెను.

శ్లో॥ పంచోపచారా న్దేవాయ యథావిధి సమర్పయేత్
గంధం, పుష్పం చ ధూపం చ దీపం నైవేద్య మేవ చ
ఉపచారాశ్చ పంచైతే మునిభిః పరికీర్తితాః

తా. దేవునకు యథావిధిగా పంచోపచారములు సమర్పించవలెను. గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము అనునవి యైదు పంచోపచారములుగా మునులచే చెప్పబడుచున్నవి

శ్లో॥ సుగంచమేతి మంత్రేణ ఘటే దేవం వినిక్షిపేత్
మంత్రై రుపనిషద్భిశ్చ తథావారుణ సూక్తకైః
అబ్లింగమంత్రైః శ్చాన్యైశ్చ తథా వైదశ శాంతిభిః

తా. "సుగంచమ..." అను మంత్రముతో స్వామిని కలశమందుంచవలెను. ఉపనిషన్మంత్రములతోను, వారుణ సూక్తములతోను, అబ్లింగ... మంత్రములతోను, అన్య మంత్రములతోను, దశశాంతులతోను,

శ్లో॥ పంచామృతై శ్శుద్ధతోయై స్స్నాపయే ద్ధనుమ త్ప్రభుం
పంచోపచారా న్దేవాయ దిక్పాలేభ్య స్సమర్పయేత్

తా॥ పంచామృతములు, శుద్ధ జలములతో శ్రీ హనుమంతుని స్నానము చేయించవలెను. హనుమంతునకు దిక్పాలకులకును పంచోపచారములు సమర్పింపవలెను.

శ్లో॥ హనూమ ద్దక్షిణేభాగే నీలం చైవ ప్రపూజయేత్
జలాధివాసః కర్తవ్యో యామమాత్రం చ స్వామినః

తా. హనుమంతునకు కుడివైపున నీలుని కూడ పూజింపవలెను. ఒక జాము సమయము స్వామిని జలమునం దుంచవలయును.

శ్లో॥ కారయే ద్వాద్యఘోషం చ మహోత్సవకరం యథా
ఏవం జలాధి వాసస్య ప్రకారః కథ్యతే బుధైః

తా. మహోత్సవముగా వాద్యఘోషముకూడ చేయించవలెను. ఇట్లు పండితులచే జలాధివాసవిధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉత్తిష్ఠ బ్రాహ్మణ ఇతి జలస్థం దేవ ముద్ధరేత్
కదలీవనమధ్యే తు రంగవల్లీం ప్రకల్పయేత్

తా. "ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే..." అను మంత్రంతో జలమునం దుంచబడిన స్వామిని పైకి తీయవలెను. అరటి తోటమధ్య ముగ్గు నేర్పాటుచేయవలెను.

శ్లో॥ తత్ర పీఠే మహారమ్యే యామమాత్ర మనంతరం
సుగంచమేతి చోచ్చార్య స్థాపయే దంజనాసుతం

తా అచ్చట మిక్కిలి రమ్యమగు పీఠమున ఒక జాము సమయమయిన పిదప "సుగంచ మే..." మంత్రము నుచ్చరించుచు శ్రీ హనుమంతుని యుంచవలెను.

శ్లో॥ హనుమత్తాపనీయేన దేవం పంచామృతై శ్శుభై
స్నానం శుద్ధోదకై ర్దివ్యైః కారయే చ్చ యథావిధి

తా. హనుమత్తాపనీయోపనిషన్మంత్రములతో శ్రీ హనుమంతుని శుభప్రదములగు పంచామృతములతోను స్వచ్ఛజలములతోను యథావిధిగా స్నానము చేయించవలెను.

శ్లో॥ కృత్వా పంచోపచారాంశ్చ గీతవాద్యాంశ్చ కారయేత్
యేవం చ కదళీవానః ప్రకారః కథ్యతే బుధైః

తా పంచోపచారము లొనర్చి గీతవాద్యములను కావించవలెను. ఇట్లు కదళీవనమున స్థాపించు విధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉత్తిష్ఠ బ్రహ్మణ ఇతి కదళీవనమధ్యతః
పున ర్దేవం సముద్ధృత్య యామమాత్రం తతః పరమ్

తా. "ఉత్తిష్ఠ బ్రహ్మణ..." అను మంత్రముతో యామమాత్రము పిదప కదళీవనమధ్యమునుండి తీసి

శ్లో॥ కదళీ చూత ఖర్జూర నారికేళ ఫలాదిషు
సుగంచమేతి మంత్రేణ స్థాపయే ద్ధనుమత్ప్రభుమ్

తా. అరటి, మామిడి, ఖర్జూర, కొబ్బరి ఫలము

లంపు "సుగంచమ..." అను మంత్రముతో హనుమత్ప్ర
భువును స్థాపించవలెను.

శ్లో॥ హనుమద్వేదశిరసా పునః పంచామృతై శ్శుభైః
హనుమద్విగ్రహం పూజ్య మభిషిచ్య మహోత్సవైః

తా. హనుమత్తాపనీయోపనిషన్మంత్రములతో మరల
శుభప్రదములగు పంచామృతములతో మహోత్సవముగా
పూజ్యమగు హనుమద్విగ్రహము నభిషేకించి,

శ్లో॥ పంచోపచారా న్దేవాయ యథావిధి సమర్పయేత్
ఏవం ఫలాధివాసశ్చ ప్రకారః కథ్యతే బుధైః

తా. దేవునకు యథావిధిగా పంచోపచారముల
నొనర్చవలెను. ఇట్లు పండితులచే ఫలాధివాస విధానము
చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉత్తిష్ఠ బ్రహ్మణ ఇతి స్వామినం ఫలవాసతః
ఉద్ధృత్య చ పున ర్దేవం తతః పంచామృతేషు చ
సుగంచమేతి చోచ్చార్య యామమాత్రం వినిక్షిపేత్

తా. "ఉత్తిష్ఠ బ్రహ్మణ" మంత్రముతో స్వామిని
ఫలాధివాసమునుండి లేవదీసి మరల దేవుని 'సుగంచమ...'
మంత్రముతో యామమాత్రము పంచామృతములందుంచ
వలెను.

శ్లో॥ పంచామృతై శ్శుద్ధతోయై ర్నమకే నాఽభిషేచయేత్
పంచోపచారా న్కుర్వీత నృత్య గీత మహోత్సవైః

తా. నమస్కార మంత్రము లుచెప్పుచు స్వామికి పంచామృతములతోను శుద్ధ జలముతోను అభిషేకించవలెను. నృత్య గీత మహోత్సవములతో పంచోపచారము లొనర్చవలెను.

శ్లో॥ పంచామృతాధివాసం చ హనుమత్ప్రభు ముద్ధరేత్
ఉద్ధృత్య ధాన్యరాశౌ చ విధ్యుక్తం స్థాపయేత్సుధీః

తా. పంచామృతములందున్న హనుమత్ప్రభువును పైకితీసి యథావిధిగా విజ్ఞుడగు కర్త ధాన్యరాశియందు స్థాపించవలెను.

శ్లో॥ వ్రీహయశ్చేతి ఇత్యేవ మంత్ర ముచ్చార్య యత్నతః
నానా ధాన్యాని సంగృహ్య ఏకరాశిం చ కారయేత్

తా. "వ్రీహయశ్చ..." అను మంత్రము నుచ్చరించుచు ప్రయత్నముగ నానా ధాన్యముల సేకరించి ఒక రాసిగా చేయవలెను.

శ్లో॥ సుగంధమేతి చోచ్చార్య విగ్రహం తత్ర నిక్షిపేత్
పంచామృతైః శుద్ధతోయై రభిషేకం చ కారయేత్

తా. "సుగంధమ..." మంత్రమునుచ్చరించి అచ్చట స్వామివిగ్రహము నుంచవలెను. పంచామృతములతోను, శుద్ధజలములతోను అభిషేకము చేయవలెను.

శ్లో॥ తతః పంచోపచారాంశ్చ కపీశాయ సమర్పయేత్

తా. పిమ్మట వానరవీరుడగు హనుమంతునకు పంచోపచారము లొనర్చవలెను

శ్లో॥ అధశ్శయః మాచారో బ్రహ్మచర్యా తతఃపరం
జితేంద్రియః ఫలాహారః కుర్యాత్తూన్యోద సమాప్తి

తా. ఆచార్యుడు ఈ సమయమునందే పైన చెప్పిన విధముగా బ్రహ్మచర్యమును పాటించి ఇంద్రియ నిగ్రహుడై సూర్యోదయము వరకు ఫల భక్షణము మాత్రము చేయుచు నుండవలెను.

శ్లో॥ నృత్య గీతాది వాద్యైశ్చ పురాణపఠనేన చ
వేదపారాయణే నైవ కుర్యాజ్జాగరణం తతః

తా. రాత్రియంతయు నృత్య గీతాది వాద్యములతో కాని, పురాణపఠనముతో కాని, వేదపారాయణముతో కాని జాగరణ మొనర్చవలెను.

శ్లో॥ ఏవం ధాన్యాధివాసస్య ప్రకారః కథ్యతే బుధైః
ఏవం పంచాధివాసేషు క్రమేణ మునిపుంగవ!
సువర్ణ పుష్ప తాంబూలం శ్రద్ధాయుక్తస్సమర్పయేత్

తా. ఇట్లు పండితులచే ధాన్యాధివాస విధానము చెప్పబడుచున్నది. మైత్రేయా! ఈ రీతిగా పంచాధివాసములందు శ్రద్ధతో సువర్ణ పుష్పాదులతో కూడిన తాంబూలములను సమర్పించుకొనవలెను

శ్లో॥ ప్రాతరుత్థాయ శుద్ధాత్మా హనుమద్భక్తి సంయుతః
స్నాన సంధ్యాదికం కర్మ నిర్వర్త్య నియతేంద్రియః

తా. శుద్ధాత్ముడగు నాతడు ఉదయముననే లేచి భక్తి ప్రపత్తులు కలవాడై ఇంద్రియ నిగ్రహము కల్గి స్నాన సంధ్యాది నిత్య కర్మను నిర్వర్తించి

శ్లో॥ ఉత్తిష్ఠ బ్రాహ్మణ ఇతి హనుమద్విగ్రహం తతః
ధాన్యాధివాసా దుద్ధృత్య పీఠమధ్యే వినిక్షిపేత్

తా. "ఉత్తిష్ఠ బ్రహ్మణ..." అను మంత్రముతో

హనుమద్విగ్రహమును ధాన్యాధివాసమునుండి తీసి పీఠ మధ్యమమున నుంచవలెను.

శ్లో॥ పంచామృతై శ్శుద్ధతోయైః కుశోదక ఫలోదకైః
పుష్పోదకైః పంచగవ్యైః పురుష సూక్తేన వై తతః

తా. పంచామృతములతోను, శుద్ధజలము తోను, దర్భల జల ప్రోక్షణముతోను, ఫలోదకములతోను, పుష్పోదకము తోను, పంచగవ్యముతోను పురుషసూక్త విధానము ననుసరించి

శ్లో॥ విధినా స్నాపయే ద్దేవం పట్టవస్త్రం సమర్పయేత్
పంచోపచారా న్దేవాయ తాంబూలం చ సమర్పయేత్

తా. యథావిధి స్వామిని స్నానము చేయించి పట్టు వస్త్రము సమర్పించి పంచోపచారములు చక్కగా నొనర్చి తాంబూలాదికములను సమర్పింపవలెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
శ్రీ పంచముఖ హనుమన్మాత్రవివరణే
శ్రీ హనుమద్విగ్రహ ప్రతిష్ఠా కథనం నామ
ఏకోనచత్వారింశత్పటలః

## చత్వారింశః పటలః

## శ్రీ హనుమద్విగ్రహ ప్రతిష్ఠా కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ స్వగృహోక్త విధానేన షట్పాత్రవిధినాపి వా
చతుష్పాత్ర ప్రయోగేన భూతశ్ఛనస్సురో నితి

తా. శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. తమ గృహ్య సూత్ర విధానము చెప్పిన రీతినికాని షట్పాత్ర ప్రయోగ పద్ధతినికాని, చతుష్పాత్ర విధానముచేతకాని 'భూర్భువస్సువరోమ్' అను

శ్లో॥ మంత్రేణాగ్నిం ప్రతిష్ఠాప్య దర్భపుష్పాక్షతై శ్శుభైః
అగ్నిహోత్రమలంకృత్య కుర్యాద్ధ్యానాది కాన్మునే

తా. మంత్రము చే అగ్నిప్రతిష్ఠాపన మొనర్చి, మంగళప్రదములగు దర్భలతోడను, పుష్పములతోడను, అక్షతలతోడను, అగ్నిహోత్రము నలంకరించి ఓ మైత్రేయ మహాముని! పిదప ధ్యానాదికము నొనర్చవలెను.

శ్లో॥ అథాజ్యేనచ వ్యాహృద్భి ర్జుహుయా దాహుతీ స్త్రతీ
ఆవాతవాహీతి ఋచా ద్వాదశాఽఽవృత్తిమాత్రతః

తా. పిమ్మట వ్రతమొనర్చు వ్యక్తి నేతితో "ఆవాత వాహి..." అను మంత్రము చెప్పుచు పండ్రెండుమారు లావృత్తియగునట్లు హోమము చేయవలెను.

శ్లో॥ ఆహుతీ ర్మూలమంత్రేణ జుహుయా ద్గోఘృతేన చ
శమ్యశ్వత్థ సమిద్భిశ్చ చరుణా గోఘృతేన చ
మధుసమ్మిశ్రితై ర్వ్రీహి పిష్టయుక్తై శ్శుభై స్తిలైః

తా. ఆహుతులను మూలమంత్రము చెప్పుచు ఆవు నేతితోనే సమర్పింపవలెను. జమ్మిసమిధలు, రావిసమిధలతోను, చరువుతోను, ఆవునేతితోను, తేనెతోకూడిన శాలి పిష్టముతోను, శుభప్రదములగు నువ్వులతోను

శ్లో॥ అష్టోత్తరసహస్రం వా అష్టోత్తరశతం చ వా
ఆహుతీ ర్మూలమంత్రేణ జుహుయా చ్ఛ్రద్ధయా స్వతః

తా. వేయి యెనిమిదిమార్లుగాని నూటఎనిమిదిమార్లు మూలమంత్రముతో శ్రద్ధగల్గి ఆహుతులను వేల్చవలెను.

శ్లో॥ గాయత్ర్యా జుహుయాదష్ట వింశతి శ్చరుణా తతః

తా. పిమ్మట ఇరువది యెనిమిది మార్లు గాయత్రీ మంత్రముతో చరువులు, హోమముచేయవలెను.

శ్లో॥ అథోపదేష్టా తంత్రం చ నిర్వర్త్య విధిపూర్వకం
అనంతరం గయస్ఫానో మంత్రేణ చరుణాతతః
సమిధాజ్య తిలై శ్చాపి జుహుయాద్ద్వాదశాఽఽహుతీః

తా. పిమ్మట ఉపదేశకుడు యథావిధిగా తంత్రమును నిర్వహించిన అనంతరము "గయస్ఫానో..." మంత్రము చెప్పుచు చెరువులతోడను, పిమ్మట సమిధలు, నేయి, తిలలను పండ్రెండుమార్లు హోమముచేయవలెను.

శ్లో॥ పునపి త్విష్టకృతం విప్రః యదస్యేతిచ మంత్రతః
సమిధాఽఽజ్య తిలై శ్చాపి జుహుయా ద్ద్వాదశాహుతీః

తా. ఓ మైత్రేయా! "యదస్య కర్మణో స్వాహా!" అను మంత్రము చెప్పుచు సమిధలు, ఆజ్యము, తిలలతోడను పండ్రెండుమారులు హోమముచేయవలెను.

శ్లో॥ సంశేషి తాఽఽజ్యేన హనుమ ద్విగ్రహాంగాని
సంస్పృశేత్
ప్రాణప్రతిష్ఠా సమయే విగ్రహాఽఽచార్యయో ర్ద్వయోః
నవీనేన చ వస్త్రేణ కుర్యా దాచ్ఛాదనం ప్రతి॥

తా॥ హోమము చేయగా మిగిలిన నేతితో హనుమ ద్విగ్రహము యొక్క సమస్తావయవములను స్పృశించవలెను. ప్రాణప్రతిష్ఠా సమయమున విగ్రహమునకు ఆచార్యులకు కూడ నూతన వస్త్రము కప్పవలెను.

శ్లో॥ సూర్యమండలమధ్యస్థం ఉష్ట్రారూఢం మహౌజసం
సువర్చలాయుతం హేమ వర్ణం పింగాక్ష మవ్యయమ్
ఆవాహయే ద్ధనూమ ద్విగ్రహే అంకుశముద్రయా॥

తా॥ సూర్యమండల మధ్యమున నుండువాడు, ఒంటె నెక్కినవాడు. గొప్ప తేజోవంతుడు, సువర్చలాసహితుడు, బంగరుఛాయ కలవాడు, పింగళవర్ణములగు నేత్రములు కల వాడు, నాశరహితుడు అగువానిని అంకుశముద్రతో విగ్రహమునందు ఆవాహన మొనర్చవలెను.

శ్లో॥ దేవస్య హృదయేఽంగుష్ఠ మాచార్యస్య వినిక్షిపేత్
జపేద్ధనుమ ద్గాయత్రీం అష్టావింశతి సంఖ్యయా॥

తా॥ హనుమంతునియొక్క హృదయభాగమున ఆచార్యుని బొటనవ్రేలి నుంచవలెను అట్లుంచి ఇరువది ఎనిమిది మార్లు హనుమద్గాయత్రిని జపించవలెను.

శ్లో॥ సప్తాక్షరీం హనుమతః ప్రజపే త్సూర్య సంఖ్యయా
అనంతరం మూలమంత్రం అష్టోత్తరశతం జపేత్॥

తా॥ శ్రీ హనుమంతుని సప్తాక్షరీ మహామంత్రమును పండ్రెడు మార్లు జపించిన పిదప మూలమంత్రమును మూట యెనిమిదిసార్లు జపించవలెను.

శ్లో॥ ప్రాణప్రతిష్ఠామంత్రం చ ఛందర్షి న్యాసపూర్వకం.
త్రివార ముచ్చరే ద్ధీమా నంగుష్ఠం చ విసర్జయేత్ ॥

తా॥ ఛందము. ఋషి, న్యాసము మున్నగున వన్నియు చెప్పుచు ప్రాణప్రతిష్ఠా మంత్రమును మూడుమార్లుచ్చరించి విగ్రహ హృదయమున నుంచిన బొటనవ్రేలు తీయవలెను.

ఆచరణభాగము—

అస్య శ్రీప్రాణప్రతిష్ఠా మహామంత్రస్య... వినియోగః

తా॥ అని వినియోగము చెప్పి కరహృదయాది న్యాస మొనర్చి దిగ్బంధనము చెప్పి,

ధ్యానం:-

శ్లో॥ రక్తాంబోధిస్థ పోతోల్లస దరుణ సరోజాధిరోఢా కరాబ్జైః
పాశం కోదండ మిక్షూద్భవ మణిగణ మప్యంకుశం పంచ బాణాన్
బిభ్రాణాసృక్కపాలం త్రినయన విలసత్పీన వక్షోరుహాఢ్యా
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణ శక్తిః పరానః॥

అని ధ్యానమొనర్చవలెను.

అస్మిన్ హనుమద్విగ్రహే ప్రాణప్రతిష్ఠాం హనుమతః

జీవ ఇహ స్థితః ఆం హ్రీం క్రోం యం రం లం శం షం
సం హం ళం క్షం హం స సోహం అస్మిన్ విగ్రహే
ప్రాణ ఇహ ప్రాణః
ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం
ళం క్షం అస్మిన్ శ్రీ హనుమద్విగ్రహే శ్రోత్ర త్వ
క్చక్షు ర్జిహ్వా ఘ్రాణాః
అస్మిన్ హనుమద్విగ్రహే వా క్పాణి పాద పాయూ
పస్థాః
అస్మిన్ హనుమద్విగ్రహే వచనాదాన గమన
విసర్గానందాః
అస్మిన్ హనుమద్విగ్రహే మనో బుద్ధ్యహంకార చిత్తాః
అస్మిన్ హనుమద్విగ్రహే ప్రాణాపాన వ్యానోదాన
సమానాః
సర్వే ఇహైవ ఆగత్య సుఖం చిరంతిష్ఠతు స్వాహా
క్రోం హ్రీం ఆం ఇమం మంత్రం త్రివారం జపేత్"

శ్లో॥ ఉద్ఘాట్యాచ్ఛాదితం వస్త్రం దేవయాఽఽచార్యయోరపి
ఉన్మీలనం విగ్రహస్య చక్షుషా కారయే త్తథా

తా॥ ఇట్లు త్రివారజపమైన పిదప దేవతావిగ్రహము
నకు ఆచార్యునకు కప్పిన వస్త్రములు తీసిన పిమ్మట విగ్రహ
మునకు చక్షురున్మీలనము గావింపవలెను.

శ్లో॥ వయస్సువర్ణ మంత్రేణ విగ్రహస్య ప్రయత్నతః
పంశేషితాఽఽజ్యం కుర్వీత వృష్టిం స్వర్ణశలాకయా॥

తా॥ "వయస్సువర్ణా" అను మంత్రము నుచ్చరించుచు మిగిలిన అర్ఘ్యమును పయోత్న పూర్వకముగా బంగరు శలాక (కడ్డీవంటిది)తో వర్షము వలె చల్లవలెను.

శ్లో॥ ఆవాహనా ద్యష్టముద్రాః విగ్రహస్య ప్రదర్శయేత్

తా॥ ఆవాహనాదికములగు ఎనిమిది ముద్రిలు విగ్రహమునకు ప్రదర్శింపవలెను.

శ్లో॥ సూపాఽపూపాది సంయుక్త నానాఫల సమన్వితం
నైవేద్యం షడ్రసోపేతం విగ్రహస్య ప్రదాపయేత్॥

తా॥ పప్పు, అప్పములు మున్నగువానితోడను, వివిధములగు పండ్లతోడను కూడిన ఆరు రుచులగు ఉప్పు, పులుపు, తీపి, కారము చేదు, ఒగరు అను షడ్రసములతో నొప్పు నైవేద్యమును విగ్రహమునకు నివేదన చేయవలెను.

శ్లో॥ తాంబూలం మంత్రపుష్పం చ వాద్యఘోషం చ కారయేత్
తథాఽఽవరణదేవానాం నైవేద్యం చ ప్రదాపయేత్॥

తా॥ తాంబూలము, మంత్రపుష్పము, వాద్యఘోషాదికములును ఏర్పరుపవలెను. అట్లే ఆవరణ దేవతలకును నైవేద్యములను సమర్పింపవలెను.

శ్లో॥ సమ్యగ్ధ్యాత్వా తతో దేవం బ్రాహ్మణాంశ్చ ప్రపూజయేత్
వస్త్రైరాభరణైర్దివ్యై ర్గురుం చాపి ప్రపూజయేత్।

తా॥ పిమ్మట దేవుని గొప్పగా ధ్యానించి బ్రాహ్మణులను పూజింపవలెను. వస్త్రములతోను, దివ్యములగు ఆభరణములతోను గురువును కూడ పూజింపవలెను.

శ్లో॥ అథాష్ట కలశానాంతు మూలమంత్రేణ భక్తితః
వేదవిద్భ్యశ్చ విప్రేభ్యో దానం కుర్యా ద్విచక్షణః॥
తా॥ పిమ్మట మూలమంత్రముతో అష్టకలశములకు భక్తితో పూజచేయవలెను. వేదజ్ఞులవారి, బ్రాహ్మణులకు విచక్షణుడై దానమొసర్పవలెను.
శ్లో॥ రాజ్యేన వా సువర్ణేన హనుమద్విగ్రహం తతః
కారయిత్వా సుశీలాయ బ్రాహ్మణాయ ప్రదాపయేత్॥
తా॥ పిమ్మట వెండితోగాని, బంగారముతోగాని హనుమద్విగ్రహమును చేయించి సత్శీల సంపన్నుడగు బ్రాహ్మణునకు దానమొసంగవలెను.
శ్లో॥ హనుమత్ప్రీతయే కుర్యాత్ గోదానం సర్వకామదం
అనంతరం యథాశక్తి కుర్యా ద్బ్రాహ్మణ భోజనమ్॥
తా॥ శ్రీహనుమంతని ప్రీతికై కోర్కెలన్నిటిని తీర్చగల్గు గోదానమొసర్చవలెను. పిదప శక్తిననుసరించి బ్రాహ్మణులకు భోజనము లేర్పాటుచేయవలెను.
శ్లో॥ స్వయం దేవాత్మకం ధ్యాత్వా చిరం సువిహరేత్సుఖీ
జీవో హ్యేవం కృతే సాక్షాత్ విగ్రహే సుస్థిరోభవేత్॥
తా॥ ఇష్టదైవతముగా స్వామిని ధ్యానించి చిరకాలము ఎవడైనా సుఖముగానుండును. ఇట్లుచేసినచో శ్రీహనుమంతుడుకూడ సాక్షాత్తుగా విగ్రహమున స్థిరముగానుండును.
శ్లో॥ హనుమత్పురతో దివ్య ముష్ట్రిం సంస్థాపయే ద్విజః
పూజయే త్పరమప్రీత్యా సప్రాప్నోతి మనోరథాన్॥

తా॥ హనుమంతుని యెదుట దివ్యమగు ఒంటెను నెలకొల్పి ఏ ద్విజుడు పరమ ప్రీతితో పూజించునో అతడు కోర్కెలన్నిటిని పొందగల్గును

శ్లో॥ చక్రపాణ ప్రతిష్ఠాయై కర్మనిర్వర్త్య పూర్వవత్
అంగుష్ఠాం చక్రమధ్యేతు సంక్షిప్య విధిపూర్వకం
ప్రజపే న్మంత్ర గాయత్రీ మష్టోత్తరశతం ద్విజ॥

మైత్రేయా!

తా॥ చక్రపాణప్రతిష్ఠకొరకును వెనుకటివలెనే విధాన మంతను నిర్వర్తించి అంగుష్ఠమును చక్ర మధ్యభాగమున నుంచి యథావిధిగా నూటయెనిమిది పర్యాయములు మంత్ర గాయత్రిని జపించవలెను.

"యంత్రరాజాయ విద్మహే వరప్రదానాయ ధీమహి
తన్నో యంత్రః ప్రచోదయాత్" అనునది మంత్రగాయత్రి.

శ్లో॥ సర్వదేవాత్మకం ధ్యాత్వా ప్రధానం కేష్టదైవతం
స్థాపయే త్పీఠమధ్యేతు కృత్వా పూర్వదిశాముఖమ్॥

తా॥ ఇష్టదైవతమును ప్రధానముగా సర్వదేవాత్మకముగా ధ్యానమొనర్చి తూర్పుదిక్కు ముఖమునుంచి పీఠమధ్యమున స్థాపించవలెను.

శ్లో॥ సర్వానితరదేవాంశ్చ పరివారాంశ్చ కారయేత్
కస్తూరికా చందనాది సుగంధద్రవ్య చర్చితః॥

తా॥ ఇతరదేవత లందరను పరివారముగా నొనర్పవలెను. అందరకు కస్తూరి, చందనము మున్నగు సుగంధ ద్రవ్యములు పూయవలెను.

శ్లో॥ కర్తా చోదఙ్ముఖో భూత్వా సంసిద్ధో నియతేంద్రియః
పరధ్యాన విహీనస్సన్ పూజయే దిష్టదైవతమ్॥

తా॥ కర్తయగువాడు ఉత్తర దిక్కునకు తిరిగి కూర్చుండి సంసిద్ధుడు, నింద్రియనిగ్రహముకలవాడు పరధ్యానము లేనివాడునై ఇష్టదైవతమును పూజింపవలెను.

శ్లో॥ పూజాదౌ శ్రీ హనూమంతం పూజాంతే ముని పుంగవ!
దినేదినే యథాశక్తి మూలమంత్రం జపేత్సుధీః॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా! పూజయందును పూజాంతమునందును ప్రతిదినమూ యథాశక్తి మూలమంత్రముతో విజ్ఞుడగువాడు శ్రీ హనుమంతుని జపించవలెను.

శ్లో॥ అన్యదైవం పరిత్యజ్య ఏకం యద్దైవమేవ యః
భజేచ్చ తస్మాద్దైవాచ్చ సర్వమాప్నోత్య
సంశయః॥

తా॥ ఇతర దైవముల వీడి ఒక్కనినే దైవముగా ఎవడైతే కోల్చునో ఆ దైవముచేతనే సందేహములేకుండ వానికి సమస్తము సిద్ధించును.

శ్లో॥ పూజార్థం శ్రీ హనూమతః
మునే వక్ష్యామ్యహం శ్రుణు

తా. ఓ మైత్రేయ మహాముని ! శ్రీ హనుమంతుని పూజకొరకు వలయు విధి చెప్పుచుంటిని వినుము.

శ్లో॥ తామ్రేణ రజతే నైవ సువర్ణేన విశేషతః
కుర్యాత్పాత్ర ద్వయే దివ్యే ఉపచారాంశ్చ వింశతి

తా॥ రాగితో కాని, వెండితో కాని, విశేషించి బంగారముతో కాని రెండు ప్రధాన దివ్యపాత్రలు చేయించవలెను. ఇరువది యుపచారములు చేయవలెను.

శ్లో॥ పూర్ణంచ విసియోగంచ పాత్ర ద్వయ ముదాహృతం
పూర్ణపాత్రస్థ ముదకం వినియోగే వినిక్షిపేత్

తా॥ పూర్ణపాత్ర, వినియోగపాత్రయు పాత్ర ద్వయముగ చెప్పబడినవి. పూర్ణపాత్రయందలి యుదకమును వినియోగపాత్రయం దుంచవలెను.

శ్లో॥ సప్తవర్ణమనుం విప్ర ఉచ్చరే చ్ఛ్రీహనూమతః
కారయేచ్చ ప్రతిదినం ఉపచారాంశ్చ వింశతి

తా॥ ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! శ్రీ హనుమంతుని సప్తాక్షరీ మంత్రము నుచ్చరింపవలెను. ప్రతిదినము ఇరువది యుపచారములను కూడా చేయవలెను.

శ్లో॥ ఆవాహ నాసనం పాద్య మర్ఘ్య మాచమనీయకం
స్నానం వస్త్రోపవీతం చ గంధ పుష్పాక్షతాదయః

తా॥ ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, అక్షతలు.

శ్లో॥ ధూపం దీపం చ నైవేద్యం పానీయం తదనంతరం
తాంబూలం మంత్రపుష్పం చ నృత్యం గీతం తథైవ చ
ప్రదక్షిణ నమస్కారా ఉపచారాంశ్చ వింశతి

తా॥ ధూపం, దీపం, నైవేద్య పానీయములు, తాంబూలము, మంత్రపుష్పం, నృత్యం, గీతం, ప్రదక్షిణం, నమస్కారము అను నివి ఇరువది యుపచారములు.

శ్లో॥ పిపీలికా మక్షికాది స్పృష్టం యద్దుష్టబీజకం
మృచ్ఛిలా కేశమష్టం చ యద్యప్యశుచి పాచితమ్

తా. చీమలు, ఈగలు మున్నగువానిచే ముట్టుకొనబడినవి, ముదిరిపోయినవి; మట్టి, రాళ్లు జుట్టు వీనితో కూడి దుష్టమైనవి. ఏ రీతి నయినా అశుచియై ప్రాయశ్చిత్తము చేయబడినవియైనను అట్టివి.

శ్లో॥ అతి పక్వ మపక్వం చ తద్విహాయ సుపావనమ్
నైవేద్యం దీయతే తుభ్యం హనుమాన్ ప్రతిగృహ్యతాం

తా. మిక్కిలి పండినది, పూర్తిగ నుడుకనిది యగు వానిని విడిచి, పవిత్రమైన నైవేద్యమును నీకిచ్చుచున్నాను. ఓ హనుమత్ప్రభూ ! స్వీకరింపవలసినది.

శ్లో॥ ప్రతీక్షంతే సురాస్సర్వే ధూపస్యావసరం యతః
తేన తుష్టో భవ శ్రీమ న్నాంజనేయ నమోస్తు తే

తా. ఓ ఆంజనేయా ! దేవత లందరు నీ ధూప సమయము కొరకు వేచియున్నారు కావున ఓ స్వామీ నా యీ ఆరాధనచే తుష్టుడవగుము. నీకు నమస్కారము.

శ్లో॥ ఏలా గుగ్గుల సంయుక్త గవాజ్యేన సుసంప్లుతః
ధూపోఽయం గృహ్యతాం దేవ ! ఆంజనేయ
నమోస్తు తే

తా. ఏలకులు, గుగ్గులము వీనితో కూడిన ఆవునేతితో చేయబడిన యీ ధూపమును గ్రహింపుము. ఓ దేవా ! ఆంజనేయా ! నీకు నమస్కారము.

శ్లో॥ ఏవం యః పూజయే న్నిత్యం ప్రతిష్ఠిత మతంద్రితః
ఇహ భుక్త్వాఽఖిలా న్భోగా నంతే ముక్తిం స విందతి

తా॥ ఇట్లు ప్రతిష్ఠింపబడిన హనుమంతుని తొట్రుపాటు లేనివాడై ప్రతినిత్యము ఎవడు పూజించునో వాడు ఇహమున సకల భోగము లనుభవించి దేహాంతమున ముక్తి నందును.



శ్లో॥ హనూమ ద్దాలయం గత్వా తత్పదాసక్త మానసః
సప్తాక్షరీం హనుమతో దశవారం జపేత్సుధీః

తా॥ హనుమంతుని ఆలయమునకు వెళ్ళి బుద్ధిమంతుడగు వాడు ఆ హనుమంతుని పాదపద్మములందే మనస్సును నిల్పి శ్రీ హనుమంతుని సప్తాక్షరీ మహామంత్రమును పది మార్లు జపించవలెను.



ఇతి శ్రీ పరాశరసంహితాయాం శ్రీ పంచముఖ హనుమన్మంత్ర వివరణే శ్రీ హనుమద్విగ్రహ ప్రతిష్ఠాకథనం నామ చత్వారింశః పటలః



—: x :—